# బుర్రకథా పితామహ, పద్మశ్రీ

# షేక్ నాజర్

జీవితము - రచనలు - ప్రదర్శనలు - పాట్లు

పరిశోధనా గ్రంథము



రచయిత

డా॥ అంగడాల వెంకట రమణమూర్తి

# బుఱ్ఱకథా పితామహ, పద్మశ్రీ



# షేక్ నాజర్

జీవితము - రచనలు - ప్రదర్శనలు -పాట్లు

పరిశోధనా గ్రంథము



రచయిత

డా॥ అంగడాల వెంకట రమణమూర్తి

# బుర్రకథ పితామహ పద్మశ్రీ షేక్ నాజర్
# జీవితము - రచనలు - ప్రదర్శనలు - పాట్లు
# పరిశోధనా గ్రంథము

రచన, సమర్పణ, పి.హెచ్.డి. గ్రహీత
డా॥ అంగడాల వెంకట రమణమూర్తి

ప్రథమ ముద్రణ : 2015 సెప్టెంబరు
ప్రతులు : 1000
మూల్యము : రు. 200

ప్రూఫ్ రీడింగ్ & ఎడిటింగ్ :
యుటిఎఫ్ వెంకటేశ్వరరావు

కవర్ డిజైనింగు & ప్రింటింగు
కె.కె. గ్రాఫిక్స్, మచిలీపట్నం

ప్రచురణ
తెలుగు భాషా సాంస్కృతిక సమాఖ్య
మచిలీపట్నం

ప్రతులకై
**శ్రీమతి ఎ. రాజశ్రీ**
ఉప్పలూరు, కంకిపాడు మండలం,
చరవాణి : 8985151735

**పి. వెంకటేశ్వరరావు**
ఎన్.ఎస్.యు.టి.ఎఫ్. భవన్
ఈడేపల్లి, మచిలీపట్నం - 521 001.
చరవాణి : 94903 00640

# అంకితం

ప్రజాకళలకోసం

అహర్నిశలు శ్రమించి,

తపించి,

తరించిన కళాకారులకు

ప్రగతివాదులకు....

**- అంగడాల**

# మున్నుడి



- మండలి బుద్ధప్రసాద్
ఉపసభాపతి,
ఆం.ప్ర.శాసన సభ

జంగం కథలుగా తెలుగునాట అనాదిగా జనజనాన, నరనరాన చైతన్యాన్ని నింపిన బుర్రకథ ఆధునిక కాలములో తిరిగి అందలమెక్కింది కళానిధి శ్రీ నాజర్ తంబుర పట్టుకున్న తరువాతే అని చెప్పడంలో అతిశయోక్తి లేదు. పేదరికం పద్మశ్రీని అందుకోవడానికి అడ్డురాదని చెప్పడానికి నాజర్ జీవితం ఒక ఉదాహరణ. హరికథకు శ్రీ ఆదిభట్ల నారాయణదాసు ఎలాగైతే ఒక ఆహార్యాన్ని, ఆధ్యాత్మిక ఆనందాన్ని సమకూర్చారో, అలాగే బుర్రకథకు నాజర్ గారు సరికొత్త వేషము, బాణీ, వాణిని అందించారు. రగడలు పాడడం, నడకలలో నవరసాలు కురిపించడం, దరువులలో సరికొత్త మధురిమలు పలికించడంలో ఆయనకు ఆయనే సాటి. వీర రస ప్రధానముగా సాగే బుర్రకథను గుండెలు కరిగేలా కరుణరసప్లావితముగా నాజర్ గారు చెప్పేతీరును మనం ఆయన "బెంగాల్ కరవు", "రాయలసీమ కరవు" బుర్రకథలలో చూడగలము. స్వంతంగా ఎన్నో బుర్రకథలను రచించి, స్వరపరచిన నాజర్, అందులో కష్టాల కొలిమిలాంటి తన జీవితానుభవాన్ని రంగరించారు. కళ... కళాకారుల కోసం కాదు ప్రజలను చైతన్యపరచటం కోసం, సరికొత్త ఆలోచనలు రేకెత్తించటం కోసం అని నమ్మిన నాజర్, తన జీవితాన్ని కళాసరస్వతి పాదసేవకు అంకితము చేసిన ధన్యజీవి. నాజర్ గారి బొబ్బిలి యుద్ధం, పల్నాటి యుద్ధం బుర్రకథలు వింటుంటే, ఆంధ్ర పౌరుషము ఉరకలెత్తుతుంది. బుర్రకథాగానములో తాను తరించటమే కాక ఎందరినో భావి కళాకారులను, బుర్రకథా దళాలను తయారుచేసిన ఒక సాహితీ కళాసంస్థ శ్రీ నాజర్.

తెలుగుతల్లి వరపుత్రుడైన బుర్రకథ పితామహ షేక్ నాజర్ జీవితంపై పరిశోధన చేసిన శ్రీ అంగడాల వెంకట రమణమూర్తి అభినందనీయుడు. మా గురువు గారు డా॥ ఎస్.గంగప్ప పర్యవేక్షణలో ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం నుంచి శ్రీ రమణమూర్తి డాక్టరేటు పొందారు. శ్రీ నాజర్ ఆత్మకథాంశాలతో శ్రీ రమణమూర్తి రచించిన "పింజారి" తెలుగు ప్రజలను ఆర్ద్ర హృదయులను చేసింది. ఎన్నో వ్యయప్రయాసలకు లోనైనా శ్రీ నాజర్ గారి సమగ్ర జీవితాన్ని, బుర్రకథ వికాసానికి వారు చేసిన కృషిని ఈ సిద్ధాంత గ్రంథం ద్వారా జాతికి తెలియజెప్పిన శ్రీ రమణమూర్తి ధన్యజీవి. శ్రీ రమణమూర్తి భవిష్యత్తులో మరిన్ని మంచి రచనలు చేసి సాహిత్యలోకంలో చిరస్థాయిగ నిలవాలని కోరుతున్నాను.

# ఆశీరభినందనలు !

- ఆచార్య ఎస్.గంగప్ప

సి.73, శ్రీనివాసనగర్‌కాలనీ,
గుంటూరు.

ఒక అతిసామాన్య వ్యక్తి, అత్యున్నత శిఖరాలనధిరోహించి అసామాన్య వ్యక్తిగా నిరూపించుకొన్న షేక్ నాజర్ జీవిత విశేషాలను పరిశీలిస్తే వ్యక్తికున్న ఆసక్తి, పట్టుదల, సాధన అనే అంశాలు ప్రాముఖ్యం వహించినట్లు స్పష్టం. దానికి తోడు కాలగతిలో పరిస్థితులు అనుకూలించడమూ అవసరమనిపిస్తుంది. దానికి తోడు ఆ వ్యక్తి పూర్వార్జిత సుకృతమూ పని చేసిందనిపిస్తుంది.

ఇవన్నీ బుర్రకథ పితామహబిరుదుతో ప్రసిద్ధికెక్కి “పద్మశ్రీ”గా ఎదిగిన తీరు షేక్ నాజర్ జీవితంలో సఫలమయ్యాయి. అలాంటి షేక్‌నాజర్ కళాకారుని బుర్రకథతో, జీవిత విశేషాలను, ఆయన అభ్యున్నతి చెందిన తీరును వివరిస్తూ పరిశోధన చేసి పిహెచ్‌డి పట్టం పొందిన చి॥ అంగడాల వెంకట రమణమూర్తి అభినందనీయుడు.

మట్టిలో పుట్టి మట్టిలో పెరిగి పద్మశ్రీగా ఎదిగిన షేక్ నాజర్ జీవితం కళా సాహిత్యాలను గూర్చి పరిశోధించిన రమణమూర్తి కూడా అతి సామాన్యమైన రైతు కుటుంబంలో పుట్టి పెరిగి డాక్టరయ్యాడు. నామార్గ దర్శకత్వంలో పరిశోధించిన పరిశోధకులు పిహెచ్‌డి పట్టా కోసం 27 మంది, ఎం.ఫిల్ డిగ్రీ కోసం 20 మందికి ఆయా వ్యక్తుల ఆసక్తిని గమనించి ఉచిత పరిశోధనాంశాలను సూచించాను. అదే రీతిగా రమణమూర్తి ఆసక్తిని బట్టి షేక్‌నాజర్ బుర్రకథా విశ్లేషణ సూచించగా విషయాన్ని రమణమూర్తి నైపుణ్యంతో నిర్వహించి ఈనాడు ఇంత గ్రంథం వెలువరిస్తున్నారు. సంతోషం.

‘బుర్రకథా పితామహుడు’ ‘షేక్ నాజర్’ అనే ఈ సిద్ధాంత వ్యాసంలో ఏడు ప్రకరణాలున్నాయి. మొదటి ప్రకరణంలో షేక్ నాజర్ జీవిత విశేషాలు, రెండవ ప్రకరణంలో బుర్రకథ పుట్టుపూర్వోత్తరాలు, మూడవ ప్రకరణంలో షేక్ నాజర్ స్వయంగా వ్రాసి అభినయించిన ప్రసిద్ధ బుర్రకథల విశేషాలు, నాల్గవ ప్రకరణంలో నాజర్ బుర్రకథల్లోని వర్ణనలు, సామెతలు, అలంకారాలు, రసౌచిత్యాలను గూర్చిన వివరణ, అయిదో ప్రకరణంలో ఆయా బుర్రకథల్లోని పాటలు, ప్రార్థనలు, ఆయా పాత్రల శీలస్వభావాలను సముచితంగా రమణమూర్తి వివరించారు.

షేక్ నాజర్ మట్టిలోపుట్టిన మాణిక్యం. దాన్ని సానబెట్టిన వారు తండ్రి మస్తాన్. పెదనాన్న. ఒకరు విద్యాగంధం అబ్బజేస్తే మరొకరు నాజర్‌లో గల గాన జ్ఞానాన్ని గమనించి సంగీతం నేర్పారు. ఇవి ఆయా సందర్భాలలో పరిమళించసాగాయి. మొదటి

గ్రంథ పఠనం చేశారు. బుర్రకథవంతగా, ఆ వెనుక బుర్రకథా ప్రవర్తకుడుగా ఎదిగి జీవనోపాధిగా చేసుకున్నారు. ప్రజానాట్యమండలి వల్ల పేరు, దాని వల్ల ఇబ్బందులు, జైలుపాలు కావడం, ఆ వెనుక ప్రభుత్వం చేత సన్మాన సత్కారాలు పొందడం, బుర్రకథా పితామహుడు మాత్రమే కాదు, ఆ కళలో 'పద్మశ్రీ' అయ్యారు నాజర్. ఆ సందర్భంలో గుంటూరులో కీ॥శే॥ వావిలాల గోపాలకృష్ణయ్యగారు ఘనంగా సత్కరించారు. ఆ సభలో పాల్గొన్న నాకు బుర్రకథా పితామహుడుగా షేక్ నాజర్ ప్రతిభా పాటవాలను వివరించే అదృష్టం దక్కింది.

రమణమూర్తి సిద్ధాంత వ్యాసం ద్వారా ఒక నిజం బయటపడింది. కర్నాటిలక్ష్మీ నరసయ్య తనను ఎంతగానో వంతగా సిద్ధంచేసిన షేక్ నాజర్ పేరుతో ఢిల్లీలో బుర్రకథ చెప్పి వచ్చాడట. అది వాణి పత్రిక ద్వారా తెలిసింది. అయినా కూడా నాజర్ కర్నాటిని క్షమించారు. 'వెన్నుపోటు'లో చూడవచ్చును.

నాజర్ తన సొంత బుర్రకథల్లో సంగీత బాణీలను, రసోదంచితంగా, రసభావాలను పదరచనారీతులను, సందర్భోచితంగా తనకు నచ్చిన, తనకు వచ్చిన భాషలో పాటలను రచించడంలో తనకు తానే సాటినని నిరూపించుకొన్నారు. ఈ విషయాన్ని మూడో ప్రకరణంలో ఆయా బుర్రకథల విశేషాలను వివరించడంతో పాటు నాల్గో ప్రకరణంలో ఆయా బుర్రకథల నామౌచిత్యాలను, వాటిలో సందర్భోచితంగా వాడిన సామెతలను, సముచితమైన అలంకారాలను, సందర్భోచిత వర్ణనలను, ఆయా కథల్లో కరుణ, వీరరసాలను పోషించిన తీరు తెన్నులను ఎంతో చక్కగా సోదాహరణంగా వివరించాడు రమణమూర్తి. ఆయిదో ప్రకరణలో నాజర్ సంగీతజ్ఞతను స్పష్టం చేశాడు. ప్రార్థనలు, పాటలు మొదలైన వాటి రచనల వల్ల నాజర్ వాగ్గేయకారుడుగా నిరూపించుకొన్న రీతిని తెలిపారు. పాత్రల శీలస్వభావాలను చివరి ప్రకరణలో చేసిన తీరును నాజర్ గొప్ప మనస్తత్వవేత్తగా వివరించాడు రమణమూర్తి.

జానపదకళారూపాల్లో ఒక ప్రజాకళారూపమైన బుర్రకథా విశిష్టతను, దానికై జీవితమంతా త్యజించి (మీరుగట్టి) షేక్‌నాజర్ తెలుగు సాహిత్యంలో ఎంతో ప్రాముఖ్య ప్రచారాలను తెచ్చి 'బుర్రకథా పితామహునిగా, 'పద్మశ్రీ'గా ఎదిగిన షేక్ నాజర్ కళాసాహిత్యాలను గూర్చి ఇంత మంచి పరిశోధన గ్రంథం రచించినాడు. 20 ఏళ్ళ తరువాత ముద్రణకు తీసుకుని రావడం నాకెంతో ముదావహ విషయం. అందుకు రమణమూర్తికి, అతనికి ఈ ముద్రణలో సహకరిస్తున్న మిత్రులకు మరోమారునా అభినందనలు.

డాక్టరేట్ పుచ్చుకోవడమే కాదు, షేక్ నాజర్ 'బుర్రకథ పితామహుడుగా' పద్మశ్రీగా నిరూపిస్తూ చేసిన కృషిని గ్రంథ ముద్రణలో సాహితీ లోకానికందిస్తున్న రమణమూర్తికి మరో మారు నా ఆశీరభినందనలు !

# బుర్రకథా లేజర్..నాజర్

తెలుగు జాతి ప్రాచీన సంగీత కళారూపం బుర్రకథ. ఈ జానపద ప్రక్రియను జనపదాలకు జ్ఞానపథం చూపిన అరుణకిరణంగా మార్చిన లేజర్... నాజర్. మత ప్రబోధాలకు, ఉదరపోషణకు మాత్రమే పరిమితమైన బుర్రకథను తాడితపీడిత బాధిత జనం బుర్రలకు పదునుబెట్టే ఆయుధంగా మలిచిన కళాశక్తి ఆయన. ఒక తుఫాను రేపాడు.. ఒక తరాన్ని ఊపాడు.. అభ్యుదయ, విప్లవభావాలు ప్రవహింపచేశాడు. ఆ భావధార తెలుగుజాతి ఉన్నంతవరకూ ఉరకలెత్తుతూనే ఉంటుంది.

బుర్రకథకు సరికొత్త జీవం పోసిన నాజర్ దాని శక్తియుక్తులన్నింటినీ ప్రజల కోసం, ప్రజాసమస్యలు ఎలుగెత్తి చాటడం కోసం, ప్రజల్ని చైతన్యవంతులుచేయడం కోసమే ఉపయోగించారు. బళ్లారి రాఘవలాంటి మహానటుడినే 'బెంగాల్ కరవు' బుర్రకథ చెప్పి ఏడ్పించిన అద్వితీయ కళాకారుడు నాజర్. కరవు బీభత్సాన్ని హృదయవిదారకంగా చెబుతూప్రతి ప్రేక్షకుడితో కన్నీళ్లు పెట్టించారు. తన బాల్యంలోని క్షుద్బాధను రంగరించి బెంగాల్ కరవు దృశ్యానికి కథారూపమిచ్చారాయన. వీరకరుణహాస్య రసాలను సమపాకంలో కూర్చి తను చెప్పదల్చుకొన్న అంశాలను ప్రజల హృదయాల్లోకి సూటిగా చొప్పించి వారిలో ఉద్రేకాన్ని, ఉత్తేజాన్ని రగల్చడం ఆయన ప్రత్యేకత. కమ్యూనిస్టు పార్టీ, ప్రజాచైతన్యశంఖారావం అనే అర్థం తీసుకొచ్చారు. మాటల్ని ఈటెలుగా సంధించారు. పాటల్ని తూటాలుగా పేల్చారు. తన గళానికి కలాన్ని జోడించి అనేక పాటలు రాశారు. ఆయన ప్రతి పాట అన్యాయాలు, అక్రమాలు, దోపిడీ, బానిసత్వాలపై ఎక్కుపెట్టిన తూటాలే. తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటంలోనూ తన కలం, గళం ద్వారా నైజాంనవాబు, రజాకార్లపై కన్నెర్ర చేశారు.

బెంగాల్ కరవు బుర్రకథను విన్న గూడవల్లి రామబ్రహ్మం ఇచ్చిన సలహా, ప్రోత్సాహంతోనే వీరగాథలను బుర్రకథలుగా మలిచి నాజర్ గొప్ప విజయం సాధించారు. అందుకు ఆయన ఎంతో పట్టుదలతో కృషిచేశారు. ఈ రచనలకు కావాల్సిన అభ్యాసం కోసం తాను శిష్యరికం చేశారు. తానే స్వయంగా వాటిని కథలుగా కట్టారు. పల్నాటి యుద్ధం బుర్రకథను చెబుతూ బాలచంద్రుడై పరవళ్లు తొక్కారు. పళ్లు పటపటా కొరికారు. ప్రేక్షకుల్ని ఉద్రేకపూరితుల్ని చేశారు.

కొందరు ఏకంగా పూనకాలే పోయారంటే ఆ కథలో ఆయన ఎంతగా ఒదిగిపోయి ఉంటారో ఊహించుకోవచ్చు. ఇందులో రాజకీయాలున్నాయని, చెప్పడాకికి వీలులేదని అభ్యంతరం పెట్టినవారూ ఉన్నారు. నిజమే ఆయన ఆ కథలో రాజకీయాలు చేర్చారు. కన్నమ'దాసులు' తిరగబడాలని పిలుపునిచ్చారు. ఆత్రేయగారి ప్రోత్సాహంతో అల్లూరి సీతారామరాజు బుర్రకథను నాజరు రాశారు. కల్లాకపటమెరుగని బుద్ధిజీవులు గిరిజనుల అమాయకత్వాన్ని, జాజీజాపత్రీ, లవంగ యాలుకలూ వంటి సంపదల రక్షణకు వాళ్లు పడే ఇబ్బందులను కళ్లకుకట్టారు. అంతేకాదు, ఆనాడేకొలు రాజకీయాన్ని దీనిలో ఎండగట్టారు. ఆయన రాసిన బొబ్బిలి బుర్రకథ సాహిత్యపరంగా మిగిలినవాటికంటే అగ్రగామిగా నిలుస్తోంది. అక్షరాలకు గజ్జెగట్టి స్టేజిని వణికించినట్లు సాగిన మరో కళారూపం వీరాభిమన్యు. రాణీ రుద్రమ్మ కథలో కూలి తల్లులు రుద్రమూర్తులు కావాలని కోరారు. ఏ కథను చెప్పినా దాని మూలసూత్రాన్ని, నేటి పరిస్థితులకు అన్వయిస్తూ చెప్పడం నాజర్ ప్రత్యేకత. చరిత్రకు కథనాన్ని జోడించి నిజాలను వెల్లడిస్తూ సంగీత సాహిత్య హావభావ నటనా వైద్యుష్యంతో రక్తికట్టించడం, ప్రజలతో 'సెహబాష్' అనిపించుకోవడం, వారి మదిలో ఆలోచనల అగ్గి రాజేయడం, వారి హృదిని కార్యాచరణకు ఉసిగొల్పడం నాజర్ విలక్షణ..వైశిష్ట్యం.

ఇటువంటి సాంస్కృతిక యోధుని జీవితం, కళావైదుష్యం గురించి పరిశీలించి, పరిశోధించి, ఒక పత్రం సమర్పించడమంటే తేలికైన విషయం కాదు, కత్తిమీద సామే. మిత్రులు అంగడాల మెంకటరమణమూర్తిడారు ఆ పనిని ఎంతో నిబద్ధత, పట్టుదలతో పూర్తిచేశారు. సరైన తూకపు రాళ్లతో కొలిచారు. వీరగాథలలో సమకాలీన ప్రజలజీవితానికి సంబంధించిన సమస్యలను చొప్పించి బుర్రకథ నడపడంలో, ప్రేక్షకులను ఆకట్టుకోవడంలో నాజర్ చూపిన ప్రతిభకు జొమ్మకట్టారీయన. జానపద కళారూపానికి కొత్తరూపు, ఊపునిచ్చి చిరయశస్సు అందించిన ఈ ఆంధ్రా అమర్ షేక్‌ను చక్కగా అక్షరీకరించారు. అంగడాల పరిశోధన కృషికి ప్రత్యేక అభినందనలు.

**- ముత్యాల ప్రసాద్-**

విజయవాడ. సంపాదకులు

29.06.2015 విశాలాంధ్ర దినపత్రిక

## "నా తండ్రి బుర్రకథకళా లెజెండ్ ! అని ఋజువు చేశావు"



ఎస్.కె.బాబుజి
కీ॥శే॥ పద్మశ్రీ నాజర్ కుమారుడు
గుంటూరు.

విశ్వవిద్యాలయాలలోని విద్యార్థులు పట్టాకోసం పరిశీలన, పరిశోధనాత్మక, సిద్ధాంత గ్రంథాలు వ్రాయడం పరిపాటి. నేను ఇప్పుడా ఫ్యాకల్టీగా చేస్తున్న పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంలో ఎం.ఫిల్, పి.హెచ్.డి. పట్టాకోసం విద్యార్థులు వ్రాసిన పలుగ్రంథాలు చదివాను. వాటిల్లో ఏదోఒక కళ గురించి వివరణ, కళాకారులు ప్రదర్శించే కథా అంశాలు, వృత్తి విశేషాలు, కాల, నాగరికత పరిస్థితులు వగైరాలు మాత్రమే పొందుపరుస్తారు. కాని వెంకటరమణ మూర్తి వ్రాసిన ఈ గ్రంథం చదివితే కేవలం పట్టాకోసం కాకుండా, నేటి కళాకారులందరికీ ముఖ్యంగా, ప్రజా కళాకారులందరికీ వారిని గురించి తెలుసుకోవాలనుకునే విద్యార్థులందరికి ఒక దిక్సూచిగా మా తండ్రిగారి వ్యక్తిత్వాన్ని తెలియపరచాలనే కసితో ఈ గ్రంథం వ్రాసినట్టు కనపడుతుంది.

ఇక నేను స్వయంగా చూసిన మరో విషయం ఏమిటంటే, మానాన్నగారి వద్దకు వచ్చిన శిష్యులు చాలామంది మూడునెలలుగాని, ఆరునెలలుగాని శిష్యరికంగా వచ్చి, బుర్రకథ రగడలు పాడటం నేర్చుకొని వెళ్ళేవారు. కాని వెంకటరమణమూర్తిలాగా సంవత్సరాల తరబడి మా ఇంటికొచ్చి, నాన్నగారి చుట్టూతిరిగి, మా నాన్నగారు మంచంలో పండుకొని వున్నాకూడా, నాన్నగారి మనసులోని లోతైన విషయాలకోసం ఆరాటపడుతూ, 'ఇంకా ఏమి చెబుతాడా' అని ఒక్కోరోజు ఉదయం నుండి సాయంత్రందాకా సంభాషించిన.....ఒకేఒక వ్యక్తి సోదరుడు రమణమూర్తి. నాడు అతని ఆంతర్యం నాకు తెలియలేదు కాని, నేడు ఈ గ్రంథం చదివితే మాకు తెలియని విషయాలనెన్నింటినో ఈ గ్రంథంలో పొందుపరచడం నాకు ఆశ్చర్యాన్ని, ఆలోచనలని కల్గించింది. అందుకే వెంకటరమణమూర్తికి అశేష కృతజ్ఞతలు తెలుపుతున్నాను.

'కర్నాటక సంగీత పితామహుడు త్యాగరాయ కృతులు దైవారాధన

సంభరితాలు, హరికథా పితామహుడు 'ఆదిభట్ల నారాయణ దాసు' హరికథలు దైవికపరచరితలు, పదకవితా పితామహుడు అన్నమయ్య కీర్తనలు దైవప్రశంస ప్రబోధాలు. ఇక భరతనాట్యం, కూచిపూడి నృత్యాంశాలు దైవచరితా సంగ్రహాలు. తోలుబొమ్మలాటలు, జముకులకథలు, ఒగ్గుకథలు, జంగాలకథలు, పంబకథలు, రుంజకథలు-చిందుభాగవతాలు, వీధిబాగవతాలు, యక్షగానాలు మొ॥గు జానపద కళలన్నీ కూడా పురాణ, ఇతిహాసాంతర దైవపద ఆధ్యాత్మిక సంరక్షితాలే! అందుకే నాటినుండి నేటివరకు ప్రభుత్వాలు, మత పెద్దలచే పోషించబడి, అదే హద్దుగా నేటికీ అదే మార్గాన్ని అనుసరిస్తూ వస్తున్నాయి కళలు.

ప్రజల అవసరాలను ప్రాతిపదికగా చేసుకొని, సామాజిక అసమానతలను కూల్చే సంబోధనా సారాంశ సారస్వతంతో రూపాంతరం చేసిన ఏకైక కళాస్వరూపంగా నా తండ్రి బుర్రకథా పితామహుడు "పద్మశ్రీ" షేక్ నాజర్, బుర్రకథా సమగ్ర కళా స్వరూపమైన ఈ గ్రంథం ధృవీకరిస్తుందనేది అక్షర సత్యం. ఇది శ్రీ వెంకటరమణమూర్తి యొక్క నిర్భయ, నిస్వార్థ హృదయానికి దర్పణం. అందుకే కళలపై వచ్చిన పి.హెచ్.డి గ్రంథాలన్నింటికీ ఇది తలమానికం.

ఇంకా నాన్నగారేమనేవారంటే రెండో కోవకు చెందిన కళ డబ్బు సంపాదించి పెట్టేది. కళలు అనేక రకాలు. వాటికి మానవతా విలువలతో సంబంధం ఉండదు. మనుషుల జీవితాలతో పనిలేదు. దేవుడి గురించి, లేదా దైవమాయలు లేదా వింతైన కల్పితకట్టు కథలతో ప్రజలను ఆకర్షిస్తూ కళలుగా చలామణి అవుతుంటాయి. అవి సమాజానికి మేలు చేయవు. మొదటి కోవకు చెందిన బుర్రకథ కళాస్వరూపం ఓ విశిష్ట సమాజ కళా ప్రక్రియ లయబద్ధంగా గానం చేయాలి, ఆడాలి, ఎడంచేతితో అందెలు వాయించాలి, కుడిచేతితో తంబురతీగలు(రాగమాలికలకు అనుగుణంగా) మీటాలి. కష్టంతో కూడుకున్న కళాస్వరూపం. అందుకే అట్టికళని ఎవరు బ్రతికిస్తే, ఆ కళ వారిని బ్ర[illegible]కిస్తుంది".

నాన్న మాటలు గమనిస్తే ఇలాంటి మాటలు ఏ పి.హెచ్.డి గ్రంథాలలోనూ కనిపించవు ఇట్టి నియమాలు ఏ కళాకారుడూ పాటించిన దాఖలాలు లేవు. అందుకు "సోదరా అంగడాల వెంకట రమణమూర్తీ ! "నా తండ్రి బుర్రకథ కళాలెజెండ్" అని నీ గ్రంథం ద్వారా ఋజువు చేశావు!



# కన్నె చెఱవీడిందిన్నాళ్లకు

- యుటిఎఫ్ వెంకటేశ్వరరావు,
ఎం.ఏ (లిట్) ఎం.ఏ., ఎం.ఇ.డి.డి.ఇ.టి.,

కృష్ణాజిల్లా రచయితల సంఘంవారు తెలుగు రచయతల మహాసభల సందర్భంగా ప్రచురించిన ఓ ఉద్గ్రంథం తిరగేస్తుంటే నాజర్‌గారి జీవితాన్ని గురించిన వ్యాసం 1955 వరకే ఉంది. మరో నాల్గు దశాబ్దాల కాలపు జీవనరేఖలెలా తెలుస్తాయి? కార్యదర్శి జి.వి.పూర్ణచంద్ గారి నడగ్గా 'రచయిత మీ బందరులోనే ఉన్నారుగా' అన్నారు. కృష్ణా విశ్వవిద్యాలయానికి వెళ్ళి వారిని కలిసాను. మాటల సందర్భంగా ఆ పరిశోధనా గ్రంథాన్ని సమర్పించి, పి.హెచ్.డి.పట్టా తీసుకొన్నాను గానీ, దాన్ని నేటి వరకూ వెలుగులోకి తేలేకపోయామని చెప్పారు. అందుకు కారణం తన అశక్తత, ఆర్థికలేమి అని వాపోయారు. ఒక విశిష్ట ప్రక్రియకు ఆద్యుడై కళారూపాలతో ఆంధ్రదేశాన్ని ఒకతరం పాటు ఉఱ్ఱూతలూగించిన పద్మశ్రీ షేక్ నాజర్ గార్ని గూర్చిన సిద్ధాంత గ్రంథపు వెలుగులను తెలుగులకందించే పనికి పూనుకొనే వారే లేకపోయారా? ఆ పని మనమే చేద్దాం అనిపించింది. ఆ మాటే తమ్మునితో అన్నాను. సంఘం అధ్యక్షులు గుత్తికొండ సుబ్బారావు, నాటి శాసనమండలి సభ్యులు కె.ఎస్.లక్ష్మణరావు గార్లతో సంప్రదించాను. మారు మాట్లాడకుండా ఆర్థికంగా సాయమందించటానికి మాటిచ్చారు. కొదవనావల్ల కాకపోతుందా అన్నదే నాధీమా-వెంటనే మూర్తిగారు డి.టి.పి. ప్రతినిచ్చినా నా సహజ చపలత మరోసారి ప్రూఫ్ చూడాలని చెప్పింది. ఈలోగా పెద్దల అభిప్రాయాలు వ్రాయించే ప్రయత్నంలోనూ విపరీతమైన జాప్యం జరిగింది. ఫోటోలున్న సి.డి. తెరుచుకోలేదు.ఇన్నాళ్టికి ముహూర్తం కుదిరింది.

మహత్తరమైన కళారూపాన్ని మనకందించిన బుఱ్ఱకథా పితామహ పద్మశ్రీ షేక్ నాజర్‌గారి జీవనయానం సిద్ధాంత గ్రంథాన్ని ప్రచురించగా ఆదరించనున్న తెలుగు భాషా సంస్కృతీ ప్రియులకు ధన్యవాదాలు. శ్రమదమాదుల కోర్చి ఎంతో సమగ్రంగా, విశ్లేషణాత్మకంగా, వివరణాత్మకంగా రచించిన తన గ్రంథ పుత్రికను రెప్ప విప్పార్చి చూస్తూ 'అన్నా' అన్న ఆప్యాయపుకేక పెట్టే తమ్ముడు అంగడాల వెంకటరమణ మూర్తికి ఆంధ్ర జాతి పక్షాన ఋణం తీర్చుకొనే అవకాశం దక్కించుకొన్న అదృష్టవంతుడినౌతున్నాను.

సంకల్పముంటే సాధ్యం కానిదేముంటుంది? ముగ్గురం ఈ క్రతువుకు అధ్వర్యవులమయ్యాం. ఈ సిద్ధాంత గ్రంథం కన్నె చెఱవీడింది అచ్చై ఆంధ్రుల హస్తాలకెక్కనుంది. అడిగిందే తడవుగా ఆర్థికాన్నందించిన గుత్తికొండ సుబ్బారావుగారికీ, కె.ఎస్.లక్ష్మణరావుగారికీ, మాజీ మంత్రి డొక్కా మాణిక్యవరప్రసాదు గారికీ ఈ మహత్తరమైన అవకాశం నాకిచ్చిన సోదరుడు రమణమూర్తి గారికీ ధన్యవాదాలు.

# కృతజ్ఞతలు

బుర్రకథా పితామహ, పద్మశ్రీ షేక్ నాజర్ గారిపై పరిశోధన చేయమని ప్రోత్సహించి, అస్తవ్యస్తంగా నేను వ్రాసిన వ్యాసాలను చూచి సవరించి, ఎలా రాయాలో చెప్పి, నిరంతరం నాకు మార్గదర్శకులు, శ్రేయోభిలాషులు, సాహితీ కృషీవలులు, మర్మయోగి, సుప్రసిద్ధ విమర్శకులు, సాహితీ స్రష్ట అయిన గురువులు ఆచార్య ఎస్. గంగప్ప గారికి ప్రప్రథమంగా హృదయ పూర్వక కృతజ్ఞతా నమస్సుమాంజలులు. వారి వ్రాతపూర్వక ఆశీరభినందనలూ వెలగట్టలేనివి.

బుర్రకథకే ఎనలేని కీర్తినార్జించి పెట్టిన నాజర్‌గారు తమ జీవితానుభవాలను, ఆయన బుర్రకథా వికాసానికి చేసిన కృషిని సాదరంతో వివరించి నా ఈ పరిశోధనకు ఎంతగానో తోడ్పడ్డారు. వారికి నా కృతజ్ఞతా వందనాలు. వారి కుమారులు షేక్ బాబూజీ, నా తండ్రి బుర్రకథ కళా లెజండ్ పేరుతో వ్రాసిన అభిప్రాయం అమూల్యం.

విజయవాడ ఆకాశవాణి కేంద్రంలో జానపద విభాగంలో పనిచేసిన సహృదయులు కె.వి. హనుమంతరావుగారు నాజరుగారి ఇంటర్వ్యూలను అడిగినంతనే నాకందించి, నా ఈ పరిశోధనకు ఎంతగానో సహాయ సహకారాలు అందించారు. వారికి నా కృతజ్ఞతా పూర్వక నమస్సులు.

నాగార్జున విశ్వవిద్యాలయ తెలుగు విభాగాధిపతులు, అధ్యాపక బృందానికి మరియు చిన్న సిబ్బంది నన్నెంతో ఆదరించి ప్రోత్సహించారు. వారికి నా కృతజ్ఞతాంజలులు.

నాగార్జున విశ్వవిద్యాలయ గ్రంథాలయాధిపతులకు, వారి సిబ్బందికి, జిల్లా, ప్రాంతీయ గ్రంథాలయాధిపతులకు, వారి సిబ్బందికి కృతజ్ఞతలు.

గురుభక్తి పరాయణులు అయిన పర్వతనేని శాంతి కిశోర్‌గారు నా ఈ పరిశోధనలో నన్నెంతో ప్రోత్సహించారు. వారికి నా కృతజ్ఞతలు.

నా ఈ సిద్ధాంత గ్రంథానికి వ్రాతప్రతులు అందించిన పి. భాస్కర్, తమ్ముడు అంగడాల సుధాకర్‌లకు ఆశీస్సులు.

ఈ పరిశోధనకు నన్ను ప్రోత్సహించిన శ్రేయోభిలాషులైన పెద్దలకు మిత్రులకు నా హృదయ పూర్వక కృతజ్ఞతాభివందనములు.

ఊపిరాడని పని ఒత్తిడిలోఉండి కూడ నా గ్రంథాన్ని పరిశీలించి 'మున్నుడి'ని వ్రాసి యిచ్చినందుకు గౌ॥ ఆంధ్రప్రదేశ్ శాసన సభ ఉపసభాపతి, మాన్యులు మండలి బుద్ధప్రసాదుగారికి మన:పూర్వక కృతజ్ఞతలు.

వ్రాతప్రతికి చక్కని ఫాంట్‌తో తొలుత డి.టి.పి. చేసి యిచ్చిన శ్రీ పి. నాంచారయ్య గారిని మరువలేను. పేజీలను సర్దుబాటుచేసి, చక్కని ముఖ చిత్రాన్ని డిజైన్ చేసిన బందరు కె.కె. గ్రాఫిక్స్ అధినేత శ్రీమతి అరజా కల్యాణి గార్కి సమాచారం ఇవ్వడంలో నాలోపం ఉన్నా విసుగుకొనకుండా సకాలంలో చక్కగా గ్రంథాన్ని అచ్చొత్తించి, అందించిన కె.కె. ఆఫ్‌సెట్ ప్రింటర్స్ అధినేత శ్రీ అరజా కేదారనాథ్ గారికి ధన్యవాదాలు.

ఈ గ్రంథం వెలుగు చూడటానికి కారకులు, తనంత తానై వచ్చి,నాజర్ జీవిత కథా గ్రంథం రెండు దశాబ్దాలుగా అచ్చుకునోచుకోలేదా? అని ఆవేదనా పూరితమైన ఆశ్చర్యాన్ని వ్యక్తం చేసి, డి.టి.పి. ప్రతిని తీసికొని మధ్యతరగతి మందహాసినైన నన్ను ఎవ్వరి యింటి గుమ్మం ఎక్కనీకుండా, ముద్రణకయ్యే వ్యయాన్ని ఎవరు భరిస్తున్నారో కూడ కనీసం చెప్పకుండా, నన్నెవ్వరి వద్దా చేయిసాచనీకుండా, అనారోగ్యాన్ని కూడ లెక్కచేయకుండా ప్రచురణ, ఆవిష్కరణ ఏర్పాట్లన్నీ తానే భుజానవేసుకొని, పుస్తక పరిమాణాన్ని తగ్గించి, ఒకటికి రెండుసార్లు భాషా దోషములను సరిదిద్దిన తెలుగు భాషా సాంస్కృతిక సమాఖ్య, మచిలీపట్నం అధ్యక్షులు యు.టి.ఎఫ్. వెంకటేశ్వరరావు గారి ఋణం తీర్చుకోలేనిది. సోదరతుల్యులైన వారి సేవ సదాస్మరణీయం.

చివరిగా ఎంతో ప్రయత్నించి తెలుసుకొన్నాను. దీనిముద్రణకైన ఖర్చులో కృష్ణాజిల్లా రచయితల సంఘం అధ్యక్షులు గుత్తికొండ సుబ్బారావుగారు సింహభాగం భరించగా, శాసనమండలి పూర్వ సభ్యులు కె.ఎస్.లక్ష్మణరావు గారు, మాజీ అమాత్యవర్యులు డొక్కా మాణిక్యవరప్రసాదు గార్లతో బాటు తానుపడ్డ శ్రమకు తోడు ఒక్కిన ఆర్థిక భారం కూడా పంచుకొన్న పెనుబోతు వెంకటేశ్వరరావు (యుటిఎఫ్) గారికీ వారి వదాన్యతను కలకాలం గుర్తుంచుకుంటానని కృతజ్ఞతా పూర్వకంగా మనవి చేసికొనుచున్నాను.

**- రచయిత**

# విషయసూచిక

## ప్రధమ ప్రకరణం

### బుర్రకథా పితామహ, పద్మశ్రీ షేక్ నాజర్ జీవిత విశేషాలు

## రెండవ ప్రకరణం

## బుర్రకథ వికాసం-వివిధ దశలు

పేజి.నెం.



## అయిదవ ప్రకరణం

## గేయగానం



## ఆరవ ప్రకరణము

## పాత్రల స్వభావం

# పద్మశ్రీ షేక్ నాజర్ జీవిత విశేషాలు

భారతదేశం సకల సంపదలకు ఆలవాలము. విభిన్న సంస్కృతులు, భిన్న భిన్న కళలకు దేశంలోని కొన్ని రాష్ట్రాలు ప్రసిద్ధి చెందాయి. అలాంటి కళలకు ఆంధ్రరాష్ట్రం పెట్టింది పేరు. ఈ కళల్లో "బుర్రకథ" ఒకటి. ఇది ప్రజా కళారూపం, ప్రదర్శన కళారూపం. దీనికి మెరుగులు దిద్ది ప్రజల హృదయాల్లో చెరగని ముద్ర వేసిన ఘనులు పద్మశ్రీ షేక్ నాజర్.

సామాన్యమైన అట్టడుగు కుటుంబంలో నిరుపేదగా జన్మించి పద్మశ్రీ దాకా ఎదిగిన నిజాయితీ కళాకారుడు శ్రీ నాజర్. శ్రీ నాజర్ యొక్క ఉత్తమ జీవితమే, శీలమే అతణ్ణి గొప్పవాణ్ణి చేశాయి. అవి లేకుండా శ్రీ నాజర్ పేరు జీవితంలో ఎన్నో కష్టనష్టాలను చవి చూసినా నీతి, నిజాయితీలకు మాత్రం కట్టుబడి సమున్నతంగా, నిటారుగా తన తలను ఎత్తుకుని తిరిగిన ఉత్తముడు. జీవిక కోసం ఎటుబడితే అటు పోలేదు. కళను నిమ్నస్థాయికి చేర్చలేదు. తను నమ్ముకున్న 'కళామతల్లి' బుర్రకథకు తెలుగు సీమలోనే కాదు, ప్రపంచ ప్రఖ్యాతి తెచ్చిపెట్టిన ఘనత శ్రీ నాజర్‌కు దక్కుతుంది.

అలాంటి ఉత్తమ కళాకారుల జీవిత విశేషాలను సాధ్యమైనంత సూక్ష్మంగా పరిశీలించి, ఆయన బుర్రకథలను ఆ వెనుక పరిశీలిద్దాము.

**జననం**

1920 ఫిబ్రవరి 5వ తేదీన గుంటూరు జిల్లా పొన్నెకల్లు గ్రామంలో నిరుపేద దంపతులైన షేక్ మస్తాన్, బీబాబీలకు శ్రీ నాజర్ జన్మించారు.

నిరుపేద కుటుంబంలో జన్మించినా తెలుగు సీమలో 'బుర్రకథ' కే ప్రాధాన్యం కల్పించి దశదిశలా వ్యాపింపజేసి సామాన్య జీవితం నుండి "పద్మశ్రీ" దాకా ఎదిగిన విశిష్ట వ్యక్తి శ్రీ "షేక్ నాజర్".

## విద్యాభ్యాసం

శ్రీనాజర్ తండ్రి మస్తాన్ కష్టజీవి. ఆ రోజుల్లోనే 'చదువు మనిషికి మూడోనేత్రమని' గమనించిన గొప్పవాడు. మా కష్టాలు మాతోనే పోవాలని కుమారుడైన నాజరును 1925వ సం॥లో వీధి బడిలో చేర్పించాడు. "పువ్వు పుట్టగానే పరిమళిస్తుందన్నట్లు" ఐదేళ్ళ ప్రాయంలోనే ఒకసారి విన్న పాఠం వెంటనే అప్పగించేవాడు. పాటలు, పద్యాలు ఏవైనా సరే అలవోకగా అదే శృతిలో పాడేవాడు.

## గాన విద్యాభ్యాసం

ఇది గమనించిన నాజరుగారి పెదనాన్న నాజరును దగ్గరకు పిల్చి సరిగమలు పలికించి, సన్నాయి నేర్పటం ప్రారంభించారు. నమాజు, వీధి భాగవతుల పాటలు, ఎరుకల సింగి, సింగడు, సోది బాణీలు, కృష్ణ చెంచులు జంటగా జేగంటలు వాయిస్తూ పాడే పద్ధతి, దేవ చెంచులు పేరణం చేస్తూ వీరతాళ్ళు మోగిస్తూ పాడే పాటలు, వీర చెంచుల ఆడవాళ్ళు ముద్దకోసం పాడే పాటలు, వీటితోపాటు బవినీలు, పంబలు, జక్కులు మున్నగువారి వంశపారంపర్యంగా వస్తున్న మౌఖికమైన తెలుగు జానపద బాణీలను అందులోని మెలకువలను ఆసక్తితో నేర్చుకున్నారు నాజరుగారు.

ప్రతి ఏటా పీర్ల పండుగనాడు శ్రీ నాజరు తండ్రి, పెదనాన్న పులి, ఎలుగు, ఎరుకుల సింగడు, గొర్ల కాపరి వంటి వేషాలు వేసి జనాన్ని మెప్పించేవారు. అందుకు ప్రతిఫలంగా ప్రజలు మెచ్చుకుని కొంత ధాన్యాన్ని యిచ్చేవారు.

ఒకసారి ప్రతి ఏడులా కాకుండా శ్రీ నాజరుతో పద్యాలు, కీర్తనలు పాడించారు. ముందు సంవత్సరం కంటే ఎక్కువ ధాన్యం పోగయ్యింది.

## నాటక నటన

1920వ సం॥ స్కూలు వార్షికోత్సవంలో విద్యార్థులందరూ కలసి 'ద్రోణ విజయం' అనే నాటకాన్ని ప్రదర్శించారు. అందులో నాజరు 'ద్రోణ' పాత్రను

పోషించారు. ఆ పాత్రకు జీవం పోశాడని మాష్టారు నాజరును ప్రశంసించి బహుమతిని ఇచ్చారు. నాజరుగారి తండ్రితో మీవాడు సహజ నటుడే కాదు, ఏక సంథాగ్రాహి కూడా, కృషి చేయిస్తే మంచి కళాకారుడు అవుతాడని చెప్పారు. అలా శ్రీ నాజరు 'దిన దిన ప్రవర్థమానుడై' ఎదుగుతున్నాడు.

ఆ నోట, ఆ నోట శ్రీ నాజరును గూర్చి విన్న గొప్ప హార్మోనిస్టు 'ఖాదర్ సాహెబ్' గారు 'కనకతార' నాటకంలో 'కనకసేనుని' వేషం వేయించారు. ఆ పాత్రను పోషించిన శ్రీ నాజరు ప్రజల ప్రశంసలను, అభిమానాన్ని చూరగొన్నారు.

## బాలరత్న సభ

1928 సం॥లో శ్రీ ఖాదర్‌గారు శ్రీ నాజరు తల్లిదండ్రులను ఒప్పించి "శ్రీ టి.రామకృష్ణ శాస్త్రి"గారి ఆధ్వర్యంలో నిర్వహింపబడుతున్న "బాలరత్న సభ"లో చేర్పించారు. నాజరు పేరును 'గోపి'గా మార్చి చదువు, నటన, సంగీతం, నాట్యం, గానం నేర్పించారు. "శ్రీ టి.రామకృష్ణశాస్త్రిగారు అసామాన్య నటశేఖరులు, నారద పాత్ర ప్రసిద్ధులు. సుమారు 1500 నాటకాల్లో నటించిన గొప్ప నటుడు".

అప్పటి వరకు మగవేషాలు మాత్రమే వేస్తున్న నాజరుగారు 'కృష్ణలీల'లో దేవకి వేషం, 'శ్రీకృష్ణ తులాభారం'లో రుక్మిణి వేషం ధరించి ఆడ వేషాల్లో కూడా శ్రీ నాజరు గొప్పవాడని ప్రేక్షక ప్రశంసలు పొందారు.

ఒకసారి "భక్త రామదాసు" నాటకంలో 'చాందిని' పాత్రను పోషించవలసి వచ్చింది. ఆ పాత్రకు నాట్యం ప్రధానం కాబట్టి నాట్యం నేర్చుకోడానికై తెనాలిలోని కళావంతుల నాయకురాలి వద్దకు వెళ్ళారు. నాట్యం నేర్పడానికి ఆమె అంగీకరించింది. ఆమె చెప్పిన వెంటనే అనుకరిస్తుంటే అనుమానం వచ్చి 'నీకు నాట్యంలో ప్రవేశం ఉందా' అని ప్రశ్నించింది. దానికి శ్రీ నాజరు కులుకు కోలాటం, చెక్క భజనలలో ప్రవేశముందని సమాధానమిచ్చారు. అది విని ఆమె "నీవు లయబ్రహ్మవురా" అని అభినందించింది. అనతికాలంలోనే నాట్యంలోని మెలకువల్ని నేర్పింది.

అలా తర్ఫీదై ఇంచుమించు రోజూ నాటకాలు ప్రదర్శిస్తూ ఉండేవారు శ్రీ నాజరు. ఆయన నటనకు ప్రేక్షకులు ఏకకంఠంతో "వన్స్‌మోర్" అని ఈలలు, చప్పట్లు కొడుతూ లీనమయ్యేవారు.

1929లో "కృష్ణలీల" నాటకం చీరాలలో ప్రదర్శించారు. ప్రదర్శన అనంతరం నాటక సంస్థలో వాటాలు కుదరక గొడవలు జరిగాయి. 'బాలరత్న సభ' కళాకారులను అందరినీ ఎవరిళ్ళకు వాళ్ళను పంపించారు. ఇంటికి వచ్చిన నాజరు ఖాళీగా కూర్చోలేక బట్టలు కుట్టడం నేర్చుకుంటానని ఓ దర్జీ వద్ద చేరాడు.

## దర్జీ

దర్జీ పని నేర్చుకుంటున్న శ్రీ నాజరు వద్దకు తండ్రి మస్తాన్‌గారు వచ్చి తీసుకు వెళ్తూ 'నాజరూ వన్స్‌మోర్‌లు కొట్టించుకునే నీవు బట్టలు కుడుతూ, గుండీలు వేయటం నాకు బాధగా ఉంది. స్వరాలు పలికించి సంగీతాన్ని ఆలపించాల్సింది పోయి నీలో నీవే పాడుకుంటుంటే నేను చూడలేను. నీవు గొప్పవాడిగా పేరు ప్రఖ్యాతులు సంపాదించుకోవాలి' అని బాధతో చెప్పారు.

## సంగీతాభ్యాసం

నాజరును ఎలాగైనా విద్వాంసుని చేయాలని శ్రీ ఖాదర్ సాహెబ్‌గారు అనేక ప్రయత్నాలు చేస్తున్నారు. 1929లో నరసరావుపేట బెంచి మెజిస్ట్రేటు, సహృదయులు అయిన శ్రీ మురుగుళ్ళ సీతారామశాస్త్రిగారి వద్దకు తీసుకువెళ్ళి అప్పగించారు. ఆయన ఎంత ప్రయత్నించినా వారాలు కుదర లేదు. శ్రీ నాజరు తండ్రి ఎలానో తిప్పలు పడి డబ్బు పంపి ఒక నెల తరువాత నా వల్ల కాదు డబ్బులు పంపలేను అని చెప్పారు. చివరకు గురువుగారు నాజరుచే జోలె కట్టించి తన శిష్యురాండ్రను భిక్ష వేయుటకు ఒప్పించారు. త్యాగరాజ కృతులు, 'శాంతము లేక సౌఖ్యము లేద'నే కృతి పాడగా నాజరును శిష్యురాండ్రు బావుందని మెచ్చుకున్నారు.

నాజరుకు సమవయస్కులు ఎదురైనపుడు కొంచెం సిగ్గు అనిపించేదట. 'సంగీతంపై గల మక్కువ, గమ్యం చేరాలనే తపనలు అతనిని కార్యోన్ముఖుని'గా చేశాయి. శాస్త్రిగారి వద్ద ఐదు సంవత్సరములు గడిపారు. ఈ కాలంలో 25 చిన్న వర్ణాలు, 4 పెద్ద వర్ణాలు, త్రికాలు శ్రద్ధగా నేర్చుకున్నారు.

1934లో 'బాలరత్నసభ' కుర్రాళ్ళంతా కలసి మళ్ళీ నాటకాలు వేయాలనుకుంటున్నారు, నిన్ను తీసుకు రమ్మన్నారని నాజరుగారి పెద్ద మామ వచ్చారు. "ఈలలు, చప్పట్లు, వన్స్‌మోర్‌లతో కూడిన గత వైభవము కళ్ళ ముందు కదలి", గురువుగారితో మామయ్య కొడుకు పెళ్ళి అని అబద్ధం చెప్పి శ్రీ నాజరు బయలుదేరారు.

**<u>బాల మహమ్మదీయ సభ</u>**

1934లో 'బాల మహమ్మదీయ సభ' అని పేరు పెట్టి నాటకాలు వేస్తుంటే 'ఏ నోట విన్నా నాజర్ మంచి పాటగాడు, ఆటగాడు' అని గొప్పగా చెప్పుకునేవారు. ప్రత్తిపాడు గ్రామస్థుల కోరికపై నాజరు తన బృందంతో "శ్రీకృష్ణ తులాభారం" నాటకం ప్రదర్శించారు. రుక్మిణి పాత్రను అద్భుతంగా పోషించారని నాజరుకు కొందరు నాజరును అనుకరిస్తూ, అనుసరిస్తున్నారు. అలా నాజరుగారు రెండవ దశలో "అనుభవాలను పాఠాలుగా చేసుకుని, మేధ పెంచుకుంటూ ఎదుగుతున్నారు".

ఆడుతూ, పాడుతూ నేర్చుకున్న మిషన్ జీవనాధారం మాత్రమే కాలేదు, పరిచయాలను పెంచి, మాటా మంతీ, లోక జ్ఞానం వంటి వాటిలో మానసికాభివృద్ధిని పెంచి పోషించింది.

ఓ రోజు నాజరుగారు బట్టలు కుడుతూ మంచి హుషారుగా, అదే స్థాయిలో రాగాలు తీస్తున్నారు. ఆ సమయంలో అక్కడకు 'కొమ్మినేని బసవయ్య'గారు వచ్చింది గమనించకుండా పాడుతూనే ఉన్నారు. పాట పూర్తయిన తరువాత చప్పట్లు

కొడుతున్న బసవయ్యగార్ని చూసి సాదరంగా కూర్చుండబెట్టారు. కాసేపు పిచ్చాపాటి మాట్లాడిన తరువాత బసవయ్యగారు మా పిల్లలకు సంగీతం నేర్పమని నాజరుగార్ని అడిగారు.

## సంగీత గురువు

ఇంతకాలం తాను నేర్చుకున్నవి, పాడినవి ఒక క్రమ పద్ధతిలో ఏర్చి కూర్చి సాధన చేస్తూ నేర్పటం మొదలు పెట్టారు. సంగీతంలోని లోతు, మాధుర్యం, గొప్పదనం మెల్లగా అర్థం చేసుకో సాగారు. నాజరుగారి వద్ద సంగీతం నేర్చుకున్న "శ్రీ కొమ్మినేని చక్రవర్తి ప్రముఖ సంగీత దర్శకులు" అయ్యారు.

సంగీతం నేర్పుతున్న నాజరుగారిని గూర్చి విన్న ప్రక్క ఊరి కుర్రాళ్ళు సంగీతం, నాటకాలు నేర్పమని కోరారు. వారిచే సాధన చేయించి నాటకాలు ఆడిస్తూ, తాను కూడా ఆడుతూ, పాడుతూ జనరంజకుడుగా ప్రజలకు దగ్గరయ్యారు. కొండ్రుపాడు, కొట్రుపాడు, చిన్న లింగాయపాలెం యువ కళాకారులచే 'కనకతార' మొదలగు నాటక ప్రదర్శనలు యిప్పించి, ప్రజల ప్రశంసల్ని పొందారు.

## ప్రథమ వివాహం

ప్రయోజకుడైన శ్రీ నాజరును ఒక ఇంటి వాణ్ని చేయాలని తలచిన బంధువులు, మిత్రులు, మేనమామ గారమ్మాయి 'ఖాసింబీ'తో 1942లో శిష్యుల సహకారంతో వివాహం జరిగింది.

## గాయకుడు

కమ్యూనిస్టుల ఆధ్వర్యంలో "తుళ్ళూరు'లో పాటల పోటీలు ర్వహిస్తున్నారు. అందులో పాల్గొనవలసిందిగా శ్రేయోభిలాషులు, మిత్రులు . నాజరుకు కబురు పంపించారు. 'కారుమంచి వెంకటేశ్వరరావుగారు' రచించిన ాటలు, పద్యములు పాడి 'ప్రథమ బహుమతి'ని గెలుచుకున్నారు.

నాజరుగార్ని గురించి తెలుసుకున్న పొన్నెకల్లు కమ్యూనిస్టువారు "శ్రీ కొండపనేని బలరామ్, వేములపల్లి శ్రీకృష్ణ"గారు శ్రీ నాజరును కలసి "మీ ఈ ఉన్నతమైన కళ ప్రజారంజకము, కాబట్టి నీవు ప్రజా కళాకారుడవు అయితే దేశానికి సేవ చేసిన వాడవు కాగలవు దానితో నీవు అనుకున్న గమ్యం చేరగలవు" అని చెప్పారు.

**హాస్యవంత**

గుంటూరు తీసుకువచ్చి జానపద కళాప్రక్రియ, ప్రదర్శనా వాఙ్మయము అయిన 'బుర్రకథ'ను ప్రచార సాధనంగా ఎంచుకున్నారు. ఉలిందం వాస్తవ్యుడైన 'వేపూరి రామకోటి'ని ప్రధాన కథకునిగా చేసి, వంతలుగా 'శ్రీనాజరును హాస్య పోషణకు, ముక్కామల పురుషోత్తమును రాజకీయ పోషణకు' నిర్ణయించారు.

1943లో ప్రప్రథమ బుర్రకథా రచయిత, కథకులు అయిన 'కాకుమాను సుబ్బారావు'గారు వ్రాసిన 'సోవియట్ వీరవనిత' "టాన్యా" అను కథను ఈమనిలో ప్రదర్శించారు.

**కథకుడు**

కొన్నాళ్ళకు రామకోటిగారు కమిటీకి చెప్పి, ఒప్పించి నాజరుగారిని ప్రధాన కథకునిగా చేసి, తాను హాస్యవంతగా మారిన 'ఉత్తమ కళాభిరుచిగల సహృదయుడు', తాడికొండలో 'టాన్య' కథనే నాజరుచే చెప్పించారు. కథను విన్న ప్రజలు, ప్రముఖ బుర్రకథకులు 'శ్రీ దొడ్డవరపు వెంకట స్వామి'ని గుర్తు చేశారనే వార్త మారుమ్రోగింది.

శ్రీరామకోటిగారు పట్టుబట్టి కమిటీకి చెప్పి అందెలు, చెక్కలతో పాటు తంబుర కూడా ఉండాలని 'ధేనువకొండ వెంకటస్వామి'గారి వద్దకు తీసుకువెళ్ళి తంబుర కొన్నారు. తంబురను శృతి చేసి శ్రీ నాజరుచే పాడించి గొంతుకు సరిపడ 'ధీం తధింధింత' అనే తాళం పలికింప జేశారు.

తుళ్ళూరులో కథ చెప్పడానికి వెళుతూ దారిలో అంతకుముందున్న నాటకాల అనుభవం, సంగీత జ్ఞానం కలిపి 'ధేనువకొండ' వారి బాణీలు తెలిసిన నాజరును అడుగు, తాళం చూపించి ధైర్యం చెప్పిన 'రామకోటి' ఉత్తమ కళాభిమాని.

**బుర్రకథల్లో సంస్కరణలు**

దొడ్డవరపు వెంకటస్వామిగారు కథను ప్రారంభించే ముందు పాడే 'శ్రీధేనువగిరి' ప్రార్థననే నాజరుగారు మార్పులు, చేర్పులు చేసి పాడేవారు. 'రెంటపాల గుడ్డిజంగం' ఎలియాస్ 'కోటి వీరయ్య'గారు "సముద్ర మథనం" ఘట్టంలో వాడిన "గిరగిర కవ్వము తిప్పుచు, కేకలు వేయుచును" అను రగడలను యుద్ధము, వీర ఘట్టాలలో పాడి చూడగా జనవాహిని బావుందని మెచ్చుకున్నారు. నాజరుగారు తన ఆప్తమిత్రుడైన రామకోటితో నిరంతరం కథలు ఎలా మెరుగులు దిద్దాలి, ఎలా రక్తి కట్టించాలి అని చర్చించి ప్రదర్శనలు యిచ్చేవారు. అలా కళల్లో మెలకువలు గమనిస్తూ, అనునయిస్తూ కాలం గడుపుతున్నారు.

విజయవాడ 'రైతు మహాసభ'లో పోటీలు నిర్వహిస్తున్నారని తెలిసి క్రిక్కిరిసిన ప్రేక్షక సమూహము ఎదుట రష్యాకు 'టాన్యా' అను స్త్రీ స్వేచ్ఛకై చేసిన పోరాటగాథను ప్రదర్శించారు. ఆ కథలోనున్న ఆంతర్యాన్ని అర్థమయ్యేలా, స్త్రీల అభ్యుదయాన్ని గూర్చి చెప్తూ 'పోరాట పథం వైపు దేశ స్వేచ్ఛకై పోరాడే వాళ్ళు అంతా సమానులే' అనే సిద్ధాంతాన్ని తెలియజేశారు. ప్రజలను చైతన్యవంతులుగా చేయడానికి బుర్రకథను ప్రదర్శించినందుకు 'ద్వితీయ బహుమతి' లభించింది.

**ప్రజా నాట్యమండలి సభ్యత్వం**

1943లో గుంటూరు 'ప్రజానాట్య మండలి'లో 'నాజర్ దళం' సభ్యులుగా చేరారు. తబలా, హార్మోనియం, డోలక్, మృదంగం, తంబురా వంటి వాద్యాలపై సాధన చేయటం మొదలు పెట్టారు. నాజరుగారు అంతకుముందే సంగీతం, నటన

మరియు నాట్యంలోగల ప్రావీణ్యానికి, తనకు తానుగా అభివృద్ధి చేసుకున్న కళను జతచేసి అతి తక్కువ కాలంలోనే సామ్యవాద రచయిత అయిన 'సుంకర సత్యనారాయణ' గారి 'కష్టజీవి' బుర్రకథను స్వతంత్రించి కొన్ని చోట్ల మార్పులు చేసి చెపుతుంటే ప్రజలు ఉత్తేజితులు అయ్యేవారు.

ప్రజా నాట్యమండలిలో సభ్యత్వం ఉన్న ప్రతి కళాకారునికి నెలకు 16/- రూపాయల జీతం, సామూహిక భోజనాలు, పడకలు, చర్చలతో ఉండేవారు. అలాంటి సమయంలో నాజరుగారి భార్యకు కంటి జబ్బు చేసింది. ఆమెను పార్టీవారు హాస్పిటల్‌లో చేర్చి వైద్యం చేయించారు. ఆమెను పరీక్షించిన వైద్యులు దాంపత్య జీవితానికి పనికిరాదని చెప్పారు. భార్యా వియోగాన్ని దిగమింగుకుని బాధతో ఆమెను ఇంటికి పంపించారు.

1944లో "డాక్టర్ గరికపాటి రాజారావుగారి నేతృత్వంలో 'రాష్ట్ర ప్రజానాట్యమండలి'కి నాజర్ దళాన్ని ఎన్నిక" చేశారు. నాజరుగారు కూచిపూడి, డప్పుల డాన్సులు నేర్చుకున్నారు.

సుంకర, వాసిరెడ్డిగారి 'మా భూమి' నాటకంలో 'జమిందారు', 'క్రిప్స్ రాయబారం'లో 'లాబు' పాత్రలతో పాటు 'వీధి భాగవతం'లో 'భూపాల' వంటి విచిత్ర వేషాలు కూడా వేస్తూ "ఆంధ్రరాష్ట్రమంతటా సామ్యవాద సిద్ధాంతాన్ని నాజర్‌దళం ప్రచారం" చేస్తుంది.

అహ్మదాబాదు ఆలిండియా నాటక సభ్యుల జానపద కళల పోటీలో నాజరు దళానికి 'ప్రథమ బహుమతి' లభించింది.

అదే సమయంలో కళాకారుడుగా ఎదుగుతున్న నాజరుగారు ఆరోగ్యం క్షీణించడం చేత బాధపడుతున్నారు. డాక్టరును సంప్రదించగా మళ్ళీ పెళ్ళి చేసుకొమ్మని సలహా యిచ్చారు. ఆ విషయం పార్టీ వాళ్ళకు చెప్పారు.

## ద్వితీయ వివాహం

క్రమశిక్షణాయుతులు, సామ్యవాది అయిన 'శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య'గారు నాజరుగారితో నీ మొదటి భార్యను, బంధువులను ఒప్పించినట్లయితే పార్టీ పెళ్ళి చేసుకోవచ్చు అని చెప్పారు. ఇంటికి వెళ్ళి రెండవ వివాహం గురించి అడిగితే అందరూ నిరాకరించారు. తన పరిస్థితిని ఎవరూ అర్థం చేసుకోవటం లేదు కనుక ఎవరికీ తెలియకుండా పెళ్ళి చేసుకోవటం ఉత్తమం అని నిర్ణయించుకున్నారు. కొరిటిపాడులో విడాకులు తీసుకున్న 'ఆదంబీ' అనే అమ్మాయి ఉందని తెలిసి వెళ్ళారు. ఆ అమ్మాయిని వివాహం చేసుకోవటానికి ఒప్పించారు. 'కన్యాశుల్కంగా వాళ్ళ నాన్నకు వంద రూపాయిలిచ్చి' ఆ అమ్మాయిని విజయవాడ తీసుకువచ్చారు.

1944లో పెదపూడిలో చారిత్రాత్మక, వైజ్ఞానిక, రాజకీయాలకు, 'కొడవటిగంటి, మల్లంపల్లి, నిడదవోలు వెంకట్రావు, ఆదినారాయణ, శ్రీశ్రీ'ల ప్రసంగాలకు స్పందించి పాటలు వ్రాయనారంభించారు. సభ్యుల ఎగతాళిని పట్టుదలగా మార్చుకుని నాజర్‌గారు రచయితగా మరో పర్వానికి నాంది పలికారు. జానపదులు (పల్లె ప్రజలు) పాడుతూ పనులు చేస్తూ ఉంటారు. అట్టి జానపదుల కళాప్రక్రియలోనిదైన 'వలియ వలియ' అను పాటలో గ్రామీణ జన జీవన విధానాన్ని తెలియ చేశారు.

## బుర్రకథా రచయిత

1944వ సంవత్సరం బెంగాల్‌లో తుఫాను వచ్చి, వరదల కారణంగా అనేక ...ంది నిరాశ్రయులయ్యారు. అక్కడి "ప్రజల హీన, దీన, దయనీయ పరిస్థితిని ...పర్లో చూసిన నాజరుగారికి, కళ్ళల్లో నీళ్ళు నిండి ఒక్క క్షణం అక్షరాలు ...ంచలేదు". ఆ సంఘటనతో స్పందించిన నాజరుగారు "బెంగాల్ కరువు" అని ...రు పెట్టి కరవుకు గురైన సగటు మనిషి స్థితిగతులను వివరిస్తూ "బుర్రకథ" ను ...శారు.

విజయవాడ హనుమంతరాయ గ్రంథాలయంలో 'బెంగాల్ కరవు' ప్రదర్శిస్తూ తాను జీవితంలో అనుభవించిన విషాద సంఘటనలు దృష్టిలో ఉంచుకుని "కోడలు ఊరొదలి మామతో వెళ్ళే" సంఘటనలో కరుణ రసాన్ని "గుమ్మాన యుద్ధ రాక్షసి, దేశాన కరువు పిశాచి, దేశమందు తిండి దొంగలు, దాచి వేసిరి తిండి గింజలు" అంటూ నిత్య సత్యాలను అత్యంత మనోహరంగా వివరించారు.

అంతేగాక యుద్ధం వస్తే కరవు వచ్చి సంక్షోభం పెరుగుతుంది. సోదర, మిత్రులు ఆహుతి అవుతారని నిరసనగా పాడుతూ "గాంధీ, జిన్నాలు కలవాలని మనమంతా ఏకమై కోరాలోయ్" అంటూ సందేశాన్నిచ్చారు. అది చూసిన ప్రముఖ రాజకీయ నాయకులు, అభ్యుదయ రచయితలు నాజరుగారిని ప్రశంసించారు.

**శ్రీ సుందరయ్య ప్రశంస**

మానవతావాది, త్యాగశీలి, నిస్వార్థజీవి, క్రమశిక్షణాయుతుడు, ప్రేమ స్వభావి అయిన శ్రీ పుచ్చలపల్లి సుందరయ్యగారు శ్రీ నాజరును ఆప్యాయంగా కౌగలించుకుని వెన్నుతట్టి "నా బిడ్డ ఎంతో ఎత్తు ఎదిగాడని" అభినందించారు. అభ్యుదయ పత్రిక కవరు పేజీపై నాజరుగారి ఫోటో వేసి, లోపలి పేజీల్లో పొగడుతూ ప్రత్యేక వ్యాసం ప్రచురించారు.

**శ్రీ బళ్ళారి రాఘవ అభినందన**

1944లోనే బాపట్ల యువజన మహాసభలో "బెంగాల్ కరవు" బుర్రకథ ప్రదర్శించారు. శ్రీ 'బళ్ళారి రాఘవ'గారు ఆ సభకు అధ్యక్షత వహించారు. నాజరుగారు బుర్రకథ చెపుతుంటే అధ్యక్ష పీఠం నుంచి లేచి "భళా నాజరూ నీ వంటి ఉ త్తమాభిరుచి గల కళాకారుడు ఈ దేశానికి ఎంతో అవసరం" అంటూ అభినందించారు.

**కరవు సహాయనిధి**

తరువాత కొన్నాళ్ళకు బళ్ళారిలో 'నాజరు బృందం'చే కథ చెప్పించి డబ్బు

వస్తువులు, వస్త్రాలు ప్రోగుచేసి కమ్యూనిస్టు పార్టీ వారి 'కరవు కమిటీ' ద్వారా బెంగాల్‌కు పంపించారు.

## సన్మానం

1946లో మచిలీపట్నం ప్రజా సహకారంతో 'పినపాల నాగభూషణం'గారు పనస కర్రను తెప్పించి నిపుణుడైన 'నందం సుబ్బారావు'తో సరిక్రొత్త పద్ధతిలో తంబురా చేయించారు. సభను ఏర్పాటుచేసి నాజరుగారిని సత్కరించి బహూకరించారు.

ప్రముఖ పాత్రికేయులు అయిన శ్రీ 'కె.అబ్బాస్' డక్కన్ క్రానికల్ పత్రిక చివరి పేజీలో ఫోటో వేసి వ్యాసాన్ని ప్రచురించారు. అందులో నాజరుగారిని "ఆంధ్రా అమర్ షేక్" అనే జనాభిప్రాయాన్ని వ్యక్త పరిచారు.

## నాటక దర్శకత్వం

మా భూమి నాటకంలో 'కమల' పాత్రకు ప్రజానటి 'జమున'ను తీర్చిదిద్ది దుగ్గిరాలలో ప్రదర్శింపజేశారు.

## ప్రభుత్వ నిషేధం

దేశంలో కార్మిక, కర్షక సమ్మెలు, ధనిక, పేద వర్గాల మధ్య పోరాటాలు చినికి చినికి గాలి వానగా మారాయి.

సృజనాత్మకత కలిగి ప్రజలలో మమైకమై ప్రజా కళాకారుడుగా కీర్తింపబడుతున్న 'నాజరు దళం' తాడిత పీడిత జనాన్ని చైతన్యోద్దీపితం చేసి, ప్రజా సంఘాల ద్వారా సాయుధ పోరాటానికి సన్నద్ధుల్ని చేస్తుందని ప్రభుత్వం నిషేధం విధించింది.

ప్రజా నాట్యమండలి కళాకారులు వేరుగా ఉండక పార్టీలో కలిసి

ఉంటున్నారు. ప్రజా నాట్యమండలి సలహాదారు (అడ్వైజర్) 'మద్దుకూరి చంద్రం'గారు పార్టీని, కళాకారులను వేరుచేసి కళాకారులు ఇకనైనా వేరుగా ఉ ంటూ స్వయంప్రతిపత్తిపై జనాన్ని చైతన్యవంతం చేయాలన్నారు.

**ఏర్వాక కమిటీ**

ఏర్వాక కమిటీలుగా ఏర్పడి ఒక్కొక్కరు ఒక్కో సంస్థగా వాళ్ళ బాధ్యతలు నిర్వహిస్తున్నారు.

నాజరుగారు పొన్నెకల్లు చుట్టుప్రక్కల గ్రామాల్లో కూలి, పాలేళ్ళ, రైతు సంస్థలను నిర్మించారు. అక్కడి వాళ్ళను నాటకాలు ఆడిస్తూ ఇల్లు మరచి చైతన్యవంతులను చేస్తున్నారు. ఇంటి దగ్గర నుండి తల్లి కబురుచేస్తే వెళ్ళారు. వెళ్ళిన నాజరు గారిని "నీకు దేశంతో పాటు మేము కూడా ఉన్నాము అనే విషయం మరచిపోయినట్లున్నావు" అంటూ తల్లి మందలించింది.

ప్రభుత్వపు నిషేధాజ్ఞలకు భయపడిన నాజరుగారు అటు పోలీసులకు, ఇటు భూస్వాములకు తెలియకుండా తల్లి మాట కాదనలేక పొలం పనులకు వెళు తున్నారు. కష్టజీవి యొక్క సాధక, బాధకాలను పాటలుగా వ్రాస్తూ, పాడుతూ, వివరిస్తూ జనాన్ని సమతా పథంవైపు తీసుకువెళ్తూ తన కర్తవ్యం నిర్వహిస్తున్నారు.

**పాటల రచయిత**

తన పాటల్లో రైతు కూలీలను, కష్టజీవులను దృష్టిలో ఉంచుకుని వారి జీవన విధానాన్ని వివరించారు. "ఏ నాటి కానాడు ఎండ వానల్లో" పాటలో రైతు కూలీలను గూర్చి వివరించి చెప్తూ పాడించేవారు. ఊరికి ఉత్తరాన విసిరేసినట్టు ఉ ంచే అంటరాని విధానాన్ని నిరసిస్తూ వారినందరినీ ఏకం కావాలని ప్రబోధించారు

"ఎండల్లో వానల్లో నీడనక, నిద్రనక" అనే పాటలో పనిచేసే వాళ్ళ "పస్తులు సోమరిపోతులకు ఆస్తులు"గా ఉన్న పరిస్థితిని కొనసాగనివ్వరాదని "శ్రామికులంతా ఏకం కావాల"నే సందేశాన్నిచ్చారు. రోజూ కూలి చేస్తూ జీవనం గడవక ఏ

పూటకాపూట అన్నీ వెతుక్కునే వారిని గూర్చి "ఎన్నాళ్ళీ కాపురాలు" పాటలో 'సగటు మనిషికి కూలి చాలక ఎన్ని యిబ్బందులు ఎదుర్కుంటున్నాడో' చెప్పారు.

భూస్వాముల వద్ద చేసే కమతగాళ్ళను గూర్చి "ఏరన్న రాకముందే ఏర్వాక వచ్చె రన్న" పాటలో తెల్లవారక ముందే లేచి చద్దన్నం, పచ్చడి మెతుకులు తిని భూస్వాములు చెప్పినట్లు చేయటం, జబ్బులొచ్చినా సెలవుల్లేవు అని వివరిస్తూ కామందుల దౌర్జన్యాన్ని నిలదీసి అడగమని' చెప్పారు.

## పేదల మనిషి

అలా ఉపన్యాసాలు, మాటలు, పాటల ద్వారా 'బుర్రకథ'లు చెప్పేప్పుడు సమయం, సందర్భం వచ్చినపుడు సామాజిక స్థితిగతులు, వాటి పరిష్కార మార్గాలు చెపుతూ 'దోపిడీ విధానాన్ని పెట్టుబడి దారులనుంచి సామాన్య మానవునికి సమాజంలో గుర్తింపు కావాలని' తన ఉద్దేశాన్ని ప్రజలకు చాటేవారు.

ఇలా అన్ని ఊళ్ళల్లో ముమ్మరంగా ప్రచారం చేస్తున్నారు. ప్రక్క ఊరి ఆసామి "ఏరా?! కులం, గోత్రం లేనోళ్ళని ప్రభువులని చేస్తావా?" అని చెంపపై కొట్టి పెన్ను లాక్కు వెళ్ళాడు. శ్రామికులకు తెలిసి వెళ్ళి ఆసామిని నిలదీయగా కంగుతిని కొట్టలేదని అబద్ధం చెప్పి తప్పించుకుని పెన్నిచ్చి పంపాడు.

నాజరుగారు ఏ జనానికైతే "మహాప్రస్థానం" ఏర్పాటు చేశారో అదే జనంలో వచ్చిన మార్పును చూసి, ఆ దారిలోనే నడవాలనే స్పృహను కల్పించి తాను చేసిన కృషి సార్థకమైందని 'ఈ పట్టు మీరు ప్రభువులయ్యే వరకు ఉండాలని' ఉత్సాహపరిచారు.

## అజ్ఞాతవాసం

పేదల విముక్తి పోరాట సంఘాలైన ఏర్వాక కమిటీవారిని, కమ్యూనిస్టు అభిమానులను, సానుభూతి పరులను అటు ప్రభుత్వం, ఇటు ధనిక వర్గం ముప్పు తిప్పలు పెట్టి మూడు చెరువుల నీరు త్రాగిస్తున్నారు. అదే సమయంలో తాటికొండ

పోలీసు స్టేషన్‌పై దాడి చేశారనే నెపంతో సామ్యవాద కమిటీ సభ్యులను, ప్రజా కళాకారులను అరెస్టు చేస్తున్నారనే వార్త రాగానే తలా ఓ దిక్కుకు చెల్లా చెదురై తమ ఉనికి ఎవరికీ తెలియకుండా, ఊళ్ళలో ఉండకుండా, 'కొండల్లో, పొలాల్లో, అడవుల్లో అజ్ఞాతవాసం' చేస్తున్నారు.

ఏ క్షణంలో ఏ విపత్తు వస్తుందో తెలియని పరిస్థితిలో నాజరుగారు పరారిలో ఉన్నారు. నిండు చూలాలైన నాజరుగారి భార్య గిలక లేని బావిలో నీళ్ళు తోడుతూ కాలు జారిపడి ప్రాణాపాయ స్థితిలో ఉంది. ఆమెను వాళ్ళ అన్నయ్య గుంటూరు ఆసుపత్రిలో చేర్పించారని తెలిసింది. వెంటనే రావటానికి పోలీసులకు, కామందులకు తెలిస్తే అపాయం కనుక రాత్రి వరకు ఎలాగో ఓపిక పట్టి ఎవరికీ కనిపించకుండా చీకట్లో చుట్టూ గమనిస్తూ, భయాందోళనలతో వెళ్ళి ఆసుపత్రిలోనున్న భార్యను కలిశారు. 'కష్ట సమయంలో నిన్ను చూసుకునే అవకాశం లేకపోయిందని' ఏడ్చి బాధను దిగమ్రింగుకుని, సముదాయించి మామగారింటి ప్రక్కనే ఉన్న నిమ్మతోటలో తోటమాలిగా ఉంటూ మిత్రుల సహకారంతో వైద్యం చేయించినప్పటికీ ఆమె దక్కలేదు. తను బైటకు రావటానికి వీల్లేక మిత్రుల సహాయంతో కర్మకాండ జరిపించి, పొన్నెకల్లు వచ్చి పుట్టెడు దుఃఖంలో ఉన్నారు. కొన్నాళ్ళకు పోలీసుల నిఘా తగ్గుముఖం పట్టింది.

## మూడవ వివాహం

ఎప్పుడూ ఖాళీ లేకుండా ఏదో ఒక పని చేస్తూ హాయిగా ఉండే నాజరుగారు, ఒక్కసారిగా భార్యా వియోగం కలిగి మనోవ్యథతో కుమిలిపోతున్నారు. తల్లి, పెద్దమ్మ వచ్చి ఓదార్చి "మళ్ళీ పెళ్ళి చేసుకో నాయనా! ఒంటరితనం మంచిది కాదు, మనస్సుకు శాంతి లేనపుడు చేదోడు, వాదోడుగా మనిషికి మరో మనిషి తోడు ఉంటే మనసు కుదుట పడుతుందని"ని నచ్చచెప్పారు. ఈ పరిస్థితుల్లో పెళ్ళి వద్దని తిరస్కరించారు.

1948లో ప్రభుత్వం ప్రజా సంఘాలపై, ప్రజా కళాకారులపై గల నిషేధాన్ని ఎత్తివేసినట్లు ఉత్తర్వులు రాగానే ఊరట చెందారు. తరువాత కొన్నాళ్ళకు గారపాడులో గల మేనమామ గారమ్మాయి 'ఆదంబీ'ని మూడవ వివాహం చేసుకున్నారు.

భార్యా వియోగం నుంచి, ప్రభుత్వ ఒత్తిడుల నుంచి తేరుకుంటున్న నాజరుగారికి తుళ్ళూరులో ఓ భూస్వామిని ఎవరో హత్య చేసారట. మన పార్టీ వాళ్ళంతా పరారీలో ఉన్నారని సుబ్బయ్య వచ్చి ఆదుర్దాగా చెప్పాడు. అప్పటికి నాజరుగారి పెళ్ళి జరిగి పదమూడు రోజులు. ఇంకా ముద్దు, ముచ్చట తీరనేలేదు. అసలే లోకం పోకడ తెలియని అమాయకురాలు ఆదంబీ. కానీ ఆమెకు సంగీతం అంటే బాగా ఇష్టం. అలాంటి పసి మనసును విడిచి పెట్టాలంటే బాధ కలిగినా తప్పదని అనుకుంటుండగా పోలీసులు ఊళ్ళోకి వచ్చారని కబురందింది.

__ఇంటిపై పోలీసు దాడి__

ఇక్కడ ఉండడం మంచిది కాదని ఎటు వెళ్ళాలో తోచక ఆలోచించే సమయం లేక నాజరుగారు ప్రక్క సందులోకి వెళ్ళారు. కాంగ్రెస్ వాలంటీర్లు ఎదురొస్తూ కన్పించారు. వాళ్ళను చూసి ప్రక్కనే ఉన్న పొగాకు బేరన్‌లోకి జొరబడ్డారు. ఆ క్షణంలోనే పోలీసులు వచ్చి నాజరుగారి ఇంటిని సోదా చేస్తున్నారు. "ఇదేం ఇల్లురా? బాబూ! గోనెలతో గోడలు, కంది కంప, ఈత ఆకులతో ప్రహరీ (దడి) సూర్య చంద్రులు వీడికి ఆప్తమిత్రులులా ఉన్నట్టుంది" అన్నారు పై కప్పుకేసి చూస్తూ. అసలు విలువైన వస్తువు ఒక్కటి కూడా ఉన్నట్టు లేదు అంటూ వండిన అన్నం కుండలు చూసి వీడు తిన్నట్టు లేదు అంటూ అన్నం కుండలు బైటకు విసిరి, పచ్చళ్ళ నిండా కిరసనాయిలు పోశారు. దడులు విరగ్గొట్టి, గోనెలు కోసేసి, వస్తువులన్నీ చిందర వందర చేసి త్రొక్కుతూ "ఒసే ముసలిదానా ఎక్కడే నీ కొడుకు" అని తిడుతున్నారు. బేరన్‌లో నుండి అంతా చూస్తూ, వింటున్న నాజరుగారికి పట్టరానంత ఆగ్రహం వచ్చినా సమయం కాదని, శమాయించుకున్నారు.

ఎంత అడిగినా, తిట్టినా చెప్పవా? నిన్ను ఒక్క దెబ్బ కొట్టామంటే చస్తావ్! ఇప్పుడు కాదు మళ్ళీ వస్తాం. ఈ లోగా నీ కొడుకు వస్తే కోర్టుకు రమ్మని చెప్పు. లేదంటే "తంబుర మీటేందుకు వ్రేలు, ఆడేందుకు కాలు, పాడేందుకు గొంతు, జనాన్ని ఉద్ధరించేందుకు మెదడు, చైతన్యం గురించి వ్రాసేందుకు చేయి ఉండవు. ఇంతెందుకు ఒక్క మాటలో చెప్పాలంటే కనిపిస్తే చాలు చంపేస్తాం" అంటూ బెదిరించి వెళుతూ పుస్తకాలు, వీడి రచనలు ఉంటాయి చూడండి అని ఓ పోలీసు అధికారి అన్నాడు.

ఇక్కడ ఏవో వ్రాసిన కాగితాలుంటే చిత్తు కాగితాలని పారేశాము. పుస్తకాలుంటే చించి పారేశాము అంటూ ప్రక్కనున్న పోలీసులు చెప్పగా పారేసిన వాటిని ఏరుకుని తీసుకువెళ్ళారు.

**పోలీసులపై విమర్శ**

పోలీసులు వెళ్ళిన కాసేపటికి నాజరుగారు తేరుకుని "పోలీసులా వీళ్ళు? పేదలను దోచుకుని ధనికులను కాపాడే కాపలా కుక్కలు, ధనికులపై తిరగబడి ఇదేం అన్యాయం అని నిలదీసే పేదలను అణచి వేసే భక్షక భటులు" అని తనలో తాను అనుకున్నారు.

**మారు వేషం**

సద్దు మణిగిన పిదప ఎవరూ గుర్తు పట్టకుండా తన అభిమాని అయిన ఒక జీతగాని బట్టలు ధరించి, ప్రక్కనే ఉన్న తట్ట నిండుగా పేడ వేసుకుని, తలపై పెట్టుకుని ఎవరూ గుర్తించకుండా నెమ్మదిగా ఇళ్ళ మధ్య నుంచి 'మోతడక' కొండ వద్దకు చేరుకున్నారు. కొండ గుహలో ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకొని "నాలాంటి వాళ్ళకు, ఈ దేశానికి ధనికుల నుండి దాస్య విముక్తి లభించాలనే ఆశ"తో కాలం గడుపుతున్నారు.

**పేదల విముక్తికై**

తెల్లవారగానే నాజరుగారికై కార్యకర్తల పిల్లలు పలికెలో అన్నం, తాబేటికాయలో నీళ్ళు తీసుకుని వస్తే రోజంతా జాగ్రత్తగా వాడుకుంటున్నారు. వాళ్ళు తెచ్చి యిచ్చిన కాగితాలపై పాటలు వ్రాసుకుంటూ, దేశానికి శాంతి, స్వేచ్ఛ కావాలనే ఆశయంతో రోజులు దుర్భరంగా గడుపుతున్నారు.

నాజరుగారిని ఒక కార్యకర్త ఇంటిలో విందు ఉందని పిలిచారు. చీకటి పడిన తరువాత ఊరిలోకి ఎవరి కంటా పడకుండా అభిమాని సహాయంతో కార్యకర్త ఇంటికి చేరారు. అప్పటికే అక్కడికి వచ్చిన తల్లిని, భార్యను చూసిన నాజరుగారికి ఒకవైపు ఆనందము, మరొకవైపు దు:ఖమూ కలిగాయి. నన్ను నమ్ముకున్న తల్లి, భార్యలకు నా మూలంగా సుఖం లేకుండా, దు:ఖం కలిగిస్తున్నాననే బాధను దిగ మ్రింగుకుని, ఆ రాత్రి వాళ్ళతో గడిపారు.

తొలికోడి కూయగానే తల్లి వచ్చి నాజరుగారిని లేపి ఇంటి చుట్టూ పోలీసులు, కాంగ్రెస్ వాలంటీర్లు తిరుగుతున్నారని చెప్పింది. వెంటనే నాజరుగారు ఇంటి వెనుకగా ఉన్న ముళ్ళ కంచె దూకి, తప్పించుకుని ఎవరికీ అనుమానం రాకుండా ఎట్టకేలకు ఊరి బయటనున్న కొండకు చేరుకున్నారు.

మూర్ఖుడైన ఆ ఊరి ప్రెసిడెంటుకు ఈ వార్త తెలిసి బరిసె తీసుకుని, కాంగ్రెస్ వాలంటీర్లను కొందరిని తన వెంట బెట్టుకుని కొండ వద్దకు బయలు వేరాడు. అది తెలిసిన పేదలంతా ఏకమై మా నాజరు బాబును మేము కాపాడుకుంటామని ఎదురు తిరిగారు. గొడవ జరుగుతున్న విషయం తెలిసిన ఆ ఊరి చర్చి ఫాదర్ వెంటనే వచ్చి మధ్యలో కలగజేసుకుని "ఇంటిలో ఎలక ఉందని ఇంటినే తగల బెట్టుకుంటామా?" అని ఇరువురిని సమాధాన పరచి ంపించారు.

ఆలోచనా పరుడైన ఫాదర్ రహస్యంగా అర్థరాత్రి నాజరుగారిని పిలిపించి

"నాయనా! నీవు ఇక్కడ ఉండడం క్షేమం కాదు. నీ గొప్పదనం ఏమిటో నిన్నటి గొడవ మూలంగా తెలిసింది. ప్రజలను చైతన్య వంతులను చేశావు. ఇంకా నీవు చేయాల్సింది చాలా ఉంది. మరో సురక్షిత ప్రాంతానికి వెళ్ళటం అటు నీకు, ఇటు గ్రామానికీ మంచిది. నీకు మంచి భవిష్యత్ ఉంది. కావున తెల్లవారక ముందే ఇక్కడి నుంచి వెళ్ళిపో" అని చెప్పారు.

**మరో మారు వేషం**

అర్ధరాత్రి చర్చిలో భోజనం చేసిన నాజరుగారు చర్చి ఫాదర్‌గారి సహాయంతో తరాజు, తూనిక రాళ్ళు, ఒక గోనె పట్టా, కొంత పొగాకు తెప్పించుకుని పట్టాలో పెట్టుకుని, తలకు గుడ్డ చుట్టుకుని, పొగాకు మూటను తలపై పెట్టుకుని, తక్కెట చేతిలో పట్టుకుని నల్లపాడు చెరువు గట్టు వెంబడి లాలుపురం మీదుగా గారపాడు చేరారు.

నాజరుగారి చెల్లిది కూడా గారపాడే అత్తగారి ఊరు. ఊరి బయట యానాదుల ఇళ్ళ దగ్గర ఉన్న చెల్లెలి ఇంటికి నాజరు గారు చేరుకున్నారు. కాసేపటికి విషయం తెలిసిన నాజరుగారి భార్య చేపల కూర తీసుకుని వచ్చింది. మిట్ట మధ్యాహ్నాం కావటం చేత భోజనం చేసి భోషాణం ప్రక్కన నిద్ర పోయారు.

వేసవికాలం కావటం చేత రాత్రిపూట భోజనం చేసి యానాదుల ఇళ్ళ మధ్య ఆరుబయట పడుకున్నారు. మూడవ రోజున చెల్లిలి ఇంటి వద్ద కాంగ్రెస్ వాలంటీర్లు గొడవ చేస్తున్నారని కొందరు యానాదుల కుర్రాళ్ళు, నాటకాలు నేర్చుకున్న అభిమానంతో వెళ్ళి పొమ్మని ఊరి బయట ఉన్న తుమ్మల చెరువు వరకు వచ్చి విడిచి వెళ్ళిపోయారు.

అక్కడ నుంచి కాలి నడకన చేలకు అడ్డంపడి 'కర్నూతల' చేరి ఊళ్ళోనుంచి వెళ్ళటం మంచిది కాదని కొండ ఎక్కి, దిగి సాయంత్రానికి కొండవీడు చేరుకున్నారు. ఆ ఊరిలో తన గురించి ఎవరికీ తెలియక పోవటం చేత ఊరిలో

నుంచే 'తుళ్ళూరు' వచ్చి మిత్రుడైన రామకోటి గారిని కలుసుకున్నారు. పగలు ఊరిలో కుర్రాళ్ళు కాపలాతో ఉంటూ, రాత్రిళ్ళు పొలాల్లో తాటి తోపుల్లో గడుపుతున్నారు. ఒక పోలీసు శ్రీరామకోటికి స్నేహితుడు అవడం చేత భోజనాలు వాళ్ళ అమ్మ తీసుకుని వస్తుండేది.

అచ్చమ్మపేట పోలీస్ స్టేషన్‌పై దాడి జరిగింది. ఆ గొడవల్లో ఎస్.ఐ గారి భార్య మరణించగా, ఇది కమ్యూనిస్టులే చేసి ఉంటారని పోలీసులు కమ్యూనిస్టు అభిమానుల ఇళ్ళను గాలిస్తున్నారు. ఉన్నట్టుండి వచ్చి పడిన ఈ ఉపద్రవం నుంచి బయట పడటం కోసం కోతి కొమ్మచ్చి ఆడుతున్న పిల్లలను ఎప్పటికప్పుడు సమాచారం తెలియజేయమని నియమించారు.

పరిస్థితులు విషమించక ముందే ఇక్కడి నుంచి బయటపడాలని నిర్ణయించుకుని సాహిత్యం, రచనలు అన్నీ కుండలో పెట్టి ఒకచోట పాతిపెట్టి, దేవులపల్లి వెంకటేశ్వరరావుతో కలసి ముళ్ళకంచెలు, తుప్పలు, కొండలు దాటుతూ అంధకారంలో పామో, తాడో తెలియని అయోమయ స్థితిలో మిలటరీ వాళ్ళ కళ్ళలో పడకుండా తప్పించుకోవటమే ధ్యేయంగా, ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని పొద్దు పొడిచే సరికి 'మోతడక' చేరారు. దేవులపల్లిగారు నీవింక ఇక్కడ ఉండమని నాజరుగారికి చెప్పి వెళ్ళిపోయారు.

నాజరుగారు ఊరి బయట కాపుసారా కాస్తున్న సామ్యవాద సానుభూతి పరులైన హరిజనుల వద్దకు చేరారు. వారు నాజరుగారికి భోజనం పెట్టి, కొన్ని కాగితాలు తీసుకుని వచ్చారు. వాటితో ప్రక్కనే ఉన్న కొండ గుహకు చేరుకున్నారు. అసలే వేసవికాలం. కొండ వలన సరయిన విశ్రాంతి లేక మానసిక ఆందోళనలన్నీ కలిసి, కాళ్ళు వాచి, జ్వరంతో వళ్ళుంతా బొబ్బలు వచ్చాయి. స్ఫోటకం పోసి చనిపోతానని భయపడ్డారు. ఒక కామ్రేడ్ యిచ్చిన మందుల వలన నయమైంది.

పొన్నెకల్లులో ఓ పక్కా కాంగ్రెస్ వాలంటీరు చావిడిలో ఉన్న పిచ్చుక గూడును అజాగ్రత్తగా తీస్తుండగా, ఆ చూరులో ఉన్న పాము కరచి మణించాడు.

నాజరుగారి అన్న బడా ఖాసిం నాజరుగారిని వెతుక్కుంటూ వచ్చి అనారోగ్యంతో ఉన్న తమ్ముణ్ణి చూసి హృదయానికి హత్తుకుని బావురుమన్నారు.

"అన్నయ్యా! నా కన్నా ముందు యిలా ఎందరో కష్టపడ్డారు. కనీసం ఇది మాతోనైనా ఆగిపోవాలనేదే నా కోరిక" అని ఓదార్చారు.

## కాంగ్రెస్ కన్నా పోలీసులే నయం

కాసేపటికి తేరుకున్న ఖాసిం నాజరుగారితో "రామిరెడ్డిగారు ఎస్.ఐ గారితో నీ గురించి మాట్లాడారు. కాంగ్రెస్ కార్యకర్తలకు కనబడకుండా తీసుకురమ్మని, నిన్ను కాపాడతానని చెప్పారని" చెప్పారు.

"రేపు మధ్యాహ్నం రెడ్డిగారిని కోమట్లు అరుగుమీద కూర్చోమని చెప్పు. నేను వస్తాను కానీ ఈ విషయం అమ్మకు, నా భార్యకు చెప్పవద్దు" అని చెప్పి అన్నను పంపించారు నాజరుగారు.

ఆ రాత్రి సరిగా నిద్ర పట్టక తెల్లవారేందుకు సమయం ఉన్నను లేచి చారల లుంగీ కట్టుకుని, చిరిగిన బనియను వేసుకుని, పై పంచె తలకు చుట్టుకుని, ఒక కామ్రేడ్ తోడు రాగా పరుగులాంటి నడకతో బయలుదేరారు. పిట్టలు కీచు కీచుమంటూ పీచు పీచుగా తెల్లవారేప్పటికి పొన్నెకల్లు గ్రామ శివార్లకు చేరుకున్నారు నాజరుగారు. ఊరు బయట ఉన్న పెద్ద బండ చాటున నక్కి కూర్చున్నారు. తనతో వచ్చిన కామ్రేడ్ ఊళ్ళోకి వెళ్ళాడు. బండ చాటున కూర్చున్న నాజరుగారికి అక్కడి నుండి అంతా కన్పిస్తుంది. నాజరుగారు ఎవరికీ కనిపించకుండా కూర్చున్నారు. అలా ఎంతసేపు కుర్చున్నారో తెలియదు. మట్ట మధ్యాహ్నం వీధుల్లో జనసంచారం తగ్గిపోయింది. అందరూ పనులకు వెళ్లి వచ్చి ఎవరిళ్ళలో వారు విశ్రాంతి తీసుకుంటున్నారు. జన సంచారం లేకపోవటంతో నాజరుగారు మెల్లగా కొండ దిగి సందుల్లో నుండి ఇళ్ళ చాటుగా నడుస్తూ ఒక ఇంట్లోకి చేరుకున్నారు.

అక్కడ ఉన్న ఎస్.ఐ. నాజరుగారిని చూసి "నీవేనా నాజరు?" అని

ప్రశ్నించారు. నాజరుగారు అవునని తలూపారు. ప్రక్కనే ఉన్న రామిరెడ్డిగారు వచ్చి నాజరుగారిని ఒక గదిలో పెట్టి తాళం వేశారు. ఈ విషయం తెలిసిన కాంగ్రెస్ కార్యకర్తలు కర్రలు, బరిసెలు, గొడ్డళ్ళు పట్టుకుని వచ్చి ఎస్.ఐ గారితో ఘర్షణకు దిగి "నిన్ను ఏమీ అనము నాజరుగారిని వదిలేయ్, చంపేసి వెళ్ళిపోతాం" అని బెదిరింపుగా వాదిస్తున్నారు. అది చూసిన నాజరుగారు "పెనం మీద నుండి పొయ్యిలో పడ్డట్టయింది నా పని" అనుకుని, సరే ఏమౌతుందో చూద్దాం అని గుండె దిటవు చేసుకున్నారు.

## పోలీసుల అరెస్టు, వేధింపు

ఈ లోగా మిలటరీ వ్యాన్ వచ్చింది. అది చూసిన జనం చెల్లాచెదురై పోయారు. నాజరుగారిని వ్యాను ఎక్కించి తీసుకు వెళుతుంటే రోడ్డుకు ఇరువైపులా జన సమూహము బారులు తీరి నిలబడి కన్నీరు కారుస్తూ, దీనంగా చూస్తున్నారు. ఈ విషయం పొగాకు కంపెనీలో పని చేస్తున్న తల్లికి తెలిసి పరిగెత్తుకొచ్చింది. నాజరుగారిని చూసి "అయ్యా! నాజరూ" అని పెద్దగా అరచి స్పృహ తప్పి పడిపోయింది.

నాజరుగారిని మంగళగిరి మిలటరీ క్యాంపుకి తీసుకువెళ్ళారు పోలీసులు. నాజరుగారిని మీ నాయకులు ఎవరు? వాళ్ళు ఏం చేద్దామని అనుకుంటున్నారు? వాళ్ళ పేర్లమిటని కొట్టిన చోట కొట్టకుండా కొట్టారు. ముందురోజు కొట్టిన దెబ్బల మదే కొడుతుంటే ప్రాణం పోయినా బావుండు అనిపించేంతగా హింసించారు. పోలీసుల వేధింపు చర్యలు తట్టుకోలేక, తన తల్లి స్పృహ తప్పి పడిపోయిన సంఘటన తలచి వేస్తుండగా తన తల్లికి ఏమైందో తెలియక నాజరుగారు సతమతమై పోతున్నారు.

నాలుగు రోజుల అనంతరం పోలీసులు వేధింపు చర్యలు ఆపి నాజరును కూర్చి అడిగి తెలుసుకుని వారికి తెలిసిన ఘంటసాల పాటలు, పద్యాలు, కీర్తనలు, గీతులు పాడించుకుని తమకై తెచ్చుకున్న క్యారేజీలోని భోజనం నాజరుగారికి కూడా పెట్టేవారు.

అలా నెల రోజులు గడచిన తర్వాత ఒకనాటి అర్ధరాత్రి నాజరుగారితో మరో నలుగురు యువకులను మంగళగిరి మిలటరీ క్యాంపు నుంచి గుంటూరుకు తీసుకువెళుతున్నారు. వెళ్ళే దారిలో రైలు గేటు వేసి ఉంది. గుంటూరు నుంచి ఒక టాక్సీలో వచ్చిన వ్యక్తి ఆగి ఉన్న వ్యాను వద్దకు వచ్చి పోలీస్ ఆఫీసర్‌తో రహస్యంగా ఏదో చెప్పి వెళ్ళిపోయారు.

పోలీసులు వెంటనే వ్యాన్‌ను మంగళగిరికి తీసుకుని వచ్చి "మీ పెళ్ళాల తాళ్ళు గట్టివిరా, ఎందుకంటే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కమ్యూనిస్టులపై ఉన్న నిషేధాజ్ఞలను రద్దు చేశారని కలెక్టర్ కల్యాణరావుగారు స్వయంగా వచ్చి చెప్పారు" అని వివరించారు.

## జైలు - విడుదల

నెల రోజుల జైలు జీవితం తర్వాత ఒకరోజు ఉదయం ఎనిమిది గంటలకు నాజరు గార్ని వ్యాన్‌లో గుంటూరు తీసుకువచ్చి సబ్ జైలులో ఉంచారు. మిత్రులు, అభిమానులు వచ్చి చూసి వెళ్ళారు. వివరాలు నాజరుగారి తల్లికి, భార్యకు వివరించి చెప్పారు. వాళ్ళు ఆనందంగా గుంటూరు సబ్ జైలుకు వచ్చి నాజరుగారిని చూశారు. అమాయకురాలైన భార్య "నిన్ను వదులుతారట కదా!" అని కటకటాలు పట్టుకుని అడిగితే నాజరుగారికి, తన తల్లికి కూడా నవ్వు వచ్చిందట. ఎందుకంటే "ఎన్ని బాధలు పడిన సంగతి కాదు ఆమెకు కావలసింది ఇకనైనా సుఖంగా ఉండవచ్చు" కదా అనే ఉద్దేశం చూసి నవ్వారు.

## నాజరు దళం

నాజరుగారు జైలు నుంచి విడుదలైన పిదప కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తలు అందరూ కలసి ఎప్పుడు, ఎలా చేయాలని చర్చించుకుంటున్నారు. "ఉద్యమకారులపై నిషేధం ఎత్తివేసిన తర్వాత తెలంగాణా సాయుధ పోరాట ఆగిపోయింది". సభలు, సమావేశాలు ముమ్మరంగా జరుగుతున్నాయి. ఈ పరిస్థితి- "ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీలో చీలిక" వచ్చింది.

1949లో చంద్ర రాజేశ్వరరావుగారు కార్మిక, కర్షక నాయకత్వం బలపరచాలనే ఉద్దేశంతో నాజరుకు 'సర్క్యులర్'ను పంపారు. నాజరుగారు ఆలోచనలో పడ్డారు. అలా ఆలోచిస్తూ రామకోటి గారు 'నాజరు దళం'గా బుర్రకథలు చెపుదామని వ్రాసిన ఉత్తరం చూశారు. నాజరుగారు కూడా అదే సరైంది అని నిర్ణయించుకున్నారు.

సుంకర సత్యనారాయణగారి 'కష్టజీవి' బుర్రకథలో రైతు నాయకులు కామందుల తొత్తులై ఉండటం బావుండలేదని మంచికి బదులు చెడు ఎక్కువగా జరుగుతుందేమోనని ఆలోచించి చెప్పడం మానేశారు. క్రొత్తగా ఏదైనా కథ వ్రాయాలనే ఉద్దేశంతో తెలుగు, సంస్కృత సాహిత్యం చదవటం ప్రారంభించారు. "ప్రాచీన సాహిత్యంలో సామాన్య మానవుని గూర్చి కంచు కాగడాతో వెదికినా దొరకలేదు" అయినా నిరుత్సాహ పడక చదువుతూ వెదుకుతూనే ఉన్నారు.

## పల్నాటి యుద్ధం

1950లో నాజరుగారు మద్రాసు 'ఆంధ్ర మహాసభ'లో 'బెంగాల్ కరవు' బుర్రకథను ప్రదర్శించారు. ప్రముఖ సినీ నిర్మాత 'శ్రీ గూడవల్లి రామబ్రహ్మం'గారు ఆ కథను విన్నారు. నాజరుగారిని పిలిచి తన వద్ద నున్న 'పల్నాటి యుద్ధం' స్క్రిప్టు చూపించి కథ తయారు చేయమని 'దీనితో నీకు భుక్తి, దేశ భక్తి, పెత్తందార్ల నుంచి పేదలకు దాస్య విముక్తి లభిస్తాయి' అని చెప్పి స్క్రిప్టు యిచ్చారు.

నాజరుగారు స్క్రిప్టును పరిశీలించి "బ్రహ్మనాయుని చాప కూటి సిద్ధాంతం, దేవాలయ ప్రవేశం, నిమ్నజాతుల వారికి అధికారం కట్టబెట్టిన బ్రహ్మనాయుని ఔదార్యం, అన్నీ బావున్నాయని ప్రయాగ కోదండ రామశాస్త్రిగారి సహాయంతో ఆప్తమిత్రులు రామకోటిగారి అమూల్యమైన సలహాలతో మార్పులు, చేర్పులు చేసి బుర్రకథ"ను పూర్తి చేశారు.

## వంతల కొరత

"ప్రదర్శనకై రాజకీయ వంత అయిన పురుషోత్తం కోసం కబురు చేస్తే

మతి స్థిమితం లేదని తెలిసింది. నాజరుగారు నాకు మంచి సహాయకుడైన వాడికిలా జరిగిందే అని బాధపడి, ఇంటికి వెళ్ళి అతని భార్యకు కొంత ధనమిచ్చి వైద్యం సరిగా చేయించ''మని చెప్పి వచ్చారు. వంతకోసం దేవులాట ప్రారంభించారు. ప్రజా నాట్య మండలి కళాకారుడైన 'కర్నాటి లక్ష్మీ నరసయ్య'కు తర్ఫీదు యిచ్చి అతి తక్కువ కాలంలో మంచి వంతగా తయారుచేశారు.

<u>స్వతంత్రంగా బుర్రకథా కథకుడు</u>

కొత్త కథ, కొత్త వంత, కొత్త జీవితం స్వతంత్రంగా కథ చెప్పటం ఆరంభించారు. ఆలపాటి వెంకట్రామయ్యగారు, మంతెన వెంకట్రాజుగారి యాజమాన్యంలో కాంగ్రెస్ సభలో సాంస్కృతిక, వైజ్ఞానిక కార్యక్రమాలు జరుగుతున్నాయని తెలుసుకుని నాజరుగారు వారిని కలుసుకుని తాను కథ చెప్పడానికి అంగీకరింపజేసారు. అలా కాంగ్రెస్ సభలో చెప్పబోతున్న నాజరుగారితో "తల్లి నాయనా! నాజరూ పస్తులున్నాం, బిచ్చమెత్తుకుని విద్య నేర్చుకున్నావు. ఎంతో కష్టపడి కథకు ఓ రూపం తెచ్చావు. పోలీసులతో తన్నులు తిన్నావు. కామందులు కనిపిస్తే నరుకుతాం, చంపుతాం అనే సంక్లిష్ట పరిస్థితుల్లో జైలు కెళ్ళి ప్రాణాలతో మిగిలావు "గడ్డ పలుగులు గాలికి ఎగిరి పోయాయా" అని దు:ఖంతో అన్ని బాధలు పెట్టి నోళ్ళ వేదికపై కథ చెపుతావా? అని నాజరుగారి గతాన్ని గుర్తు చేసింది.

వెంటనే నాజరుగారు తల్లితో "అమ్మా! అవి నాలాంటి వాళ్ళు మరచిపోలేని దుస్సంఘటనలు. నాలాంటి వాళ్ళకు తప్పవు. కానీ ఇప్పుడున్న పరిస్థితుల్లో స్వతంత్ర కథకుడుగా నేను స్థిర పడాలనుకుంటున్నాను. "కాంగ్రెస్ వేదికలపై కథ చెప్తే పోలీసు దాడులు ఉండ''వని సర్ది చెప్పారు.

కానీ నా కథలో, నాలో ఏ మార్పూ ఉండదమ్మా! అని నమ్మకంగా చెప్పి వెళ్ళి "పల్నాటి యుద్ధం" కథ చెప్తే జనం ఎక్కువగా రాలేదు. కారణం ఏమిటా అని ఆరా తీస్తే నాజరుగారిని పోలీసులు చంపేశారనే వదంతులు విని, ఇతను

వేరే అని జనం రాలేదట. వెంటనే సుంకర రచించిన 'కష్టజీవి' బుర్రకథను పెట్టించి కరపత్రాలు పంచి మైకులో ప్రచారం చేయిస్తే ప్రజలు తండోపతండాలుగా ఎడ్లబండ్లు కట్టుకుని, అన్నం మూటలతో తిరునాళ్ళకు వచ్చినట్లుగా వచ్చారు.

అలా వచ్చిన ఆబాలగోపాలాన్ని చూసిన చివుకుల వెంకటేశ్వరరావుగారి అనుయాయులు వచ్చి నాజరుగారి తంబుర పైనున్న సుత్తి కొడవలిని, తలపాగ పైనున్న యంత్ర చిహ్నం తీసి 'కాంగ్రెస్‌కు జై' అనాలని పట్టుబట్టారు. వెంటనే మీరు "బంగారంతోనో, వెండితోనో గాంధీగారి బొమ్మ చేసి యివ్వండి వద్దంటే అప్పుడు చూద్దాం!" అని ఆలపాటి, మంతెన మున్నగు వారు అన్నారు. ఈ జే జేలతోనే కాలం సరిపోతుంది. త్వరగా పనులు చూడండి, సభ ప్రారంభించాలని సర్ది చెప్పి పంపించారు.

"వేషం వేసుకుని వేదిక మీదకు వెళుతున్న నాజరుగారిని ఒంటినిండా మురికి, చిరిగిన గుడ్డలతో, ఎముకల గూడులా బక్క చిక్కిన దేహంతో సగటు మనిషి అయిన ఓ శ్రమజీవి హీన స్వరంతో 'బాబయ్యా! మీరు కాంగ్రెస్‌లో చేరిపోయారా?" అని బిక్క మొహంతో అడిగాడు. నాజరుగారికి ఒక్కసారిగా 'గుండెల్లో గునపాలు గుచ్చినట్లు'గా అవాక్కయి పోయారు. కొంతసేపటికి తేరుకుని భుజం మీద చేయివేసి 'నేను చెప్పే కథ విని తర్వాత నేను ఏమయ్యానో నీవే నిర్ణయించుకో' అని చెప్పి ఒక కార్యకర్తను పిలిచి ఇతన్ని ఎదురుగా కూర్చోబెట్టమని చెప్పారు.

**<u>సామాన్యుని స్పందన</u>**

నాజరుగారు తనదైన ధోరణిలోనే కథ చెప్పిన పిదప వస్తుంటే కష్టజీవి ఎదురెళ్ళి ఆప్యాయంగా కౌగిలించుకుని "కష్టజీవుల కడగండ్లను తీర్చటానికి మీ బోటిగాళ్ళున్నారు కనుకనే నాబోటిగాళ్ళు ఇంకా బతకగలుగుతున్నారు బాబయ్యా! మీరు నా ఆయుష్షును కూడా పోసుకుని లోకాన్ని ఉద్ధరించాలయ్యా!" అన్నాడు. అని వెళుతున్న ఆ బడుగుజీవిని చూస్తున్న నాజరుగారికి కదులుతున్న కళేబరంలా అనిపించింది. అంతేకాక నాజరుగారికి బాధ్యతను కూడా గుర్తు చేసింది.

ఆనోట ఆనోట బుర్రకథల నాజర్ బ్రతికే ఉన్నాడని ప్రజలకు తెలిసింది. టికెట్ పెట్టి కథలు చెప్పిస్తున్నారు. హాలు పట్టని జనసందోహం, జనత హృదయంలో ఆనందమూ, అభిమానమూ డబ్బుకు కొదవ లేదు. అలా నాజరుగారు దినదిన ప్రవర్థమానమై ప్రజారంజకుడుగా పేరు ప్రఖ్యాతులు గడిస్తూ ప్రశాంతంగా, నూతన రీతులను నిరంతరం అన్వేషిస్తూ కథకు ఓ రూపం, ఓ పద్ధతి కల్పించారు.

సమయాన్ని బట్టి, సందర్భ శుద్ధితో రామకోటిగారి సహాయంతో రాజకీయం, హాస్యం ఏర్చి, కూర్చి చెప్పేవారు నాజరు.

పేదవాళ్ళను గూర్చి "కారప్పుచ్చళ్ళు, పుల్నీళ్లు, కూరలేని కూళ్ళు, గోచీ లేనోళ్ళు, గొడ్డు చాకిరీ గాళ్ళు, పల్లె పల్లెలందు పేదవాళ్ళు" అని పల్లెల్లో కూలీ చేసుకుంటున్న రైతు కూలీల గురించి వ్రాశారు. శ్రీనాధుని "చిన్న చిన్న రాళ్ళు, చిల్లర దేవుళ్ళు" చాటు పద్యాన్ని పేరడీగా వ్రాసి చెప్పేవారు.

రాజకీయ నాయకులను దుయ్యబడుతూ "సందు సందుకో సారాకొట్టు, పేటకో పేకాట క్లబ్బు, వీధికొక వ్యభిచార గృహం లైసెన్సు" ఇలా ఉంది ప్రభుత్వ విధానం అని వివరించేవారు.

కోర్టులోని న్యాయం గురించి చెప్తూ "వాది నష్టం, ప్రతివాది ముదనష్టం, కోర్టువారి ఇష్టం, ప్లీడరు దుష్టం" అని విశదపరచేవారు.

"మూఢనమ్మకాలను గూర్చి తన ప్రతీమాట, పాట, ఆటలో కూడా అట్టడుగు ప్రజానీకాన్ని సోది, మంత్రాలు, జాతకాలు ఇలాంటి వన్నీ నమ్మవద్దని సమాజాన్ని, సందర్భాన్ని బట్టి ప్రతి చిన్న విషయంలో కూడా అతి జాగ్రత్తగా, విజ్ఞానవంతంగా ఉండాల"ని ఆయన ప్రతి ప్రదర్శనలోనూ చెప్పేవారు.

ప్రజానీకాన్ని చైతన్యవంతం చేయటం కోసమని సమాజాన్ని అద్దంపట్టి చూపిస్తూ, ప్రజలపై జరుగుతున్న దోపిడీని చూపిస్తూన్నారు. కథలు

చెప్పించుకునేవారు "మా డబ్బులు తీసుకుని ప్రజల్ని మాపై తిరగబడేలా మమ్మల్ని తిట్టి, తన్నించేలా చేస్తున్నావు గదయ్యా!" అని సరదాగా అనేవారు. అలా నాజరుదళం లక్ష్మీనరసయ్యగారి ఆధ్వర్యంలో నీరసం రాకుండా తింటూ, ఆయాసం లేకుండా కథలు చెపుతున్నారు.

నాజరుగారు వీరులపాడులో కథ చెప్పడానికి కంచికచర్ల నుంచి కోడెగిత్తల బండిపై తీసుకు వెళుతున్నారు. అవి పరుగులు తీస్తుంటే సరదాగా అనిపించిందట కొంత దూరం వెళ్ళాక సప్టా దగ్గర వేగంగా వెళుతూ బండి చక్రం రాయిపై ఎక్కడ పడుతుందనే భయంతో నాజరుగారు బండిలో నుండి దూకారు. కాలు చీల మండ చిట్లింది. అమితమైన బాధ కలిగినా, భరిస్తూ జనానికి నిరుత్సాహం కలుగకుండా ఏదో విధంగా కూర్చుని కథను ముగించారు. ఆ పరిస్థితుల్లో విజయవాడ వచ్చారు. ప్రముఖ వెయిట్ లిఫ్టర్ "శ్రీ గుళ్ళపల్లి సూర్యనారాయణ"గారు తన ఇంటికి తీసుకు వెళ్ళి నాజరుగారి భార్యకు కబురు పంపించారు. కాలు తోముతూ ప్రకృతి వైద్యం చేసి అతి నైపుణ్యంతో తగ్గేలా చేశారాయన.

**ఆకాశవాణి**

1950లో నాజరుగారు విజయవాడ ఆకాశవాణిలో "భక్త ప్రహ్లాద" బుర్రకథను చెప్పగా శ్రోతలు "ఇంతవరకు బుర్రకథ కూడా గొప్పగా ఉంటుందని మాకు తెలియజేయడమే గాక కథ చెప్పడంలో గల నైపుణ్యం, అందులోని మాధుర్యాన్ని మెచ్చి వ్రాస్తూ ప్రశంసించారు.

**సినీ పరిశ్రమ ప్రవేశం**

'గరికపాటి రాజారావు'గారు మొట్టమొదటగా నాజరుగార్ని మద్రాసు పిలిపించి "పుట్టినిల్లు" సినిమాలో బుర్రకథ చెప్పాలన్నారు. సుంకర రచించిన "రుద్రమదేవి" కథకు మెరుగులు దిద్ది కథ పూర్తి చేసి, బయలుదేరుటకు సిద్ధమవుతుండగా రామకోటిగారిని హాస్యనటునిగా ఉండమని సినీ పరిశ్రమవారు

కోరారు. రామకోటిగారు ఉండిపోతానని నాజరుగారితో చెప్పారు. తాను రామకోటిగారిని విడిచి ఒంటరిగా రాలేక తప్పనిసరి పరిస్థితుల్లో బయలుదేరారు.

ప్రముఖ సంగీత దర్శకులు శ్రీ సాలూరి రాజేశ్వరరావుగారు "మీరు మద్రాసులోనే ఉండండి. మీకు ప్రతి సినిమాలో ఒక పాట పాడేందుకు అవకాశం ఇస్తాం" అని చెప్పారు. "నాజరుగారు ఇక్కడ ఇమడలేనని అంతేకాక "నా జీవితం, బుర్రకథ కళా భవితవ్యం ఆలోచించి నేను తీసుకున్న నిర్ణయం ఇది" అని వచ్చేశారు.

**బొబ్బిలి యుద్ధం**

1951లో దేశ ప్రజలను ఉత్తేజపరచడానికి, పోరాట పటిమను పెంపొందింప చేయటానికి "బొబ్బిలి యుద్ధం" బుర్రకథలో పౌరుషం గల పాత్రల స్వభావాలు, సన్నివేశాలు ఉన్నాయని, బొబ్బిలి కోడి పందెములు మాత్రమే కాదని, అసలు 'ఏదో విషయం తెలుసుకోవాలని బయలుదేరారు'. ఎవరికి తోచింది వారు చెపుతుంటే నాజరుగారు వ్రాసుకున్నారు.

'విజయనగరం రాజావారి పెంకుటిల్లు ఒకటి సాలూరు దగ్గర పాచిపెంట వద్ద ఉంది. అక్కడ వయసు మళ్ళిన ఓ పండు ముదుసలి కన్పించగా నాజరుగారు ఆయన్ని కలిసి బొబ్బిలి గురించి అడిగారు. దానికి ఆయన "ఇక్కడ నీటి తగాదా తరతరాలుగా సాగుతున్నవి. ఎందుకంటే ఇక్కడ నీటికి అడ్డుకట్ట వేస్తే విజయనగర వాళ్ళకు ఎక్కువ పొలం సాగు అయి పంటలు బాగా పండుతాయి. నీరు క్రింద వెళితే బొబ్బిలి వాళ్ళకు సాగు ఎక్కువై పంటలు బాగా పండుతాయి. అందుక అనువంశికంగా ఈ రెండు రాజ్యాలలో పోరాటం జరుగుతుందని" చక్కని వివరణ ఇచ్చారు.

1951వ సంవత్సరానికి చక్కని కూర్పులతో చరిత్ర చదివి ప్రముఖ సలహాలతో చాలా కష్టపడి "బొబ్బిలి యుద్ధం" బుర్రకథను రచించా మొట్టమొదటగా విజయనగరంలో కథ చెప్పటానికి వెళ్ళారు. కథ పేరు చెప్ప

అక్కడున్న రాజులు "ఆపు! ఇక్కడ బొబ్బిలి కథ చెపుతావా?! ఎవడ్రా నీవు?" అని గదమాయించారు.

అనుకోని సంఘటన ఎదురయ్యేప్పటికి విస్తుపోయి కొంతసేపటికి తేరుకున్న నాజరుగారు "అయ్యా! నేను ఏమి వ్రాశానో చూడండి ఆ తర్వాత బావుండలేదంటే ఇక్కడే నా కథ చించి యిక ఎక్కడా కథ చెప్పనని" సర్ది చెప్పి తన శక్తినంతా ధారపోసి కథ చెప్పారు.

"కథ విన్న పెద్దలు బాగానే సమర్థించి వ్రాసి, సమర్థవంతంగానే చెప్పావు. నీవు చాలా అదృష్టవంతుడివి. లేకపోతే ఈ విజయనగరం గడ్డ మీద బొబ్బిలి కథ ఎవడూ చెప్ప సాహసించడని, అది కూడా నీవే మొదటివాడవని ప్రశంసించి నీ గానం, నటన బావున్నాయ"ని అభినందించారు. మీదట సన్మానించారు. కిర్లంపూడి దొరలు తుని మహారాజా వారి కుమారుడు కథ చెప్పించి సన్మానించి వెండి కప్పులు బహుమానంగా యిచ్చారు. అలాగే బొబ్బిలివారు కూడా కోట ముందు కథ చెప్పించి పిట్టల నరశింహారావుగారి ఆధ్వర్యవంలో సింహతలాటకం, బంగారు, వెండి కప్పులు బహూకరించారు.

**<u>అభిమన్యు యుద్ధం</u>**

1952లో 'యువతను ఉత్తేజపరచడానికి సాధనమైన కథకోసం అనేక గ్రంథాలు చదివారు'. పౌరాణికుడైన "అభిమన్యుని" యొక్క ప్రాణభీతి లేని యుద్ధ సన్నద్ధ ఉత్సాహాన్ని నేటి యువతకు ప్రేరణ కల్గింపగలదనే ఆశయంతో రచించారు. 'నాజరుగారు ఏ కథ ఎన్నుకున్నా జన చైతన్యం కలిగించేదిగా ఉంటుంది'. సాంఘిక, జానపద, చారిత్రాత్మక కథలు, పౌరాణిక కథలు వ్రాసి చెప్పారు. ప్రజలకు స్పందన కలిగిస్తూ సాంఘిక ఇతివృత్తం వ్రాయాలనే నిశ్చయంతో 1944వ సంవత్సరంలోనే బెంగాల్ కరవు వ్రాసి ఉగ్రరూతలూగించి పోలీసుల చేత తీసుకుపోబడింది.

## నేటి రాయలసీమ

1952లో ఒకనాటి రతనాల సీమగా పేరుగాంచిన రాయలసీమ, రాళ్ళసీమకాగా నాజరుగారు ఆ ప్రాంత ప్రజానీకపు సాధక, బాధకాలకు చలించి "రాయలసీమ కరవు" అని పేరు పెట్టి బుర్రకథను రచించారు. రైతు కూలీలు, సన్నకారు రైతులు, వడ్డీ వ్యాపారులు, పల్లె ప్రజల మనస్తత్వం అన్నీ అద్దం పట్టి చూపించారు. ఈ కథ చెపుతూ ఏడుస్తూ, ఏడిపిస్తూ, నవ్వుతూ, నవ్విస్తూ, రాజకీయ చైతన్యం కలిగిస్తూ అనేక ప్రదర్శనలిచ్చారు.

మద్రాసులో ఆంధ్రరాష్ట్రం అవతరణ కోసం ఆమరణ నిరాహార దీక్ష చేసి అసువులు బాసిన సందర్భంగా 'అమరజీవి', 'త్యాగశీలి' 'శ్రీ పొట్టి శ్రీరాములు'గారిపై సుంకర, వాసిరెడ్డి గారలు వ్రాసిన "స్వతంత్ర సంగ్రామ మందు" అనే సీస పద్యాన్ని నాజరుగారితో పాడించారు.

## అల్లూరి శ్రీరామరాజు యుద్ధం

1953లో మరో కథ వ్రాయాలని ఆలోచిస్తూండగా దేశాన్ని రక్షించడం కోసం ప్రాణ త్యాగం చేసిన అల్లూరి సీతారామరాజు, బ్రిటీషువారి విద్యా విధానం సరైనది కాదని మానివేసి, తల్లిని ఒప్పించి దేశ రక్షణకై బలైపోయిన ఇతివృత్తంతో కథ వ్రాసి, చెపుతూ, జనతను దేశభక్తి వైపు మళ్ళిస్తూ, తనదైన కథ సరళితో యువజనుల్లో చైతన్యం కలిగించారు.

## ఆసామి నాటకం

"కౌలుదారీ విధానం దృష్టిలో ఉంచుకుని రైతు కూలీలను ఉద్దేశించి తిరుగుబాటు ధోరణితో "దున్నేవానిదే భూమి" అనే ముఖ్య ఉద్దేశంగా 'ఆసామి' నాటకం రచించారు. నాటకాన్ని ప్రదర్శించగా చూసిన రాష్ట్ర కమ్యూనిస్టు నాయకులు మెచ్చుకోలుగా శ్రీ నాజర్‌ను అభినందించారు.

**ప్రజానాట్యమండలి తిరస్కారం**

విజయవాడ ప్రజానాట్యమండలిగా మార్చమని అడిగితే రాష్ట్ర సభ్యులు తిరస్కరించారు. అపుడు విజయవాడ వారు యిక నుండి మేము డ్రస్సులు, వాద్యాలు ఇవ్వమని నిషేధించారు. అయినా నిరుత్సాహ పడక నిబ్బరంగా విజయవాడ గ్రంథాలయ ఆడిటోరియంలో టిక్కెట్టు పెట్టి డ్రామా ప్రదర్శిస్తే ప్రజలు ఆదరించారు.

**ఆసామి ప్రదర్శనకు ఉత్తమ బహుమతి**

1954 మే నెలలో మచిలీపట్నం "ఆంధ్ర నాటక కళాపరిషత్" వారు 'మినర్వా థియేటర్'లో ఆంధ్రరాష్ట్ర మాజీ ముఖ్యమంత్రి, సాహిత్యాభిమాని, సాహితీవేత్త అయిన శ్రీ 'బెజవాడ గోపాలరెడ్డి' ఆధ్వర్యంలో ఆసామి నాటకం ప్రదర్శించగా "ఎనిమిది బహుమతులు" వచ్చాయి. ఉత్తమ ప్రదర్శనగా కూడా ఎంపిక చేశారు. 'కొప్పరపు సుబ్బారావు'గారు నాటకం బావుందని పీఠిక వ్రాయగా, న్యాయవాది శ్రీ 'వేములపల్లి శ్రీ కృష్ణ'గారు ముద్రించారు.

తిరువూరులో టిక్కెట్టు నాటకం ఏర్పాటు చేయగా పార్టీ తరపున ఈ నాటకం ప్రదర్శించడం లేదని ఎవరో చెప్పారట. జనం అంతగా రాకపోవడంతో నష్టం వచ్చింది. ఒప్పుకున్న మిగిలిన కథలను వంతలుగా మిక్కిలినేని, కోసూరి పున్నయ్యల సహాయంతో పూర్తి చేశారు. క్రైస్తవ కథలు చెపుతున్న నందిగం వెంకటేశ్వరరావును తీసుకు వచ్చి వంతగా తీర్చి దిద్దారు.

నాజరుగారు రెండవ సినిమా "అగ్గిరాముడు" కోసం 'శ్రీరాములు నాయుడు' గారు మద్రాసు రమ్మన్నారు. నాజరుగారు వెళ్ళి 'ఆత్రేయ'గారితో "పల్నాటి యుద్ధమా", "రామరాజా" చెప్పాల్సింది అని అడిగారు. సందర్భాన్ని బట్టి 'రామరాజు' బాగుంటుంది కానీ దానిపై ప్రభుత్వ నిషేధం ఉందని ఆత్రేయగారు అంటుంటే నాయుడుగారు విని ఆ నిషేధం గురించి నేను చూస్తాను, మీరు కథ తయారు చేసేయండని అన్నారు.

అదే సమయంలో రష్యా సాంస్కృతిక బృందంవారు స్టూడియోకు వచ్చారు. ఆ సందర్భంలో నాజరుగారు 'రామరాజు' కథ చెపుతున్నారు. రామరాజును తుపాకితో కాల్చిన సందర్భంలో "అబ్బా సూటిగ నాటెను తుపాకి గుండు రాజు గుండెలోన అయ్యో!" అంటూ తన సహజ ధోరణితో చెపుతున్నారు. ఆ సన్నివేశంలో పై స్థాయిలో ట్రాజెడీని రష్యా కళాకారుడు నాజరుగారికి చూపించారు. ఆ స్థాయిని నాజరుగారు అందుకోలేక యాతన పడుతుంటే నాయుడుగారు టేక్ ఓకే చేయడంలేదు. అప్పుడు 'భానుమతి'గారు చొరవ తీసుకుని నాయుడుగారితో మనకింకా అంత టెక్నిక్ డెవలప్ కాలేదని సర్ది చెప్పారు. నాజరుగారు ఎలాగో కథ పూర్తి చేసి 'నేనింకా నేర్చుకోవలసింది చాలా ఉందని మళ్ళీ సంగీత సాధన'కు పూనుకున్నారు.

**<u>సంగీతాన్వేషణ</u>**

నాజరుగారు శ్రీ "జంగా సుబ్బదాసు"గారి వద్దకు వెళ్ళి పాడి వినిపించి, ఇందులో మార్పులు, చేర్పులు ఉంటే చెప్పండి అన్నారు. ఆయన విన్న తర్వాత "అందే కోటదాసు"గారి ప్రక్కన నాటకాలు ఆడినపుడు ఆయన పాడినపుడు విన్నాను. మళ్ళీ ఇన్నాళ్ళకు నీ నోటి వెంటే విన్నాము. నాకు తెలిసినంతవరకు 'ఇదే గొప్ప. ఇంతకన్నా ఎక్కువగా నాకు తెలియదు' అన్నారు. అంతటితో నాజరుగారు సమాధానపడక ఒకవైపు సంతృప్తి, మరొకవైపు అసంతృప్తితో ఇంకా నూతన సంగీత బాణీల అన్వేషణలోనే ఉన్నారు.

ఆ ప్రయత్నంలోనే ప్రముఖ హార్మోనిస్టు 'అకుల నరసింహారావు'గారిని కలిశారు. కరీంఖాన్, బిస్మిల్లా ఖాన్, ఓంకార్ నాథ్, ఠాగూర్ మొదలగు వారి షహనాయి, సన్నాయి సంగీత రికార్డులు వింటే కొంత ఉపయోగం ఉండవచ్చని ఆయన సూచించారు. ఆ తర్వాత 'ఆంధ్ర సంఘం వారి ఆహ్వానంపై కథ చెప్పటానికి కలకత్తా వెళ్ళారు'.

1955లో సంగీత రికార్డులు తెచ్చి విన్న తర్వాత 'కరీంఖాన్ సంగీతం

మన జానపద బాణీలకు దగ్గరగా ఉండటం' వలన హార్మోనియం, తంబుర, టక్కీలపై సాధన చేస్తున్నారు. ఆ సమయంలో మూడో సినిమా 'భలే బావ'కు కథ కోసం మద్రాసు రమ్మనగా వెళ్ళి పాత-కొత్త కలయికతో, నూతన పోకడలతో కథ సంతృప్తిగా చెప్పి ఆనందంగా విజయవాడ తిరిగి వచ్చారు నాజరుగారు.

**శ్రీనివాస చక్రవర్తిగారి ప్రశంస**

'ఆంధ్ర దర్శిని' అనే చారిత్రక కళా గ్రంథంలో ప్రాచీన జానపద కళారూపమైన 'బుర్రకథ'కు జీవంపోసి కథకుని వేషం రంగులు, దుస్తులు, తనదైన సొంత బాణీని ఏర్పాటు చేసి తనకు తానే సాటి అనే కాక, ఇది "నాజరు యుగం" అని ప్రముఖ సాహిత్యవేత్త, సంపాదకులు, విమర్శకులు అయినటువంటి శ్రీ శ్రీనివాస చక్రవర్తిగారు ప్రశంసిస్తూ వ్రాశారు.

**కలకత్తాలో కథలు**

1956లో రాష్ట్ర ప్రభుత్వ నాటక సంగీత అకాడమీ ఆధ్వర్యవంలో నాజరు దళానికి కలకత్తా ప్రోగ్రామ్స్ వచ్చాయి. కానీ లక్ష్మీనరసయ్య నాజరుగారితో నాకు ఢిల్లీలో జానపద స్పెషల్ ప్రోగ్రామ్ ఉంది అని చెప్పారు. నాజరుగారు నాకు తెలియని ప్రోగ్రామ్ ఏమిటని అనుమానం వచ్చి "వేరే ఎవరికైనా వంతగా వెళు తున్నావా? నీకేం లోటు జరిగింది. మొత్తం పెత్తనం అంతా నీదే కదా! నాజరుదళం మొత్తం నీ హయాంలోనే నడుస్తుంది కదా!" అని అంటున్న నాజరుగారి మాటల్ని మధ్యలోనే ఆపుచేసి నేను వెళ్ళాలని మొండిగా సమాధానం ఇచ్చాడు. దానికి నాజరుగారు సరే నీ యిష్టం అని చెప్పి వెంకటేశ్వరరావుగారిని తీసుకుని కలకత్తా వెళ్ళి కథలు ముగించుకుని వచ్చారు.

**వెన్నుపోటు**

తరువాత 'చల్లపల్లి'లో ప్రోగ్రామ్ ఉండి మేకప్ వేసుకుంటున్న నాజరుగారి వద్దకు ఓ కుర్రాడు వచ్చి "ఆకాశవాణి" పత్రిక అయిన 'వాణి' పత్రిక అట్టపై ఉ

న్న 'నాజరు దళం' ఫోటోను చూపించి మధ్యలో ఉన్నది మీరేనా అని సందేహంగా అడిగాడు. అది చూసిన నాజరుగారు ఒక్కసారిగా నిర్ఘాంతపోయారు.

కర్నాటి, మాచనేని, ప్రయాగ నర్సింహశాస్త్రి గారలు నాజరుదళంగా ప్రోగ్రాం చేద్దామని ఢిల్లీ వెళ్ళారు. ప్రోగ్రాంలు ఇచ్చిన తర్వాత విజయవాడ ఆకాశవాణిలో ఉద్యోగాలు ఇస్తారని ప్రయాగ ప్రలోభ పెట్టి ఢిల్లీ తీసుకువెళ్ళి ఉంటారని నాజరుగారు ఊహించారు. ఏదో తెలియని దిగులు, నేనింతగా నమ్మిన వాడు నన్ను మోసం చేస్తాడా? ఇంతటి వెన్నుపోటు పొడుస్తాడా?! అని, మనసు మనసులో లేక ఆలోచిస్తూ కాలం మర్చిపోయారు. కొంతసేపటికి ఎవరో పిలవగా అతికష్టం మీద తేరుకుని కథ ముగించుకుని విజయవాడ వచ్చారు.

నాజరుగారు కర్నాటిని కలిసి 'అసలిలా చేయటానికి నీకు మనసెలా ఒప్పింది? 1949 నుంచి 1958 వరకు అంటే గత తొమ్మిది సంవత్సరాల నుండి ఈనాటి వరకు 'నాజరు దళం' నీకేమైనా లోపం చేసిందా? నీ పాత బాకీలన్నీ తీర్చుకుని, పొలం కొనుక్కున్నా నేను ఏమీ అనలేదు ఎప్పుడైనా, ఎవరైనా నిన్ను అమర్యాదగా చూశారా? నీవు చెప్పినట్లు మేము నడిచాము. కేవలం ఉద్యోగం కోసం, నీ స్వార్థం కోసం అభివృద్ధి చెందుతున్న కళారూపానికి, నిన్ను పూర్తిగా నమ్మిన నాకు ద్రోహం చేస్తావా? నా పేరును అడ్డం పెట్టుకుని ఉద్యోగం సంపాదించుకున్న నీవు ఎవరైనా వచ్చి "నాజరు గొంతు పోయేలా చేయమన్నా చేస్తావు. 'తనవారు లేనిచోట ఉండకూడదు" అన్నారు పెద్దలు. కనుక నీవు, నేను కలసి ఉండటం మానవతా దృష్ట్యా మంచిది కాదనిపిస్తుంది. ఇక నీవు నెలసరి జీతంతో తప్ప కళాకారుడిగా ఎదగలేవు. "నేను నమ్మిన ఈ కళను నా ఊపిరి ఉన్నంతవరకు, ఎన్ని అడ్డంకులు వచ్చినా, నా శక్తి మేరకు కొనసాగిస్తాను" ప్రజలకు నాజరు తెలుసు. నాజరు కళకు ప్రజల అండదండలుంటాయి. నైతికంగా నీవు నన్ను మోసం చేశాననుకుంటే పొరపాటు. 'నీ వేలితో నీ కన్నే పొడుచుకున్నావు'. నిన్ను చరిత్ర క్షమించదు. క్షణిక సౌకర్యం కోసం శాశ్వత కీర్తిని కోల్పోయావు. "నాజరు

భౌతికంగా పోయినా బుర్రకథ ఉన్నన్నాళ్ళూ ప్రజల గుండెల్లో నాజరు బ్రతికే ఉంటాడు". నేను డబ్బు, ఉద్యోగం కోసం ఎప్పుడూ చూడలేదు. ఆ సంగతి నీకు తెలిసి కూడా ఇలా చేశావే, అదే నా బాధ నాకు చెప్పి వెళతానంటే ఆనందంగా పంపేవాడిని. 'నాది ఓటమి ఎరుగని పోరాటం'. తాత్కాలిక కష్టాలు ఎదురైనా అంతిమ విజయం సత్యానికే. "నా కళ ద్వారా ప్రజలను చైతన్యవంతం చేస్తాను. అదే నా కోరిక. నా జీవితాశయం" అని గుంటూరు వచ్చేశారు.

నాజరుగారు కథలు చెప్పటానికి వెళితే కర్నాటి ఏడని ప్రజలు అడిగినపుడు, నాజరుగారికి నిజం చెప్పక తప్పలేదు. "మరచిపోతున్న సంఘటనల్ని ప్రజలు అడుగుతుంటే ములుకులతో పొడుస్తున్నట్లు బాధగా" ఉండేది. నాజరు ఒక ప్రక్క వంతల కొరత, మరో ప్రక్కన సంసార బాధలతో సతమతం అవుతున్నారు. ఆ సమయంలో భార్య ధైర్యం చెపుతూ "కాలం ఎలానో వెళ్ళబుచ్చాలి కాని, దిగులు పడితే బ్రతుకు వెళ్ళ మారదని" ప్రోత్సహిస్తూ కర్తవ్యాన్ని, బాధ్యతని గుర్తు చేస్తూ ఉండేవారు.

**బుర్రకథా సామ్రాట్**

కాకినాడ 'సాయి భజన మండలి' వారి ఆధ్వర్యవంలో "బోళ్ళ సీతారామస్వామి" గార్ని వక్తలుగా పిలిచి, నాజరుగారికి బంగారు కలికితురాయి, సన్మానం చేయ సంకల్పించారు. ప్రక్క వీధి దసరా పందిరిలో 'నిడదవోలు అచ్యుతరామయ్య'గారి కథ ఉంది అని చెప్పారు. సన్మానం అందునా పోటీ కథ అని ఆలోచించిన నాజరుగారు మంచి వంతలను చూడాలని వెతకడం ప్రారంభించారు. "రాణిలంక నివాసులైన విఠల్ బ్రదర్స్ వద్దకు వెళ్ళి అడిగితే, తమకు ఖాళీ లేద"న్నారు. తంబుర తీగలు బిగించి, శృతి చేసే "శృతి, లయ, జ్ఞానం కల శత్రుఘ్నరావు, హనుమంతరావులను ఖరారు చేసి కథ చెప్పారు". అభిమానులు పులకరించి కారులో ఊరేగించారు. అనంతరం వెండి బహుమతులు

ఇచ్చి "బుర్రకథా సమ్రాట్" బిరుదునిచ్చి బంగారు కలికితురాయి తగిలించి ఘనంగా సన్మానించారు.

నాజరుగారి పిల్లలను తన తల్లి ఆలనా పాలనా చూస్తుంటే నాజరుగారి భార్య పొగాకు కంపెనీలో పనికే వెళ్ళేది.

**వదలని పేదరికం**

"అనంత కళా వాహినిలో నూతనత్వం కోసం నిరంతరాన్వేషి అయిన నాజరుగారు హార్మోనియంపై అఖండ సాధన చేస్తున్నారు". 'కంబం' వాస్తవ్యులైన 'శ్రీ ఈదుల నారాయణరెడ్డి'గారు నాజరుగారితో కథ చెప్పించటానికి వచ్చారు. "ఇంటి చుట్టూ పొలాలు, చిన్న పూరిల్లు. అది కూడా ఎప్పుడు పడిపోతుందో తెలియని స్థితిలో ఉంది. ఇల్లంతా పిల్లలు. నేలపై గండు చీమలు పిల్లల్ని కుడుతూ, ఇంటి చుట్టూ చీమల పుట్టలు, అప్పుడప్పుడు తేళ్ళు, పాములు కూడా వస్తూ ఉంటాయి. నులక మంచాలు, ఇంట్లో నాలుగు మసి కుండలు, కట్టుబట్టలు తప్ప లేని పిల్లలు, తింటానికి తిండి సరిగాలేక, ఉండటానికి కూడా సరైన ఇల్లు కూడా లేని "దయనీయ పరిస్థితిలో ఉన్నాడు. కనుకనే ఇతను ఇంతగా స్పందిస్తూ, జనరంజకంగా మలచి కథలు చెప్పగలుగుతున్నాడేమోనని" రెడ్డిగారు తనలో అనుకున్నారు.

రెడ్డిగారు వచ్చింది కూడా గమనించకుండా నూతనత్వం కోసం కృషి చేస్తున్న నాజరుగారిని పిలిచి 'ఏమిటయ్యా! యిది?' అన్నారు. దానికి సమాధానంగా నాజరుగారు "పంచభూతములకు నిలయం మా ఇల్లు" అంటూ తన పేదరికాన్ని అందంగా ధ్వనింపచేశారు.

**స్వగృహం**

కుశల ప్రశ్నల అనంతరం కంబంలో కథ చెప్పాలని రెడ్డిగారు అడ్వాన్సు యిచ్చి వెళ్ళారు.

కంబంలో కథ చెప్పి తిరిగి వస్తున్న నాజరుగారికి లారీ కలప యిప్పించారు రెడ్డిగారు. తాను కూడా లారీలో గుంటూరు వచ్చి సిమెంటు వ్యాపారి అయిన చౌదరిగారితో డబ్బు ఉన్నపుడు ఇస్తుంటాడని చెప్పి మాట్లాడి సిమెంటు ఇప్పించి 'యక్షగాన నిలయం' పేరుతో ఒక ఇల్లు ఏర్పాటు చేశారు.

విఠల్ బ్రదర్స్ నాజరుగార్ని పాలకొల్లు పిలిపించి 'నజరాను' బహూకరించి, ఘనంగా సన్మానించారు. అనంతరం ఇంటికి వచ్చారు. నాజరుగారి పెద్ద అమ్మాయికి ధనుర్వాతం రాగా ఆసుపత్రిలో చేరిస్తే డబ్బు బాగా ఖర్చు అయినా తక్కువ కాలంలోనే ఆరోగ్యం చేకూరింది. అలాంటి సమయంలోనే వంత అయిన వెంకటేశ్వరరావు నాజరుగారిని కలిసి "గురువుగారూ నేను స్వంతంగా కథలు చెప్పుకుంటానని" వెళ్ళిపోయాడు. అలా మళ్ళీ వంత కొరతతో కాకినాడ వెళ్ళి 'సలాది భాస్కరరావు'ను తీసుకువచ్చి, వంతగా తర్ఫీదు యిచ్చి కథలు చెపితే రామకోటిని మరిపించాడని ప్రజలు మెచ్చుకున్నారు.

**<u>బుర్రకథా పితామహ</u>**

1962లో భీమవరం వాస్తవ్యులైన 'శ్రీ గన్నాబత్తుల రంగరాయోద్ధారక సోదరులు' నాజరుగారికి సన్మానం చేయాలని నిర్ణయించుకున్నారు. ఆ సమయంలో అధ్యక్షుడుగా వ్యవహరించాలని ఒక కాంగ్రెస్ మంత్రిగారిని ఆహ్వానించారు. దానికి ఆయన "నాజరు కమ్యూనిస్టు కదా! ఆ సభకు నేను వస్తే బావుంటుందా!?" అని ప్రశ్నించారు. ప్రక్కనే ఉన్న కవికులాలంకార, వాజ్మి నాయుడు'గారు మేము మాత్రం అలా అనుకోవడం లేదు ఎందుకంటే "చచ్చిపోతున్న తెలుగు జాతి కళారూపమైన బుర్రకథకు జీవం పోసిన నాజరుకు సన్మానం" అనే అనుకుంటున్నాము అని అన్నారు. వెంటనే మంత్రిగారు సరే మీ యిష్టం. అలాగే కానివ్వండి అని ఒప్పుకున్నారు.

"నాజరుగారిని పూల రథంలో ఉన్నతాసనంపై కూర్చుండబెట్టి డెబ్బై తల ఎడ్ల బళ్ళతో ఊరేగింపు ఏర్పాటు చేశారు. ఆ ఊరేగింపులో కళాభిమానులు,

కళాకారులతో పాటు నాజరుగారి శిష్యులు ముందు నడుస్తున్నారు. వారి ముందు షహనాయి, సన్నాయి, బ్యాండు, గంగిరెద్దు మేళం, విచిత్ర వేషాలతో బహిరంగ ప్రదర్శన జరుగుతూ ఉంది. రోడ్డుకు ఇరువైపులా బారులు తీరిన జనం క్రిక్కిరిసి, మేడలపై నుంచి చూస్తూ నాజరుగారి గొప్పతనం గూర్చి చెప్పుకుంటూ అమితానందంతో ఉన్నారు".

ఊరేగింపు అనంతరం సన్మానకర్తలు "గండ పెండేరం" ఒక దూదేకుల వాడి(పింజారి) కాలికి తొడగాలా? చేతికి వేస్తే చాలదా?! అని చిన్న చూపుతో మాట్లాడుకుంటున్నారు. అది తెలిసిన 'సంగీత విద్వాన్ మహావాది వెంకటప్పయ్య శాస్త్రి'గారు, తెనాలి వాసులైన మృదంగ విద్వాన్ రామానుజం' గారు, 'సూరి'గారు శ్రీ నాజరుతో 'ఏదో పెద్దలు' చేస్తున్నారు, అనికాక బుర్రకథ చెప్పటంలో నాకు నేనే సాటి' అని బల్లపై కాలుపెట్టు, "జవ్వాది"గారు "గండ పెండేరం నీ కాలికి తొడుగుతారు" అని చెప్పారు.

ఆనాటి సభకు 'మల్లంపల్లి సోమ శేఖరశర్మ, నిడదవోలు వెంకట్రావు, అయ్యల సోమయాజులు, నార్ల వెంకటేశ్వరరావు'గారు వంటి ప్రముఖులు హాజరయ్యారు. ఇంకా విమర్శకులు, శాస్త్ర పరిశీలకులు, పరిశోధకులు, మేధావులు, శిష్యులతో నిండిన ఆ సభలో 'పురాణం సుబ్బారావు'గారి పర్యవేక్షణలో సన్మాన పత్రం చదివి "బుర్రకథా పితామహ" బిరుదు ప్రధానం చేసి అంగరంగ వైభవంగా, ఘన సన్మానం చేశారు.

**<u>ఘంటశాల అభినందన</u>**

"గన్నాబత్తుల వారి సలహాతో ప్రముఖ సినీ దర్శక, నిర్మాత శ్రీ తాతినేని ప్రకాశరావుగారు నాజరుగారిని నూతన గృహ ప్రవేశం సందర్భంగా ఆహ్వానించి, కథ" చెప్పించి వెండి కప్పులు, వెయ్యినూట పదహార్ల నగదు యిచ్చి సన్మానించారు. అదే సమయంలో "నటి 'లక్ష్మీరాజ్యం'గారి తల్లి వర్ధంతికి నాజరుగారిచే కథ' చెప్పించి వెయ్యినూట పదహార్లు ఘంటశాల"గారి చేతుల మీదుగా ఇప్పించారు

ఆ సందర్భంలో శ్రీ ఘంటశాలగారు, నాజరుగారి గురించి చెపుతూ, "ఆయన గాయకులు, నటులు, రచయిత కూడా. అదంతా ఆయన చేసుకున్న పూర్వజన్మ సుకృతం అని నేను భావిస్తున్నాను. అసలు నాజరుగారు బుర్రకథోద్ధరణకై జన్మించిన వ్యక్తి అని సాటి కళాకారునిగా నేను సహృదయంతో అభిమానిస్తున్నాను" అని ప్రశంసించారు.

కళాభిమానులైన ప్రజలు లాంఫారంలో ఘంటా కంకణం, దుగ్గిరాలలో నవరత్నాల హారం, విజయనగరంలో బంగారు కౌమారాలు ఇచ్చి నాజరుగారిని సాదరంగా సత్కరించారు.

## విరసం సభ్యత్వం తిరస్కారం

1963లో "శ్రీ శ్రీ"గారు కంబం మహాసభకు పిలిచి కథ చెప్పించి సాంఘిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితులు బావున్నాయని తానెంత వద్దంటున్నా వినక 'విరసం'లో సభ్యునిగా చేర్చుకున్నారట. నాజరుగారు విరసం సభలో కథలు చెపుతున్నాడని ఉభయ కమ్యూనిస్టుల వాళ్ళు కథలు చెప్పించటం లేదు. కొంత కాలానికి విరసం సభ్యత్వం తీసివేశారు. ఆనాటి నుంచి ఏ పార్టీ ముద్ర లేకుండా స్వతంత్రుడై కథలు చెపుతున్నారు.

అలా స్వతంత్రుడై కథలు చెపుతున్న నాజరుగారితో ఒకనాడు వంతయైన పలాది భాస్కరరావు రాజకీయ హరికథ చెప్పుకుంటానని' అన్నారు. నాజరుగారు సంతోషంగా "నా శిష్యుడు స్వతంత్రంగా బ్రతుకుతానంటే కాదంటానా, నీవు హాయిగా జీవించు" అని చెప్పి ఇద్దరి పేరు మీదున్న స్థలం అమ్మి, ధనం ఇచ్చి "భార్య, ఇద్దరు పిల్లలున్న నీవు జాగ్రత్తగా జీవించమని" దీవించి పంపారు.

స్వతంత్ర కథకుడైన కొంతకాలానికి వెంకటేశ్వరరావు మళ్ళీ తిరిగి వచ్చి నాజరుగారి వద్ద వంతగా చేరాడు.

1964లో అగ్ర నిర్మాత అయిన 'యు. విశ్వేశ్వరరావు'గారు "నిలువు దోపిడి"

సినిమాలో "నాజరు గారిచే పాడించి బుర్రకథ అనుభవం ఉన్న కీ.శే. రాజబాబు' గారిచే నటింపజేశారు. తరువాత 'పెత్తందార్లు' సినిమాలో తంబుర, అందెలు వాయిస్తూ ఘంటశాల గారితో పాడించి కీ.శే.డా॥ఎన్.టి.రామారావు గారిని తెరకెక్కించారు. ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన సివిల్ ఇంజనీరు అయిన 'కె.యల్.రావు'గారు, రాజకీయ వేత్త 'కొత్త రఘురామయ్య, ఎం.పి.గారు, రాజకీయ నాయకులు లక్ష్మీ రఘురాంగారలు నాజరుగారి ప్రతిభను గుర్తించి సత్కరించి బహుమతులు అందజేశారు.

## భారత పర్యటన

"1972లో బొంబాయి, అహ్మదాబాదు, కలకత్తా, టాటానగర్, తిరుచునాపల్లి, ఒకటేమిటి భారతదేశంలో తెలుగువారున్న ప్రదేశాల్లో కథలు" చెప్పి రజత పతకాలు, నటరాజ విగ్రహాలు వంటి అనేక బహుమతులు, సన్మానాలను అందుకున్నారు. అలా పర్యటిస్తున్న సమయంలో పాకిస్తాన్, ఇండియాల మధ్య అభిప్రాయ భేదాలు రాగా, ఈ పరిస్థితుల్లో ఇక్కడ ఎందుకు మళ్లీ వస్తానని మిగిలిన కథలు తరువాత చెపుతానని గుంటూరు తిరిగి వచ్చేశారు.

"ప్రసిద్ధి గాంచిన నాటక రంగ నటులు సినీనటులు అయిన నాగభూషణంగారు నాజరుగారిచే తను అబ్బాయి పెళ్ళికి కథ" ఏర్పాటు చేయించారు. వంత అయిన వెంకటేశ్వరరావు తాగాడని నాజరుగారు మందలించారు. వెంకటేశ్వరరావు నేను ఇకపై మీతో రానని వెళ్ళిపోయాడు. ప్రక్కనున్న చిన్నబ్బాయి నేను కూడా వెళుతున్నానని వెళ్ళిపోయాడు.

ఉన్న వంతలు వెళ్ళిపోయేసరికి మళ్ళీ వంతలను వెదకి 'సైదులు, నూర్ భాషా'లను తీసుకు వచ్చి, తర్ఫీదు నిచ్చి కథలు చెపుతున్నారు. అనుభవం లేని వాళ్ళతో కథ చెప్పటం చాలా కష్టంగా ఉన్నా, చేయగలిగింది ఏమీ లేక వాళ్ళతోనే నెట్టుకు వస్తున్నారు.

నిడదవోలు అచ్యుతరామయ్యగారు హార్మోనియం కూడా ఉంటే కథ ఇంకా బాగా ఉంటుందని సూచించారు.

## బుర్రకథ యక్షగానం

నలభై ఏళ్ళ క్రితం ఉన్న కూచిపూడి నాట్యానికి, ఇపుడున్న నాట్యానికి చాలా తేడా ఉంది. వాళ్ళు ఆ నాట్యాన్ని 'యక్షగానం'గా చెపుతున్నారు. దానికి మీరేమంటారు అని 'శ్రీనివాస చక్రవర్తి'గారికి ఉత్తరం వ్రాశారు నాజరుగారు.

దానికి ఆయన 'అసలు యక్షగానం బుర్రకథే' అది ఎలా అనేది తెలియాలంటే జాతి కళారూపాలకు నెలవైన జానపద సాహిత్యానికి సంబంధించిన శాస్త్రాలు చదివితే అర్థమవుతుందని సమాధానమిచ్చారు.

నాజరుగారు శాస్త్రాలు చదవటం ప్రారంభించారు. వాటిల్లో "జక్కుల కథలు చెప్పేవారు రెండు వివాహాలు చేసుకుని వారినే వంతలు"గా ఉపయోగించేవారని గమనించారు నాజరుగారు. కళాభిమాని సాహిత్యం అంటే ఆసక్తి, సంగీత జ్ఞానంగల తనకు ఎల్లవేళలా చేదోడు వాదోడుగా ఉంటున్న 'ఇల్లాలిని వంతగా చేసి కథలు' చెప్పసాగారు నాజరుగారు.

ఒకసారి 'సాంబశివరావు, థామస్'లతో కథ చెప్తున్నారు నాజరుగారు. వారు పరువు మరచిపోయి, రాగాలాపనలో లీనం అయిపోయేవారు అలా మైమరచి పోవటం అలవాటుగా మారింది "అంతటి గొప్ప సంగీతాన్ని నాజరుగారు వినిపించేవారని అనడంలో సందేహం లేదు". అంతేకాదు కథలో ప్రతి చిన్న విషయంలో కూడ అందరితో పాటు తల్లికి, భార్యకు వినిపించి వారి సలహాలు కూడా పాటించేవారు.

'గుడ్డి జంగం'గారు వాల్మీకి ఆశ్రమంలో నిండు చూలాలు సీతమ్మ బాధపడే సన్నివేశంలో "నడువ జాలనమ్మ నేనీ కానల భూమిలోన" అని వ్రాసిన దాన్ని ఆధారం చేసుకుని నాజరుగారు 'బొబ్బిలి యుద్ధం'లో మల్లమ్మ నిండు చూలాలుగా

గల సన్నివేశంలో "నిలువ జాలనమ్మ అరనిముషమైన అమ్మయ్య" అని ఆమె వేదనను చిత్రీకరించారు.

సంగీత నాటక అకాడమీ వారి ఆధ్వర్యవంలో "బొబ్బిలి యుద్ధం" కథను చెపుతున్నారు నాజరుగారు. 'శ్రీనివాస చక్రవర్తి'గారు ఆ కథ చూడటానికి వచ్చారు. ప్రదర్శన అనంతరం నాజరుగారితో "ఈ సన్నివేశాన్ని నీవు పాడుతూ, అభినయిస్తుంటే ఆడవాళ్ళు తలలు వంచుకుంటున్నారు. మగవాళ్ళు నవ్వుకుంటున్నారు. కనుక అది తీసివేస్తే మంచిది. అంతేగాక మూలకథను మించకుండా హాస్యం, రాజకీయ సంభాషణలు ఉండాలి. సన్నివేశాలు కల్పించక ముందు చాలా జాగ్రత్తలు తీసుకోవాలి" అని సలహా ఇచ్చారు.

**కథలో సవరణ**

ఒకసారి నాజరుగారు కథ చెపుతూ ప్రేక్షకులను గమనించి గురువు శ్రీనివాస చక్రవర్తిగారి సలహాను పాటించి ఆ సన్నివేశం చెప్పడం మానేశారు.

నాజరుగారు బుర్రకథలపై రెండు వ్యాసాలు వ్రాసి 'నాట్యకళ పత్రిక'కు పంపిస్తే వాటిని వారు ప్రచురించారు.

గుంటూరులో నాజరుగారి ఇంటికి 'ఎన్నిరెడ్డి రామిరెడ్డి'గారు వచ్చి స్వతంత్ర పార్టీకి కమ్యూనిస్టుల మద్దతు ఇస్తున్నారు. ఆ సభలో నీవు కథ చెప్పాలని అడిగారు. నాజరుగారు ఈ విషయం తల్లితో చెపితే ఇక నుంచి నీవు ప్రజా వేదికలపైనే కథలు చెప్పు చాలు అని సూటిగా చెప్పింది.

నాజరుగారు అన్ని పార్టీల వారు నన్ను ఆదరించి నిరాకరించారు. దయచేసి మీరు ఏమీ అనుకోవద్దు. నాకు కుదరదు. ఇంట్లో మా అమ్మగారు వద్దంటున్నారు అని రెడ్డిగారితో చెప్పారు. దానికి ఆయన కోపంగా నాజరుగారిని 'ఇంట్లో చెల్లని వెధవ' అని రుసరుసలాడుతూ వెళ్ళిపోయారు.

## తండ్రిగా బాధ్యత

నాజరుగారికి మొత్తం పిల్లలు ఏడుగురు. ఇద్దరు అబ్బాయిలు షేక్ సైదులు బాబు, బాబూజీ, ఐదుగురు అమ్మాయిలు. పెద్దమ్మాయి అలీనా, రెండవ అమ్మాయి బేగం, తరువాత బంగారు పాప, బీబాబీ, సితార, వీరు కూడా సంగీతంలో ప్రవేశం ఉన్నవారే.

ఈ నేపథ్యంలో నాజరుగారి పెద్దమ్మాయి పి.యు.సి. ఉత్తీర్ణురాలైన కొన్నాళ్ళకు ఎల్.సి.ఇ. డిప్లమా చదివి, ఉద్యోగం చేస్తున్న ఒక వ్యక్తి నాజరుగారిని వారి పెద్దమ్మాయిని పెళ్ళి చేసుకుంటానని అడిగారు.నాజరుగారు పెద్ద కూతురైన 'అలీనా'ను ఆయనకు ఇచ్చి వివాహం చేసి, ఇంటి స్థలం కొని యిచ్చారు. రెండవ అమ్మాయికి పదవ తరగతి అనంతరం సంబంధం చూసి పొలం అమ్మి పెళ్ళి జరిపించారు. వీరిద్దరికి 'కళాభారతి జమున'గారు రింగులు చేయించి యిచ్చారు. మూడవ అమ్మాయి ఎనిమిదవ తరగతి చదివిన అనంతరం బంగారు సింహ తలాటకం అమ్మి, స్థలం కొని అందులో ఇల్లు కట్టించి ఆమె వివాహం జరిపించారు.

## సన్మానం కన్నా కథలే మిన్న

తెలుగు మహాసభలో నాజరుగారి కథ చూసిన 'శ్రీ జలగం వెంగళరావు'గారు సన్మానం చేస్తామని తెలిపారు. అందుకు నాజరుగారు ఒప్పుకున్న కథలు ఇంకా కొన్ని ఉన్నాయి. అవి పూర్తి అయిన తరువాత వస్తానని చెప్పారు. కొన్ని రోజుల తరువాత వెంగళరావుగారు విజయవాడలో నాజరుగారికి 'రజత పతకం' ఇచ్చి సన్మానించారు. "సన్మానం కన్నా ఒప్పుకున్న కథలకు ఎక్కువ ప్రాధాన్యమిచ్చేవారు నాజరుగారు".

## టి. అంజయ్యగారిచే సన్మానం

1978లో రంగస్థల వృత్తి కళాకారుల మహాసభలో జమునగారు, రాజమండ్రిలో శ్రీ వెంకట్రావుగారు, 1979లో ముఖ్యమంత్రిగారు వెనుకబడిన

తరగతుల మహాసభలో మెమెంటో యిచ్చి సన్మానించారు.

1981లో పేదల పెన్నిధి, ముఖ్యమంత్రి శ్రీ టి.అంజయ్యగారి చేత తెలుగు సంవత్సరాది రోజున సన్మానింపబడ్డారు. ఇలా నాజరుగారు అనేక సన్మానాలు అందుకున్నారు.

అంతకుముందు ఒకసారి 'చెన్నారెడ్డి'గారు సన్మానం అంటే వీలు కుదరదని చెప్పారు. వచ్చే సంవత్సరానికి మీరు తప్పకరావాలని 'గొర్రెపాటి వెంకట సుబ్బయ్య'గారు చెప్తే కాదనలేక ఒప్పుకున్నారు.

మరుసటి రోజున బళ్ళారి దగ్గర ఓ పల్లెనుండి కథ చెప్పించుకొనుటకై నాజరుగారి వద్దకు వచ్చారు. ఇపుడు వీలు కుదరదని, తరువాత వీలు చూసుకుని వచ్చి కథ  చెప్తానని చెప్పి పంపించారు.

1981లో జమునగారు ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ అధ్యక్షురాలు అయ్యారు. నాజరుగారిని అకాడమీలో మీరు సభ్యులై, మీరే నడిపించండి అని జమునగారు వినయంగా అడిగితే నాజరుగారు నాకే  బాధ్యతలు వద్దని, ఏమీ అనుకోవద్దని చెప్పి అప్పటికి తప్పించుకున్నారు.

మార్చి 17వ తేదీన సాంస్కృతిక శాఖామాత్యులైన 'భాట్టం శ్రీరామమూర్తి'గారు నాజరుగారిని మీరు అకాడమీలో సభ్యులు కావాలి, తప్పదు అని ఒప్పించి చేర్పించారు.

## కేంద్ర సంగీత, నాటక అకాడమీ సభ్యత్వం

1982లో కేంద్ర సంగీత నాటక అకాడమీ అధ్యక్షులు కమలా చటోపాధ్యాయగారు మరియు ఆంధ్రప్రదేశ్ నాటక అకాడమీ అధ్యక్షురాలు కళాభారతి జమున-గారల సమక్షంలో నాజరుగారు హైదరాబాదు 'రవీంద్ర భారతి'లో బుర్రకథను ప్రదర్శించారు. బుర్రకథను తిలకించిన ఇరువురు నాజరుగారిలోని బుర్రకథ చెప్పటంలో గల నైపుణ్యాన్ని ప్రశంసించి ఐదువేల నగదు, రత్నకంబళితో ఘనం

సన్మానించి కేంద్ర నాటక అకాడమీలో సభ్యునిగా చేర్చుకుంటున్నట్లు సభాముఖంగా తెలియజేశారు.

**జీవనభృతి**

1983లో ముఖ్యమంత్రి అయిన శ్రీ టి. అంజయ్యగారు "వృద్ధ కళాకారుల జీవన భృతి నెలకు నూట యాభై రూపాయలు" ఇవ్వనున్నట్లు ప్రకటించారు. కళాభిరుచిగల పేద యువ కళాకారులను ప్రోత్సహించడానికి సాంస్కృతిక మంత్రిగారు పదివేల రూపాయల నగదును నాజరుగారికి యిచ్చారు. "నాజరుగారు ఆరు బుర్రకథల దళాలను ఏర్పాటు చేసి, వారికి తర్ఫీదు యిస్తూ, ఆ దళాల జీవన భృతిగా ప్రతి కళాకారునికి నెలకు మూడు వందల రూపాయలు" ఇస్తున్నారు. "హైదరాబాదు రవీంద్ర భారతిలో మిత్రుల, ప్రజల, కళాకారుల, మంత్రుల సమక్షంలో తాను తర్ఫీదు ఇచ్చిన ఆరు బుర్రకథా దళాలతో ప్రదర్శనలు చేయించారు. అనంతరం సాంస్కృతిక సమాఖ్యచే వాద్యాలు, మైకులు, డ్రస్సులు ఆ ఆరు దళాలకు" ఇప్పించారు.

**గవర్నర్‌గారిచే సన్మానం**

1984లో ఆంధ్ర కాంగ్రెస్ ఏర్పాటు చేసిన సాంస్కృతిక ఉత్సవాలలో ఆంధ్ర గవర్నర్ గౌరవనీయులు 'శ్రీరామ్‌లాల్'గారు 'నాట్యదర్శి' కంచు విగ్రహం యిచ్చి సన్మానించారు.

**పద్మశ్రీ**

1986వ సంవత్సరంలో జనవరి 10వ తేదీ సాయంత్రం గుంటూరు హరిహరమహల్‌లో సినిమా చూస్తున్న నాజరుగారిని హాలు వర్కర్స్ సహాయంతో గుర్తించిన పోలీసులు సినిమా హాలులోని ఒక గదికి పిలిపించారు. నాజరుగారికై అక్కడకు వచ్చిన ఆర్.డి.ఓ, కలెక్టర్, ఎస్.పి.లు ఒక్కసారిగా నాజరుగారికి శుభాకాంక్షలు అందజేసి, "కళాకారులు గర్వించదగిన రీతిలో మీకు కేంద్ర ప్రభుత్వం

'పద్మశ్రీ' బిరుదు" ఇచ్చి, గౌరవించి సత్కరించ నిర్ణయించారని ఆనందం తెలియజేశారు. ఆ శుభాకాంక్షలతో గూడిన వార్త విన్న నాజరుగారు చాలా సంతోషించారు. "రిపబ్లిక్ డే రోజున ఉన్నత రాజకీయవేత్తలు అయిన శ్రీ రాజీవ్‌గాంధీ, శ్రీ పి.వి. నరసింహారావుగారల సమక్షంలో రాష్ట్రపతి శ్రీ 'జ్ఞాని' జైల్‌సింగ్'గారు రాష్ట్రపతి భవన్‌లో 'పద్మశ్రీ' అవార్డును నాజరుగారి గుండెలపై ఉంచారు".

ఆ సందర్భంలో ఉత్తమ రాజకీయవేత్త, నిస్స్వార్ధజీవి అయిన శ్రీ 'వావిలాల గోపాలకృష్ణయ్య'గారు నాజరుగారిని గుంటూరులో సత్కరించి తన హృదయానికి హత్తుకున్నారు. ప్రధాన వక్తగా ఆచార్య యస్.గంగప్ప గారు పాల్గొని నాజరుగారి బుర్రకథా విశిష్టతను ప్రశంసించారు. అపుడు నాజరుగారు 'నలభై ఏళ్ళుగా మీరిచ్చిన పరిజ్ఞానం ఇది. నాకు ఇంకా బాధ్యత ఉంది. అది త్వరలోనే పూర్తి చేస్తాను" అని చెప్పారు. శ్రీ వావిలాలగారు నవ్వుతూ "నీవు అంతటి సమర్ధుడవే నాజరూ" అంటూ అభినందించారు.

అదే సందర్భంలో అప్పటి .. "ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి, తెలుగుదేశం పార్టీ నాయకులు కీ.శే. నందమూరి తారక రామారావుగారు హైదరాబాదు రవీంద్ర భారతిలో శాసనసభ్యుల సమక్షంలో వెయ్యి నూట పదహార్ల నగదు" బహూకరించి సత్కరించారు.

1986లో ఉపరాష్ట్రపతి గౌరవనీయులు శ్రీ ఆర్.వెంకటరామన్‌గారు కేంద్ర సంగీత నాటక అకాడమీ తరపున పదివేల రూపాయల నగదును బహూకరించి సన్మానించారు. యన్.టి.రామారావుగారు 1987 నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలియజేసి, ఐదువేల రూపాయల నగదు ఇచ్చి, పండిత శాలువా కప్పి సన్మానించారు.

ఆంధ్రప్రదేశ్ గవర్నర్ కుముద్‌బెన్ జోషి గారి సమక్షంలో పెనుగొండ

వాస్తవ్యులు, ప్రముఖ వైద్యులు అయిన శ్రీ షేక్ మిర్జాన్‌గారు ఘన సన్మానం చేశారు.

ఒంగోలులో రాజారావుగారి స్మారక సభలో డాక్టర్లు, కళాకారులు సన్మానం చేశారు. నరసరావుపేట నూర్ భాషా సంఘంవారు, కవుల, కళాకారుల సదస్సులో, విద్యార్థి వార్షికోత్సవ సభలో కార్మిక, కర్షక, రాజకీయ వేదికలపై, రాష్ట్ర, రాష్ట్రేతర ప్రజలు హార్దికంగా, ఆర్థికంగా అనేకసార్లు సన్మానం చేశారు. అనంతరం హైదరాబాదు ప్రజానాట్యమండలి సభలో, నిజాం కళాశాలలో కథలు చెప్పి గుంటూరు వచ్చేశారు.

గుంటూరులోని తన ఇంటిలో ఒకరోజు ఉదయం నిద్రలేచిన నాజరుగారు మూత్ర విసర్జనకు వెళ్ళారు. మూత్ర నాళాలు స్తంభించి మూత్రం రాకపోవటంచే పొట్ట ఉబ్బటం మొదలయ్యింది. అది గమనించిన నాజరుగారు ప్రభుత్వ ఆసుపత్రికి వెళ్తే ఆపరేషన్ చేయాలి ముప్పైవేలు ఖర్చు అవుతుందని, తాత్కాలికంగా వచ్చే ఏర్పాటు చేస్తున్నాం అని చికిత్స చేసి పంపించారు.

ఇలా కాదని ప్రజా డాక్టర్‌గా ప్రసిద్ధి చెందిన డా॥కాసరనేని సదాశివరావు గారిని కలిసి విషయం వివరించారు. ఆయన అసెంబ్లీ సమావేశాలకు వెళుతున్నాను, వచ్చిన వెంటనే చేస్తాను అని చెప్పారు. సమావేశాలు ముగిసిన తరువాత 1986 డిశంబర్ 12వ తేదీన ఆపరేషన్ చేసి, రెండు నెలల పాటు వైద్యం చేసి ఇంటికి పంపించారు. ఆ రాత్రి జ్వరం వచ్చి మళ్ళీ నెల రోజుల పాటు ఆసుపత్రిలో ఉంటే నాజరుగారి భార్య చాలా ఓర్పుతో కంటికి రెప్పలా కాపాడుతూ సేవ చేసింది. కోలుకున్న తరువాత డాక్టర్‌గారు అడుగక పోయినా ఐదు వందల రూపాయలు ఇచ్చి ఇది ఫీజు కాదు, ఏదో మా శక్తి కొలది ఇస్తున్నాము. కాదనకండి అంటూ డాక్టరు వారిస్తున్నా ఇచ్చి నమస్కరించి ఇంటికి వచ్చారు.

1993 సెప్టెంబర్ 13న గుంటూరులోని అరండల్‌పేట రియల్ ఎస్టేట్ సంస్థ 'కళ్యాణి ఎంటర్‌ప్రైజస్' వారు శ్రీనాజరును ఘనంగా సన్మానించారు.

మద్రాసు తెలుగు అకాడమీ ప్రతి ఏటా ప్రకటించే ఉగాది పురస్కార అవార్డుల ప్రదానోత్సవం సందర్భంగా శ్రీ నాజరును మద్రాసు పిలిపించి సన్మానించారు. ఈ సందర్భంగా ప్రముఖ సినీ గాయకులు యస్.పి. బాల సుబ్రహ్మణ్యంగారు పదివేల రూపాయల ప్రత్యేక ఆర్థిక సహాయం చేశారు. తదనంతరం శ్రీ నాజర్‌గారి కళాసేవను కొనియాడారు.

1995వ సంవత్సరంలో శ్రీ యన్.టి.రామారావుగారు తన జన్మదినం సందర్భంగా జానపద కళాకారులలో ప్రముఖులైన బుర్రకథా పితామహ, పద్మశ్రీ శ్రీ నాజర్‌ను సత్కరించి, జాతీయ స్థాయిలో ఉత్తమ స్థానం సాధించారని ప్రశంసిస్తూ, పాతిక వేల రూపాయల నగదును బహూకరించారు.

డెబ్బై ఎనిమిది సంవత్సరాల వయసులో అనారోగ్యంతో బాధ పడుతూనే "జాతి జీవితం - కళా పరిణామం" అనే ఉద్గ్రంథ రచనకు పూనుకున్నారు. అదే ఆయన జీవిత ధ్యేయం.

కనుక తానే స్వయంగా ముద్రించాలని మొదలుపెట్టి ఎవరు చెప్పినా వినకుండా ప్రూఫులు ఏకధాటిగా చూస్తూ ఆరోగ్యం సహకరించకపోయినా తన జ్ఞానం వెలుగు చూస్తుందనే సంతృప్తితో పూర్తి చేసి పడిపోయారు. ఆసుపత్రికి తీసుకెళ్ళారు. 1997 ఫిబ్రవరి 21వ తేదీన ఆయన పరమపదించారు.

ఈ విధంగా మట్టిలో పుట్టి, మట్టిలో పెరిగి ఈనాడు 'బుర్రకథా పితామహ' అనే మాణిక్యంగా రూపు దిద్దుకుని "పద్మశ్రీ" దాకా ఎదిగిన శ్రీ షేక్ నాజర్‌గారు తెలుగు సీమలో వెలసిన మహోత్తమ కళాకారుడు. ఉత్తమ లక్షణాలు కలిగిన కళాకారులను ఇటు ప్రజలు, అటు ప్రభుత్వం కూడా గుర్తిస్తుందనడానికి నిదర్శనం శ్రీ నాజర్.

# బుర్రకథ

ఆదిలో మానవుడు తనలో కల్గిన భావోద్వేగానికి అనుగుణంగా, లయాన్వితంగా నాట్యాన్ని రూపకల్పన చేయడం ప్రారంభించి, తదనుగుణంగా మాటనేర్చి, మాట నుంచి పాట కూర్చి వాద్యాల సహాయంతో జానపద గేయాలను, గేయ గాథలను ఆలపించి, అభినయించి ఆనందాన్ని, విషాదాన్ని ప్రకటించటం అలవరచుకున్నాడు.

జానపదం అంటే జనపదం. అనగా పల్లె ప్రజలు నివసించే ప్రాంతం. అట్టి వారి చేత ప్రదర్శించబడే కళే జానపద కళ. అట్టి జానపద విజ్ఞానం అనంతం. అందులో భాగమైన జానపద కళలను జానపద కళా రూపాలనడం సమంజసం. అట్టి విజ్ఞానం నాలుగు విధాలుగా విభజన చేయడం జరిగింది.

1. మౌఖిక జానపదం (ORAL FOLK LORE)
2. సాంఘిక జానపదం (SOCIAL FOLK COSTUMS)
3. జానపద వస్తు సంస్కృతి (METERIAL FOLK CULTURE)
4. జానపద కళలు (FOLK ARTS)

జానపద విజ్ఞానంలోని జానపద కళలు సంగీత-నృత్య-రూపకాలుగా పరిణతి చెందాయి. అందు సంగీతంలో వాద్య సంగీతం, గాత్ర సంగీతంగా వెలువడ్డాయి. నృత్యంలో పాటతో కలసి, పాట లేకుండా వెలువడ్డాయి. రూపకంలో చిత్రకళా శిల్పమైన ధార్మికంగా - భౌతికంగా, వేష భాషలుగా వెలువడ్డాయి. జానపద సాహిత్యం పండుగలు, వినోదాలు, నమ్మకాలు, మతాల సమ్మేళనాలతో మిళితం అయి ఉంటాయి.

జానపద కళా రూపాలుగా పేరు గాంచిన గేయ గాథలు యక్షగానం, జంగం కథ, బుర్రకథ, హరికథ, తోలు బొమ్మలాట, వీధి భాగవతం, కోలాటం, పగటి వేషాలు, గారడీ విద్యలు మొదలైనవన్నీ ప్రముఖాలు. ఈ జానపద కళలను

ॱజా కళలు అనడంలో ఔచిత్యం ఎంతో ఉంది. అంతేకాక ప్రజా ప్రదర్శన కళా ॱాపాలు అనడం మరింత సహజంగా ఉంటుంది. ప్రదర్శనా వాఙ్మయమైన ॱర్రకథకు ప్రదర్శన కళారూపాలలో అత్యంత ప్రాముఖ్యంతో కూడిన విశిష్ట స్థానం ॱంది.

**ॱర్రకథ పుట్టుక**

శక్తి కథలు, పల్నాటి వీర కథలు కీ.శే. 13,14 శతాబ్దాల కాలం నాటికే ॱంధ్రదేశంలో వ్యాపించినట్లు ప్రమాణాలున్నాయి. తదనంతరం 14,15 శతాబ్దాలలో కాటమరాజు కథలు, కుమార రాముని కథ, గాంధారి కథలు, బయలు దేరాయి. 1850లో 'హరి హరీ పదాలు మొదలై విశాఖ, శ్రీకాకుళం జిల్లాలలో విశేషాదరణ పొందాయి. తరువాత 19వ శతాబ్ది పూర్వార్థం వరకు గల మధ్య కాలంలో 'బొబ్బిలి కథ', 'దేశింగురాజు కథ', 'కామమ్మ కథ', 'లక్ష్మమ్మ కథ' 'పేరంటాండ్ర కథలు' బహుళ ప్రచారంలోనికి వచ్చాయి. 20వ శతాబ్ది ప్రారంభంలో యక్షగానాల ప్రభావంతోను, మహారాష్ట్రుల కాలక్షేపాల ప్రభావంతోను, 'బొబ్బిలి వరుస కథల నుంచి జంగం కథలు' పరిణమించాయి.

బసవ పురాణం పాల్కురికి సోమనాథుడు 'శ్రీయాళ చరిత్ర'ను గూర్చి "కరమర్థి నూరూర శిరియాళు చరిత పాటలుగా కట్టి పాడెదు వారు" అని వివరించాడు. కవి సార్వభౌముడు కాశీ ఖండములో దక్షవాటి పురమును వర్ణిస్తూ "కీర్తింతు రెడ్దాని కీర్తి గంధర్వులు గాంధర్వమున యక్షగాన సరళి" అను దానిని బట్టి గంధర్వ గానాన్ని యక్షగాన సరళిలో పాడి వినిపించేవారని విశదమవుతుంది (పండితారాధ్య చరిత్రలో "ఆదట గంధర్వ యక్ష విద్యాధరాదులై నాడెడు వారు" అను దానిని బట్టి నాట్యానికి అనుకూలమైన దుస్తులు ధరించి యక్షిణిలాగ తంబురలాంటి వాద్యాన్ని వాయిస్తూ, పాడుతూ కథ విన్పించేదని తెలుస్తుంది). ఆదిలో కథ విన్పించింది జక్కుల పురంధ్రి అని విదితం కాగలదు. అసలు "మూల

యక్షగానం అనేది సంగీత, నృత్యముల సహాయంతో కళారూపమైన కథ" అని స్పష్టమౌతుంది.

'క్రీడాభిరామం'లో

"ధృత తాళంబున వీర గుంభితక ధుంధుంధుం కిటాత్కార సం
గతి వాయింపుచు నాంతరాళిక లయ గ్రామాభి రామంబుగా
యతి గూడం ద్విపద ప్రబంధమున వీరా నీక ముంబాడె నొ
క్కతె ప్రత్యక్షరముం గుమారకులు ఫీట్కారంబు నందూలగన్"

అను పద్యమే గాక 'క్రీడాభిరామం'లో

" అకలంక స్థితికోరి కొల్చెదరు బ్రహ్మానంద సంభావనన్
సకలానంద మయైక మాతలగుచున్ సంతోష చిత్తంబునన్
తక దుమ్ముల్ మక నాళముల్ జవనికల్ తందానలమ్మయ్యకున్"

పై పద్యాలను బట్టి చూస్తే కాకతీయ యుగం నాటికే జంగం కథలు బహుళ ప్రచార మందినట్లు 'జవనిక' వాద్యం ఉపయోగించినట్లు, 'తందాన' అనే వంత పదం పాడినట్లు విశదమైంది.

కాశీ ఖండంలో 165 పుట, 56వ పద్యం అయిన

"వల్లకి చక్కికాహళము వంశము
డక్క హుడక్క ఝర్ఝరుల్
ఝల్లని యానిగా గలుగు శబ్ద
పరంపర తాళ బద్ధమై" అను చోట "డక్క హుడక్క" అనుటను బట్టి కాహళముతో బాటు "డక్క" నేడు బుడబుక్కలవారు ఉపయోగించే "హుడక్క" అని చెప్పవచ్చును.

క్రీడాభిరామంలో -

"వాద్య వైఖరి కడు నెరవాది యనగ
ఏకవీరా మహాదేవి ఎదుట నిల్చి
పరశురాముని కథ తెల్ల ప్రౌఢి పాడె
చారుతర కీర్తి బవనీల చక్రవర్తి"

దీనిని బట్టి వివిధ వాద్యాలతో పరశురాముని కథలు బవని వారు పాడి వినిపించినట్లున్నది. జవనికలు, డక్కీలు మొదలగు వాద్య వైఖరులన్నీ చేరి ఉండవచ్చును.

పండితారాధ్య చరిత్రలో "ఆదట గంధర్వ యక్ష విద్యాధరాదులై నాడెడు పాడెడు వారు" అను దానిని బట్టి నటి నాట్యానికి అనుకూలమైన దుస్తులు ధరించి యక్షిణిలాగ తంబుర లాంటి జంత్ర వాద్యాన్ని వాయిస్తూ, పాడుతూ, ఆడుతూ కథ వినిపించేదని అర్థమౌతుంది.

చంద్రశేఖరుడు 'చంద్రశేఖర శతకము'లో

"ఇంటిని తిమ్మరాజు త ఇంటిని ఈర్ల కథా ప్రసంగముల్
ఇంటిని పాదులాలి ఇబమింటిని నాయకురాలి శౌర్యమె
ప్పటికి నంది వాక్యముల పొందు చరిత్రల నాదు భాగ్యమె
మెన్నటికి గల్గునోయను నవజ్ఞుడు మూర్ఖుడు చంద్రశేఖరా!"

ఈ పద్యంలో "ఈర్ల కథలే" శ్రీనాథుడు "పల్నాటి వీర చరిత్ర"గా రచించినట్లు తెలియుచున్నది. దీనినే 'పిచ్చుకుంటల' వారు కథగా చెపుతారు. తిమ్మరాజు కథ' అను పేరుతో "బంగారు తిమ్మరాజు కథ" నేటికీ ప్రచారంలో ఉన్నది.

యక్షగానాలు, వీధి నాటకాలు, బుర్రకథలు మొదలైనవన్నీ 'దేశి 'రస్వతానికి' చెందిన సంగీత రూపకాలుగా పరిణామం చెందుతూ వేనికవే ఓ

ప్రత్యేకమైన రూపాన్ని సంతరించుకుని వివిధ కళారూపాలుగా అభివృద్ధి చెందినట్లు సాహిత్య, చారిత్రక ఆధారాలను బట్టి తెలుస్తుంది. ఇలా గాన రూపంగా వృద్ధి పొందుతూ వచ్చిన 'యక్షగానం'లో సూత్రధారుడు ప్రవేశించి నటి పాటకు వంత పాడుతూ, కథా గమనంలో, వచ్చే చిల్లర పాత్రలకు వాచకం చెబుతూ ఉండేవాడు. నటి వివిధ పాత్రలను అభినయిస్తూ కథ వినిపిస్తూ ఉండేది. అదే పరిణామ దశలో 'భామా కలాపం', 'గొల్ల కలాపం'గా రూపొంది ఉండవచ్చును.

అలాకాక పరిణామ దశలో 'యక్షగానం'లో ఒక్కొక్కరు ఒక్కో పాత్రను అభినయించే సాంప్రదాయ పరమైన మార్పు జరిగింది. 'తంజావూరు' యక్షగానాలలోను, యాదవదాసు గరుడాచల యక్షగానాలతో పాత్రలు ప్రవేశించడం, ప్రవేశించిన ప్రతిపాత్ర తమకు తామే పరిచయం చేసుకునే పద్ధతి ఉండేది. దానికి ఉదాహరణగా "వెడలె సత్యభామ" అంటూ సత్యభామ ప్రవేశించేది. అన్ని పాత్రలు అలా ప్రవేశించేవి. ఈ పరిణామాన్ని 'యక్షగాన నాటకాల'ని పిలిచారు.

మూల యక్షగానమైన సంగీత రూపము బుర్రకథ, హరికథ, కూచిపూడి నాట్యాల ప్రదర్శకులు "ఎవరికివారు మాదే యక్షగానం" అంటున్నారు. యక్షగానములను వినిపించేది యక్షకులైన జక్కుల వారైతే, బుర్రకథ విన్పించేది జంగాలు. యక్షగానం స్త్రీలు వినిపిస్తే, బుర్రకథను పురుషులు, స్త్రీలు కూడా వినిపిస్తారు. యక్షగానంలో సూత్రధారుడు, విదూషకుడు ఉన్నట్లే బుర్రకథలో వంతదారులు ప్రవేశించారు. యక్షగానంలో హాస్యం విదూషకుడు చెప్పగా బుర్రకథలో వంత చెపుతాడు.

**<u>బుర్రకథ నామోత్పత్తి</u>**

"తంబురతో చెప్పెడి కథ కావున తంబుర కథ"యని కొందరి అభిప్రాయం. "తంబుర పేరులోని 'తం' అను మొదటి అక్షరం లోపించి రేఫకు జడ్డ వచ్చి బుర్రకథ" అయినది అని కొందరి తలంపు.

"తంత్రి బుర్ర తంబుర' అని 'శబ్దరత్నాకరములోను సూర్యరాయాంధ్ర నిఘంటువులోనూ ఉంది. గుమ్మెటలకు 'బుర్ర' యను పేరు కలదు. కానీ, ఈ అభిప్రాయం ఎక్కువ ప్రచారంలో లేదు కావున ఇది అర్థ విపరిణామంలో వచ్చిన మార్పు కావచ్చును. 'తంబుఱ కథ, తంబుఱా కథ' అను పేర్లు జానపద గాథ కారులలో నేటికినీ విరివిగా వ్యాప్తి యందున్నవి. అసలు తంబుర శబ్దములోనే 'బుర్ర' అనే శబ్దము ఇమిడి ఉన్నది. ఆంధ్ర దేశమున ఒక్క గుంటూరు మండలమున మాత్రమే వాడుక కలదని తెలుస్తుంది. బుర్రలను వాయిస్తూ చెప్పే కథ కావున 'బుర్రకథ' యనే పేరు సమంజసముగా ఉందంటారు కొందరు. ఎపుడెపుడు ఎలాంటి మార్పు జరిగిందో తగిన ఆధారాలు లేవు. బుర్రకథను చెప్పేప్పుడు 'తంబుర, గుమ్మెట'లను ఉపయోగిస్తారు. కావున ఏది ఎలా ఉన్నా బుర్రల మూలంగానే ఈ 'బుర్రకథ' అని పేరు వచ్చిందనేది సమంజసంగా తోస్తుంది.

**బుర్రకథలు - వర్గీకరణ**

బుర్రకథలలో ఇతివృత్తాన్ని బట్టి పలు రకాలుగా విభజించడం జరిగింది.

1. ప్రబోధాత్మకాలు
2. చారిత్రకాలు
3. పౌరాణికాలు
4. పతివ్రతల కథలు
5. మత సంబంధిత కథలు

ఇందులో కొన్నింటికి అంతర్భాగాలు కలవు.

**1 ప్రబోధాత్మకాలు:-** ప్రబోధాత్మకాలు అనగా (అ)జ్ఞానం, నీతి, మానవత, ఐక్యత, సృజనాత్మకత, చైతన్యం వంటి సామాజిక స్థితిగతులను గూర్చి విపులంగా బోధించేవి. సాహితీ ప్రక్రియలోనే వీనికి అత్యంత ప్రాధాన్యత కలదు. వీటిని మళ్లీ ఈ రీతిగా విభజించవచ్చు.

i) **సాంఘికాలు:-** సాంఘికాలు అంటే సమాజాన్ని అద్దం పట్టి చూపే ప్రక్రియ. ఉదా: నాజర్‌గారి రచన 'బెంగాల్ కరవు', నేటి రాయల సీమ'. వీటిలో 'బెంగాల్

కరువు' అలభ్యం. 'సుంకర సత్యనారాయణగారి - కష్టజీవి', 'వారణాసి సత్యనారాయణశాస్త్రి గారి - కట్నం లేని కమలమ్మ పెండ్లి', 'రెడ్డి చిన వెంకటరెడ్డి - లంచగొండులు' మొదలగునవి ప్రముఖాలు.

(ii) **<u>రాజకీయాలు:</u>**- సమాజంలోని రాజకీయ పరిస్థితిని వివరించే ప్రక్రియ. ఉదా: నాజర్‌గారి 'అల్లూరి శ్రీరామరాజు యుద్ధం'. ఇది ఆనాటి రాజకీయ పరిస్థితులను అద్దం పట్టి చూపిస్తుంది. నేదునూరి గంగాధరంగారి - 'చైనా దురాక్రమణ', ద్వారంపూడి ప్రతాపరెడ్డిగారి - 'బాపూజీ' మొదలగునవి.

(iii) **<u>ప్రచారకాలు:</u>**- లోకంలోని స్థితిగతులను గూర్చి తెలిపే ప్రక్రియ. ఉదా: 'శాంతిశ్రీ గారి 'ఇందిరా గాంధీ ఇరవై సూత్రాలు', నదీరా గారి 'హరిజన ప్రగతి' మున్నగునవి.

**<u>2. చారిత్రకాలు:</u>**- జరిగిన చరిత్రను గూర్చి విశదపరచే ప్రక్రియ. ఉదా: నాజరుగారి 'బొబ్బిలి యుద్ధం', 'పల్నాటి యుద్ధం', 'అల్లూరి శ్రీరామరాజు యుద్ధం', సుంకర సత్యనారాయణగారి 'అల్లూరి సీతారామరాజు', దంటు కృష్ణమూర్తిగారి ఝాన్సీ లక్ష్మీబాయి మొదలగునవి.

**<u>3. పౌరాణికాలు:</u>**- పురాణాలను గూర్చి తెలిపే ప్రక్రియ. ఉదా: నాజర్‌గారి 'అభిమన్యు యుద్ధం', నదీరా గారి - రామాయణం ఏడుకథలు, దుగ్గిరాల గౌరీ మనోహరరావు గారి - ఉత్తర గోగ్రహణం, దంటు కృష్ణమూర్తిగారి - కురుక్షేత్రం, శాంతిశ్రీగారి - భగవద్గీత, కేశవ తీర్థస్వామి - ప్రహ్లాద విజయం, శ్రీ కృష్ణ విజయం, వాడ్రేవు శేషగిరిరావు - 'సత్యహరిశ్చంద్ర' మొదలగునవి ప్రముఖములు.

**<u>4. పతివ్రతల కథలు:</u>**- పతివ్రతలను గూర్చి తెలుపు ప్రక్రియ ఉదా:- మూర్తిశ్రీ గారి 'బాల నాగమ్మ'

**<u>5. మత సంబంధి కథలు:</u>**- మతమును గూర్చి బోధించే ప్రక్రియ. ఉదా:- <u>హిందూమతం</u>:- కేశవ తీర్థస్వామి మట్టుపల్లి మహాత్మ్యము, నాగశ్రీ -

శ్రీనివాస కళ్యాణము, కోట్ల లింగమూర్తి - శ్రీ శివలీల మొదలైనవి.

**క్రైస్తవ మతం**:- 'జొన్నకూటి ప్రకాశం - పది ఆజ్ఞలు' మున్నగునవి.

**బుర్రకథ ప్రవర్తనా లక్షణాలు**

బుర్రకథ జానపద ప్రజా ప్రదర్శనా కళారూపం. ఇందు సంగీతం, సాహిత్యం, నృత్యములు ముప్పిరిగొని ఉంటాయి. కథను ముగ్గురు ప్రదర్శిస్తారు. కథకుడు (మధ్యలో) ప్రధాన వ్యక్తి. అతనికిరువైపులా ఇద్దరు వంత లుంటారు. ఒకరు హాస్యం, మరొకరు రాజకీయం. కథకుడు షరాయి, నిలువు అంగీ, తలపాగ ధరించి, కాళ్ళకు గజ్జెలు కట్టి, కుడి భుజంపై తంబుర ఉంచి మీటుతూ శృతి చేస్తూ, ఎడమ చేతి వ్రేళ్ళకున్న అందెలను మ్రోగిస్తూ ఆవేశ పూరితుడై, రసానుగుణంగా గానం చేస్తూ భావగర్భితంగా అభినయిస్తూ, సందర్భోచితంగా నృత్యం చేస్తుంటే, వంతలు గుమ్మెటలు ధరించి కథా కథనంలో తాళగతిని అందిస్తూ సహకరిస్తారు.

ధేనువకొండ వెంకయ్యగారిచే రచితమైన 'విరాట పర్వం' అను జంగం కథలో -

"నీటుగ విభూతి రేఖలు దీర్చియు నిల్వు లుంగీల్దొడిగి
పేటురు మొలాల్ పేట పాగాల్విల్లె వాటు వొనరదాల్చి,
జోడు గుమ్మెటలు దట్టుచు వంతలు బాడుచు మరియొకడు
పోడిమిగా చేబూని సితారా భుజమున ధరించి
గజ్జెలు మువ్వలు అందెలు పదముల నొల్లని మ్రోయగనూ
తఝుణుత తకయని నాట్యము సల్పుచు తంబుర మీటుచునూ
సంగతిగా సభ వారి కెల్ల ప్రసంగ పూర్వకముగా
చెంగున దుముకుచు జంగంబులకును జీవనధనమనగా"

పై పద్యంలోని లక్షణాలే దాదాపు బుర్రకథ కున్నవని అనుటలో సందేహము లేదు. 'బుడిగె అనగా గుమ్మెట' అని అర్థము కలదు.

## బుర్రకథ వికాసం

క్రీ.శ.1929 ప్రాంతంలో 'దొడ్డవరపు వెంకటస్వామిగారు, ధేనువుకొండ వెంకయ్యగారు రచించిన 'ఉత్తర గోగ్రహణం' అను జంగం కథను పాడుతుండేవారట. బుర్రకథ అవతరణకు ఈ జంగం కథ దోహద మొనరించిందంటారు.

1942 ఆగష్టులో విప్లవ స్వాతంత్ర్య సమరంలో దేశ ప్రజలను ఉత్తేజితులను చేయడానికి, జాతీయ ప్రబోధం జానపదులకు సైతం తెలియజేయడానికి 'బొబ్బిలి వరుస కథ'లోని కీర్తనలు, దరువులు, పద్యాలు తీసుకుని, జంగం కథగా ఏర్పడగా, రాజకీయం కలుపుకుని బుర్రకథగా అవతరించింది. 'ఈ ప్రక్రియకు ఇంతటి ప్రచారం తెచ్చిన ఘనత కమ్యూనిస్టులదే"నని చెప్పుటలో అతిశయోక్తి లేదు'. అంతేకాక "శిథిలమౌతున్న జాతీయ కళను ఉద్ధరించి అభివృద్ధి చేసింది కూడా సామ్యవాదులైన ప్రజా నాట్యమండలి కళాకారులేనని నిస్సంకోచం"గా చెప్పవచ్చు.

1942 ప్రాంతంలో గుంటూరు మండలం నుంచి బాపట్ల ప్రాంతం వరకు 'కాకుమాను సుబ్బారావు' గారు జంగం కథలను అనుసరిస్తూ 'బాబూరావు' అను బుర్రకథ మొట్టమొదటిసారి తెలుగులో రచించారు.

రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో మాతృదేశ సంరక్షణకై పోరాడిన రష్యన్ వీర వనిత 'టాన్యా' బుర్రకథ 1943లో 'కాకుమాను సుబ్బారావు'గారు రచించి తాను కథకుడుగా చింతలపాటి సూర్యనారాయణ, కంఠమనేని వెంకట సుబ్బయ్య వంతలుగా మొట్టమొదటి దళంగా ఏర్పడి ప్రదర్శించారు.

కృష్ణాజిల్లా దివితాలూకాలో కీ.శే. పెండ్యాల వెంకటేశ్వరరావు, పరుచూరి రామకోటయ్యగారలు దేశభక్తిని తెలుపుతూ యువజన సభలో వైజ్ఞానిక కార్యక్రమంగా 'బుర్రకథ'ను చెప్పారు. కార్యక్రమాన్ని చూసి ఉత్తేజితులై కోసూరి పున్నయ్య హాస్య

వంతగా, సిరివిశెట్టి సుబ్బారావు కథకుడు, గోవర్ధన రాజు రాజకీయ వంతగా ఏర్పడి గ్రామీణ సామెతలతో కథలు చెప్తూ యువజనులను చైతన్యవంతులను చేశారు. రెంటాల గుడ్డి జంగం గారు 'బుర్రకథ' గాన ప్రవర్తకుడిగా ప్రసిద్ధి చెందారు. కాకుమాను సుబ్బారావుగారు రచించిన 'టాన్యా' బుర్రకథను రసవత్తరంగా, కళాత్మకంగా అత్యద్భుతమైన కళా ప్రక్రియగా తీర్చిదిద్ది బుర్రకథకే ఎనలేని కీర్తిని తెచ్చినవారు శ్రీ షేక్ నాజర్‌గారు.

1943లోనే సామ్యవాద సిద్ధాంతాలకనుగుణంగా సుంకర సత్యనారాయణగారు రచించిన కష్టజీవి బుర్రకథను స్వతంత్రించి అభ్యుదయ భావాలుగల 'నాజర్'గారు ప్రజానురంజకంగా చెప్పి ప్రజా కళాకారుడిగా గుర్తింపు పొందారు. 1943లోనే ఫాసిస్టు వ్యతిరేక ఉద్యమ కళాకారులైన కోగంటి గోపాలకృష్ణయ్య, కోసూరి పున్నయ్య మొదలగువారు బొంబాయిలో జరిగిన కమ్యూనిస్టు సభలో జానపద కళలను ప్రదర్శించి బహుమతి పొందారు. తదనంతరం నాలుగు బుర్రకథ దళాలను, జానపద కళలను ప్రదర్శించు జానపద కళాకారులను వారు తయారు చేశారు.

1944లో "కొత్తపల్లి రంగారావుగారు కూడా టాన్యా"ను రచించి ప్రకటించడాన్ని బట్టి చూస్తే ఆ కథకు గల ప్రాధాన్యం వేరే చెప్పనవసరం లేదు. 1944లో 'బెంగాల్ కరవు' బుర్రకథను రచించి నటించిన ఘనత ప్రజా కళాకారుడైన 'శ్రీ నాజర్'దే. తదనంతరం బెంగాల్ కరువునే రాయలసీమ కరువుగా రచించారు.

పల్నాటి యుద్ధం (1950), బొబ్బిలి యుద్ధం (1951), రాయలసీమ కరవు (1952), అభిమన్యు యుద్ధం (1952), అల్లూరి శ్రీరామరాజు యుద్ధం (1953)లను రచించి కథకుడుగా, కథా రచయితగా బుర్రకథా ప్రక్రియకే నాజరుగారు తలమానికమైనారు.

1947లో 'వారణాసి సత్యనారాయణ శాస్త్రి'గారు 'నేతాజీ' బుర్రకథను,

1948లో 'జంపన చంద్రశేఖరరావు'గారు 'నేతాజీ జీవిత చరిత్రను బద్దిరెడ్డి కోటేశ్వరరావు'గారు 'నైజాం రజాకార్ల దురంతాలు', 'తిరునగరి రామాంజనేయులు'గారు 'తెలంగాణా వీరులు' అను బుర్రకథను మొదలగునవి జాతీయోద్యమ స్ఫురణతో రచించారు. రాజమండ్రి వారైన కొండపల్లి వీర వెంకయ్య అండ్ సన్స్, కాళహస్తి వారైన తమ్మారావు సంస్థవారు బుర్రకథలు వ్రాయించి, ప్రచురించి బుర్రకథా సాహిత్యాన్ని బ్రతికించారు.

**ప్రముఖ బుర్రకథా రచయితలు**

కాకుమాను సుబ్బారావు, సుంకర సత్యనారాయణ, షేక్ నాజర్, నదీరా, వారణాసి సత్యనారాయణ శాస్త్రి, బద్దిరెడ్డి కోటేశ్వరరావు, ద్వారం ప్రతాపరెడ్డి, ఎస్.ఎం.హౌతా, వి. సత్యనారాయణ, దంటు కృష్ణమూర్తి, మూర్తిశ్రీ, ఓలేటి శివరామకృష్ణ శాస్త్రి, నేదునూరి లక్ష్మీకాంత మోహన్, తిరునగరి రామాంజనేయులు ప్రభృతులు ప్రముఖ బుర్రకథా రచయితలు.

**ప్రఖ్యాత దళాలు**

కాకుమాను, నాజర్, నదీరా, మిక్కిలినేని లక్ష్మీకాంత మోహన్, విరల్ బ్రదర్స్, జూనియర్ నాజర్, బెనర్జీ, కుమ్మరి మాష్టారు, నిడదవోలు అచ్యుతరామయ్య అంతేకాక కృష్ణాజిల్లా ప్రజా నాట్యమండలి వారైన కొండేపూడి రాధ, తాపీ రాజమ్మ, వీరమాచనేని సరోజిని, మోటూరి ఉదయం మున్నగు స్త్రీలు కూడా బుర్రకథ దళాలుగా ఏర్పడి కథలు చెప్పారు.

**ముగింపు**

పేదవాడుగా పుట్టి పద్మశ్రీ దాకా ఎదిగిన శ్రీ షేక్ నాజర్ ఉత్తమ ప్రజా ప్రదర్శన కళాకారుడని మనకు స్పష్టమైంది. ప్రజా ప్రదర్శన కళారూపాల్లో ఆధునిక యుగంలో సామాజికంగా, రాజకీయంగా ప్రజల్లో ఎంతో చైతన్యం తెచ్చి మంచిని పెంచి, మానవతను నిరూపించిన కళాకారుడు నాజరన్న విషయం తెలుస్తుంది.

పైగా బడుగు వర్గాల చైతన్యానికి, వికాసానికి ప్రయత్నించి ఫలితాలు సాధించిన బుర్రకథా ప్రవర్తకుడు శ్రీ నాజర్.

తెలుగునాట బుర్రకథ అంటే నాజర్. నాజర్ అంటే బుర్రకథ అనే ధృడాభిప్రాయాన్ని, నేల నాలుగు చెరగుల విస్తరింపజేసిన ఘనుడు శ్రీ నాజర్. ఈనాడు మన మధ్యన ఉంటూ, ఎన్నో సన్మానాలను, సత్కారాలను పొందుతూ బుర్రకథ ప్రాముఖ్యాన్ని ప్రకటించిన శ్రీ నాజర్ తెలుగు జాతికే గర్వకారణం.

ఈ బుర్రకథ ఇంకా ఎంతో విశిష్టతను సాధించాలని ఆకాక్షించే శ్రీ నాజర్ కీర్తి ప్రతిష్ఠలు ఇబ్బడి ముబ్బడిగా కొనసాగాలని ఆకాంక్షిద్దాం.




పద్మశ్రీ బిరుదు ప్రదానం
సందర్భంగా
నాజర్‌ను సత్కరిస్తున్న
మాజీ రాష్ట్రపతి
శ్రీ ఆర్. వెంకట్రామన్

# వరుసలు

బుర్రకథల రచనాంగాలు ప్రధానంగా రగడలు, దరువులు, ద్విపదలు, కీర్తనలుగా చెప్పుకోవచ్చు. ఇవేకాక వృత్తాలు, తేటగీతి, ఆట వెలది, సీస, కంద పద్యాలు కూడా రచింపబడ్డాయి.

బుర్రకథలు వీర గాథలకు, రాజకీయాను కరణలు, సాంప్రదాయిక వీరగాథలలో వలె దానిలో ఆద్యంతమూ ఒకే ఛందస్సుండదు. జంగం కథల వలె ఇవి సమాహారమై ఉంటాయి. 'జంగం కథల నుండి రగడలు, వచనములు బుర్రకథల్లో గ్రహింపబడినాయి. సాంప్రదాయక వీరగాథల నుండి బొబ్బిలి వరుస, హరి హరీ పదముల వరుస, తందాన వరుస, సై సై వరుస, సర్వాయి పాపని వరుస, శారద పదముల వరుస మున్నగునవి స్వీకరింపబడినవి". ఎక్కువగా మూడు వరుసలు వాడుతారు అవి -

1. జంగం వరున 2. తందాన వరుస 3. సై సై వరుస

ఇవికాక 'ఏల వరుస' జంపె వరుస, భళి భళీ వరుసలు' కూడా ఉపయోగిస్తున్నారు.

**జంగం రగడ**

ఒక్కొక్క పాదమున 8+8+9 లేదా 10 మాత్రలుండును. ఇందు యతి ప్రాసలు కాకతాళీయములేగాని నిబద్ధములు కావు. ఈ వరుసలో 1-3 గణముల ఆద్యక్షరములకు (1-17) (మాత్రలకు) యతిని పాటించుచు రెండేసి పాదములకు ప్రాసము, అంత్య ప్రాసములు ఏర్పడుటచే జంగం రగడ ఏర్పడి ఉండును.

**తందాన వరుసలు**

8+8+9 లేదా 10 మాత్రలొక పాదముగా సాగెడి బొబ్బిలి వరుసను రెండు

విధములుగా విరుచుట వలన రెండు రకముల వరుసలు పుట్టాయి. ఒకటి, ం౦ు గణములను చేర్చుటచే 8+8 మాత్రలొక పాదముగా సాగెడి వరుస, ఒకటి, రెండు, మూడు గణములను చేర్చుటచే 8+9 (10) మాత్రలొక పాదముగా సాగెడి వరుస మరొకటి. యతి ప్రాసలు చేర్చి బుర్రకథల్లో తందాన వరుసగా ప్రయోగిస్తున్నారు.

**సై సై వరుసలు**

ఈ వరుసలో ఒక్కొక్క పాదమున 12 మొదలు 15 మాత్రల వరకు ఉండునట్లు కొన్ని పాదములు చెప్పి, చివర 14 మొదలు 16 మాత్రలు గల పాదముతో ముక్తాయింపు చేయబడును. ఈ వరుసలో పూర్వ పాదములిట్లు విరుగును.

8+4 =12, 8+5=13, 9+5=14, 10+5=15

ముక్తాయింపు పాదములు 8+6=14, 9+6=15, 10+6=16గా విరుగును. సాధారణముగా 8 మాత్రల గణము 4+4 గాను లేదా 3+3+2 గాను, 9 మాత్రల గణము 3+3+3 గాను, 10 మాత్రల గణము 5+5 గాను విరుగుట పరిపాటి. ఈ సై సై వరుసలకే రెండు రెండు పాదములకు యతియు, అంత్య ప్రాసయు బిగించి ఆధునికులు బుర్రకథల్లో ప్రయోగించుచున్నారు.

**సర్వాయి పాపని వరుస**

ఈ వరుస ఏల వరుసలాగా ఉంటుంది. 7+7=14 మాత్రలలో రెండు పాదములను చెప్పబడును. మూడవ పాదము చివర సంబోధన ఒకటి ఉండును.

**హరి హరీ పదముల వరుస**

ఈ వరుసలనే భళి భళీ వరుసలు అని కూడా అంటారు. అట తాళమున అంత్య ప్రాసతో సాగెడు దరువు. ఇందు ఒక్కొక్క పాదమున సాధారణముగా 16

మాత్రలు ఉండును. అది 3+5+5+3గా విరుగుచుండును. ఇందు యతి ప్రాసలు కాకతాళీయములే గాని నియమితాలు కావు. అంత్య ప్రాస మాత్రం ఉండును. ఈ వరుసలకై యతి ప్రాసలు బిగించి బుర్రకథల్లో భళి భళీ వరుసలుగా వాడుచున్నారు. 5+5+3 మాత్రలలో కొన్ని పాదములు వ్రాసి ముక్తాయింపులో 5+5 | 5+5 | 5+5+3 మాత్రల పాదమొకటి వ్రాయబడును. ఈ ముక్తాయింపు వరుసలోనే పునరావృత్తి ఉండును. ఈ వరుసను సాధారణముగా బుర్రకథల్లో చిట్ట చివర ప్రబోధమునకు ఉపయోగింతురు.

1. **<u>బొబ్బిలి కథ వరుస</u>**

నాజరుగారి "పల్నాటి యుద్ధం"లో
"కమ్మ కమ్మనీ కలలు గంటదా - యమ్మ సుభద్రమ్మ
కన్న కలలు నిజమాయె సుభద్రకు - ఎన్నో దినములకు"

| పుట - 6 |

2. **<u>తందాన వరుస</u>**

నాజరుగారి "అల్లూరి శ్రీరామరాజు యుద్ధం" నుండి
"కొండ బండయే పట్టె మంచముగ ॥తందా॥
పండుటాకులే పట్టు పరుపులుగా" ॥తందా॥

| పుట - 12 |

3. **<u>సై సై వరుస</u>**

నాజరుగారి "పల్నాటి యుద్ధం" నుండి
"అన్నదమ్ముల పోరుతో ॥సై॥
పతనమైన పల్లనాడురా ॥సై॥

| పుట - 30 |

4. <u>సర్వాయి పాపని వరుస</u>

నాజరుగారి "పల్నాటి యుద్ధం"లో
"వందలాది ప్రజ కూలిరా ॥సై॥
వీరులంతా నేల కొరిగిరా ॥సై॥

। పుట - 29 ।

5. <u>హరి హరి పదముల వరుస</u>

నాజరుగారి "అల్లూరి శ్రీరామరాజు యుద్ధం"లో
" ఆ ప్రక్కా ధార్ కొండా
ఈ దిక్కా గామ్ కొండా
చిక్కారు నాయాళ్ళు
జాతోళ్ళు జీతగాళ్ళు" । పుట - 29 ।

6. <u>శారద పదముల వరుస</u>

నాజరుగారి "నేటి రాయలసీమ" నుండి
"వాడ వాడకే తిరిగి నాడయ్యా ॥రామరామ॥
గడప గడప గాలించి నాడయ్యా ॥రామరామ॥
తిండి లేక ఎండిపోయె - పండువంటి రైతూ ॥రామరామ॥

। పుట - 13 ।

రగడ, రేకు, తాళము, చంద్రికల లక్షణాలను గూర్చి ఆచార్య యస్.వి. జోగారావుగారు తన సిద్ధాంత గ్రంథములో వివరించారు.

1. హయ ప్రచారము : 4 సూర్య గణములు
2. తురగ వల్గనము : 8 సూర్య గణములు
3. విజయ మంగళము : 16 సూర్య గణములు
4. ద్వి రద గతి రగడ : నగ, నలల, భల, సల, త, ర
గణాలలో ఏవైనా నాలుగుంటాయి.

5. జయ భద్ర : ద్విరద గతికి రెట్టింపు

6. మధురగతి : గగ, భ, స, నల గణములలో ఏవైనా నాలుగు ఉంటాయి

7. హరిగతి : మధురగతికి రెట్టింపు

8. హరిణగతి : గగ, భ, స, నల గణములలో

ఏవైనా రెండు, సూర్యగణ పూర్వకముగా ఉండును

9. వృషభ గతి : హరిణగతికి రెట్టింపు

ఒకటి, రెండు, మూడు రగడలు ఒక తరగతికి; ఆరు, ఏడు ఒక తరగతికి; ఎనిమిది, తొమ్మిది ఒక తరగతికి చెందుతాయి.

చిత్రకవి పెద్దనాదులు యక్షగాన రేకులందు నాలుగు విధములైన రగడ గతులనే చెప్పియున్నను, నవ విధములు అందు గతార్థములవుతున్నాయి.

I. <u>**త్రిపుట రేకు**</u>:- వృషభగతి రెండు పాదములు ఏడు లఘువులు. వృషభగతి పాదముననే ఏడేసి లఘువుల దళములు నాలుగుండును. రెండు పాదములందు ఎనిమిది తకిట కిట తకిట తకిట కిట తక".

II. <u>**జంపెరేకు**</u>:- ద్విరద గతి రెండు పాదములు ఒక లఘువు. ఇందు పంచ మాత్ర గణములు ఎనిమిది ఉండును.

III. <u>**రచ్చరేకు**</u>:- తురగ వల్గన గతి, అయితే ఇది కూడా 'వృషభ గతి'లా ఒక్కో పర్యాయము నడచును.

IV. <u>**ఏకతాళి**</u>:- మధురగతి. ఇందు ఒక్కొక్క దళము చతుర్మాత్రకం. "తరికిట-తరికిట" అను ఒడుపు కలది.

V. **అట తాళము**:- పాదమునకు 24 మాత్రలు. ముఖ్యములైన రగడగతి ప్రభేదములెల్లను త్రిపుటాదుల యెడ గతార్థములవుతున్నాయి. అందుచే అట తాళమునకు మాత్రా సంఖ్య మాత్రము సూచింపబడినది.

"అర్ధరేకులు లేక అర్ధచంద్రికలు" "చిత్రకవి పెద్దన" "అప్పకవి" త్రిపుట, జంపె మొదలగు రేకులందు సగము పరిమితి గలవే 'అర్ధచంద్రికల'ని సూచించారు. "చంద్రిక యనగా రేకు". ప్రాయకముగా రేకులు ఎన్ని గతులనుండునో, అర్ధచంద్రికలు కూడా అన్ని గతుల యుండును.



నాజర్ గారు శిక్షణ ఇచ్చిన బుర్రకథ కళాకారులు




శ్రీ షేక్ నాజరు - శ్రీ జాషువాలతో నున్న పోస్టల్ కవర్

# దరువులు

'దరువు ధృవా శబ్ద భవమని' పండితాభిప్రాయము. సంస్కృత నాటకములందు ధృవాగాన ప్రసక్తి లేదు. ధృవాగానము ప్రదేశ, క్షేప, నిష్క్రమ, ప్రాప అధికాంతరములని పంచ విధములుగా చెప్పబడ్డాయి. 14వ శతాబ్ది నుండియే 'ధృవాగాన' ప్రశంస మన వాఙ్మయమున వినబడుచున్నది. "తాళ్ళపాక" వారి సంకీర్తన లక్షణమున "దరువు" పేర్కొనబడినది. జంపె, త్రిపుటాదులు యక్షగాన నాటకములందు దరువులనియే పేర్కొనబడినవి. దరువులు యక్షగానములందనేక ప్రయోజనములకు యుక్తమైనవి. ఇవి ఒక్కొక్క చోట కంద పద్యములతో కూడి యుండును. వాటిని కందార్థములందురు.

I. **త్రిపుట రేకు**:- నాజరుగారి 'బొబ్బిలి యుద్ధం' నుండి

"అట్టి మాటకు ధర్మరాయుం దగ్గి పిడుగై భగ్గుమని తా
పట్టి మీసం పట్టి దువ్వాడ దిగ్గు నా కుర్చీని దూకాడా"

॥వహ్వారె - వహ్వా॥ ।పుట - 26 ।

II. **జంపెరేకు**:- నాజరుగారి 'నేటి రాయలసీమ'లో

"ఓ తెలుగు బిడ్డా లేలేరా - భళిభళి
ఈ తెలుగు గడ్డ నీదేరా - భళిభళి
గుమ్మాన యుద్ధ ప్రమాదం - భళిభళి
దేశాన కరవు దుమారం - భళిభళి"

III. **ఏకతాళి**:- నాజరుగారి 'పల్నాటి యుద్ధం'లో

"చాకలి మంగలి మాలా మాదిగ
సర్వజనులెల్ల - వహ్వా" ।పుట - 6 ।

IV. **అట తాళము**:- నాజరుగారి 'బొబ్బిలి యుద్ధం'లో

"ఆశ జూపి బుస్సీని బుట్టలో - వేశారన్నాడ

అమ్ముడు పోయెను పరాసువారు - సొమ్ముల కన్నాడ
సమ్మతమగు రాజీని చేసుకుని - రమ్మని అన్నాడ" ।పుట - 24।
"చచ్చి ఎవరిని సాధిస్తావనే సేవక పెద్దన్న
బ్రతికి నేను సాధించిన ఘనతేమున్నది పెద్దన్నా" ।పుట - 36।

V. **అర్ధచంద్రిక**:- నాజరుగారి 'బొబ్బిలి యుద్ధం'లో

"బాతుగుడ్లు బడి - కోడిగుడ్లున్
నేతిలడ్లు - బంగారపు వడ్లున్
ఘుమఘుమలాడే - కస్తూరి పునుగున్
ఘనముగ బ్రాంది - విస్కీ భంగున్
నల్లమందు గంజాయి - గోనెలున్
పుల్లకల్లు సారాయి - బానలున్" ।పుట - 21।

VI. **దరువు**:- నాజరుగారి 'బొబ్బిలి యుద్ధం'లో తాండ్రపాపారాయుడు తన మిత్రులతో కలసి యుద్ధానికి బయలుదేరునపుడు

"శాంభవి రావె - గంభీర భైరవీ
శంభురాణి నాకభయమీయవే
కుంభిణి నిప్పుడే కూలద్రోసెదన్ ॥శాం॥
చెంతనుండాన్ - శాత్రవ పుర్రెలతో బంతులాడెదా
వైరి ప్రేగులన్ - జందెమేసెదన్
వారి నెత్తుటన్ - వసంతమాడెదన్" ॥శాం॥ ।పుట - 37।

విజయరాజంపిన సేన పంటను నాశనం చేయగా రైతు కూలీలు రంగారావుతో మొరపెట్టుకున్నారు. అది విన్న రంగారావు కలత చెంది వారితో

"తిరిపెమెత్తనేల - మీకీ
దీనత నేడేల - తిరిసె

గోనెలాదిగా - కోటలో ధాన్యము
కొలిపించెదనే - పాలక జనులకు
పంటలు బోయిన - బంగరు భూమికి
పన్నులు మిమ్మీ - ఏటి కడుగము" అన్నాడు

**కందార్థం**:- నాజరుగారి 'బొబ్బిలి యుద్ధం'లో

"అన్నా వినుడీ మహరా
జన్నెము పున్నెంబు నెరుగ - నా మన్నెములో
ఎన్నో కుట్రలు కలతలు

ఎన్నియొ నా మన్నె ప్రజల బాధించినాడా
మన్నె సున్తాన్బిరుదు గన్నాడ
కన్నుమిన్నుగాన కతడీ - కమ్మనిట్టుల వ్రాసినాడ
బిరుదు గన్నాడ" ।పుట - 16 ।

**శ్రీ నాజర్ బుర్రకథల్లో రసాలు**

"బొబ్బిలి యుద్ధం, పల్నాటి యుద్ధం, అభిమన్యు యుద్ధం, అల్లూరి శ్రీరామరాజు యుద్ధం"ల యందు ప్రధానంగా వీర రసాన్ని రచించారు.

'నేటి రాయలసీమ'లో కరుణరసాన్ని ప్రధానంగా రచించారు.

**భాషా వైవిధ్యం**

ఈ ప్రక్రియ మార్గ వాఙ్మయానికి చెందిందా? లేక దేశీ వాఙ్మయానికి చెందిందా? అనే ప్రశ్న ఉదయిస్తుంది. "మార్గ కవిత్వం పండితోపజ్ఞమైంది. దేశి కవిత్వం పామరోపజ్ఞమైంది". మరి బుర్రకథలోని భాషను పరిశీలిస్తే పండితులచే రచింపబడి నాగరికులైన వారికే అది గ్రహించడానికి వీలుగా ఉన్నట్లు తోస్తుంది. ఇందలి భాష, భావాలు కవులు పనిగట్టుకుని వ్రాసినట్టుగా ఉన్నాయి.

నాజరుగారు 'బొబ్బిలి యుద్ధం'లో సంస్కృత శ్లోకాలు కూడా ప్రయోగించారు. ప్రధాన మంత్రి బుర్రా బచ్చన్నతో మహారాజు విజయరామరాజు అంటున్న సందర్భంలో

శ్లో ॥ " అసంతుష్టా ద్విజానష్టా
సంతుష్టి ఇవ పార్థివ:
సంతుష్టా గణికా నష్టా
అసంతుష్టి ఇవ కులాంగనా" ఉపయోగించారు.

నాజరుగారి 'బొబ్బిలి యుద్ధం'లోని సరళమైన భాష చూడండి. పాపారాయునితో దాసి లక్ష్మి అయ్యా! పాపారాయా!!

" ఎక్కడి బావ ఎక్కడి లోకం బాబూ అన్నదా
దీపం పెట్టే దిక్కు లేదు మన దేవిడి కన్నదా
రావు వంశ భవితవ్యము నీపై నుంచినారు బాబూ
అశలు మాసిన అల్లుని నీకడ - కంపినారు బాబూ"

ఈ ఉదాహరణను బట్టి చూస్తే ఇంత కన్నా సులభ రచన ఉండదేమోననిపిస్తుంది. దీనిని బట్టి 'బుర్రకథా రచన దేశి, మార్గ సామరస్యాన్ని సాధించిన ప్రక్రియ'గా మనం భావించవచ్చు. అందువల్ల ఈ ప్రక్రియ పండిత, పామర జనరంజకమైనదని మనం గమనించవచ్చు.

**వంత పాటలు**

1. తందాన తందాని తందనా
2. భళానంటి భాయి తమ్ముడా - సై భాయి భళానోయి దాదానా
3. భళానోయి భాయి తమ్ముడా - సై భాయి భళానోయి దాదానా
4. వినరా ఆంధ్రకుమారా ధీరా విజయము మనదేరా
5. తందాన భాయీ దేవనందనానా - తందాని తాన

6. ఓ భారతీయుడా - ఓ వీర యోధుడా! లేవయ్యా లేచి రావయ్యా

7. దందానా - తుమ్మెదా

8. వినరా ! మానవ ! వీర సోదరా! వీనుల విందుగను

10. తందానా అయ్యో తందానా - ఓ దేవ నందనానా.

ఇంతేకాక కథకుని పాటనే తిరిగి వంతలుగా పాడుతారు.

**గుమ్మెట**

కథకునికి సహాయకుడైన వాడు వంత, వంత వాద్యం గుమ్మెట. వంతలు వాయించే వాద్యాన్ని గుమ్మెట అంటారు. గుమ్మెటను వంత మెడలో వేసుకుని ఎడమ చేతితో గుమ్మెట సోగని మూస్తూ, కుడి చేత్తో మూతి మీద మోగిస్తారు. కథాగమనాన్ని బట్టి (బరువును బట్టి) గుమ్మెటపై దరువు మధురంగా, మహెూధృతంగా వాయిస్తారు. "కొన్ని సందర్భాలలో గుమ్మెట్లే సమ్మెట్లవుతాయి". గుమ్మెట ధ్వనులు మూడు విధాలు. అవి 1) మంద్రము 2) మధ్యమము 3) పంచమము అని పేర్లు.

ఎడమ చేతి దగ్గరున్న సోగను తెరచి, కుడి చేతితో గుమ్మెట మీద కొట్టినచో 'ధిం' అను ధ్వని పుట్టును. దీనినే "మంద్రము" అందురు.

ఎడమ అరచేతితో సోగను మూసి, కుడి చేతితో మూతి మధ్యలో కొట్టినచో "త్త" అను ధ్వని పుట్టును. ఈ ధ్వనిని "మధ్యమము" అంటారు.

ఎడమ చేతితో సోగను మూసి, గుమ్మెట మూతి చుట్టునుగల అంచుపై ఎక్కడ కొట్టినను అనునాసికా సహితమగు 'ద' అను ధ్వని పుట్టును. దీనిని 'పంచమము' అందురు.

ఈ మూడు ధ్వనుల సమ్మేళనంతోడనే బుర్రకథల తాళములన్నీ నడచును.

**క్రమం** బుంబుంత (మూడు దెబ్బలు)

1. బుంబుంత ధింత ! బుంబుంత ధింత!
2. బుంబుంత ! ధింత బుంబుంత! ధింత బుంబుంత!
3. తకతకిట! తకతకిట!
4. తకతక్కిట! దరికిట తక్కిట!
5. త! ఝుణం తకత! ఝుణం తకట!
6. త! ఝుణం తక తక తఝుణం తక్కిట త!
7. దరికిట తక్కిట! ధిత్తరికిట తక్కిట! తక దరికిట తక్కిట!
8. ధి తరికిట తక దిరికిట! ధిత్తరికిట తక దరికిట!
9. తకిట తకిట తక! ఇదే ధిత్తత తదిమి తక!
10. దరికిట దరికిట - తంధోంకి తధోంకి!
11. తక ధింతక! దరికిట ధింతక!
12. తత్రాత్త ధింతక! తత్తత్తత్త ధింతక!
13. తతాత్త తక్కిట దరికిట తత్తత్తత్త తక్కిట దరికిట!
14. ధిం తరికిట తక తక్కిట దరికిట!
15. ధిం తరికిట ధింధిత్తరి కిటధిం!

**తంబుర**

బుర్రకథ ప్రక్రియలో కథకుడు కుడి భుజం మీద పెట్టుకుని కుడిచేత్తో మీటే వాద్యాన్ని 'తంబుర' అంటారు. దీనికి నాలుగు తీగలుండాలి. కానీ సాధారణంగా మూడే ఉంటున్నాయి. ఈ నాలుగు తీగలు కూడా బిగింపులో సమానంగా ఉండవు. అంతేకాక లావులో కూడా వ్యత్యాసం ఉంటుంది. 1) మంద్రస్థాయి తీగ 2) మధ్యమ స్థాయి తీగ 3) షడ్జమ స్థాయి తీగ 4) తారాస్థాయి తీగ అను నాలుగు రకాలు.

1) మంద్రస్థాయి తీగ లావుగా ఇత్తడితోగాని, రాగితో గాని చేయబడుతుంది.

2) మధ్యమస్థాయి తీగ మొదటి దాని కన్నా సన్నగా ఉండి ఉక్కుతో చేయబడుతుంది.

3) షడ్జమస్థాయి తీగ రెండవదాని కన్నా సన్నగా ఉంటుంది. ఈ తీగను ఇప్పుడు తొలగిస్తున్నారు.

4) తారాస్థాయి తీగ. ఇది చాలా సన్నగా ఉండి ఉక్కుతో చేయబడుతుంది.

**సంగీతం**

కథా ఘట్టాలకు అనుకూలంగా కథకుడు రాగ, తాళాలను ఎన్నుకోవాలి. విద్వాంసులు పాడే రాగ, తాళాలకు వీటికి సంబంధం లేదు. ఇవి దేశి రాగాలు.

'శృతి లేని పాట మతి లేని మాట, తాళం లేని గీతి శీలం లేని నాతి వంటిదని' నాజర్‌గారి అభిప్రాయాన్ని 'నదీరా'గారు ఇలా చెప్పారు. 'రసానుగుణంగా రాగాలు ఆలపించడంలో శ్రీనాజర్ సిద్ధహస్తులు'.

**నృత్యం**

దేశి నృత్యం నాలుగు రకాలు. అవి 1) నడక 2) చిందు 3) గంతు 4) కుప్పి గంతు. ఇవి ఉత్తరోత్తర బలీయాలు.

కథకుడు బొమ్మలా నిలబడకూడదు. సన్నివేశాన్ని బట్టి, సందర్భాన్ని బట్టి కదలికలను చూపాలి. సాధారణ విషయాలు చెప్పేటప్పుడు ముందుకు, వెనుకకు నడవాలి. దీనినే 'నడక' అంటారు.

సంతోషమైన, ఉత్సాహవంతమైన విషయాలు పాడుతున్నపుడు వేసే అడుగులను "చిందులు" అంటారు.

యుద్ధ ఘట్టాలను వర్ణించేటపుడు వేసే అడుగులను "గంతులు" మరియు "కుప్పి గంతులు" అంటారు.

**కథకుడు**

కథ చెప్పేవారి ముగ్గురిలో ముఖ్యుడు కథకుడు (మధ్యలో). కుచ్చు తలపాగా

ధరించి, మోకాళ్ళ వరకు పెద్ద గౌను, ఎడమచేతి చిటికెన వ్రేలికి చుట్టిన రుమాలు. దానితోపాటు అందెలు పట్టుకుని, కుడిభుజంపై తంబుర ధరించి, కుడి చేతితో దానిని మీటుతూ, నడుం చుట్టూ కాశీ కోక చుట్టుకుని చూడముచ్చటగా కనిపిస్తాడు. కాళ్ళకున్న గజ్జెలు ఘల్లు ఘల్లు మంటుండగా నాట్యం చేస్తూ, అటూ ఇటూ తిరుగుతూ, సాత్విక, ఆంగిక అభినయాలతో రంగస్థలమంతా తిరుగుతుంటాడు. కథలోని సన్నివేశాలను బట్టి అభినయిస్తాడు. మధ్య మధ్య 'అరెరెరెరె' అంటూ వంతలను, శ్రోతలను ఉత్సాహపరుస్తూ కథ చెపుతుంటాడు. చక్కని స్వరం, సంగీత పరిజ్ఞానం ఉన్న కథకుడైతే ప్రేక్షకులని బాగా ముగ్ధుల్ని చేయగలుగుతాడు. దీనిలో ప్రముఖులు 'శ్రీ నాజర్'.

<u>వంతలు</u>

కథకునికి ఇరువైపులా ఉండే వారిని వంతలు అంటారు. వీరు గుమ్మెటను భుజానికి తగిలించుకుని వాటిపై దరువు వేస్తూ కథను సజావుగా నడిపిస్తారు. కథకుని లయ ప్రకారం వంత గుమ్మెటను వాయిస్తాడు. తిరిగి తాను కూడా పాడతాడు. 'హాస్యం, రాజకీయం' అని ఇరువురు వంతలు ఉంటారు.

విషాద ఘట్టాలలో 'హరిహరీ' - అయ్యో' అంటూ వీరోచిత ఘట్టాల్లో 'శహబాష్-భళిభళి-వహ్వా-భేష్' అని అంటూ వంతలు ప్రేక్షకుల్ని ఆకర్షిస్తారు.

కథకుడు కథను వివరిస్తుంటే వంతదారు ప్రేక్షకులకు వచ్చే అనుమానాలను హాస్య ధోరణిలో కథకుని ప్రశ్నించి ప్రేక్షకులను పరవశింప చేస్తాడు. ప్రేక్షకులకు విసుగు పుట్టకుండా హాస్యంతో కథా కథనానికి లోటు రాకుండా ప్రేక్షకులను కథ వినేట్టు చేస్తాడు. దళం ముగ్గురూ కలసి ఒకరికొకరు సహకరించుకుంటూ నవ్విస్తూ, ఏడ్పిస్తూ, ఉద్రేక పరుస్తూ ఉంటారు. హాస్య వంత ప్రేక్షకులకు విసుగు పుట్టకుండా హాస్యోక్తులతోను, రాజకీయ వంత రాజకీయాలతో ముడిపెట్టి ప్రేక్షకుల్ని ఆశ్చర్య చకితులను చేస్తారు.

## <u>సాహిత్యంలో నాజర్ బుర్రకధకు గల స్థానము</u>

తెలుగు సాహిత్య ప్రక్రియల్లో ప్రబోధాత్మక ప్రక్రియగా బుర్రకథకు విశిష్ట స్థానం ఉంది. ఇతి వృత్తములు తీసుకునే విషయంలో వస్తు వైవిధ్యం కలిగి సాంఘిక, చారిత్రక, పౌరాణిక, మత సంబంధాలతో కూడిన అంశాలు కలిగి ఉంటుంది.

సాంఘిక పరమైన ఇతివృత్తములందు ఆధునిక సమాజంలో ప్రబలి ఉన్న అనేక సమస్యలకు అద్దం పట్టినట్లు కన్పిస్తుంది. పేరొందిన మహనీయుల జీవితాలను వస్తువుగా తీసుకుని, ప్రజలను చైతన్యోద్దీపితులుగా చేస్తుంది. లంచగొండితనం, వరకట్న సమస్య, శ్రామిక వర్గంపై పెత్తందార్లు జరిపే దాడులు ఒకటేమిటి సమాజంలో ఉన్న ప్రతి సమస్యను కూడా తీసుకుని పరిష్కారాన్ని తెలుపుతుంది. ఉదా:'నాజరు'గారు రచించిన 'నేటి రాయలసీమ'

చరిత్రలో అనాదిగా జరుగుతున్న సర్వ మానవ సమాన స్వేచ్ఛకై జరిపే పోరాట యోధుల జీవితాలను చెప్తూ పోరాట పటిమ పెంచేది. ఉదా: 'నాజరు'గారు రచించిన 'అల్లూరి శ్రీరామరాజు యుద్ధం', 'బొబ్బిలి యుద్ధం', 'పల్నాటి యుద్ధం' ఇత్యాదులు.

పురాణాలలో గల మహనీయులను ఆదర్శవంతంగా తీసుకుని ప్రజలను ఆదర్శవంతం చేసేది. ఉదా: శ్రీ 'నాజరు' రచించిన 'అభిమన్యు యుద్ధం'.

**<u>రస వైశిష్ట్యము</u>**: బుర్రకథ ముఖ్యంగా వీరరసోపేతం. తర్వాత స్థానం కరుణరసానికి చెందుతుంది. శృంగారం తదితరాలు అంగిక రసాలుగా చెప్పబడతాయి. కానీ హాస్యానికి ప్రత్యేక స్థానం ఉంది. ఒక వంత ప్రత్యేకంగా హాస్యానికి నియమితుడై ఉంటాడు.

**<u>వర్ణనా వైవిధ్యం</u>**: సాహిత్యానికి వర్ణన అనేది కచ్చితంగా ఎంతో కొంతైనా ఉంటుంది. కానీ ప్రబంధాలలో మాత్రం విశిష్టత పొంది 'అష్టాదశ వర్ణనలు'

ఉండాలనే నిర్ణయం ఉంది. బుర్రకథ చిన్నది కావున కథ కథనం దెబ్బ తినని రీతిలో అలంకారిక వర్ణనలుంటాయి.

**<u>ముగింపు</u>**: బుర్రకథ పుట్టుక, పరిణామ వికాసాలను గూర్చి నా చేతనైనంత వరకు ప్రస్తావించడానికి ప్రయత్నం చేశాను. ఎంచేతంటే అనంతమైన కళా స్రవంతిలో పరుగెత్తడం సామాన్యునికి సాధ్యం కాదు కనుక.



బుర్రకథ పితామహ బిరుదు సందర్భముగా పూలరథంలో నాజర్‌ను ఊరేగిస్తున్న అభిమానజనం



ఘంటశాలతో నాజర్

# ఇతివృత్తాలు

# అల్లూరి శ్రీరామరాజు యుద్ధం

సస్యశ్యామలంగా శోభిల్లుతున్న పాపికొండలను ఆనుకుని ఉన్న భద్రాచలం ప్రక్కనున్న పల్లెల్లో నిరంతర శ్రమతో ఉన్నంతలో సర్దుకుని గిరిజనులు జీవిస్తూ ఉండేవారు. వ్యాపార నిమిత్తమై భారతదేశానికి వచ్చి, స్వార్థపరులైన కొందరు భారతీయుల అండతో దోచుకుంటున్న బ్రిటిష్ ప్రభుత్వం వన్య ప్రాంతాల వరకు విస్తరించింది. మన్నెం ప్రజలు మైదానాలను చదును చేసి సాగు చేసుకుంటూ ఉన్నారు. అట్టి వాళ్ళకు వడ్డీలకు డబ్బులిచ్చి అవి ఎన్నటికీ తీరకుండా చక్రవడ్డీలు వసూలు చేస్తుండేవాడు 'వడ్డీల యముడైన నాగులు'.

కస్తూరి, పునుగు, జాజి, జాపత్రి, లవంగ, యాలకులు, సుగంధ ద్రవ్యాలు, వెదురు, యేగీశ, టేకు మొదలగు విలువైన మానులను వీరితోనే రవాణా చేయించుకుంటూ సంపదనంతా నల్లోడైన నాగులు సహకారంతో తెల్లోల్లు దోచేస్తూ ఉండేవారు. మన్నెం ప్రజలు బ్రతుకు తెరువుకై ఎండు పుల్లలు కొట్టుకు వెళ్తుంటే రేంజరు మామూళ్ళు, కొండ గడ్డితో గుడిసె కప్పుకోవాలని కోసుకుంటే గార్డుకు లంచాలు, కల్లు వాసన చూసినా కేసు, పుట్టినా, చచ్చినా, చుట్టముచ్చినా జరిమానా, ఇంటికి తలకు పన్నులు వసూలు చేస్తుండేవారు.

1882-86 మధ్య కాలంలో 'ఆంగ్లేయుల దురాగతాలను అంతం చేయాలనే కాంక్షగల ద్వారబంధాల చంద్రయ్య, పులిచింతల సాంబయ్య, రేఖవల్లి అంచుల రెడ్డి వంటి చైతన్యవంతులను అణచివేయడానికి నిర్ణయించి 'పోలీస్ స్టేషన్లు' ఏర్పాటు చేశారు. తెల్లదొరల దురాగతాలు అలా ఉన్నాయి.

పశ్చిమ గోదావరి జిల్లా నర్సాపురం తాలూకా మొగల్తూరు గ్రామంలో అల్లూరి వెంకటరామరాజు, నారాయణమ్మల ప్రధాన సంతానం రామరాజు తరువాత

ఒక కుమారుడు, ఒక కుమార్తె కలిగారు. తండ్రి విజ్ఞతగల వాళ్ళు కావాలని పిల్లలను వీథినే బడిలో చేర్పించాడు.

అలా ఆ కుటుంబం ప్రశాంతంగా కాలం గుడుపుతున్న సమయంలోనే వెంకట రామరాజు ఆకస్మికంగా మరణించాడు. పిదప పినతండ్రి అయిన రామకృష్ణంరాజు తుని మహారాజా వారి స్కూల్లో రామరాజును చేర్పించారు. బుద్ధి వికాసంకల రామరాజు ఈ విద్యా విధానం బావుండలేదని నిర్ణయించుకుని సాము గరిడీలు, విలువిద్య, కళలపై ఆసక్తి చూపుతూ ఉండేవాడు.

బ్రిటిష్ వారి నుంచి భారతదేశానికి విముక్తి కావాలనే గాంధీగారి ఉద్యమం చేత ప్రభావితుడైన రామరాజు స్వాతంత్రోద్యమంలో చేరాడు. కానీ అదెంత కాలమో సాగలేదు. శాంతి ద్వారా సాతంత్ర్యం రాదని, పోరాటం ద్వారానే సాధ్యమని, ఆంగ్లేయులు ఏ ఆయుధాలను ఉపయోగిస్తున్నారో అవే ఆయుధాలతో తిరగబడితే తప్ప తట్టుకోలేము అని సాయుధ పోరాట ఉద్యమం వైపు జనతను ఉద్యమింప చేయసాగాడు.

మన్యంలోని 'గూడెం' అనే పల్లెలో 'గాంగంటం, గాంమల్లు' సోదరులిరువురు తెగింపు కల ఆదర్శవంతులు అని విన్న రామరాజు వారిని కలిశాడు. వాళ్ళకు పరిస్థితి వివరించి ఆయుధాలను ఉపయోగించే నేర్పు, ఐక్యత, ధర్మ, శౌర్య, సాహస వీరులైన వారిని సమీకరించే ప్రయత్నంలో సంతకు వెళ్ళారు. గాం సోదరులు ఇరువైపులా ఉండగా రామరాజు పెద్ద బండరాతిపైకెక్కి పరిస్థితినిలా చెప్పడం ప్రారంభించాడు.

"సోదరీ, సోదరులారా! మన్యంలో పుట్టి పెరిగిన మాన్యులారా! 'ధనికులచే చేయబడిన దరిద్రులారా!' తెలుగు మాత మాన, ధన సంపదలను పరదేశస్థులైన తెల్లదొరలు కొల్లగొడుతున్నారు. ఇంకా మనలో నున్న స్వార్థపరులు నాయకులై

రచ్చబండ వద్ద అవినీతి తీర్పులనిచ్చు నీతి బాహువలు న్యాయవేత్తలు, కాకాలు పట్టడం కోసం కల్లబొల్లి మాటలు చెప్పి, లేమిలో నున్న ఆడపిల్లలను బలవంతంగా తీసుకువెళ్ళి వాళ్ళ జీవితాలను ఫణంగా పెట్టి కొందరు ధనం, పదవులను సంపాదిస్తున్నారు. ధరలు ధరణికి దూరంగా దివినంటుచున్నవి. మనిషి రూపంలో ఉన్న వడ్డీల జంగ మందిశెట్టి. ఇలా ఇంత మంది ద్రోహుల మధ్య అన్యాయంగా నలుగుతున్న మీ జీవితాలకు స్వేచ్ఛ కావాలంటే ఇలా కాదు. మరొక్క మాట. కొండలను పిండి చేసి కండలను కరిగించి సాగు చేసిన మీ పొలాలను వడ్డీల పేరుతో సొంతం చేసుకుంటున్న పాపాత్ముడు కొండారెడ్డి. మీరు పండించిన మామిడి పండ్లు, కలవారు తిని పారేసిన టెంకలు మీరు తెచ్చుకుని వాటిలోని జీడి ఎండబెట్టి, ఆ పిండితో జావ కాచి త్రాగి కడుపు నింపుకుంటున్నారు. అలాకాక మీ పండ్లు మీరే తినాలి అనుకుంటే ఒకే మాటగా, ఒకే బాటగా ఏకమై విప్లవించండి" అని చెప్తుంటే ప్రజలు వెంటనే మైదానపు రాజ ఆపవయ్యా, మాట తీపి, గొంతులు కోసే వాళ్ళు మీ మైదానపు వాళ్ళు వడ్డీ తెలియని మాకు వడ్డీ పేరుతో కనీసం చెడ్డీలు కూడా లేకుండా చేశారు అని ఉమ్మి వెళ్ళిపోయారు గిరిజనులు.

అయినా రామరాజు నిరాశ చెందక గాం సోదరులతో నాకీ మోదుగ చెట్టు, బుద్ధునికి బోధి చెట్టు వలె మార్గదర్శి అయింది. బండపై ఆకులే పక్క పర్చి ఆకాశమే అద్దాల మేడగా, మృగాల గోల జోలగా, పక్షుల కూతలే వీర గీతాలుగా, తూరుపు రేఖ లెరుపయ్యాయి. అలా తాను మారి జనంలోకి వెళ్లి జనాన్ని మార్చాలనుకుంటున్నానని గాం సోదరులకు నచ్చ చెప్పి తిరిగి గూడెంకు పంపాడు.

ఇల్లు కట్టుకుని, డబ్బు వడ్డీకి తెచ్చి వ్యవసాయం చేస్తూ మన్య ప్రజల్లో ఒకడిగా మారి వారికి చేదోడు వాదోడుగా ఉంటూ యోగిలా తన జీవితం త్యాగం చేయ నారంభించాడు. మన్య ప్రజల వద్దకు రోడ్డు పనికి రావటం లేదేమిటని తహసీల్దారైన బాస్టీనొచ్చి గద్దించాడు. రాజు బాస్టీనుతో మీరు "అరణాల కూలికి

మూడు అణాలే ఇస్తున్నారు. పనిలో రాచి రంపాన పెట్టి కూలి అడిగితే కొట్టడం న్యాయమా?" అని నిలదీసి అడిగాడు. మమ్మే ప్రశ్నిస్తావా? అని బాస్టియన్ లాఠీచార్జీ చేయమన్నాడు. తర్ఫీదైన సాయుధులు బాణాలు వేస్తుంటే, మిగిలిన వాళ్ళు రాళ్ళ వర్షం కురిపించారు. అలా ఊహించని సంఘటనకు భయపడిన బాస్టియన్ పారిపోయాడు. వర్షాకాలం కావటం చేత ఘాటు రోడ్డు పని ఆగిపోయింది. బెదిరింపులు లేవని స్వయంగా మన్య ప్రజలు ధైర్యంగా రాజు అండతో వ్యవసాయం చేసి, పంటలను సంతకు తెచ్చారు. వడ్డీ దొరలు రౌడీలను, పోలీసులను పెట్టి సరుకంతా బలవంతంగా లాక్కున్నారు. డబ్బులివ్వక పోగా అప్పుల చిట్టాలు చూపి చింతపండు తట్ట తెచ్చిన వారికి ఓ ఉప్పుకట్ట, తేనె డబ్బా తీసుకుని వాసన కొట్టే గబ్బు కొబ్బరినూనె, పెద్ద అరటి గెలకు ఓ గుప్పెడు చిట్టలు ఇచ్చారు. అలా వాళ్ళకు పనికిరాని వస్తువులన్నీ ఇచ్చారు. అపుడు రాజు వచ్చి 'చిట్టాలు చించి వీళ్ళకు అండగా నేనున్నానని మర్చిపోకండి' అని చెప్పి వెళ్ళిపోయాడు. వెంటనే ఆసాములు, భూస్వాములంతా వీడు ఉంటే మన వ్యాపారం కష్టం. వీడిని అంతమొందించాలని నిర్ణయించుకున్నారు.

బాస్టియన్‌కు లంచమిచ్చి గంటం దొరకు మునసబు గిరి నుంచి తొలగించడమే కాక, మల్లు దొర రిజర్వు భూములను కూడా స్వాధీన పర్చుకుని లంచమిచ్చిన మన్య స్వార్థపరులకు ఇచ్చాడు బాస్టియన్. అంతటితో ఆగక రాజుతో మీ చిన్నాన్న మా చిన్ననాటి స్నేహితుడు కాబట్టి ఈ మన్యం నీకు ఫర్మానాగా రాసిస్తా. తీసుకో అన్నాడు. ఆ ఇచ్చేది ప్రజలకిస్తే మంచి జరుగుతుంది కదా అని రాజు చెప్పాడు. ప్రజలను నమ్మి చాలా మంది చెడ్డారు. వారిని వదలి నీ సంసారం చూసుకోమని బుజ్జగించాడు బాస్టియన్. రాజు వినక మన్నెం ప్రజలకు రక్షణ కల్పించండన్నాడు. ప్రజా రక్షణ చట్టాలను ప్రభుత్వం చూపిస్తుందని బాస్టియన్ అనగానే, "కష్టజీవులను కూడు తిననీయని చట్టాలెందుకు? దుష్ట దోపిడీని ఆపలేని ప్రభుత్వమెందుకు?" అని రాజు ప్రశ్నించాడు. అందుకు రాజును రాజద్రోహిగా

అరెస్టు చేయమన్నాడు బాస్టియన్. ప్రజలు స్పందించి రాజును తాకితే ప్రాణాలుండవు అని హెచ్చరించారు.

రాజు చొరవతో "బాస్టియన్ గారూ అమాయకులను రెచ్చగొడుతున్నారా! క్రీస్తు నమ్మకస్తులు మీరు. ఆయన చెప్పింది ఇదేనా? మా మొర ఆలకింపక, న్యాయా న్యాయాలు విచారించక ఈ తీర్పులేమిటని" బాస్టియన్‌ని ప్రశ్నించాడు. తరువాత "సోదర ప్రజలారా ఎవరు ఉన్నత ఆశయాలతో, త్యాగంతో ఉంటే వారే నాయకులు "కావున మీరు నాకై విచారించవద్దు. ఆవేశం మాని, ఆలోచన పూని" ఐకమత్యమే పేదలకు రక్ష, అనైక్యతే ఉరిశిక్ష' కాబట్టి విజ్ఞానాన్ని, ఆచరణని అభివృద్ధి చేయండని" రాజు ప్రబోధించాడు. రాజును బందీని చేసి జైలులో పెట్టి అతని కుటుంబాన్ని జైలు దగ్గరకు చేర్చారు.

ఖైదు నుంచి బయటకు వచ్చిన రాజుతో తల్లి 'డబ్బుకు లోకం దాసోహం అంటుంది నాయనా. ఆంగ్ల విద్యలు నేర్చిన ఆంధ్రులు ఉద్యోగాలు చేసి పరువు, ధనము సంపాదించుకుంటున్నారు' అనగానే 'అమ్మా ఇది జాతి విద్యను చంపిన బానిస విద్య' అన్నాడు. 'నీవు బ్రహ్మచర్యం మాని తమ్ముని చదివించి, చెల్లి పెళ్ళి చేసి కుటుంబ బాధ్యత వహించమని' తల్లి చెప్పింది. 'నా ఆశయాన్ని దాన్ని నమ్మిన వారిని నట్టేట ముంచి పడుపు కూడు మెక్కి నా బ్రతుకు నేను చూసుకోలేనమ్మా' అని రాజు అంటే తల్లి 'నాయనా, పెద్దల మాట చద్దిమూట కాన మీ పెద్దల వలె నీవును హాయిగా ఉండమని' తల్లి బోధించింది.

అంతలో మిరవకాయ టపా వచ్చింది అమ్మా విను అని టపా చదువుతున్నాడు. "రౌడీలు నడి వీధిలో బట్టలు విప్పి కొడుతున్నారు. భర్త కళ్ళెదుటే భార్యను అవమానించారు. దొంగ పద్దులు రాసి వేలిముద్రలు అద్దిస్తున్నారు. చెప్పమ్మా ఇలా బ్రతకటం కన్నా వీర మరణం మేలమ్మా అదే నా నిర్ణయం. ఇదీ సమస్య. దీనికి పరిష్కారం పోరాటం. రామరాజు నీకే కాదు భారత

మాతకీ కొడుకే" అని కానల వెంట వెళ్ళిపోయాడు.

అహింస ఉద్యమం మూలంగా రౌలట్ చట్టాలతో జలియన్ వాలాబాగ్ లాంటి దుర్మార్గాలు ఆంగ్లేయులు చేశారు. రాజు నేతృత్వంలో ఆకలి మరణం కన్నా ఆయుధ హరణం మిన్నగా ఎంచి జనం 'రామదండు'గా కదిలారు. విప్లవ తండాలై చింతపల్లి పోలీస్ స్టేషన్ కొల్లగొట్టి, కృష్ణదేవి పేట, రాజవొమ్మంగిలలో రైఫిళ్లిచ్చి పోలీసులే రామదండులో చేరారు. అబద్ధపు రికార్డులను తగుల బెట్టారు. వీరులైన వారిని ఖైదు నుంచి విముక్తి చేశారు. విడుదల చేసిన 'వీరయ్యను తుపాకి దండు నాయకుని'గా చేశారు.

బ్రేమన్ హేర్ నాయకత్వంలో వంజేరి అడవి దారి తెలియక పోవడంతో వీరయ్య నాయకత్వంలోనే చిత్తయి పోయారు. తరువాత మలకపల్లి పోలీస్ స్టేషన్ ముట్టడించారని తెలిసి, గూండాల గుండెలు జారి, చోడవరంలో జాన్ దొర విని దౌడు తీశాడు. ఇది విని 'భూపతులు, వడ్డీ జలగలు బస్తీకి పరారయ్యారు' పోలీసు ఉద్యోగంలో చేరిన తెలుగువారు తుపాకులు మొదలైన ఆయుధాలను రాజుకిచ్చి దండులో చేరారు. 'రాజుపై తుపాకులు పేలవని ప్రచారం' సాగుతుంది. 'తన తల్లిని, తన కుటుంబాన్ని వదలి, మాతృదేశాన్ని కాపాడటం కోసం వచ్చిన రాజు నేతృత్వంలో అన్నీ విజయాలే జరుగుతున్నాయి.

మద్రాస్ గవర్నర్ లార్డ్ వెల్లింగ్‌టన్ లండన్ నుంచి కార్టు కవర్టు, హైటరీ, క్రూరీ సైన్యాధిపతులను రప్పించి మన్యానికి సేనలతో పంపాడు. అది తెలిసిన రాజు అగ్గిలో ఆజ్యంలా భగ్గున మండి ఢంకా మ్రోగించి గాం సోదరులతో కొండ నిండా ఉన్న కోయలను బండకో బాణమిచ్చి, తాచుల వలె, రేచుక్కల వలె రకరకాల ఆయుధాలతో సన్నద్ధం చేశాడు. అటు ధార్ కొండ ఇటు గాం కొండ కాచి ఉన్న మల్లును పిలిచి గంటం దొర నీ వంతని చెప్పాడు. 'గుండెకు గుండు గురి చూసి మల్లు వదలగా కవర్టు ఘాటిలో దొర్లిపోయాడు. అంత తెల్ల దొరలు బెంబేలెత్తి తెల్ల

జెండా ఎత్తి రాజును ప్రాధేయపడి కవర్డు శవాన్ని తీసుకెళ్ళి నర్సీపట్నం ఘాటు రోడ్డులో సమాధి చేశారు.

రాజు ఆప్తమిత్రుడు, వార్తాహరుడైన అగ్గిరాజు వచ్చి రాజుతో 'దువ్వ వీరులను దోపిడీ దొంగలని, సహాయం చేయవద్దని, విప్లవాన్ని సాగనివ్వకండని ప్రకాశం పంతులుగారు పెద్దాపురం కాంగ్రెస్ వారికి టెలిగ్రామిచ్చారట జాగ్రత్త' అని వివరించాడు. గాంధీజీ కూడా రాజు సాహసం, త్యాగం గొప్పవే, కాని సాయుధ పోరాటం బలపర్చము' అన్నారని చెప్పాడు. ఇదే సరైన సమయమని విభజించే పద్ధతి ప్రకారం రాజును అణచి వేయటానికై లార్డ్ వెల్లింగ్ టన్ అదేశానుసారం గూడాల్ దొర వేలాది దళాలను, ఫిరంగులను, మలబారు రైఫిళ్ళు, మరగన్‌లు, స్టెన్‌గన్‌లు, ప్యారిస్ గుర్రాలతో మన్యం వచ్చాడు.

"సోదరా! అగ్గిరాజా! బ్రిటిష్ పాలన అంతమైతే రాజు ధన్యజీవి, మన్యం ఓడితే రాజు చిరంజీవి. మంచి చెడులకు చావులేదు. అని పోరుకు పిలుపునిచ్చాడు'. అన్ని అయుధాలతో మన్య వీరులంతా యుద్ధ సన్నద్ధమై పోరు జరుగుతుండగా అందు గాం సోదరులు మరణించారు. రాజు మధ్యాహ్న సూర్యునిలా వెలుగుతూ చీల్చి చెండాడుతుండ, తుపాకి గుండు రాజు గుండెను తాకగా "ఓ భారతమాతా! అందుకో ఇదే నా వందనం' అని నేలపై ఒరిగాడు. భారతమాత స్వేచ్ఛకై ప్రాణాలర్పించిన మహా దేశభక్తుడు రాజు.

యువత రామరాజులా త్యాగంతో, నిస్వార్థంతో, సాహసంతో, ఓర్పు, నేర్పులతో దేశ రక్షణకై ప్రాణాలను సయితం అర్పించాలనే ప్రబోధంతో కవి ఈ రామరాజు చరిత్రను మన ముందుంచారు.

ఈ కథలో ఇపుడున్న విద్యా విధానం సగటు మనిషి మనుగడకు పనికి రాడని, పెట్టుబడిదారులను పెంచి పోషించటానికి ఉపయోగపడుతుందని రామరాజు

ఉద్దేశమని కవి భావన. విద్య అనేది విజ్ఞానాన్ని, వికాసాన్ని, మంచిని, మానవతను పెంచి తాను బ్రతుకుతూ, ఎదుటి వారికి బ్రతుకు తెరువు చూపేదిగా ఉండాలని, అధికారం నుంచి వెలుగును చూపే పద్ధతిలో ఉండాలనేది కవి కాంక్ష.

అహింస ద్వారా స్వేచ్ఛ రాదని, పోరాటం ద్వారానే వస్తుందని "రాజు" స్వాతంత్ర్య సిద్ధికై పోరాటానికి బయలుదేరాడు. గిరిజనులకు పరిస్థితిని వివరించాడు. అంతట గిరిజనులు మీలా తెలివైన వాళ్ళే మమ్మేల మోసం చేస్తున్నారని ఎదురు తిరగగా అదే అసలు మొదటి మెట్టుగా ఉపయోగపడిందని కవి ఉద్దేశం. అంతట ప్రజల మనిషి కావాలని అంటే వాళ్ళలో ఒకడిగా మసలి వాళ్ళ సమస్యల పరిష్కారం చేయాలనేది ప్రతి నాయకునికీ గుర్తుండేలా కవి తన ఉద్దేశం గిరిజనుల చేత చెప్పించారు. అమాయక ప్రజలను దోచుకుంటున్నవారిని అడ్డగించే వ్యక్తిని ముందు తొలగించారీ ధనవంతులు అనే విషయాన్ని కవి స్పష్టపరిచారు.

నాయకులు ఎలా ఉండాలి. నాయకత్వ లక్షణాలేమిటి అనేది కవి స్పష్టం చేశారు. త్యాగి, సాహసి, నిస్వార్థ జీవి, దేశభక్తుడు కావాలన్నారు. ఉదాహరణగా రామరాజును చూపించారు. తల్లి కుటుంబ సంక్షేమం చూడమని సామాన్య స్త్రీలాగా అడిగింది. విజ్ఞతగల కుమారుడు 'వసుధైక కుటుంబం' కావాలని, అదే నా అభిమతం అని తల్లికి చెప్పి రామరాజు తెలిపినట్లు కవి వివరించారు.

ఆంగ్లేయులపై తిరుగుబాటు చేసిన రామరాజుకు రంప పితూరి, లాగరాలు మున్నగు దాడులందు విజయం పొందాడని, అలా పట్టుదలతో ఉన్నచో ఏదయినా సాధించవచ్చుననీ, ఆత్మ విశ్వాసాన్ని కవి ఈ కథ ద్వారా స్పష్టం చేశాడు. ఇది "నిస్వార్థ దేశభక్తికి, అకళంక త్యాగానికి నిదర్శనంగా రామరాజు పాత్ర"ను కవి తీర్చి దిద్దారు.

# పల్నాటి యుద్ధం

అష్టైశ్వర్యాలకు ఆలవాలమైన ఆంధ్రదేశంలో వీరగడ్డగా వాసికెక్కి పౌరుషానికి మారుపేరుగా, కోడె గిత్తలు, పాడి పశువులు, కొమ్ము పొట్టేళ్ళు, అస్లీ జాతి పుంజులతో వానికవే సాటిగా నున్నట్టి పల్నాటికి ప్రభువు 'అనుగురాజు', ప్రధానమంత్రిగా బ్రహ్మనాయుడు అండగా ఉండ సుభిక్ష పరిపాలన జరుగుతూ ఉన్నది. కొంతకాలానికి అనుగురాజు కాలధర్మం చేశాడు. బ్రహ్మనాయుడు పిన్న వయస్కుడైన అనుగురాజు పెద్ద కుమారుడు 'నలగామరాజు'కు పట్టం కట్టాడు. కుల, మత విభేదాలు లేకుండా సర్వ మానవ సమానత్వం నెలకొల్పాలని భావించి 'మాల కన్నవదాసు'ను ప్రేమతో పెంచి సేనాపతిని చేశాడు. తరతమ భేదం లేకుండా ఏక పంక్తిలో విందు ఏర్పాటు చేసి చాపకూటి సిద్ధాంతం ప్రవేశపెట్టిన ప్రజల మనిషిగా మన్నన పొందుతూ రాజ్య యంత్రాంగాన్ని ఆదర్శప్రాయంగా మంత్రి బ్రహ్మనాయుని నేతృత్వంలో పల్నాడు ప్రశాంత జీవనం చేస్తున్నది.

వర్ణ ధర్మమనే ఉక్కు చక్రాన్ని ముక్కలు చేసి హెచ్చు తగ్గులు లేక సర్వ మానవ సమానత్వాన్ని పెంప నెంచి, ముందడుగు వేస్తున్న సంఘ సంస్కర్త బ్రహ్మయ్యను ఇలాగే వదిలేస్తే ఎన్నాళ్ళ నుంచో పెంచి పోషిస్తున్న మన ఆచార, సంస్కృతులను రూపుమాపుతాడని పెత్తందార్లైన కొందరు ప్రముఖులు ఆలోచించ నారంభించారు.

ఇదే అదనని నాగమ్మ అసమ్మతి వర్గాన్ని కూటమిగ చేసి మాల కూటి రాజ్యం మట్టి గలపాలని రెచ్చగొట్టుచుండగా, అలజడి, అశాంతులతో ప్రాణాంతక పరిణామాలను ఎదుర్కొనాలంటే అధికార దాహం గల నాగమ్మకు రెండో మంత్రి పదవి నిచ్చి తప్పని పరిస్థితిలో దుర్మార్గానికి అధికారమిచ్చి బ్రహ్మయ్య తల వంచాడు.

సమర్థురాలైన నాగమ్మ నలగాముని తమ్ముడైన నరసింగరాజుతో మీ అన్నకు పుత్రులు లేరు. కానీ మీ అల్లుడు ఆలరాజుకు తన కుమార్తె పేరమ్మనిచ్చి వివాహం చేసిన తరువాత అతడే ప్రభువు. కావున బ్రతికి ఉన్నవాడే రాజు కాబట్టి నీ పరిస్థితి

ఆలోచించుకొమ్మని దుర్బోధ చేసింది. అప్పటివరకు అగాధంలో ఉన్న స్వార్థం, దురాశలు వెల్లువై నరసింగరాజు నాగమ్మతో చేతులు కలిపాడు.

విచక్షణా రహితంగా నాగమ్మ వివేకవంతుడైన బ్రహ్మన్నను ప్రతి విషయంలో వేఛేదిస్తూ విసిగిస్తుంది. నలగామరాజు బాగా ఆలోచించి "ముందు వచ్చిన చెవుల కన్న వెనుక వచ్చిన కొమ్ములు వాడి" అన్నట్లు నాగమ్మ ప్రవర్తన నచ్చక" రెండు కత్తులు ఒకే ఒరలో ఇమడవని" కరుణామయుడైన బ్రహ్మనాయుని ఓర్పుకు ప్రతిక్షణం పరీక్షలు పెడుతూ మనశ్శాంతి లేకుఇడా చేయడం గమనించాడు. ఇదిలా కొనసాగ కూడదని నలగామరాజు తన చిన్న తమ్ముడు అయిన మలి దేవాదులను పిల్చి "మన వంశ రక్షకుడు, మన కోసం తన జీవితం అంకితం చేసిన తండ్రి వంటి విజ్ఞత గల బ్రహ్మయ్యా నేతృత్వంలో మాచర్ల సీమను ఏలుకొమ్ము. ఇంతకన్నా ప్రస్తుతానికి వేరు మార్గం లేదు అని తన శాసనం లాంటి నిర్ణయం తెలిపాడు. గురజాలను నలగాముడు పరిపాలిస్తున్నాడు.

మాచర్లలో చెన్నకేశవ ఆలయం నిర్మించి కుల, మతాల తేడా లేకుండా అందరికీ ప్రవేశం కల్పించిన బ్రహ్మన్న ఆదర్శాన్ని ఆబాల గోపాలం వేనోళ్ళ పొగడుతున్నారు. తరతమ భేదం లేకుండా ఇలా సమాన హక్కులిస్తే ప్రభువుకు, ప్రజలకు తేడా ఉండదని ధనికులంతా ఏకమై నాగమ్మను ఆశ్రయించి "నీవేం చేస్తావో చెయ్యి, బ్రహ్మన్న ఆశల సౌధాన్ని కూల్చాలి, లేనిచో మన అధికారం అనే మహావృక్షం కూకటి వేళ్ళతో కూలిపోగలదని" ఆవేశంతో వివరించారు. నాగమ్మ 'మీ అండదండలు నాకు కావాలి, మీరు నిశ్చింతగా ఉండండి, మాల కూటి రాజ్యాన్ని మట్టిపాలు చేయనిచో నేను నాగమ్మను కాను" అని ప్రతిన చేసి నలగామరాజు వద్దకు వెళ్ళి నాకీ కీలుబొమ్మ మంత్రిత్వం అక్కరలేదు అని చెప్పింది. అనగానే దేశానికి ముప్పు వాటిల్లుతుందని, తన చేయి దాటి పోయినదని ఎంచిన నలగామరాజు నీ యిష్టం వచ్చినట్లు ఏలుబడి చేయమని సెలవిచ్చాడు.

అలా నలగామరాజును కృంగదీసి లొంగిపోయేలా చేసి నలగామరాజు

రాసినట్లుగా బాలరాజుకు నాగమ్మ సంక్రాంతి పండుగ సందర్భంలో ఉత్సాహంతో కోడి పందాలు ఆడడానికి రావలసిందని జాబు రాయించింది. ఆ జాబును చూసి బ్రహ్మనాయుడు అనుమానంతో ఇలా అన్నాడు. "ఇది నలగామరాజు ఆలోచన కాదు నాగమ్మ దురాలోచన కనుక మనం పోరాదు, ప్రోత్సహించరాదు" అని మలి దేవునితో చెప్పాడు. వెంటనే బాలరాజు "గురజాల కోళ్ళను మాచర్ల కోళ్ళు గోళ్ళతోనే చంపేస్తాయి". కాన ఈ విషయమై ఇంక ఆలోచించక సన్నద్ధులం అవుదాం" అని ఆవేశ పూరితంగా చెప్పాడు. పందెగాళ్ళు కత్తులు సానబెట్టి జాతి పుంజులను తీసుకుని, గజ్జెల చెడ్డీల కట్టి, ఇటు మాచర్లవారు, అటు పోరగల కోళ్ళను తీసుకుని గురజాలవారు వచ్చారు.

ఇరువర్గాలవారు కోడేరు గుట్ట వద్దకు చేరి అలరాజును మధ్యవర్తిగ నియమింప చేసుకుని మలి దేవుల పక్షాన బాల గోపన్న, నాగమ్మ పక్షాన మువ్వల భీమన్న నిర్ణయం కాగా పందాలకు సంసిద్ధులు అయ్యారు. కోళ్ళు బరిలో పోరాడుతుండ ప్రారంభంలోనే మాచర్ల పుంజు పలాయనం చేసింది. వెంటనే గురజాల సుద్దుల వారు "పల్నాటి మిద్దెలకు వాసాల్లేవు, కొండేటి బ్రాహ్మలకు మీసాల్లేవు, మాచర్ల కోళ్ళకు రోషాల్లేవు" అనగానే మాచర్ల వారికి కోపం వచ్చి 'పటపట పళ్ళు కొరికి, చూపుతో పీక నరికేలా కొరకొర చూసి కాకి డేగను బరిలో దించారు. గురజాల పుంజు పారిపోయింది. మాచర్ల వాళ్ళు మీసాలు దువ్వుతుండ సుద్దుల వాళ్ళు ఇలా మొదలు పెట్టారు.

"పల్నాటి మిద్దెలకు వాసాల్లేవు, కొండేటి బ్రాహ్మలకు మీసాల్లేవు, గురజాల కోళ్ళకు రోషాల్లేవు" అని ఎద్దేవా చేశారు. నలగామరాజు కోపంతో గుడ్లెర్ర జేసి, ఓడిన మైకంలో ఉక్రోషంతో కాచుకోండి. ఇదే 'కడసారి పందెం. ఓడినవారు ఏడేళ్ళు రాజ్యం వీడిపోవాలని' ఊగిపోతూ చెప్పాడు. గెలిచిన ఊపులో ఉన్న మలిదేవులు ముందు వెనుకలు ఆలోచించకుండ విచక్షణ కోల్పోయి ఆవేశంతో

సరేనన్నాడు. బ్రహ్మన్న, అలరాజు ఎంత వారించినా వినక మాచర్లవారు పందానికి సన్నద్ధులయ్యారు.

మాచర్లవారు జాతి పుంజును దింపగా, గురజాల వారు పెట్టమారిని బరిలోకి దించారు. మాచర్ల పుంజు గురజాల పుంజును తరిమి, తరిమి దెబ్బ మీద దెబ్బ కొట్టగా రొప్పుతూ నేలపై పడింది. పరిస్థితిని గమనించిన నాగమ్మ వెంటనే జుట్టు విరబోసి బరిలోకి వచ్చి భీమన్నకు సైగ చేయగా కోడిని లేపి మళ్ళీ దువ్వి ఉసిగొల్పాడు. దెబ్బలు తగిలిన తిమ్మిరిలో తిరగబడిన జాతి పుంజు పెట్ట మారిని ప్రేగులు బైట కొచ్చేట్లు నెత్తురు చిందేట్లు చీరాడి, చితక పొడిచి బరిపై పడి ప్రాణాలు విడిచింది. ఆ బాధకు తట్టుకోలేని పెట్టమారి పారిపోయింది. ఇదే అదనని నాగమ్మ కంచు ఢక్క మ్రోగించి విజయం మాదేనని ప్రకటించింది.

అపుడు నాగమ్మ బ్రహ్మన్నను పరువు, ప్రతిష్ఠ అని ఆలోచించక మాచర్లను ఏలుకోండి. ఇంకెపుడూ గురజాలతో పెట్టుకోవద్దు అని పొగరుగా చెప్పింది. తారతమ్యం లేకుండా పేరుతో పిలుచుట, దయాభిక్షగా ఇచ్చెదననుట బ్రహ్మయ్యకు కోపంతో కూడిన తీవ్ర సంతాపం కలిగినా ఓర్చుకున్నాడు. తాను ఊహించినదంతా నిజమైందని బాధపడ్తూ, బాలరాజును ఇపుడు నిందించినా ప్రయోజనం శూన్యం కనుక మారు మాట్లడక తలవంచి బాలరాజు, బ్రహ్మయ్య బంధుమిత్రులు సకుటుంబ సమేతంగా అడవిలో ఉంటుంటే గిరిజనులతో దాడి చేయించింది నాగమ్మ. ఆ దాడిని తట్టుకుని ఇక్కడ ఉండలేమని పడరాని పాట్లు పడి 'వీరమేడపి' చేరారు.

వీరమేడపిలో ఏడేండ్లు గడిపి గడువు తీరిన అనంతరం అలరాజును రాయబారిగ పంపాడు బ్రహ్మయ్య. సందేహిస్తూనే కుశల ప్రశ్నలు, బ్రహ్మయ్య శాంతి సందేశాన్ని అలరాజు చెప్పగా విని నాగమ్మ విని రెచ్చిపోయి, "భారతంలో పాండవులకు రారాజు భాగం ఇవ్వలేక కాదు, రాజ్యం విచ్ఛిన్నం శత్రువులకు అవకాశం కాబట్టి దేశం "కుక్కలు చింపిన విస్తరి" కాగలదు. అందుకని రాజ్యాన్ని ముక్కలు చేయము" అని నాగమ్మ అలరాజుతో చెప్పింది. అదీకాక రాజ్యం పెద్ద కుమారునికే

చెందాలి లేదా యుద్ధంలో గెలవాలి. కావున నీకు పెద్దగా చెప్పవలసిన పని లేదనుకుంటున్నాను, ఎందుచేతంటే వివేకమున్న వాడివి కనుక అయినా మాల కూటి రాజ్యాన్ని నేను మళ్ళీ ఆహ్వానించలేను. రాజ్యం వీరభోజ్యం కదా! అయినా మీ మామ ఇంకెంతకాలం జీవిస్తాడు? తరువాత నీవే రాజు. మనం ఐకమత్యంగా ఉందామని కథను మరో మలుపు తిప్పి ఆశ చూపింది నాగమ్మ.

"అమ్మా నాగమ్మా! నీ కుతంత్రాలింక చాలించు. ప్రశాంతమైన పల్నాడులో అశాంతిని రేపి, పందాలు పెట్టి అన్న దమ్ములను వేరు చేశావు. ఇంక ఈ దురాగతాలు నే చూడలేను. నేను సన్యసిస్తానని" రాయబారిగా వచ్చిన అలరాజు కొలువు వీడిపోయాడు. ఇదే అదనని నాగమ్మ లోభియైన నరసింగరాజుతో మీ అన్నకు ముద్దుల అల్లుడు కావున అలరాజునే తన తర్వాత పట్టాభిషిక్తుని గావిస్తాడు. కాన అన్యథా ఆలోచింపక 'పక్కలో బల్లెం కాక ముందే హతమారిస్తే కార్యం సుగమమై నీవు రాజువౌతావు' అని దుర్బోధ చేసింది.

ఈ పరిస్థితి చూసిన నలగామరాజు కన్న తండ్రి కన్న మిన్నగా పెంచి పెద్ద చేసి రాజ్యాభిషేకం చేసిన ఆంతరంగికుడు నాయుడు దూరమయ్యాడు. ఒక్కగానొక్క ఆడపిల్లకు యోగ్యుడైన అలరాజుని అల్లుని చేసుకోగా అతడు అలిగి తొలగి పోయాడు. పెళ్ళి ముచ్చటైనా తీరకనే ఏడేండ్లుగా అంత:పురంలో మ్రగ్గుతున్న అమాయకురాలు పేరమ్మ తన భర్త వస్తున్నాడనే కొండంత ఆశతో ఎదురు చూస్తున్న కుమార్తెకు ఏమి చెప్పగలను అని తనలో తాను రాత్రంతా కుమిలి పోసాగాడు.

తెల్లవారగనే నాగమ్మ పరుగులాంటి నడకతో వచ్చి నలగామరాజా అలరాజును బ్రహ్మయ్య మన సరిహద్దుల్లోనే హతమార్చి ప్రక్క దేశపు రాజుల సానుభూతి, సహకారాలు ఉండకుండా చేశాడు. అంతేకాక బ్రహ్మయ్య అలరాజును కీలు బొమ్మను చేసి తానే గురజాలను పాలింప నెంచి ఈ దుర్మార్గానికి పాల్పడ్డాడని నాగమ్మ చేతిలోని మరబొమ్మయైన నలగామరాజుతో చెప్పింది. అల్లుని మరణవార్త వినగానే 'నలగామ రాజు ఖిన్నుడై పోగా, పేరిందేవి మొదలు నరికిన అరటి చెట్టులా

కూలిపోయింది. సఖులు సపర్యలు చేయగా తెప్పరిల్లి శోకదేవతలా విలపిస్తూ నాగమ్మతో ఇలా అంటుంది. "నాగమ్మా! నీ కోరిక నెరవేరింది కదా! అయినా నిన్ననవలసిన పనిలేదు. మాకు సఖ్యత లేదు. మానవత కోసం తన తనువునే విడచిన ధర్మ వీరుని దగ్గరకు పోతానని" వెళుతుండగా చిన్నాన్న నరసింగరాజు ఎదురయ్యాడు. పేరిందేవి ఆగి "చిన్నాన్నా! మమ్ము గారాబంగా పెంచి, ముద్దుగ పెళ్ళి చేసి, ముద్దు ముచ్చట తీరకనే మూడునాళ్ళ ముచ్చట చేసితివిగా మా జీవితం" అని భర్తకు మనస్సులో నమస్కరించి చితిలో దూకి సహగమనం చేసింది.

మంచికి మారుపేరైన అలరాజుని, అదీగాక రాయబారిని హతమార్చడం రాజనీతి కాదు కనుక సహనశీలి బ్రహ్మయ్య జయభేరి మ్రోగించి దిక్కులు పిక్కటిల్లేట్లు నినాద ఘోషలు మిన్నుముట్టగ యుద్ధ సన్నద్ధులై కార్యంపూడికి సైన్య సమేతంగా చేరారు. బాలచంద్రుడు బొంగరాలాట ఆడుతున్నాడు. బొంగరం పొరపాటున ఓ కోమటి పడతికి తగిలింది. అప్పుడు ఆమె "దేశం మొత్తం పిన్న, పెద్దలంతా పోరుకేగ నీవు ఆటలాడుతున్నావా? అని పరుషంగా పలికింది. బాలచంద్రుడు మారుమాట్లాడక సిగ్గుతో ఇంటికి వచ్చాడు. 'అమ్మా! నాన్నగారు ఎక్కడ' అని బాలుడు అడగ్గా, యుద్ధానికి వెళ్ళినట్లు తెలిపింది తల్లి అయినా చిన్న వాడివి నీవు వెళ్ళరాదు అని తల్లి పలుకగా వెంటనే బాలుడు 'అమ్మా! వీరపత్నివి నీవు. అయినా ఏనుగును చూసి సింహ కిశోరం భయపడునా? సాగరం ఉప్పొంగితే లోకాలు ఆగునా! కాన నన్ను దీవించి వీరమాతవు కమ్ము తల్లీ" అని ఆవేశంతో పలికాడు. నీ భార్య మాంచాలను కలసి వెళ్ళు నాయనా అని పంపింది. మందిరంలో చక్కగా ఆభరణాలు అలంకరించుకుని, పట్టు జలతారు చీర ధరించి వసంత కాలంలో వచ్చిన నిండు వెన్నెలలు కురిపించు చంద్రబింబం లాగా, మన్మథ మొలకలా ఉన్న మాంచాల సౌందర్యానికి కన్ను చెదిరి, మది కదలి, మేను పులకరించి అమాంతం వెళ్ళి కౌగిలించుకున్నాడు. అపుడు మాంచాల

విడిపించుకుని "దేశానికి వెన్నెముకలైన యువత కర్తవ్యహీనులైతే దేశం నవ్వుల పాలు కావడమే కాక పరాయి సొత్తు అవుతుంది కాన దుర్మార్గపు నాగమ్మ ఆలోచనను ఛేదించి రమ్మని వీర తిలకమిడి ధర్మయుద్ధం చేసి విజయుడవై రమ్మని దీవించి పంపించింది.

ధర్మయుద్ధ మందు నీ కత్తికెదురు లేదని, నీ సోదరులకు అండగా ఉండమని దీవించి పంపించింది తల్లి. సంధి కోసం భట్టుమూర్తిని రాయబారిగా బ్రహ్మయ్య పంపగా, నాగమ్మ తూలనాడి పంపించింది. ఇక ఉపేక్షించరాదని బాలుడు సమరభేరి మ్రోగించండి అని ఆదేశించాడు. అంతలో ఓ భటుడు వచ్చి "ప్రభూ! నాగమ్మ సేనలతో నాగులేటి దరిదాపులకు వచ్చిందని" చెప్పాడు.

సాటి రాజులు, సేన, ఆయుధం ప్రయోగించగల సామాన్య ప్రజల్లో గల రైతులు, శ్రామికులు కూడా ఒక్కరేమిటి దేశభక్తిగల ప్రతి పౌరుడు యుద్ధానికి సన్నద్ధులయ్యారు. ఇటు మాల కన్నమ దాసు సేనానిగా రణభేరి మ్రోగించమన్నాడు. అటు నాగమ్మ సింహనాదం చేసి ప్రళయ కాళి వలె చెలరేగి సేనతో బయలుదేరింది.

యుద్ధమందు ఇరుపక్షాల వారి ఆయుధాల ఒరిపిడికి నిప్పులు చెరిగాయి. బ్రహ్మన్న సేనలు మీసం దువ్వి కనుబొమ్మలు ముడిచి పఠా కత్తులు తటాలున అందుకుని, గండ్ర గొడ్డళ్ళు చేతబూని సేనలు ఉండగ, బాలుడు శరవేగంతో శత్రు సేనలో చొరబడ్డాడు. తలలు తిరుగుతూ, విచ్చు కత్తులు అరి వీరుల రొమ్ములు గుచ్చుతూ, గుండెలు, ప్రేగులు తుండెములయ్యేట్టు నెత్తురు చిందుతూ తలలు, మొండెములు వేరయి దొర్లుతూ గుట్టలు పడి చెట్టుకు, పుట్టకు చెల్లా చెదురు చేశాడు.

అరివీర భయంకర సేనలున్నా నాగమ్మ సేనలు పారిపోతుండ, ధృడ చిత్తులై న్యాయం కోసం పోరాడే కన్నమ సేనలు తరుముతున్నాయి. నరసింగరాజు గమనించి పురిగొల్పుతూ ఉన్నాడు. బాలుడు ఎదురై మిడిసిపాటుతో తొడగొట్టి మీసం దువ్వి దొంగ దెబ్బ తీయటం కాదు. ఇప్పుడు రారా ! అని కొండలు ధీ

కొన్నట్లు పెద్ద హోరుతో పోరు చేయనారంభించారు. బల్లెంతో బాలుని నర్సింగరాజు పొడవగా, దెబ్బతిన్న పులి పిల్లలాగా పైకి దూకిన బాలుడు నర్సింగ రాజు తల ఒక్క వ్రేటుతో నరికి వేయగా ధరణిపై దొర్లి, పొర్లింది.

వందలాది ప్రజలు, వీర సేనలు, వీర నాయకులు, మలి దేవరాజు, కన్నమదాసు, పల్నాటి పులి బిడ్డలు వీర మరణం పొందారు. వీర సేనలను శవాలుగా చేస్తున్న నాగమ్మను చేరి బ్రహ్మయ్య "నీ అధికార దాహంతో అన్నదమ్ముల మధ్య విభేదాలు కల్పించి, చీల్చావు. నీ రక్తదాహంతో అన్నదమ్ములతోపాటు, అమాయక ప్రజలను చంపిస్తున్నావు. పల్నాటి స్త్రీల పసుపు, కుంకుమలు, పుస్తెలు మట్టిపాలు చేశావు. నీ కోరిక నెరవేరిందా? కట్టుకో ఈ శవాల గుట్టపై నీ పట్టము. ఏలుకో ఈ స్మశానాన్ని ఏక ఛత్రంగా" అని డగ్గుత్తికతో ఆవేశాన్ని చంపుకుని గుత్తికొండ బిలం వైపు వెళ్ళిపోయాడు బ్రహ్మనాయుడు. పోరులో వీర మరణం పొందు వీరుని వలె సూర్యుడు పశ్చిమాద్రినే అస్తమించాడు.

వీరయోధుల వేడి రక్తంలా నింగిదారులు ఎర్రబారి, కక్షల వలె కారు చీకట్లు కమ్మి ఆకాశం నలుదిశలు, ఆర్తనాదాలు చేసేవారి గోడులో కలలు మారు మ్రోగుతుండ, రాబందుల రెక్కల చప్పుడు, నక్కల కూతలు కూయుచుండ స్మశానమై పోయె పల్నాడు కుటిల రాజకీయ శక్తుల మూలంగా, 'మరో కురుక్షేత్ర సంగ్రామం పల్నాడులో జరిగింది'. కుల, మత, వర్గ విభేదాల కారణంగా రణం జరిగింది. సృష్టిలో స్వార్థం పెరిగి, మానవత తరిగి పోతుంది. మనిషికి మేధతో పాటు అవినీతి పెరుగుతుండటం చేత ఇలా జరుగుతుంది.

ఇదిలా ఉన్నంతకాలం వర్గపోరు కొనసాగుతూనే ఉంటుంది. "మనిషి మనిషిగా మనుగడ సాగించే రోజు కావాలి. మనిషికై మనిషి పాటుపడే ఘడియ రావాలి. సమత కోసం, క్రాంతిలో నైనా శాంతి సాధించాలనే కవి ఉద్దేశం ప్రశంసనీయం". "శైవ, వైష్ణవ మతాల మధ్య ఘర్షణ, కులాల ఆధిపత్యం, ఉన్నత వంశజులు దళిత నాయకత్వాన్ని నిరాకరించడం పెత్తందార్ల ఆధిపత్యానికి,

అభిజాత్యానికి ప్రాధాన్యత తగ్గటం ఇలాటి కారణాలే పల్నాటి యుద్ధానికి దారి తీశాయని కవి ఇందులో నిరూపించాడు".

అన్ని వర్గాల వారికి సమాన ప్రాతినిధ్యం కల్పించాలనే ఉద్దేశం, అట్టడుగున ఉన్న జాతిని ఉద్ధరించాలంటే వారికే పట్టం కట్టాలనే అభిప్రాయం, మనుషులంతా ఒకటేనని సమాన ప్రతిపత్తిని కల్గించాలనే ఆశయాన్ని బ్రహ్మనాయుని ద్వారా కవి వివరించాడు.

సక్రమంగా పరిపాలన చేయనివ్వరు అక్రమ పరిపాలకులు అనేది కవి చూపించాడు. పెట్టుబడిదారులు తమ మనుగడకి ముప్పు వాటిల్లకుండా ఉండడం కోసం ఎప్పుడూ కూడా దేశాన్ని సవ్యంగా ఉండనివ్వరు. వాళ్ళ సుఖం, పదవులకై మానవత్వం విడిచిపెట్టి అమానుష చర్యలు చేయడానికి వెనుకాడరని కవి స్పష్టపరిచాడు. దేశానికి అరిష్టాన్ని కల్గించే వారినైనా కొన్ని సందర్భాలలో పదవుల్లో నిర్ణయించాల్సి వస్తుందని నాగమ్మను చిత్రించిన తీరులో కవి సూచించాడు.

మత ప్రాబల్యంగల రాజ్యంలో శాసనధిక్కారం చేసి లౌకిక రాజ్య విస్తరణకై పాటుబడుతున్న సంస్కరణను రూపుమాపి మళ్ళీ శాసనాధికారాన్ని తిరిగి ప్రతిష్ఠించాలనే కోరిక కల స్వార్థ, అధికార దాహం గల నాగమ్మ ఉద్దేశాన్ని కవి చిత్రించారు.

దూరాలోచన చేయక ఆవేశపడితే దురాలోచనకు బలి అవుతారని కవి నిదర్శనంగా చెప్పారు. పుంజులలోని రకాలు, పందాలు వేసే విధానం, వాటి పరిస్థితులను కవి చక్కగా వర్ణించారు. ఓడిన వారు, గెలిచిన వారు ఎలా ఆవేశ పడతారో తొందరపాటుతో, ఆలోచనా రహితులై మత్తులో పెద్దల మాట కూడా తిరస్కరిస్తారనే విషయాన్ని కోడి పందెముల సందర్భంలో కవి చక్కగా వివరించాడు.

"పెద్దల మాట చద్ది మూట" అన్నట్లుగా పెద్దలను తిరస్కరిస్తే ఏం జరుగుతుందో చెప్పారు. ఆవేశం కాదు, ఆలోచన, అనుభవం చాలా ముఖ్యమని

చెప్పారు. అనవసర పౌరుషాలు పనికి రావని, "అనువుగాని చో అధికులమనరాద"ని వివరించారు. ఒప్పందం ప్రకారం ప్రయాణం అయి జరిగి అనర్థానికి చింతించాడే కానీ, నలగామరాజును మందలించకుండా తన పెద్దరికాన్ని బ్రహ్మన్న నిలుపుకున్నాడు. అంతేకాక ధర్మ దీక్ష కలవాడు .. కనుక ఓర్పు వహించాడు ఇక్కడ ఇంకొకటి ఉంది. ఏమంటే "శక్తి, యుక్తులు ఉన్న వాళ్ళు ఎక్కడైనా ఎప్పుడైనా, ఎలాగైనా హాయిగా ఉంటార"ని కవి ఆలోచన. తాత్కాలిక పరాజయం పొందినా "అంతిమ విజయం సత్యాని"దేనని కవి ఉద్దేశం.

దుర్మార్గుల మధ్య సన్మార్గులు ఇమడలేరు అని నాగమ్మతో అలరాజు సంభాషణల ద్వారా కవి స్పష్టం చేశారు. రాబోయే విపత్తును ఊహించి ఇంక జీవితం అనవసరం అని, నిండు జీవితాన్ని వదలుకోవటంలో నీతిమంతునిగ అలరాజుని ఉన్నతునిగా చేశారు కవి. పదవి కోసం ప్రాణాలు తీస్తారనే విషయాన్ని నాగమ్మ, నరసింహరాజుల ద్వారా కవి వివరించారు.

ఇటు నలగామరాజు తన చేయి దాటిన పరిస్థితిని గుర్తెరిగి, అశక్తుడై తన మనసుకు పరిష్కారం దొరకక లోలోన మథన పడ్తున్న పరిస్థితి కవి సమర్థంగా చిత్రించారు. రాజు కూడా మనిషేనన్న విషయాన్ని, రక్త సంబంధం, దాని విలువలు కవి స్పష్టపర్చారు.

"రాజ్య కాంక్షతో మానవతను హత్య చేస్తారనే" అలరాజు మరణం నిదర్శనం అని కవి సూచించారు. అలరాజు మామ, భార్యల మనస్తాపం ఎనలేనిది అని ఇక్కడ సాంఘిక స్థితిని, సహగమన ధర్మాన్ని విశదపరిచారు. మాంచాల బాలచంద్రుని కర్తవ్యోన్ముఖుని చేసిన తీరును కవి చాలా విశిష్టంగా నిరూపించారు.

"ఇందులో కుల, మత, వైషమ్యాలు పనికిరావని, దేశభక్తి, దేశ సమైక్యత ముఖ్యమని, మానవతను పెంచాలనీ కవి ప్రధానంగా ఉద్దేశించి ఈ కథ" ద్వారా నిరూపించారు.

# అభిమన్యు యుద్ధం

పంచపాండవులు ఇంద్రప్రస్థానాన్ని ఏలుతున్నారు. సుభద్రార్జునుల వివాహానంతరం అన్యోన్యంగా జీవిస్తున్నారు. మహాబలుడు, సద్గుణ సంపన్నుడు, సాహసి, సవ్యసాచి, జగదేకవీరుడు, విజయుడు, ఆత్మ స్థైర్యంగల పాండవ మధ్యమునికి అన్ని విధముల సరి జోడి అయిన సుభద్రతో అన్యోన్య దాంపత్యంలో వారికి వారే సాటి అన్న విధంగా ఉంటున్నారు. స్త్రీకి మాతృమూర్తి కావాలనే కోరిక ఫలించినట్లుగా సుభద్ర గర్భం ధరించింది. ప్రతి స్త్రీలానే ఆమె కూడా కథలను చెప్పించుకోవటానికి ఇష్టపడుతుంటే, అర్జునుడు ఆపద్బాంధవుడైన శ్రీ కృష్ణపరమాత్మ ముద్దుల చెల్లికి పద్మవ్యూహాన్ని వర్ణించి చెప్పుచుండగా నిద్రలోకి వెళ్ళిపోగా మధ్యలోనే ఆపివేశాడు. అంత గర్భమందున్న శిశువు అంతవరకు మాత్రమే ఆలకించింది.

ఓ శుభముహూర్తాన అందమైన మగబిడ్డను ప్రసవించింది సుభద్ర. కన్నతల్లి కౌగిలిలో మురుస్తూ, కన్న తండ్రి కళ్ళలో మెరుస్తూ దిన దినాభివృద్ధి చెందుతుండగా "అభిమన్యు" అని నామకరణం చేశారు. "అక్షరాభ్యాసం చేసే సందర్భంలో ఎన్నో వస్తువులు, తినుబండారాలను ఎదురుగా ఉంచినా అభిమన్యుడు విల్లును తాకాడు". అమ్మ, తండ్రులు, మామలు, అత్తలు మురిసిపోయారు. అత్తలు అమ్మ డాబులు, మామలు అబ్బ బడాయి అని సరసోక్తులతో చమత్కరించి నవ్వుకున్నారు. అందరూ అక్షరాభ్యాసం చేయించి ధీరత్వంతో వీరుడవు కావాలని దీవించారు. పరమాత్మ ఆశీర్వాదమా అన్నట్లు వేద వేదాంగాలు, అస్త్ర, శస్త్ర, యుద్ధ విద్యలు అతి నేర్పుతో, స్ఫూర్తితో నేర్చుకుంటున్నాడు.

కౌరవ సభలో జూదమాడుటకై పాండవులను హస్తినకు పిలిచారు. నీతి మాలిన శకుని, ధర్మ నందనుడు మాయాద్యూతంలో తన తమ్ములను, తన్ను,

తాను, భార్య అయిన పాంచాలిని ఫణంగా పెట్టి ఓడిపోయాడు. "ఒక ఏడాది అజ్ఞాత వాసమూ, పన్నేండేండ్లు అరణ్య వాసమూ చేయడానికి సిద్ధపడ్డారు. ధర్మ నిరతిని కాపాడడానికి పాండవులు అన్న మాటకు అన్యథా చెప్పక కట్టు గుడ్డలతో అరణ్య వాసానికి వెళుతూ, పాండవ మధ్యముడు ఆత్మబంధువు సోదరి అయిన సుభద్రను పుట్టినింటినే ఉంచాలని భావించి "సుభద్రా బండ్లు ఓడలు, ఓడలు బండ్లు అగుట" అనగా ఇదేనేమో, నాకు తెలుసు. నీకు ఇక్కడ ఏ లోటూ ఉండదు. కానీ నీవు మాత్రం కంటికి రెప్పలా మన బిడ్డను కాపాడు" అని వ్యథాపూరిత మనస్కుడై అడవులకు వెళ్ళాడు.

నాయనా! ధర్మం కోసం నీ తండ్రులు వీరపుత్రులు, శత్రు భయంకరులు అయినప్పటికీ కూడా అడవులలో ఆకులు, అలములు తింటూ, బండరాళ్ళపైన, పచ్చికపైన సుఖం మరచి నిద్రిస్తూ అష్టకష్టాలు పడుతున్నారు. కానీ మనం అంత:పురంలో ఉంటున్నాం. నీవు మాత్రం "అసత్య మాడక, యుద్ధంలో వెనుదీయక, ఆడిన మాట తప్పక, అహం చంపుకుని, కోరికలను నశింప చేసుకుని, మనసుతో పరుగులెత్తక బుద్ధిగా ఉండాలి. అంతేకాక సకల విద్యలందును, సమస్త కళలందును నేర్పరివై మన వంశానికి పేరు ప్రతిష్ఠలు పెంచాలని సుభద్ర తన తనయునికి బోధించింది.

తదనంతరం సుభద్ర ఒంటరిగా "పుట్టింటి వద్ద అడపడుచు ఉండడం కన్న నరకం మరొకటి లేదు ఇట్టి పరిస్థితి పగవారికి కూడా వద్దని" కోరుకుంటూ ఆ బ్రహ్మరాతను నిరసిస్తూ ఆడవారికి ఇన్ని కష్టాలు లిఖిస్తాడా అని తన బాధను తెలియజేసుకున్న స్వగతంలో సృష్టికర్తను మతిలేని వానిగా, మగాడిగా ఊహించింది, ఆ క్షణంలో సుభద్ర.

సుగుణవల్లి సుభద్ర ఇలా మథన పడుతుండగా వార్తా హరుడొచ్చి "అమ్మా!

ꣳయము, జయము, పాండు పుత్రులు క్షేమంగా విరాటుని కొలువున ఉన్నారు. వెనువెంటనే మిమ్ము తోడ్కొని రమ్మన్నారు" అనగానే కనులు మూసినా తెరచినా తన నాథుని జ్ఞాపకాలను మరువలేక ఇన్నాళ్ళు సుభద్ర ఓపిక పట్టింది. ఒక్కసారిగా తన నాథుడు వస్తున్నాడన్న వార్త వినగానే జలజల కన్నీరు వచ్చినా అదే క్షణంలో వెంటనే ఆనంద పులకిత అయింది. తన కుమారుని పిల్చి "నాయనా మనం మన వాళ్ళను కలుసుకునే శుభతరుణం వచ్చింది. పద బాబూ" అని అమితోత్సాహంతో పుట్టింటికి వీడ్కోలు చెప్పి ఇరువురు బయలుదేరారు.

అర్జునుడు తన భార్యా పుత్రులను అక్కున చేర్చుకుని ప్రపంచాన్ని మరచి రక్త సంబంధపు వియోగ వ్యధను మర్చిపోయి పునస్సమాగమనానికి అమితానంద పడ్డాడు. అంతట అర్జునుడు ఇలా చెప్పసాగాడు. "సుభద్రా మనం చేసిన సహాయాలను మన వంశంలో తన కుమార్తె ద్వారా మనతో సంబంధ బాంధవ్యాలను ఏర్పరచుకోవాలనే కుతూహలంతో విరాట రాజు ఉన్నాడు. కావున నీకు ఇష్టమైనచో ఉత్తర నీకు కోడలు కాగలదని" విషయం వివరంగా చెప్పాడు. 'నా కోడలు, మీ కోడలు కాదా? మన కోడలు' అని చమత్కరించగా మనసారా నవ్వుకున్నారు.

పెద్దలు శుభ ముహూర్తము నిర్ణయించారు. సుభద్ర, ముత్తయిదువులు అభిమన్యుని పన్నీట స్నానం చేయించి, సుకుమారమైన వస్త్రాలు కట్టి, కస్తూరి తిలకం దిద్ది, నొసట బాసికం కట్టి, పట్టుబట్ట తలకు చుట్టి, మణిహారం వేసి, పెళ్ళి కుమారుని చేసి మన్మథుడినే మరిపించాడన్న వార్తను సుభద్రకు చెలికత్తెలు చెప్తూ నీకు బ్రహ్మ అందం, ఈడుజోడును చూసి ఈ జంటను సృష్టించాడని అభివర్ణించారు.

ఉత్తరను ఇష్టసఖులు సుగంధపు నూనెలు రాసి, పన్నీటి స్నానం చేయించి, ఉంగరాల నీలి కురులను దువ్వి, పూల జడను వేసి, చీర కట్టి, అద్దాల రవిక తొడిగి, నీలి చుక్కను సిగ్గులొలుకు బుగ్గలపై పెట్టి మేలి ముసుగులో నున్న

రతిలా తోడ్కొని వచ్చి అభిమన్యు సరసన కూర్చుండబెట్టారు. పెళ్ళి పందిరిలో పచ్చ తోరణాలు, ముత్యాల తోరణాలు, మంగళ వాద్యాలు మ్రోగుచుండగా, పుణ్యాంగనలు హారతులీయగా, వేద మంత్రాల సమక్షంలో అగ్నిసాక్షిగా వివాహం అంగరంగ వైభవంగా జరిగింది.

నూతన వధూవరులను కలుపుటకా అన్నట్లు సూర్యుడు పశ్చిమ కనుమలకు పయనమయ్యాడు. ప్రతి పలుకు వలపులొలుకుతూ, మత్తుగా, కైపుగా పలకాలని, విడియం (తాంబూలం) మగడు నోటి కందిస్తే వద్దు అనకుండా సిగ్గు పడుతూ స్వీకరించాలి, అంతేకాక బిడియం, దడుపు లేకుండా, చనువుగా ఉన్న పతిని చొరవతో మౌనంగా అంగీకారం తెలపాలని ఇష్టసఖులు తమ అభిప్రాయాలను, అనుభవాన్ని కలిపి రంగరించి వివరంగా చెప్పి అభిమన్యుడున్న మందిరం దగ్గరకు తీసుకుని వచ్చి కుమారా! ఉత్తర కుమారి చాలా సుకుమారి, అతి గారాబంగా పెరగటం వలన వగలు, వలపులు, వగైరాలు ఏమీ తెలియని ముగ్ధ. అందునా అమాయకురాలు, కావున మీరు సరసంగా, సరళంగా సుఖ జీవితాన్ని ఆనందంగా నిండు నూరెళ్ళు గడపండని" ఏకాంతం ఏర్పాటు చేసి వెడలి పోయారు.

మంద గమనకు చిరు చెమట పోసి, నేలను బొటన వేలితో రాస్తూ దృష్టిని అక్కడే నిల్పి తలవంచి గుండె దడతో ఉంది. అంతట మదన ప్రేరితుడైన అభిమన్యుడు ఉత్తరను సమీపించి కౌగిలించుకొనగా ఏదో తెలియని అనుభూతి ఇద్దరినీ ఆవేశించి సిగ్గు, బిడియం పటా పంచలై ఇరువురు ఒకరై ప్రపంచంతో సంబంధం లేని ఆనందాతిరేకంతో ఊహలను నిజం చేస్తూ స్వర్గాన్ని, మదన సామ్రాజ్యాన్ని ఏలుతూ ఉన్నారు.

సంజయ రాయబారం, శ్రీకృష్ణ పరమాత్మ రాయబారం రెండును విఫలమయ్యాయి. కురుక్షేత్ర మహా సంగ్రామం అతి భీభత్సంగా జరుగుతూ ఉంది. భీష్ముడు అంపశయ్యపై శయనించగా, వెంటనే ద్రోణాచార్యుడు సర్వ

సైన్యాధక్షుడైన శుభ తరుణంలో "శిష్యా! సుయోధనా! నీ అభీష్టాన్ని తెల్పు నెరవేరుస్తాను" అన్నాడు. అంతట సుయోధనుడు ధర్మరాజును ప్రాణాలతో బంధించి తెమ్మని కోరాడు. ఆచార్యుడు అర్జునుడు కదనరంగ మందు లేని తరుణంలో నీ కోరిక నెరవేరగలదని వివరించాడు.

కృష్ణార్జునులు త్రిగర్తలాధిపతులైన సంశప్తకులపై యుద్ధానికి వెళ్ళగా ఇదే సరైన సమయం అని ద్రోణాచార్యుడు అన్యులకభేద్యమైన పద్మవ్యూహాన్ని పన్ని సింహద్వారముననే ధర్మజుని బందీకృతుని గావించెదనని ప్రతిజ్ఞ చేసినాడన్న వార్త. చెవిన పడిన పాండవులు, దిక్కుతోచక, ఏమీ పాలు పోక ఆలోచిస్తున్నారు. అంతట అభిమన్యుడు అగ్గిమీద గుగ్గిలమై, క్రోధంతో పచ్చల పిడిబాకు చేపట్టి, విల్లంబులు ధరించి, పతాకత్తి ఒరలో పెట్టి తండ్రుల వద్దకు వచ్చి గర్భస్థ శిశువుగా ఉన్నపుడు పద్మవ్యూహ రహస్యం నేను విన్నాను. నాకు పద్మవ్యూహం లోనికి వెళ్ళటం వరకే తెలుసునని చెప్పాడు. ధర్మజుడు సందేహించినా, భీముడు మాత్రం నీ వెంట నేనుంటాను పద నాయనా అని ఊతమివ్వగా వెంటనే అభిమన్యుడు తల్లి దీవెనలందుకొనుటకు వెళ్ళాడు. మాతృ హృదయం కలవరపడి "నీవా చిన్న వాడవు, అదీ కాక మీ జనకులు తాను లేని సమయాన రణస్థలికి పంపవద్దని చెప్పారు. అదీ కాక నీవు తండ్రివి కాబోతున్నావు తండ్రీ అని చెప్పి, నీ శక్తి నాకు తెలుసు, కానీ రణ భూమిలో అంతా అన్యాయం కనుక నీకు అంతగా తెలియదు. అందుకని నేను భయపడుతున్నానని" బదులు చెప్పింది. "అమ్మా! నీవు వీరపత్నివే కాదు, వీర మాతవు కూడా. అయినా చావు మనిషిని వెన్నంటే ఉంటుంది కదా. 'యుద్ధమందు విజయమో, వీర మరణమో' క్షత్రియ ధర్మం కదా మాతా నీకు తెలియనిది ఏమున్నది" అని ఒప్పించాడు. మనం ఎల్లప్పుడూ పరమాత్మ సంరక్షణలో ఉంటాము. ఆ ధైర్యంతో నిన్ను పంపిస్తున్నాను నాయనా అని కలత చెందిన హృదయంతో సెలవిచ్చింది.

తదుపరి ఉత్తర వద్దకు వచ్చిన అభిమన్యుడు పట్టరాని సంతోషంతో ముద్దాడబోగా, ఉత్తర ఆవేశంతో అటు యుద్ధభూమిలో రక్తం ఏరులై పారుతుంటే, ఈ ప్రవర్తన వింతగా ఉన్నదని మందలించింది. "దేవీ ! నేను కామినై భూమికి బరువౌతాననుకున్నావా, కాదు, అమ్మ చెప్పింది నీవు అమ్మవు కాబోతున్నావని, ఆ సంతోషాన్ని పంచుకుందాం అని ఒక్క క్షణం ఇలా వచ్చాను. అందునా మన బిడ్డను వీరత్వానికి, విజ్ఞానానికి సమ ప్రావీణ్యం కలవానిగ చేయాలని నా ఆకాంక్ష" అన్నాడు. "విత్తును బట్టే మొక్క" అలానే జరుగుతుంది నాథా! కానీ "యుద్ధ మందు వెన్ను చూపిన వారిని వెన్నంటి చంపవద్దు. చేయెత్తి మొరలిడిన సంహరించవద్దు. వీరుని వలె నీ శౌర్యాన్ని ప్రదర్శించు" అను రాజనీతిని తెల్పి సమరోత్సాహాన్ని కల్గింపజేసి పంపింది.

"లక్షా ఇరవై ఒక్క వేల డెబ్బై రథాలు, ఇరవై ఒక్క వేల ఎనిమిది వందల డెబ్బై ఏనుగులు, పదివేల మూడు వందల ఇరవై కాలి బంటులు మొత్తం కలసి ఒక "అక్షౌహిణి". అట్టి కొన్ని అక్షౌహిణులతో ద్రోణుడు పద్మవ్యూహ రచన చేశాడు. మోసపూరితమైన పద్మవ్యూహ రచనపై అమిత క్రోధంతో యుద్ధ సన్నద్ధుడై వస్తున్న అభిమన్యుని చూచిన ద్రోణుడు "భామల కౌగిలి కాదు యుద్ధం" అని ఎగతాళిగా అన్నాడు. "మూడు కాళ్ళ ముదుసలీ ! ఇంకా నేను బ్రతికే ఉన్నాను నీ ఆట కట్టు. నే బాలుడను కాను, నీ పాలిట కాలుడను" అని ద్రోణ బాణ వర్షం చెల్లా చెదురుచేస్తూ, విల్లు త్రుంచి, సారథిని, గుర్రాలను చంపగా తటాలున ద్రోణుడు ప్రక్కకు తప్పుకున్నాడు. ద్రోణుడు పరాజితుడు కాగా పద్మవ్యూహాన్ని ఛేదించి లోపలికి ప్రవేశించాడు. ద్రోణుడు మళ్ళీ వేరే రథంలో యుద్ధభూమికి వచ్చి ధర్మజుని, అతని ముగ్గురు తమ్ములను సైంధవుడు వరం ప్రకారం అడ్డగించగా ధర్మజుని బంధించి, విజయ శంఖం పూరించగా, అది విన్న అభిమన్యుడు కురు సైన్యాన్ని చీల్చి చెండాడు తుండగా, "అగ్నికి వాయువు తోడైనట్లు" ఘటోత్కచుడు యుద్ధంలో

అభిమన్యునికి సహాయంగా, అండగా నిల్చాడు. "చిచ్చర పిడుగుల్లా చిత్త జల్లులా, చిటపట చినుకుల్లా" శరములు వదులుతూ కురుసేనలను తుత్తునియలు చేస్తూ చెల్లా చెదురు చేస్తున్నారు.

అంతలో దుశ్శాసనుడు ఎదురై "బాబూ, గోలీలాట కాదిది, యుద్ధం, యుద్ధమంటే సహ బాలురతో ఆటలాడుట కాద"న్నాడు. అంతట అభిమన్యుడు కోపంతో " ఛీ, తుచ్ఛుడా, అబలల జుట్టు పట్టి అవమాన పర్చుట కాదు. మాటకు మాట దెబ్బకు దెబ్బ కాచుకో" అని బాణ వర్షం కురింపించగా, దుశ్శాసనుని విల్లు విరిగి మూర్ఛిల్లగా చంపనెంచి బల్లెమెత్తాడు. పెద తండ్రియైన భీమ ప్రతిజ్ఞ జ్ఞప్తికి వచ్చి, విరమించి నీ కింకా ఆయుష్షు ఉందిపో అని ముందుకు సాగిపోయాడు అభిమన్యుడు.

తదనంతరం అగ్గిపిడుగై వీర కుమారుడు స్వైర విహారం చేస్తుండగా సుయోధనుడు అగుపించగా "కురు రాజా! వంశ నాశన కారకుడువు నీవే. ఇన్ని ఇడుములకు, ఈ యుద్ధానికి కూడా నీవే కారణం. కాబట్టి నీవు పోతే మన మధ్య ఈ వైషమ్యాలుండవు" అని ఒక్కసారిగా మత్తేభ కుంభ స్థలాన్ని చీల్చే సింహంలా ఉగ్రుడై ఊపిరి సలుపనీయక బాణ పరంపరచే తట్టుకోలేని పరిస్థితిని కల్పించి అస్త్రం సంధించగా వాయుపుత్రుని ప్రతిజ్ఞ జ్ఞప్తికి వచ్చి" బ్రతికి పోయావు, కాకిలా ఇంకా కొంతకాలం బ్రతుకు" అని వదిలి వేయు సమయంలో ద్రోణుడు దూరం నుంచి ఇది చూసి వెంటనే అందర్నీ సమీకరించాడు. అన్యాయం అనకుండా అందరూ కలసి అభిమన్యుని హతమార్చాలని నిర్ధాక్షిణ్యంగా చెప్పాడు. ఏనుగులు గుట్టలుగా పడుచున్నాయి. సైన్యం అమితంగా నశించగా మిగిలిన సైన్యం పారిపోవుతుండగా ఎంతో నష్టం జరిగింది. మధ్యాహ్న సూర్యునిలా అభిమన్యుడు చండ్ర నిప్పులు చెరుగుచుండ ఎవరూ నిలవలేరు కనుక అంతా ఒక్క సారిగ దాడి చేయండని ఆనతివ్వగా, ఆచార్యుడు చెప్పిన రీతిగనే కర్ణుడు అధర్మం అయినా

తప్పక మనసు చంపుకుని ధనుసు తుంచాడు. శల్యుడు గుర్రాలను కూల్చాడు. సారధిని కృపుడు చంపాడు. కురుపతి తమ్ములు రథమును ముక్కలు చేశారు. విరథునిపై దుశ్శాసన తనయుడు రథం పోనివ్వగా తప్పుకుని గదతో అందర్నీ ఒక్కసారిగా ఎదుర్కొన్నాడు. రాజనీతిని మాలిన పెద్దలు బాలుని అధర్మంగా కుప్పకూల్చారు. అలా బాలునిపై కుట్ర చేసి అంతమొందించారు. ఒక్కని ఉక్కడిగించారు.

ఈ వార్త విన్న ధర్మజాదులు వీర పుత్రుని పోగొట్టుకున్నాం. తల్లిదండ్రులకేం సమాధానం చెప్పి అనునయించాలో అని కుమిలి పోతున్నారు. ఈ వార్త తెలిసిన కన్న తల్లి, ప్రాణ సతి తట్టుకోలేక, కంటికి మంటికి ఏకధారగా ఏడుస్తున్నారు. త్రిగర్తలాధిపతులైన సంశప్తకులపై యుద్ధానికి వెళ్ళి వచ్చిన శ్రీకృష్ణార్జునులు తల్లడిల్లిన హృదయంతో కొంత తడవునకు తేరుకుని, అర్జునుడు సూర్యాస్తమయంలోగా ఆ దుష్ట సైంధవుని హతమారుస్తానని ప్రతిజ్ఞ చేసి సంహరించాడు.

అభిమన్యుని విషయంలో ఎలా మోసం జరిగిందో మనకు కవి సందేశాత్మకంగా చెప్పారు. శక్తిమంతుడైన వానిని అలా అంతమొందిస్తారని కవి ఆలోచన. దేశాన్ని కాపాడటం కోసం ప్రాణాలైనా అర్పించి దేశభక్తిని పెంపొందింప చేయటానికి కవి ఈ అభిమన్యుని ఆదర్శంగా చెప్పారు. యువత మెలకువగా ఉండి తన రక్షణతో దేశ రక్షణ చేయవలసిన బాధ్యత ఉంది. 'తన కన్నా దేశం మిన్న' అనే సందేశాన్ని చెప్పటం కోసమే, పోరాట పటిమ పెంచటం కోసమే అభిమన్యుని ఆయుధంగా తీసుకున్నారు కవి.

అభిమన్యుని అన్నప్రాసన సందర్భంగా కుటుంబ వ్యవస్థలోని తల్లిదండ్రుల సరదాలు, ఆలనాపాలన, ఆచార వ్యవహారాలను, చదువు గొప్పతనాన్ని కవి చాలా చక్కగా వర్ణించారు. అక్షర జ్యోతితో అజ్ఞానాంధకారాన్ని పారద్రోలి విజ్ఞాన వెలుగులు వెదజల్లాలనే ఆశయాన్ని కవి చెప్పారు.

సుభద్ర అర్జునుని కథలు చెప్పమనటంలో గర్భం ధరించిన వారి కోరికలను, స్త్రీల మనస్తత్వాన్ని చక్కగా విశదపరిచారు.

విద్య విశిష్టతను తెలుపుతూ 'విద్య వివేకాన్నీ, వినయాన్నీ పెంచి విజ్ఞతను నేర్పుతుంది'. కావున విద్యావంతుడు కావాలని కవి స్పష్టపరిచారు. అంతేకాక రాజనీతిని తెలిసి, రాజవంశానికి పేరు తేవాలని తల్లితో అభిమన్యునికి లోక సహజ రీతిని చెప్పించారు. మరల తండ్రుల కష్టదశలను వివరించి కుమారుని కర్తవ్యోన్ముఖుని చేసింది. తల్లి ప్రథమ గురువు అను విషయాన్ని కవి విశదపర్చారు. అదీ కాక సత్యం కోసం హరిశ్చంద్రుడు తన సర్వస్వాన్నీ వదులుకుని భార్యాపుత్రులను అమ్మి, తాను కూడా అమ్ముడుపోయి చివరకు ఛండాలునిలా కాటికాపరి అయ్యాడని అలా సత్యవంతునిగా ఉండమని తల్లి చెప్పింది. అలానే శిబి, బలి చక్రవర్తులు కీర్తికోసం తనను తాను, తమ సర్వస్వం ఇతరులకు ఇచ్చారు. అలాగే విశ్వామిత్ర, దుర్వాస మహర్షులు తమ కోప కారణం చేత తమ తపశ్శక్తిని కోల్పోయారు అని పురాణాలలోని నీతులను చెప్పి పురాణ పురుషునిగా కుమారుని తయారు చేయాలని తల్లి తల్లడిల్లుతూ చెప్పినట్లు కవి తన లోకజ్ఞతను, సమయస్ఫూర్తిని చాటుకున్నారు.

ఆడపిల్లలు పెళ్ళైన పిదప ఎన్ని కష్టాలొచ్చినా పుట్టినింట్లో ఉంటే కలిగే ఇబ్బందులను సుభద్ర పరిస్థితిని చెప్తూ కవి తన లౌకిక జ్ఞానం విశదపరిచారు. పగ వారినైనా క్షమించగల భర్త వియోగాన్ని, మానసిక క్షోభను కవి చెప్పాడు. విధాత కూడా పురుషుడే కాబట్టి స్త్రీలకే కష్టాలన్నీ నుదుట రాస్తాడనే ఊహని సుభద్ర అనుకున్నట్లు ఇక్కడ ఔచిత్యాన్ని చూపించారు.

అరణ్య, అజ్ఞాత వాసముల అనంతరం సుభద్రార్జునుల పునస్సమాగమనాన్ని వివరించేప్పుడు భార్యాభర్తల సరస సంభాషణను కవి వివరించారు.

ఉత్తరాభిమాన్యుల వివాహ ఘట్టం మనోజ్ఞంగా పట్టి చూపి 'సకలం కుశలం'గా కవి చిత్రీకరించారు. సహజంగా వివాహ వ్యవస్థను, ఆచార వ్యవహారాలను, సంస్కృతిని కవి పట్టి చూపారు.

కవి కథాగమనంలోను, సంభాషణలలోను పాత్ర ఔచిత్యాన్ని కాపాడుతూ ఎంతో మెలకువగా వర్ణించారు.



పెత్తందార్లు సినిమాకు ఎన్టీఆర్‌కు బుర్రకథ అడుగులు అభినయాలు తర్ఫీదిచ్చిన నాజర్



అగ్గిరాముడు సినిమాలో అల్లూరి సీతారామరాజు బుర్రకథ చెప్పున్న నాజర్ బృంద

# నేటి రాయలసీమ

సకల సంపదలకు నిలయమైన ఆంధ్రదేశం రాయల పాలనలో లలిత కళలతో విలసిల్లినదిగా చరిత్రలో ఒక స్థానం ఉంది. కొండ వాగులతో నిండి తుంగభద్రా నది కొంగు బంగారంలా ఉండగా సిరులు పండు ఒ ంగారు భూమిగా, వీర గడ్డగా పేరు గాంచినది. తెలుగు దేశంలో వర్తకానికి ఒరవడి పెట్టింది, విజ్ఞానవంతులకు నిలయంగా ఆనాడు విలసిల్లింది.

అలా బతికి చెడ్డ రాయలసీమలో 'రాయపేట' అను గ్రామం కలదు. ఆ ఊరిలో కడు నీతిమంతుడు భూపతయ్య. అతని భార్య సీత, వృద్ధుడైన తండ్రి ఉన్నారు. కల్లకపటం తెలియని కష్టజీవులు. ఉన్న కొద్ది భూమినే (కొంద్ర) నమ్మి జీవిస్తున్నారు. అన్ని పనులందు పతికి అతివ చేయూతగా ఉండేది.

భూపతయ్య తనకున్న రెండెకరాలతో పాటు షావుకారు బ్రహ్మయ్య దగ్గర అయిదెకరాల పొలం కౌలుకు తీసుకుని, ఎద్దులను కొని, నోటు వ్రాసి, అదును తెలిసి అందరితో పాటు వ్యవసాయం చేయనారంభించాడు. అడపాదడపా ఏటా వానలు పడుతూనే ఉన్నాయి. తాలో తరకో పోగు చేసి రైతులు కౌలు చెల్లబెడతారు. కౌలుకు తీసుకున్న రైతులు గంజో గట్టో వేళకింత గొంతు తడుపుకుంటూ, ఎండుతూ, తడుస్తూ, వణుకుతూ కాలం వెళ్ళబుచ్చుతారు. ఇదిలా ఉండగా మిన్ను వంక మెడలెత్తి జనులు చూస్తుండగా కళ్ళలో ఆనందం వెల్లివిరిసినట్లు ఉరుములు, మెరుపులతో వర్షం కురిసింది. కోలాహలంగా దేవతలకు కొలుపులు కొల్చి, రైతులు ఎద్దులను సింగారించి, కోటేరు వేసి అమితోత్సాహంతో ఏరువాక పాట పాడుతూ సాగారు.

"ఎన్నో కష్టనష్టాల కోర్చి, పండి వంగిన పైరులను కోసి నూర్పిళ్ళు కూడా అందరూ కలసి ఒకరి కొకరు బదులు పనులకు వెళ్తూ పరస్పర సహకారంతో అంతా కలసి మెలసి ఆడుతూ, పాడుతూ పనులు చేస్తూ వరి కుప్పలు

నూరుస్తున్నారు".

భూపతయ్య పొలం పనిలో వంచనలేని మంచితనం గల మనిషి. మోపు కట్టినా, మేడి పట్టినా అలుపు సలుపు లేనివాడు. భార్య సీతమ్మ ఇంటి పనంతా చిటికిలో ఒంటరిగానే చేసుకుని, తట్ట చంకన పెట్టుకుని భర్తకు అన్నం తీసుకుని పొలానికి వెళ్ళి గంపనిండా గడ్డి కోసుకుని ఇంటికి చేరేది. తన పుట్టింటి వారిచ్చిన ఆవును ప్రేమగా చూస్తూ, కోడెను ఇస్తుందని శ్రద్ధగా మేపుతూ మిగిలిన అన్నం పెడుతుంది. సీతమ్మ ఆవుకు కోడె పుట్టిన నీ కొండకొచ్చి తలనీలాలిస్తామని, సీతమ్మ తనకు కొడుకు పుట్టిన నిలువు దోపిడీ ఇస్తానని వెంకటేశ్వరునికి మొక్కింది.

ఆమె కోరిక ప్రకారమే మగబిడ్డ పుట్టాడు. పున్నమి చంద్రుని కన్న మిన్నయని దంపతులు మురిసి, బారసాల ఘనంగా చేయనెంచారు. చుట్టాల పుట్ట పగిలితే చీమలొచ్చిన రీతిగా 'పట్టెమంచం విరిగేట్లుగ తిష్ఠ వేశారు'. అరగించటానికే వచ్చిన చుట్టాలను ఆ దంపతులు చక్కగా ఆదరించారు.

ముద్దుల కొడుకునకు 'ఆనందయ్య' అని పేరును ఆనందంగా నిర్ణయించారు తల్లిదండ్రులు. తదనంతరం చుట్టాలు వెళ్ళలేక వెళ్ళారు.

ఇదిలా ఉండగా గొడ్లచావిడి నుండి తండ్రి ఆనందంగా వస్తూ "భూపతయ్యా! మన చిట్టిబాబు పుట్టిన వేళా విశేషం సీతమ్మ చేతి చలువతో ఆవుకు కోడె దూడ బుధవారం రోజున పుట్టింది" అని చెప్పాడు. ఈ వార్త విన్న భూపతయ్య సంతోషముతో కొష్టము వద్దకెళ్ళాడు. తండ్రి వెనుక జొన్నలు చేటతో తీసుకువెళ్ళాడు. అంత సీతమ్మ తన ముద్దుల కొడుకును హృదయానికి హత్తుకుని మహానందంతో ముద్దాడింది. "లాలి నా బంగారు కొండ, పాలు త్రాగు బొజ్జ నిండా నీకు తమ్ముడు పుట్టి తోడుగా ఆడు, వెండి గజ్జెలు నీ మొలకు, ఇత్తడి మువ్వలు తమ్ముడి మెడకు, కలసి సుఖంగా ఆడతారా? విద్యలు నేర్చుకుంటారా? బుజ్జాయి వ్యవసాయం చేసి రతనాలు పండించి, స్థితిపరుడవై బ్రతుకు నాయనా లాలి

అని పాడిన సీతమ్మ వలెనే ఊరంతా హాయిగా ఆ సంవత్సరం గడిపారు.

మళ్ళీ తొలకరి వచ్చింది. ఆకాశం వంక ఆశగా చూస్తున్న రైతులకు నిరాశలే మిగిలింది. ఏడాదిలో మబ్బు పట్టిన జాడే లేదాయె, వర్షాకాలం వచ్చినా ఒక్క చినుకు లేదు. "ఉత్తర జూచి ఎత్తర గంపను" అన్న సామెత నిజమైంది. ఇట్టి పరిస్థితిలో ఆ సీమ అల్లాడుతుంది. భూపతయ్యకు సీతమ్మ అన్నం పెట్టి 'మనకు తిండి గింజల్లేవు, పాడి పశువులకు పత్తి గింజల్లేవు' ఎలా ఈ కాపురం గడవడం అని అన్నది. భూపతయ్య చిన్నా పెద్ద లేకుండా ఎందర్ని అడిగినా, ఆఖరికి కాళ్ళు పట్టుకున్నా చిల్లిగవ్వ కూడా అప్పు పుట్టలేదు. సీమ పాడుగాను అని విలపించాడు. 'గొడ్డు, మనుషులు, గుప్పెడు గడ్డి, చారెడు గింజల్లేక సతమతమై చచ్చిపోయే గడ్డు రోజులు' వచ్చాయి. వేరే గత్యంతరం లేక బ్రహ్మయ్యను అడుగుదామన్నా బారసాలకు అంతకు ముందు చేసిన పాతబాకీ ఉంది. అయినా తప్పదు. కనుక అడిగి వస్తానని బ్రహ్మయ్య దగ్గరకు వెళ్ళాడు భూపతయ్య. "బ్రహ్మయ్య బావా అందరితో పాటు వడ్డీ నేనూ ఇస్తాను. పై పంటలో నీ బాకీ మొత్తం ఫైసలా చేస్తాను. అప్పివ్వమని" అడగ్గా భూపతయ్యతో బ్రహ్మయ్య ఇలా చెప్పసాగాడు. "మా ఇంట్లో గుట్టలు పోయడానికి రూపాయల చెట్టు లేదు'. పట్టుకెళ్ళేప్పుడున్న మాటలు ఇచ్చేప్పుడుండవు. మీకు నీతి లేదు ఎవ్వరి సంగతెందుకు నీవు తీసుకున్న వాటి పరిస్థితి ఏమిట"ని గదమాయించాడు. అప్పుడు భూపతయ్య అదేంటి బావా వర్షాలు పడక, పంటలు పండక ఊరు మలమల మాడిపోతుంటే ఎలా ఇస్తారు, ఏమి చేస్తారు అన్నాడు. బ్రహ్మయ్య కస్సుమని లేచి 'పంటలు బాగా పండినప్పుడు పొట్ట పగిలేట్టు తిన్నప్పుడు మీకు బాకీ గుర్తుండదు'. 'తాగినోడే కడతాడు తాళ్ళ పన్ను' అన్నాడు. పాతబాకీ, ఇప్పుడిచ్చేది మొత్తం కలిపి పత్రం రాయించుకో బావా అని భూపతయ్య చెప్పగానే బ్రహ్మయ్య సరే అలాగైతే విను, నూటికి ఆరుంబావలా వడ్డీ. పొలం తాకట్టు పెట్టాలి. అంతేకాదు. వడ్డీ ముందే మినహాయిస్తా. అందరికీ ఇంతే. కావాలంటే అడిగి తెలుసుకో. అయినా

కావాలంటే అరఠావు, నోటు బిళ్ళలు తెచ్చుకోమన్నాడు. తప్పని సరియై భూపతయ్య అప్పు తీసుకున్నాడు.

పెదకాపు బ్రహ్మయ్య పేచీలకు మొనగాడు. అప్పిచ్చి పేదోళ్ళను కోలుకోనీయడు. వడ్డీకి వడ్డీ కట్టి ఊళ్లో ఆడవాళ్ల తాళ్ళు తెంచే దుర్మార్గుడు. పనివాళ్ళకు కూలీకి బదులు బూతుల వాతలే బహుమతులుగా ఇస్తాడు. "నోటితో పలకరిస్తూ నొసటితో వెక్కిరిస్తాడు". ఆ దొర వీధిలో వస్తుంటే ఆడవాళ్లు కనిపించరు. అలా బ్రహ్మ రాక్షసునిలా రాయపేట నేలుతున్న స్వార్థపరుడు బ్రహ్మయ్య.

అట్టి బ్రహ్మయ్యలాంటి కసాయి వాని చేతిలో అమాయకుడైన భూపతయ్య కూడా 'కసాయి వానికి గొర్రెలా' చిక్కాడు. '850/- రూపాయలకు పత్రం రాయించుకుని పాతబాకీ రద్దు చేసి '50/-' రూపాయలు మాత్రమే బ్రహ్మయ్య ఇచ్చాడు. అవి తీసుకుని, బ్రహ్మయ్య వద్ద సెలవు తీసుకుని ఇంటికి వచ్చి భార్యతో జరిగింది చెప్పాడు. సీతమ్మ మనలను గోతిలో దించాడు, ఇలా ఎన్నాళ్ళు, ఎన్ని కాపురాలు కూలుస్తాడు 'వీడిల్లు వల్లకాడుగాను" అని తన బాధను, ఆవేదనను వెళ్ళగక్కింది. భూపతయ్య వేరే దారి లేదు. కులం, వంశమని కూర్చుంటే కూటికి చస్తాం. కూలో, నాలో చేసి బ్రతకాలి. 'కష్ట సుఖాలు కావడి కుండలు'. కావున బాధపడక భూపతయ్య కుటుంబంతోపాటు, గ్రామంలోని చిన్న రైతులు కూలీ చేస్తూ బ్రతుకు గడుపుతున్నారు. వరుసగా మూడేళ్లు వానలు కురవలేదు. ఏరువాక లేదు. విత్తనం చల్లలేదు. బీడులు మోడువారి బీటలు వచ్చి భూమిపై పచ్చదనం లేనేలేదు. పశువులు మేత లేక చిక్కి శల్యమై అరుస్తున్నాయి. ఆ బాధ చూడలేక ఎడ్లను కటికవానికి అమ్మినాడు. సీతమ్మ బావురుమని ఏడ్చి ఆవును, కోడెను అమ్మవద్దని పట్టు బట్టింది.

పశువులను అమ్మినట్లు తెలియగనే చేబదుళ్ళుచ్చిన వాళ్ళు, అప్పుల వాళు ౪ ఇంటి చుట్టూ తిరగటం మొదలు పెట్టారు. ఉన్న పొలం బ్రహ్మయ్య స్వాధీనం

చేసుకున్నాడు. ఇక భూపతయ్యే తలెత్తుకు తిరగలేక పోతున్నాడు. 'పాటు లేదు సాపాటు లేదు' ఇంక ఆ ఊళ్ళో ఉండలేక బాధలు తట్టుకునే ఆత్మస్థైర్యం లోపించి తెగించి 'కన్ను పొడుచుకున్నా కనపడని కటిక చీకటిలో దారి తెన్ను తోచక ఆలోచిస్తూ, పుట్టి పెరిగిన గడ్డను, ఆలు బిడ్డలను తల్చుకుని వాళ్ళ గతి ఏమిటని బాధతోనే., నిస్సహాయతతో గుండె రాయి చేసుకుని వెళ్తూ తెల్లవారేటప్పటికి వేరే ఊరు చేరాడు'.

ఇల్లు విడిచి వెళ్ళిన పతిని తల్చుకుని సీతమ్మ, తండ్రి భోరున ఏడ్వసాగారు. ఆ ప్రాంతం మొత్తం ఇదే స్థితిలో ఉంది. బ్రహ్మయ్య మాత్రం కరవు పనులు చేయ తలపెట్టిన ప్రభువులకు కల్లబొల్లి మాటలు చెప్పి, లంచమిచ్చి లొంగదీసి రోడ్డు పనులు చేపట్టాడు. ఖర్చులని చెప్పి కొంత కూలీల వద్ద బ్రహ్మయ్య మినహాయిస్తున్నాడు. రోజూ వచ్చిన వారికి కూడా మచ్చరు వేయడు. డబ్బులివ్వకపోగా నిల్వ ఆహార పదార్థాలనిస్తాడు. ఎంత పాటు పడినా కడుపు నిండని ప్రజల పాలిట కరవు సహాయ కార్యదర్శి కరుణామయుడిగా చెలామణి అవుతున్నాడు. అభిమానవతియైన సీతమ్మ పరువుగ కష్టపడి బతకాలని "పూలమ్మిన చోటనే కట్టెలమ్మిన రీతిగ' బిడ్డనెత్తుకుని రోడ్డు పనికి వెళుతుంది. చీర చెట్టుకు ఉయ్యాలగా కట్టి, బిడ్డను పడుకోబెట్టి, 'చేతులు కాయలు కాయ', అర్థాకలితో, అర్ధకూలితో పసి బిడ్డను, ముసలి మామను సాకుతున్నది.

మూడవరోజు బిడ్డనెత్తుకుని ఏడుస్తూ ఇంటికి తిరిగొచ్చిన కోడలు సీతమ్మను ఏమి జరిగిందని అడిగాడు. 'నిరుపేదలు పరువుగా బ్రతికే దారి లేదు'. ఈ రోజు పని లేదని బ్రహ్మయ్య పంపించేశాడు అని చెప్తూంటే తొండములేని ఏనుగు వలె, గుర్రంలాగా సకిలిస్తూ, దుర్మార్గుడు బ్రహ్మయ్య వచ్చాడు. బాకీ క్రింద ఆవును, కోడెను తోలుకెళ్తాను. అడ్డమొస్తే గొడ్డలితో నరికేస్తానని కారు కూతలు కూస్తున్నాడు. అపుడు సీతమ్మ అయ్యా ఎంతో ప్రేమతో పెంచుకున్నాము. ఆవు, కోడెలను కనికరించమని కాళ్ళు పట్టుకుని బ్రతిమాలినా జాలి నా జన్మకు లేదని క్రూరుడైన

బ్రహ్మయ్య గబగబా వెళ్ళిపోయాడు.

ఇదంతా చూసిన ముసలయ్యకు పట్టరానంత కోపం వచ్చింది. "పేదవాని కోపం పెదవికి చేటు" అనుకొని తమాయించుకున్నాడు. విలవిల్లాడి పోతున్న కోడలి దగ్గరకొచ్చి "అమ్మా! సీతమ్మా! అండవుంటే కొండ పాకొచ్చు", అండలేని చోట అణిగి మణిగి ఉంటే తొలగి పొమ్మంటుందీ లోకం. కనుక ఎట్లైనా వెళ్ళిపోదాం" అనగానే సీతమ్మ "వెళ్ళిపోదామా మామా! పట్నవాసపు మురికి వీధులలోకి, పుట్టి పెరిగిన గడ్డ, ఇల్లు వీడి, పట్టెడన్నం కోసం వేరే ఊరెళ్ళి మట్టిలో కలిసి పోవాలా? కాలమొక మహాగ్ని గుండం'. మన కొరకు కాచుకుంది" - అని అంది. సెలవడిగెదము మామా, అలా కరవుకు గురై కలవారి స్వార్థానికి బలై' అందరితో పాటు ఊరు విడువలేక విడిచి వెళ్ళలేక వెళ్తున్న సీతమ్మ బిడ్డను ఎత్తుకుని మామతో కల్సి వెళ్తున్నారు. దారిలో వడగాలి దుమ్మెత్తి పోస్తుంటే, సత్తువులుడిగిన జన సమూహం ఉవ్వెత్తుగ వెళ్తుంటే, దప్పిక తీర్చుకొనుటకు గుక్కెడు నీరు కూడా దొరకని దారి పొడుగునా స్పృహ తప్పి పడిపోతున్న జన తోరణంతో కలిసి నడుస్తున్నారు.

ఎండలు నిప్పులు చెరుగుతుంటే, కాళ్ళు బొబ్బలెక్కి నీరు కారుతుంటే, పదే పదే మగడు గుర్తొచ్చి కన్నీరు కాల్వలౌతుంటే, ఆకలితో తూలుతున్నది. చంకలో బిడ్డ జారిపోతుంటే నడువ సత్తువ లేదు. ఎన్నో అవస్థలు పడుతూ కర్నూలు చేరుకున్నారు. గంజి కోసం జనం తొక్కిసలాటలో ముసలయ్య ఎలానో ముంత గంజి సంపాదించాడు. అదే గంజి తలా కాస్త తాగి పడుకున్నారు. అర్ధరాత్రి ముసలయ్యకు వాంతులు, విరేచనాలు కాగా సరిగా వేళకు తిండి, విశ్రాంతి లేక వ్యాధితో మరణించాడు. దిక్కు లేదని, మామపై పడి సీతమ్మ ఆర్తనాదాలు చేస్తూ వుంటే బ్రహ్మయ్య వచ్చి 'నా మాట వింటే ఎలా ఉండేదానివి, ఇలా ఎన్ని రోజులు తిప్పలు పడతావే అని అన్నాడు. సీతమ్మ ప్రాణం పోయినా తప్పుడు పని చేయనని, మా కాపురం నాశనం చేశావని అంటే, నీ వాళ్ళతో నీవు చస్తావు ఈ జనంతో నీకెందుకు బాధ నేనున్నారావే!" అనగానే చుట్టూ చచ్చి పోయిన జనాన్ని చూసి,

మగడు, ఎద్దులు, కోడె, ఆవు, మామ అన్నీ పోగా బిడ్డ వంక చూస్తే "అమ్మా! ఆకలి" అని 'తువ్వన్నా (నీళ్ళు) ఇవ్వమ్మా' అనగానే తల్లడిల్లి పోయింది సీతమ్మ. నేను బతికుండి ఏం సాధించాను. కూటికి చచ్చే (ఆకలి చావు) వారే లేరని చెప్పే నాయకులారా ఇటు చూడండి, 'అటు నీతి, ఇటు బంధం ఎటూ తేలని సమస్యలు. చావో, బతుకో తేల్చలేని బ్రతుకులు తెలియవా దేవునికి, పిల్లలు గన్న తల్లులారా పలకరేమిటమ్మా అని కంటికి మంటికి ఏకధారగా ఏడుస్తూ బిడ్డ నెత్తుకుని బ్రహ్మయ్యతో నడుస్తూ "రాయలసీమ రతనాల సీమ" కూటికి, నీటికి కరువు. రైతులం చెట్టుకొకరు, పుట్టకొకరైనాము, సస్యశ్యామలం బీడు బడిపోయింది. ఆకలంటే అన్నం పెట్టాము, దానాలు చేశాం. నేడీ గతి మాకొచ్చె అని దు:ఖిస్తూ వెళ్తూ' ఉంది.

ఇంతలో భూపతయ్య గడప గడప వాడ వాడ తిరిగినా పని దొరకలేదు. కూటికై బిచ్చమెత్తి, గంజికై చేయి చాచి తీవ్ర జ్వరానికి గురై, చావ సిద్ధమై ఉన్నాడు. దుమ్ము, మురికిలో రూపు మాసిపోగా సీత భూపతయ్యను గుర్తించింది. భూపతయ్య పడిపోతుంటే పట్టుకోబోయి ఇద్దరూ క్రింద పడిపోయారు.

బిడ్డ బువ్వ అని ఏడుస్తుంటే మువ్వల బండి మోతలో బ్రహ్మయ్య పిల్లవాని ఏడ్పు వినడాయె. "దిక్కు లేని అనాథ ఆ బిడ్డ ఓ ప్రేమ గల తల్లిదండ్రుల ముద్దుల బిడ్డ". "ఓ తెలుగు బిడ్డా లే, ఈ గడ్డ నీది, పంట భూమి నీది, సంపద నీది, పరువుకై శ్రమిస్తావు. గట్టు దున్నిన తన్నుతావు. చెట్టు కొట్టితే చెండుతావు. నదులకు ఆనకట్టలు కట్టిన దేశానికి కరవులేదు. నంది కొండన కట్ట గలిగితే తెలుగు రైతు బంగారు పంటలు పండించుతాడు. ముక్కోటి బలగం ఒక్కటై నిలవాలి. "కలతలే విడనాడి కలిసి పని చేస్తే దేశం ముందుకు వస్తుంద"ని కవి ఆశిస్తున్నారు.

నాడు 'రతనాల సీమ'గా నుతికెక్కిన 'రాయలసీమ' నేడు 'రాళ్ళసీమ'గా మారిన దుస్థితిని కవి చక్కగా వివరించాడు.

అంకిత భావం గల కష్టజీవులైన భూపతయ్య కుటుంబం ఉంటున్న రాయపేటలోనే ధన పిశాచి అయిన బ్రహ్మయ్య కూడా ఉన్నాడు.

బ్రహ్మయ్య పొలం భూపతయ్యలాంటి వాళ్ళకే కౌలుకిచ్చి, డబ్బు అప్పు పెట్టి వాళ్ళ శ్రమను దోచుకునే దుర్మార్గుడుగా కవి ఎంతో సమర్థవంతంగా చిత్రించారు.

వర్షాలు లేక పంటలు పండక అటు ప్రజలు, ఇటు పశువులు నశించే పరిస్థితిని కవి ఎంతో నేర్పుతో వివరించారు. ఆ పరిస్థితిలో అప్పు కోసం వెళితే నోటికి వచ్చినట్లు తిట్టి చక్రవడ్డీకి నోటు రాయించుకోడాన్ని కవి స్పష్టపరిచారు.

అప్పు కూడా పుట్టని పరిస్థితిలో అప్పుల బాధలు తట్టుకోలేక భూపతయ్య ఊరు వదలిపోగా, కూలికి వెళ్ళిన అతని భార్య పట్ల నీచంగా ప్రవర్తించిన బ్రహ్మయ్య స్వభావాన్ని కవి ఎంతో చక్కగా విశదపర్చారు. ఆ పరిస్థితిలో ఉండలేక వలసలెళ్ళలేని మానసిక వేదనను కవి చాలా చక్కగా వివరించాడు.

కరవు గంజి కేంద్రాలలోని గంజి త్రాగి ముసలి మామ అతిసార వ్యాధితో మరణించగా ఉన్న ఒక్క అండ కూడా పోయిందని భోరున విలపిస్తున్న సీతమ్మ వద్దకు వచ్చిన బ్రహ్మయ్య పశువులా ప్రవర్తించిన రాక్షసత్వాన్ని కవి ఎంతో గొప్పగా వివరించారు.

బిడ్డను చంపుకొనలేక, మనసు చంపుకుని బ్రహ్మయ్య వెంట వెళ్తున్న సీతమ్మకు భర్త, క్షీణ దశలో కన్పించగా ఒకరి కొకరు చేరువై సొమ్మసిల్లి పడిపోతే బిడ్డ ఏడుస్తున్నా బ్రహ్మయ్య పట్టించుకోకుండా నిర్దాక్షిణ్యంగా వెళ్ళి పోవడాన్ని కవి సమర్థంగా వివరించారు. ఇందులో ఇతివృత్తాన్ని కరుణ రసార్ద్రంగా చిత్రించి కథ చెప్పే సమయంలో ప్రేక్షకుల హృదయాలను కదలించి వేసేవారు షేక్ నాజరు గారు.

# బొబ్బిలి యుద్ధం

నిజాం నవాబు పరిపాలనలో రెండు వందల సంవత్సరాల క్రితం మంత్రిగా బుర్రా బుచ్చన్న లక్షదండుతో తెలుగు దేశాన్ని తన ఏలుబడిలోకి తెచ్చుకోవాలన్న కాంక్షతో సామంతుడైన విజయనగరం పాలకుడు విజయరామరాజుకు లక్ష కప్పం కడుతూ రాజ్య పాలన చేస్తున్నాడు.

అట్టి విజయనగరానికి దాపుననే సర్వ సంపదలతో తులతూగుతున్న రాజ్యం బొబ్బిలి. సర్వారాయుడు మంత్రిగా, ధర్మారావు సర్వసేనానిగా, భండన పండితుడు, అంగరక్షకుడైన సోదరుడు వెంగళ రాయుడు, గండర గండడు, అజేయుడు తాండ్ర పాపారాయుడు, పతాకత్తి యుద్ధ ప్రవీణుడు పతాల రామన్న, ముకుందపల్లి వీరుడు ముత్యాల అప్పన్న, కత్తులతో తెగించిన తెలగలు, వీరులైన వెలమలు రక్షణనిస్తూ ఉండగా రంగారావు ఏలుబడిలో బొబ్బిలి సుఖజీవనం చేస్తుంది.

నిరంతరం పతిసేవ చేసే రాణి మల్లమ్మ దేవికి సకలైశ్వర్యాలు ఉన్నా సంతతి లేదను చింతతో బావులు, చెరువులు త్రవ్వించి, వ్రతాలు చేసి కోరిక మేరకు మల్లమ్మ దేవి గర్భవతియైనది. అమితానందంతో మల్లమ్మ కలలు పండి వెంకట్రావును ప్రసవించగా బొబ్బిలి భేరి వీరణంతో, పచ్చని తోరణాలతో విందులు, వినోదాలతో కోలాహలంగా ఉంది.

బొబ్బిలి ఎంతో ఆనందోత్సాహాలతో ఉండగా ప్రభువైన అన్న రంగారావు ఎంత వారించినా ఈ శుభ ముహూర్తంలో వేటకు వెళ్ళాలని పట్టుబట్టి, పన్నెండు మంది పాలెకాపు యోధులతో వెంగళరావు అకుల కట్ట అడవికి వేటకు వెళ్ళాడు. అడవి పందిని వెంబడిస్తూ కోడేరు చేరగా, సరిహద్దు కావలి భటులు వెనుతిరగండని ఆజ్ఞాపించారు. వెంగళరావు వేటాడిన జంతువు చేజారిపోయిందనే కసి ఒక వైపు,

శత్రువుల అడ్డగింపు మరోవైపు కోపాన్ని తెప్పించినా అదను కాదని తమాయించుకుని వెనుతిరిగి వచ్చాడు.

ఆ రాత్రే కోడేరు అడవి తగలబడిపోగా విజయ రామరాజు నిజాం నవాబును రక్షణ నిమిత్తమై సేనలు కావాలని కోరి మేము మీ సామంతునిగా ఉండటం బొబ్బిలి వారికి నచ్చుటం లేదని చాడీలు చెప్పి నవాబును ఉద్రేకపరచారు. ఇందులో విషబీజాన్ని నాటాడు. వెంటనే నారాయణ పట్నంలో పన్ను వసూలు చేసుకురమ్మని అన్న కుమారుడైన ఆనందరాజుతో చెప్పి దారిలో ఉన్న బొబ్బిలి పంటను నాశనం చేసి రమ్మని చెప్పారు. ప్రధానమంత్రి "తుమ్మల గుంట యుద్ధంలో, బలుగుపాటి యుద్ధంలో మన సేనలు చాలా నష్టపోయాయని" అన్నాడు.

"మీకు తెలియనిది కాదు, కానీ, తృప్తి లేని బ్రాహ్మణుడు, తృప్తి చెందిన క్షత్రియుడు, లజ్జాశీలయైన వేశ్య, లజ్జలేని కులాంగనలు చెడుదురని లోకోక్తి. అంతేకాని రామాయణంలో వాలి, సుగ్రీవుని యుద్ధమూ, కురుక్షేత్ర సంగ్రామాలు అన్నీ రాజ్యం కోసం కాదా? అయినా రాజ్యకాంక్షతో చావని రాజులెవరు? ఎప్పుడూ కూడా వీరుడు జయాపజయాలను అంచనా వేసి యుద్ధ ధర్మాన్ని వీడరాదు" అని వివరించగా, వెంటనే ఆనందరాజు 'చిన్నాన్నా' మీ ఆజ్ఞ తూచ తప్పక పాటిస్తాను అడ్డు వస్తే యుద్ధం చేసి బుద్ధి చెప్పి వస్తాను. నా తడాఖా చూపుతాను' అని ప్రతిన చేసి బయలుదేరాడు.

బొబ్బిలి రైతులు కుప్ప నూర్పిళ్ళు ముమ్మరంగా చేసుకుంటున్నారు. ఆనందరాజు దౌర్జన్యంతో రైతులను గాయపర్చి, పంటలను సర్వనాశనం చేసి వెళుతుండగా, రైతులంతా ఒక్కుమ్మడిగా మా శ్రమ అంతా నేలపాలు చేశాడని దీనంగా రంగారావును ప్రార్థించారు. అప్పుడు రంగారావు "మీకు శిస్తులు రద్దు చేస్తున్నాను. నష్టం జరిగిన దానికి ధాన్యాగారంలో ధాన్యాన్ని తీసుకుని వెళ్ళండి. మీ నిరంతర కృషి, శ్రమ దేశానికి ఇంత అన్నం పెడుతున్నాయి. మీ శ్రమకు

విలువ కట్టలేము" అని ఓదార్చి పంపి, ఆనందరాజును ఆపి నష్ట పరిహారం కట్టించుకుని పంపాడు.

"పన్నులు వసూలు చేసి తెస్తున్న మా బలగాన్ని బొబ్బిలి వాళ్ళు భయపెట్టి కాజేశారు" అని నవాబుకు కబురు పంపి, ఇటు రంగారావుని ఎలాగైనా దెబ్బ తీయాలని పల్నాడులో కోడిపందాలు లాగా ఏర్పాటు చేసి ఆహ్వానింపగా రంగారావు దీని వెనుక గల కుట్రను గమనించి నిరాకరించాడు. పాపారావు, వెంగళరావులు "వాడు మనలను ఏం చేస్తాడని" అనగానే రంగారావు "అలా కాదు. నవాబుకు మనకు వ్యతిరేకతను సృష్టించి మనలను ఎదిరించలేక దొంగ దెబ్బ తీయాలని కుట్ర" అని వివరించి చెప్పినా వినక "ఇది బొబ్బిలి పౌరుషానికి సంబంధించిన విషయం" అని మూర్ఖంగా జాతి కోళ్ళను తీసుకుని సైన్య సమేతంగా బయలుదేరాడు. అటు రాజు బృందం కూడా వచ్చింది.

ఇరుపక్షాల వాళ్ళు వారి వారి దర్పానికి తగినట్లుగా వచ్చి పందాలకు సిద్ధమై బొబ్బిలి పక్షాన మాదాల వెంకన్న, విజయపురి పక్షాన విజయాల చంద్రయ్యను పందెగాళ్ళుగా నిర్ణయించారు. బొబ్బిలి వారి పర్లా జాతి పుంజుతో విజయనగరం వారి పుంజు పచ్చకాకి పోరాడి బరిలో ఒరిగిపోయింది. వెంటనే "బొబ్బిలి కోళ్ళకు రోసాలెక్కువ, బొబ్బిలి దొరలకు మీసాలెక్కువ' అని సుద్దులు ఎద్దేవా చేయగా విజయనగరం వారికి ఉక్రోషం పొంగి నెమలి వర్ణం కల పుంజును, తాండ్ర పాపారావు అస్లీజాతి పుంజును బరిలో దించగా ఒకే దెబ్బకు నెత్తురు మడుగులో కొట్టుకుంటూ విజయనగరం కోడి కూలిపోయింది. మళ్ళీ బొబ్బిలి సుద్దులు రెట్టింపు ఆనందంతో "విజయపురి పుంజులకు కూతలెక్కువ, విజయపురి రాజులకు కోతలెక్కువ" అనటంతోనే బొబ్బిలివారు మీసాలు సవరించుకుంటుండగా విజయరామరాజు బుస్సున లేచి "ఇంకెన్నాళ్ళు ఆదరిపాటు, బొబ్బిలిని దుక్కి దున్నేస్తానని" అన్నాడు. ిది విన్న బొబ్బిలిపులి తాండ్ర పాపారాయుడు కస్సున లేచి 'నీ అబ్బతరం కాదు,

ముందు నిన్ను బాకుతో కుమ్ముతానని' వెళ్ళనున్న రాయుడ్ని రంగారావు ఆపి సర్ది ఇక బయలుదేరండని చెప్పి, "విజయరామరాజా! మరో పల్నాడు యుద్ధం చేయనెంచితివా? అంతిమ విజయం ధర్మానిదే అన్న విషయం మరువకండి" అని మందలించి వెడలిపోయాడు.

ఇదిలా ఉండగా లష్కరుతో బుస్సీ దొర రాజమండ్రిలో బస చేశాడు. రాజులందరినీ హాజరు కమ్మని కొమరంపాడు భోగీరావు తెచ్చిన బొబ్బిలివారి ఆహ్వానాన్ని తాను పంపుతానని, మరీ ఘోరాటవిలో వెళ్ళలేరని చెప్పి పంపివేసి, తన జాబును చింపివేసి ఎనలేని కానుకలను తీసుకుని రామరాజు హైదరుని కలిసి బొబ్బిలివారిపై వ్యతిరేకంగా నేను చేస్తాను. నీవు మిన్నకుండుమని లంచమిచ్చి వశపర్చుకున్నాడు. అంతట బుస్సీ వచ్చిన సామంతులందరినీ చూచి సంతసించి, కానుకలు స్వీకరించి, వెలమదొర రాలేదేమని ప్రశ్నించాడు. రామరాజుకు తోడైన హైదరు మౌనం వహించగా రాజు వెంటనే "కబురందినదే తడవుగా రావాలా? వీలు చూసుకుని వచ్చి కలుస్తాము. అయినా వానర బలం మించిన బలగం మాకుంది. అందునా మాకు కొండంత అండగా ఆత్మ బంధువైన పాండవులను ఎదిరించే శక్తిగల తెలగ బలగం మాకుంది. కావున కౌరవుల వంటి వారినైనా ఎదిర్చి గెలవగలం" అని చెప్పాడు. అది విన్న బుస్సీ బుస్సున లేచి ఉక్రోషంతో ఊగిపోయి, 'ఆపండి వారి ప్రేలాపనలు' అని అరిచాడు. అంతటితో ఆగక 'మీరు మాకు ఫర్మానాగా యిచ్చిన బొబ్బిలి మా ఏలుబడిలో లేదు. ఇదేమని అడగడానికి దుందుడుకు మనిషైన ఆ పాపారాయునితో వ్యవహారం సానుకూలపడదని ఊరకున్నాం' అని నయవంచపు మాటలతో బొబ్బిలిపై కన్నెర్ర చేయించగా బుస్సీ బిగ్గరగా "ఏమీ, పాపారాయుడు మమ్ము ఎదురించగలడా?" అని ప్రశ్నించగా 'ఉష్ గోడలకు చెవులుంటాయి' అని సైగ చేశాడు రాజు. బుస్సీ మెల్లగా "పాపారావుని ఎలాగైనా ఎదిరించండి. అపై హతమార్చండి దానికి మీకేం కావాలో మేమిస్తాం" అని బదులిచ్చాడు.

'రాజాము' నగరానికి రాణావారు బొబ్బిలిపులి పాపారావు రక్షణ. బొబ్బిలికి ఎవరు వెళ్ళాలన్నా అటునుంచే సులభ మార్గం. కానీ, రాజుకు తెలుసు అలా వెళితే చావు తప్పదని అందుకని దారి మార్చి వనాలు నరికించి మల్లమ్మ చెరువులో సేనల నుంచి బుస్సీదొరకు పట్టు డేరాలతో పల్లె దగ్గర నిర్మించి, చెరువు గట్టున నీలి డేరాలు వేసి ధరణి దద్దరిల్లేట్లు ధనధన ధ్వనులతో మార్మోగునట్లు సింహనాదాలు యుద్ధోన్ముఖులను చేస్తూ పలికించాడు.

అదే సమయంలో వెంగళరావు పెళ్ళితో బాటు మరో యాభై పెళ్ళిళ్ళను కూడా కలిపి అంగరంగ వైభవంగా చేస్తున్నాడు రంగారావు. బొబ్బిలి పచ్చతోరణాలతో అతి వైభవంగా, అమితానందంతో ఉండగా రణభేరి విన్పించింది. కంకణం కడుతున్న వెంగళరావు అన్నను ఏమిటీ అకాల భేరి అని అడిగాడు. ఆవేశపరుడైన తమ్ముని మభ్యపరచడానికి 'దొమ్మరోళ్ళ డోలు' అని సర్ది చెప్పాడు. గోల వినిపిస్తున్నదేమని మరల ప్రశ్నించగా గొర్రెల మందను కుదర దోలుతున్నారని సర్ది చెప్పి చూడగా అన్న చెప్పే తడబాటు సమాధానాలను అసాంతం వినకనే గబగబా కోటపైకెక్కి చూసి, వెనుకనే వచ్చిన అన్నతో "ఆనతివ్వన్నా ఆ రాజు సేనల తెగనరకుతాను' అన్నాడు. రంగారావు తమ్ముని తొందర పడకు అని, మామా దామెర్ల ధర్మయ్యా! పెళ్ళి సందడిలో నున్న బొబ్బిలికి, రాజు బుస్సీని బుట్టలో వేసుకుని మనపై పురికొల్పావు. కావున ఈ సంక్లిష్ట పరిస్థితి నుంచి ఎంతైనా నష్టపరిహారం చెల్లించగలమని, సామర్థ్యంతో నెరవేర్చుకు రమ్మని యాభై మంది వెలమ వీరులను తోడుగా పంపించావు".

పరాసు దొర మత్తులో మునిగి ఎదుటనున్న ధర్మన్నను చూసి ఏమిటని ప్రశ్నించాడు. హఠాత్తుగా వచ్చిన ఈ ముప్పు మాకు అర్థం కాలేదు. అయినా మాది మీరు తప్పుగా భావించి, క్షమించి లక్షమజిలీ ఖర్చు, ఆరు లక్షల సుంకం చెల్లిస్తాం. దారి ఖర్చు కూడా కలిపి ఇస్తామని మా ప్రభువు రంగారావు చెప్పమన్నారని నేర్పుతో

చెప్పాడు. మైకంలో ఉన్న బుస్సీ 'బొబ్బిలిని రాజుకు ఫర్మానాగా యిచ్చాము' అన్నాడు. అంతకంతకూ పెరుగుతున్న కోపాన్ని అతి బలవంతం మీద దిగ మ్రింగుకుని 'మీకు మాకు ఎట్టి శత్రుత్వం లేదు. మాకు, రాజుకు వైరం. రాజు చెప్పిన విషపు మాటలు పసిడి గుళికలుగా మీకు పని చేశాయి. ఇప్పటికీ మించి పోయింది లేదు. ఇంతసేపు నేను అభిమానాన్ని దిగమింగి మాట్లాడుతున్నాను. ఇంతసేపు నా ఓర్పును పరీక్షించావు. ఇక నా పరాక్రమం చూడు. ఎలాగంటే లక్ష దండు రాజు కున్నది. ఇరవై నాలుగు వేల దండు మీకున్నది. కేవలం యాభై మందితో నేను వచ్చాను. అందునా ఇది మీ స్థావరం. ఏనుగుపై అంబారీ నిర్మించి మీరు చూస్తూ ఉండండి. సేనలోని బంటుకు, బంటు సవాల్. ఎవరు గెలిస్తే వారిదే ఫర్మానా. రాజ్యం వీర భోజ్యం అదే మా లెక్క. దానికి సిద్ధపడితే నేను సిద్ధం" అని ధీమాగా చెప్పాడు.

"ఇదే నా నీ రాయబారం. మమ్ము రెచ్చగొట్టకు. ఇవన్నీ అనవసరం ధర్మరాయా! మేము రాజుకు బొబ్బిలి ఫర్మానా ఇచ్చేశాం ఆడిన మాట తప్పం. కావున మీరు బొబ్బిలిని రాజుకు అప్పగించి స్త్రీలతో వలస పొండి" అన్నాడు బుస్సీ.

ఆ మాటలు విన్న ధర్మారాయుడు అగ్గిపిడుగై నిన్ను, నీ బలగాన్ని చీల్చి చెండాడక పోతే నేను బొబ్బిలి గడ్డ మీదే పుట్టలేదని యుద్ధానికి సిద్ధమయ్యాడు. బుస్సీ భయంతో గజగజ వణికిపోతూ డేరాలోనికి వెళ్ళి, రామరాజా! ధర్మారాయుని బంధించమని ఆజ్ఞాపించాడు.

రామరాజు అనుమతి పొంది ఎదుర్కొనుటకు సిద్ధమైన రాజు సేనలను అశ్వారూఢులైన ధర్మారాయుని బృందం ముక్కలు చేస్తూ, ఊచకోత కోస్తూ, ఎట్టకేలకు బొబ్బిలి చేరి విషయం రంగారావుకు విశదపర్చారు. ఈ పరాభవాన్ని

విన్న వెంగళరావు ఉగ్రుడైపోయి వెన్నిచ్చి పారిపోయి వచ్చారా అని తూలనాడి మాట్లాడగా, రంగారావు "నోర్ముయ్ మూర్ఖుడా, ఇన్ని అనర్థాలకు కారణం నీవు. వేటకు వెళ్ళవద్దంటే వినకుండా వెళ్ళావు. ఆ నాటి నుండీ ఏదో ఒక గొడవ వస్తూనే ఉంది" అని వెంగళరావును మందలించి, పెద్దవాడైన మామకు క్షమాపణ చెప్పమని నిర్దేశించాడు. వెంటనే ఈ పరిస్థితి మెరుగవ్వాలంటే పాపారావు ఉండాలని, రాజీ ప్రయత్నాలు చేయాలని, వెంటనే పాపారాయుని రమ్మని జాబు వ్రాసి రొట్టెలో పెట్టి భౌగీరావుకు ఇచ్చి పంపాడు.

మార్గమధ్యంలో పరాసు సేనలు భౌగీరావును పట్టుకుని జాబు చదివి చించి, బెబ్బులి కోటలో లేదని, భౌగీరావును చంపి మూడవ జాముకే కోటను మూడు వైపులా ముట్టడించారు. అది గమనించిన బొబ్బిలి కాపలాదారులు తెలియపర్చగా పారసీ గుర్రాలను అధిరోహించి పఠాల్ రామన్న పఠాకత్తి ఝుళిపించి, విజృంభిస్తూ శత్రుసేనల గుండెల్లో కత్తిని గుచ్చుతుంటే, ముత్యాల పాపన్న ముకుంద బల్లెంతో కుమ్ముతుంటే నెత్తురు ఏరులై పారుతుంది. భేరీ రామక్క స్త్రీల సహాయంతో రాళ్ళ వర్షం కురిపిస్తుంటే, ఎవరి నైపుణ్యాన్ని బట్టి వారు యుద్ధం చేస్తూ ఉంటే శత్రు మూకలు ముక్క చెక్కలై గుట్టలు పడగా వాటిపై గుర్రాలు కదం తొక్కుతున్నాయి.

భయంకరమైన ఈ యుద్ధం ఇలాగే కొనసాగితే తనకు అపజయం తప్పదనుకొని నల్లమందు మూటలను ఏర్పాటు చేశాడు రామరాజు. అది తెలియని బొబ్బిలి వీరసేనలు శత్రుమూకను తరిమి కొడుతూ నల్లమందు మూటలలో పడి పఠాల్ రామన్న, ముత్యాల పాపన్న, భేరీ రామక్కలతో పాటు అనేక మంది వీరులు వీరమరణం పొందారు. తట్టు కోట, పుట్టుకోట మూల బురుజులను పరాసువారి అండతో విజయరామరాజు ఆక్రమించి విజయ పతాకాలను ఎగుర వేయనున్నాడన్న

వార్తను వేగుల ద్వారా విన్న వెంగళరావు అగ్గిమీద గుగ్గిలమై "అన్నా! బావకు వార్త చేరలేదు, లేకపోతే ఇంత జాగు జరగదు. కావున నేను ఇంకా చేతులు కట్టుకుని ఉండలేను, కదనానికి వెళుతున్నాను, నీ ఆనతి తిరస్కరించానని దిగులు చెందకు, పౌరునిగానైనా నా దేశ రక్షణే కర్తవ్యం. కావున వెళ్తున్నా"నని సమాధానం వినకుండానే వెళ్ళిపోతూ తెలగ బిడ్డా తెగించు, వెలమ బిడ్డా ఎగబడు, బానిస బ్రతుకు మనకొద్దు. జై ఆంధ్రమాతకు జై" అంటూ గుర్రాన్ని ఎక్కాడు.

వెంగళరావు అధిరోహించిన ఆ అశ్వం బొబ్బిలి పౌరుషాన్ని చాటే బావుటాలా మబ్బులకెగసింది. అడ్డు వచ్చిన లాడూ ఖాన్‌ను అడ్డంగా నరికి, తాను గాయపడి చేతులతో డేకుతూ బుస్సీ, రాజుల డేరాల వైపు వెళ్తున్నాడు వెంగళరావు. ఈ వార్తను విన్న రంగారావు, రాణి మల్లమ్మ పసుపు పారాణి ఆరకుండానే ఎంత ఘోరం జరిగిందని విలపించారు.

దేవి మల్లమ్మ, వెంగళరావుల పెళ్ళి సందర్భంగా "అంత:పుర స్త్రీలకు పసుపు కుంకుమలు పంపు రోజు ఇది. కానీ బదులుగా వీర తిలకం దిద్దమని, వీర వనితలుగా మారమని కత్తులు పంపుతున్నాను" అని రంగారావు వస్తున్న దు:ఖాన్ని ఆపుకుని, దు:ఖాన్ని, క్రోధాన్ని కలగలపిన మనసుతో గబగబా కొలువుకు వెళ్ళిపోయాడు.

అటు ధర్మారాయుని రాయబారం విఫలం కాగా, ఇటు పాపారాయుడు రాకపోవటం చూసిన మల్లమ్మ చివరి ప్రయత్నంగా రామరాజు వద్దకు వెళ్ళి పతిభిక్ష కోరగా రాజ్యమదంతో కావాలంటే భరణమిస్తాను అని రాజు వెకిలి సమాధానం ఇవ్వగా చలించిన మల్లమ్మ "అన్నా ! నిండు కొలువులో వలువలొలిపించిన కురురాజు ప్రాణాలు కోల్పోయె. సైరంధ్రిని అవమానపర్చిన కీచకుని పేరు అవనిపై మాసిపోయింది. మగనాలి సీతమ్మను అపహరించిన రావణుని గతిని వినలేదా? అనసూయను అగచాట్ల పాల్జేసిన దివ్య తేజస్సులే దగ్ధమై పోయె, ప్రాణ విభులన

ఎందరినో నీ దురాశకు ఆహుతి చేసి ఎందరు ఆంధ్రుల ఆడపడుచులు విలవిలలాడుచు అంతమొందిరో నీకు తెలుసా! చివరి పచ్చతోరణాలు వాడనే లేదు. పెళ్ళి అయిన మరిదిని బలి తీసుకున్నావు. తప్పక నీకు వాళ్ళ ఉసురు తగులుతుంది. లేనిచో సప్త సముద్రాలలోన కలసిపోయినట్లే" అని మల్లమ్మ తన బాధాతప్త హృదయంతో వెళ్ళిపోయింది.

అడిగిన వారికి లేదనక దానాలు చేసిన బొబ్బిలి రాణి అభిమానాన్ని చంపుకుని ఒక్క కోరిక జీవితంలో కోరగా దాన్ని రాజు తిరస్కరించగా అవమాన భారంతో ఆ తల్లి దాసి లక్ష్మిని పిల్చి రాబోయే ముప్పును తలంచి, వీడు మన వంశాంకురం, ఏ లోకాలను ఏలవలసి యున్నదో, నీ శక్తి మేరకు వీడిని కాపాడినచో నిన్ను లోకం లోకమాత అంటుంది అని "నాయనా చిన వెంకటరాయా! దేవకి, కౌసల్య దీవెనలు నీకు సాయంగా ఉంటాయి" అని గుబులుగా గుండెలకు హత్తుకుని ఆవేదనతో తల బరువెక్కి దాసికి కుమారుని అప్పగించి, మొద్దుబారిన మెదడుతో అగ్నికి ఆహుతి అవుతున్న అంత:పుర కాంతల ఆక్రందనలు విన్న మల్లమ్మ, రాజా ఏ గడ్డపై నీవీ ఘోరం చేశావో అదే గడ్డపై నీ బూడిదను బుంగలకెత్తించే వాడు బ్రతికే ఉన్నాడని నూనె మంటలందు దూకి దహనమైంది.

మానవతి మల్లమ్మ పాపయ్య కలలో "ఆశలు మాసి, అస్తులు బాసి, అసువులు ధారవోసి, నీవుండగనే అనాథలమైతిమిరా సోదరా" అని శోక దేవతలా కన్పించే సరికి తుళ్ళిపడి లేచి కలవరపడిన మనసుతో అందరినీ సమావేశపరచి 'రాజాం'లోని ఆప్తులు, మిత్రులు "దేవులపల్లి పెద్దన్న, బుద్ధరాజు వెంకన్న"లతో అత్యవసర చర్చలు జరుపుతున్నాడు. అదే సమయంలో చిన వెంకటరావుతో వచ్చిన లక్ష్మిని చూసి ఆనందంతో, ఆత్రుతగా ఏమిటి విషయాలు అని అడిగాడు. లక్ష్మి గద్గద స్వరంతో ఇంకెక్కడి బొబ్బిలి బాగు బాబు, దేవిడిలో దీపం పెట్టే దిక్కు లేదు అని భోరున విలపిస్తూ చెప్తుంటే ఆవేశం కట్టలు తెంచుకొస్తున్నా, దు:ఖం

పొంగుకొస్తున్నా, ప్రాణప్రదంగా చూస్తున్న రాజ్యం రాజ వంశనాశనం సహించలేక బాకు దూసి ఆత్మహత్యకు పాల్పడ్డాడు.

అది చూసిన లక్ష్మి వారిస్తూ "బాబయ్యా! మీకు చెప్పేదానను కాను. రావు వంశ భవితవ్యం తనపై మోపి నీ అల్లుని రక్షించమనిరయ్యా! నీవు కవచమై కాపాడువయ్యా" అని దీనంగా బాధ్యతను గుర్తు చేసింది. నా ఆప్తుల వియోగం నేను భరించలేను, నేను సన్యసించెదనని భీరుడై దు:ఖంతో మాట్లాడుచుండగా పెద్దన్న భరించి, బ్రతికి, పోరాడి నిల్చి గెలవాలని ధైర్యం చెప్పాడు.

లక్ష్మి వెంటనే పాపారాయునితో "ఒక విషయం మర్చిపోయాను, మార్గమధ్యంలో మమ్ము అడ్డగించిన రాజు శత్రుశేషం, ఋణ శేషం ఉండరాదని అనగా, బుస్సీ బాబుని చూసి వద్దు బొబ్బిలి పులిబిడ్డను విడువండని చెప్పాడు. ఇంత జరిగినా కాశిలో కాకిలా బ్రతకదల్చుకుంటే మీ ఇష్టం. తప్పుగా మాట్లాడితే శిక్షించండి.

ఆ మాటలకు పాపయ్య "చాలమ్మా! నీవు ధర్మదేవతవు. నా కర్తవ్యాన్ని చెప్పావు" అని మిత్రులారా ఇతడు మన రాజు, ఈమె రాజమాత. వీరిని సామర్లకోటలో మా అక్క జగ్గమాంబ రక్షణలో ఉంచండి. పెద్దన్నా, వెంకన్నా మీరు నాతో రండి. మోసాన్ని మోసంతోనే అంతం చేద్దాం. మనం రాజుల వేషాలు ధరించి, రాజు రాసినట్లు జాబులు రాసి డేరాలు చేరుకుందాం" అని నిర్ణయించాడు.

శత్రువుల తలలతో బంతులాడి, ప్రేగులను జందెమేసుకుని, వారి నెత్తుటిలో వసంతమాడి, వారి ఆర్తనాదాలు, హాహాకారాలు శ్రవణానందంగా చేస్తానని ప్రతిన బూనిన పాపారాయుడు పెద్దన్న, వెంకన్నలతో కలసి శరవేగంతో బయలుదేరాడు.

అక్కడ రణరంగాన రంగారావు దండధరునివలె ఖడ్గం దూసి దండెత్తిపని తలలు తెగి పడ్తుండ, మొండెములు తుండెములు కాగా మృత దేహాలు గుట్టల

పడుచుండ, రక్తం ఏరులై పారుచుండగా, తట్టుకోలేని పరాసు దండును తరిమికొట్టి, పుట్టకోటలో నున్న వారిని పొడిచి చంపి, మూల బురుజులో వారిని హతమార్చిన సంగతులు తెలిసిన బుస్సీ, రాజులు ఇరువురూ ప్రాణభీతితో పాలకొండకు పారిపోయారు.

"పరాసు వీరులారా, విజయనగర సేనలారా! రండి నేనే రంగారావును" అని పిలిచి చీల్చి చెండాడుతూ ఉన్నాడు. హైదరు జంగు రోషంతో ఎదురొచ్చి నిలవగా రంగారావు కత్తి కలిపి పోరు సాగిస్తుంటే కత్తుల రాపిడి నిప్పురవ్వలు చెరుగుతున్నాయి. రంగారావు ధాటికి తట్టుకోలేక అరువగా లాడూఖాన్ వెనుక నుంచి రావు తలపై వ్రేటు వేశాడు. రంగారావు వెనుతిరిగి ఒక్క వ్రేటుతో లాడూఖాన్ తల తురిమి, పారిపోతున్న "హైదరును ఒరేయ్! నిలవరా పిరికి పందా" అని వెంబడిస్తుండగా నల్లమందు మాటు పేలి కుప్పకూలి పోయాడు రంగారావు.

అలా మాతృభూమి రక్షణకై అంతమొందిన అమరవీరుడు రంగారావు మృత్యువును చూడలేనన్నట్లుగా ఆదిత్యుడు పశ్చిమాద్రిన అస్తమించాడు.

రంగారావు మరణవార్త విన్న ఆనందంతో చిత్తుగా తాగిన మత్తులో హాయిగా నిద్రిస్తున్న రాజు డేరాల వైపు పాపారావు, పెద్దన్న, వెంకన్నలు అడ్డు వచ్చిన వారిని హతమారుస్తూ చేరుకున్నారు. పాపారాయుడు నిద్రిస్తున్న రాజు గుండెలపై అమాంతంగా ఎక్కి, "ఎవరనుకుంటివి రా బొబ్బిలి పులి తాండ్ర పాపారాయుణ్ణిరా. మోసం చేస్తావురా, నా నుంచి నీవు తప్పించుకోలేవు, కొండను గుద్ది పిండి చేస్తా, బొబ్బిలి దుక్కి దున్నేదవా? నరసింహుడు హిరణ్య కశ్యపుని చీల్చినట్లు చీలుస్తా! అని కసి తీరా పొడిచి, పొడిచి చంపి రచ్చబండ రేవుల వద్దకు వచ్చి విచ్చు కత్తుల్లా దూకి ఆత్మాహుతి చేసుకున్నారు.

ప్రతి ఒక్కరు కూడా దేశం కోసం ప్రాణాలు త్యాగం చేయాలని దేశభక్తిని

ప్రబోధిస్తూ కవి యువతను మేలుకొలిపేందుకు ఈ కథను రచన చేశారు. అట్టి ఆంధ్రుల త్యాగ నిరతి మన ఘన చరిత.

సామంతరాజులు తామే స్వతంత్ర ప్రతిపత్తిగల రాజులు కావాలనే కాంక్ష. అట్టి రాజ్యాన్ని సాధించాలని చేసే ప్రయత్నం ఏ విధంగా ఉంటుందో అట్టి ఉద్దేశం ఎలా ఉంటుందో అచంచల మానవ స్వభావం ఎలాంటి పరిస్థితులకు దారి తీస్తుందో విజయరామరాజు పాత్ర ద్వారా రామరాజు ఆలోచనలను కవి చిత్రించారు.

ఆత్మాభిమానం, మానవత్వం, పౌరుషం కలగలసిన నాయకులు, ప్రజాబలం కల రాచరికంగా రంగారాయుని ఏలుబడిలో బొబ్బిలిని కవి వర్ణించారు.

ప్రతి మానవుని జీవితంలో సుఖజీవనం, అనుకూల దాంపత్యం, సత్ప్రవర్తన కలిగి ఉండి కూడా సంతానం ఉంటేనే వంశ చరిత్ర ఉంటుందనే ఆలోచనలో ఉంటారని సూచించారు. అన్నీ ఉన్నా, సంతానం లేని చింత చాలా బాధాకరం. అందునా స్త్రీలకు సహజంగానే లోటుగా ఉంటుందనే విషయాన్ని బొబ్బిలి పట్టపురాణి మల్లమ్మదేవి పాత్ర చిత్రణ ద్వారా కవి విడమర్చి చెప్పారు.

రాజ్యం కోసం చరిత్రలో జరిగిన యుద్ధాలను ఉదహరిస్తూ రాజనీతిని తెల్పుతూ, రాజ్యకాంక్షను, రాజ్య విస్తరణ కోసం రాజ్య తంత్రాన్ని కవి విశ్లేషించారు.

బొబ్బిలి రైతులు రాత్రింబవళ్ళు కష్టించి, శిస్తులు కట్టి, కౌలు చెల్లించి పండించిన పంటలో మిగిలిన దాన్ని వచ్చే సంవత్సరం వ్యవసాయపు ఖర్చులకు నిల్వ చేసుకుంటారనే సహజ విషయాన్ని కవి చక్కగా వర్ణించారు.

సహజంగా రైతుల సమస్యలకు ప్రభుత్వ బాధ్యతను, ప్రజలకు అండదండలిచ్చే ప్రభువులుండాలనే ఆదర్శవంతమైన రాజ్యం కావాలనే కాంక్ష బొబ్బిలి రాజుల్లా ఉండాలని కవి వివరించారు.

మానవుడు నైతికంగా గెల్వలేని పక్షంలో అవినీతితో అయినా గెలుపొందాలనుకుంటాడనే కుటిల స్వభావాన్ని విజయరామరాజు కుతంత్రాలను తెలుపు సందర్భంలో కవి చిత్రణ అద్భుతం.

మేలు జాతి పుంజులను, వాటి పేర్లను, ఆయా పద్ధతులను కవి చాలా దర్శనీయంగా చిత్రించారు. అంతేకాక దురాలోచన గల రాజును దూరాలోచనతో రంగారావు మందలించటంతో లోకజ్ఞత, ఓర్పు, నేర్పులను కలబోసి చూపి, కార్యదక్షతను కవి చక్కగా వర్ణించారు. అలనాడు భారతంలో మాయా ద్యూతం, పల్నాడులోని కోడిపోరు యుద్ధాలకు దారి తీశాయని చారిత్రాత్మక దృష్టితో మరల అదే పరిస్థితి ఇక్కడ కూడా వస్తుందని రంగారావు పాత్ర ద్వారా కవి చక్కగా చెప్పించారు.

రాజనీతిని వీడి రాజ్యకాంక్షతో వెన్నుపోటు పొడిచే విధానాన్ని, స్వార్థాన్ని, వ్యసనాలను విజయరామరాజు చెప్తూ అవి పతనానికి దారి తీస్తాయని విషయమై కవి వర్ణన అమోఘం.

ప్రజాక్షేమం కోరే రాజు ఎలా ఉండాలో ఆదర్శవంతుడు అయిన రంగారావు పాత్ర ద్వారా 'రాజంటే ఇలా ఉండాలనే' విధంగా చిత్రించారు. ఇటు ఆనంద కోలాహలం, అటు సమర భేరీ నాదాల మధ్య నలిగే రంగారావును గరళకంఠునిగా కవి విశ్లేషించారు. దొమ్మరాట అనేది శుభం జరిగే చోట ఆనవాయితీగా ఒకప్పుడు ఉండేది. అట్టి జానపదుల ఆచారాలను చక్కగా పట్టి చూపించగల మేటి దిట్ట కవి. జానపద కళా ప్రక్రియలంటే కవికి చాలా ప్రీతి అని మనకు విశదమవుతుంది కారణం ఆయన స్వతహాగా జానపద ప్రదర్శన కళాకారుడు.

రాయబారిగా వెళ్ళిన ధర్మారావు ఓర్పు, నేర్పులను యుద్ధ వాక్ చమత్కారాలను కవి చాలా నైపుణ్యంతో వివరించారు. వెంగళరావు దురుసుతనం

వల్లనే ఇన్ని విఘాతాలు కలిగాయని, పెద్దలను గౌరవించాలని క్షమాపణ చెప్పించడం, రాజుకు తమ దళాన్ని గౌరవించడం అనేవి ఉత్తమ లక్షణాలుగా కవి వివరించారు.

బొబ్బిలి తేజం, ప్రజల నైజం, యుద్ధ లక్షణం, నీతి, పౌరుషం మున్నగునవి కవి చాలా సమర్థంగా వర్ణించారు. యుద్ధంలో స్త్రీలకు కూడా స్థానం కల్పించారు. అపజయాన్ని భరించలేక, యుద్ధం చేసి వీర మరణం పొందాలనే రాచరికపు ఆచారాన్ని, దేశ రక్షణకై రాజే కాదు. ప్రతి పౌరుడు కూడా తన కర్తవ్యంగా, బాధ్యతగా వ్యవహరించాలనేది కవి ఉద్దేశం.

చరిత్రలో రాజ్యమూ, స్త్రీల వలన జరిగిన అనర్థాలు, సత్య సంధులైన వారి మాటకు శక్తి ఉంటుందనే విషయంతో పాటు ధర్మయుద్ధంలో తాత్కాలికంగా బాధలు కలిగినా అంతిమ విజయం ధర్మానిదేనన్న విషయం చరిత్ర తెలుపుతుందని కవి ఉద్దేశం.

తన వారంతా పోగా లేక లేక కల్గిన ఒక్కగానొక్క కుమారుని రక్షించుకోవటం కోసం దాసికి అప్పగించేటప్పుడు రాణికి కలిగే హృదయావేదన, మాటలకందని తల్లి హృదయాన్ని కవి చాలా సమర్థంగా వివరించారు. యుద్ధంలో ఓడిపోతే ఆనాడు స్త్రీలు పరాయి రాజుల సొత్తు కాకుండా అగ్నికి ఆహుతి చేసుకోవటం, చావో బ్రతుకో మన రాజు, మన రాజ్యం, మన వాళ్ళు, మన సంప్రదాయం అనేవి అర్థం కాగలవు. తాను పోయినా తర్వాత తన వంశాన్ని నిలబెట్టే కుమారుని రక్షించటం కోసం చేసే ప్రయత్నాలు స్పష్టమవుతాయి. మనం పోయినా వంశ చరిత్ర, వంశాన్ని బ్రతికించగల వాడు ఒకడు కావాలనే విషయాన్ని వివరించారు.

రాజులు సామంతులను, సామంతులు ప్రజలను ఇలా దోపిడి చేస్తారనే లోకంలోని సహజ రీతిని కవి మనకు తెలియపరిచారు. అరాచకపు పెత్తందార్ల

ప్రవర్తన నిగూఢంగా ఇమిడి ఉండడాన్ని కవి చిత్రించారు.

దాసి అయినా లక్ష్మి త్యాగం చేసి చిన వెంకటరాయుని తెచ్చి పాపయ్యకు అప్పగించి, పాపయ్యకు కర్తవ్యాన్ని చెప్పి తన బాధ్యతను నిర్వహించిన తీరులో మిత్రుల బాధ్యతలను గుర్తు చేయడాన్ని మనుషుల మధ్య ఉండే పరస్పర సహకార సంబంధాలను, మానవతను తన రచన ద్వారా కవి స్పష్టపరిచారు.



పుట్టిల్లు సినిమాలో రుద్రమదేవి బుర్రకథ చెప్పున్న నాజర్ బృందం



భలేబావ సినిమాకు జానకి వనవాసం బుర్రకథ చెప్పుచున్న నాజర్ బృందం

# రసం

## బొబ్బిలి యుద్ధం

విజయరామరాజు ప్రేరణతో బుస్సీ బొబ్బిలిపై యుద్ధానికి వచ్చాడు. రంగారావు రాజీ కోసం రాయబారిగా మామయైన దామెర ధర్మరాయుని పంపగా బుస్సీతో నష్టపరిహారం ఇస్తాం అని చెప్పాడు. కానీ బుస్సీ విజయరామరాజుకు బొబ్బిలి ఫర్మానాగా ఇచ్చేశాం అని సమాధానం చెప్పాడు. అందుకు ధర్మారాయుడు ఉగ్రుడై "సేనకు సేన బంటుకు బంటు సవాలన్నాడు" ఇక్కడ రౌద్ర రసాన్ని చిత్రించారు కవి. మళ్ళీ బుస్సీ రాజ్యం వీడి వలస పొండని ధర్మారాయునితో అన్నప్పుడు

"అట్టి మాటకు ధర్మారాయుం
డగ్గి పిడుగై భగ్గుమని తా
పట్టి మీసం పట్టి దువ్వాడా" । పుట - 26 ।

"మిమ్ము మీ బలగాన్ని నేనే
ముక్కలుగ చెక్కెదను చూడని
పచ్చలా పిడిబాకు దూశాడా
తారెచ్చి పులివలె రేగి పలికాడా" । పుట - 27 ।

ఉగ్రరూపం దాల్చిన సన్నివేశంలో 'రౌద్ర రసాన్ని' చెప్పారు కవి.
ధర్మారాయుని యుద్ధాన్ని గూర్చి వివరిస్తూ
"పరుగున వచ్చే దండును ధర్మయ - పఠాన తెగ నరికెన్
ఉరుకుచు వచ్చే దండును ధర్మయ - ఊచ కోత గోసెన్"
ఇచ్చట హెచ్చిన కోపంతో ఉన్న పరిస్థితిని 'వీరరసం'లో చెప్పారు కవి.

**యుద్ధ సన్నద్ధులైన బొబ్బిలి వీరులను గూర్చి**

"పఠాల్ రామన్న లేచెరా
పఠాకత్తి ఝుళిపించెరా
ముత్యాల్ పాపన చూచెరా
ముకుంద బల్లెం దూసెరా
భేరీ రామక్క లేచెరా
వీర సైనికుల్లేచిరా
పారసి గుర్రాలెక్కిరా
గుర్రాలు సైగల నందెరా
కాలుగీటి సకిలించాయా
తధిగిణ ధోం -
గుప్పట గుప్పట దూకాయ
పిప్పిగ శత్రుల దొక్కాయ
కత్తి గుండెలో గుచ్చారా
చిటపట చిటపట వడిశలరాళ్ళు
చిత్త జల్లుగ కురిపించారా" ।పుట - 29।

గా ఎవరి గొప్పతనాన్ని వారికే చెప్తూ, వీర పరాక్రమాలను తెలుపుతూ 'వీర రసాన్ని' కవి విస్పష్టంగా వర్ణించారు.

బొబ్బిలి వారి యుద్ధాన్ని గూర్చి వివరిస్తూ

"పెఠిల్ పెఠిల్ మని శత్రు శిరస్సులు పెట్టుచుండెనన్నా
పఠాకత్తితో కుమ్మిచిమ్మెరా పఠాల్ రామన్న
ముకుంద బల్లెం కుమ్మి చిమ్మెరా పఠాల్ రామన్న
ముక్క ముక్కలుగ శత్రువులను రామక్క నరికెనన్నా"

ఇక్కడ విజయరామరాజు సేనలను బొబ్బిలి వీరులు తుత్తినియలు చేస్తున్నారని

కవి 'వీర రసాన్ని' చెప్పారు.

వెంగళరావు రుద్రుడైన సందర్భంలో

" తెలగ బిడ్డడా తెగించి రారా

వెలమ బిడ్డడా ఎగబడి రారా

జై ఆంధ్రమాతకు జై" అంటూ వీరులకు సమరోత్సాహము కల్గిస్తున్న విధానాన్ని కవి 'రౌద్రరసం'లో ముంచి వేశారు.

రణరంగాన వెంగళరావు నైపుణ్యాన్ని చెప్తూ

"రా రమ్మని లాఢూ వెంగళరావు లాగ్రహమునా

హెూరా హెూరీ ఢాల్ కత్తులూ తళత్తళా మెరయా

వీరావేశానిద్దరీటెలన్ కమ్మి చిమ్ముకొనిరా

అమ్మాయని ప్రాణాలు వీడినాడప్పుడు లాఢూఖాన్

దిమ్మ తిరిగి పడిపోయె ధరణిపై రా వెంగళరావు" ।పుట - 31।

ఇరువీరుల మధ్య జరిగిన యుద్ధమును కవి 'వీరరసం'లో అద్భుతంగా చిత్రించారు.

పాపారాయునితో దాసి లక్ష్మి బొబ్బిలి పరిస్థితి వివరిస్తూ

"ఎక్కడి బావా ఎక్కడి లోకం బాబూ అన్నదా

దీపం పెట్టే దిక్కే లేదు మన దేవిడి కన్నాదా" ।పుట - 35।

అంటూ వీరులు, అంత:పురంలో స్త్రీలు అగ్నికి ఆహుతి అయినారని హృదయ విదారకమైన 'కరుణ రసం' చిప్పిల్లేట్లు చిత్రించారు కవి.

యుద్ధ సన్నద్ధుడైన తాండ్ర పాపారాయుడు వీర ప్రతిజ్ఞ చేస్తూ

"శాంభవి వీర లే - గంభీర భైరవీ

శంభురాణీ నా కభయమీయవే

కుంభిణి నిప్పుడె కూల దోసెదన్

చెంతనుండాలే - శాత్రవ పుర్రెలతో

బంతులాడెదా

వైరు ప్రేగులన్ జందెమేసెదన్

వారి నెత్తుటను వసంత మాడెదన్" | పుట - 37 |

ఇచ్చట వీరుని శక్తియుక్తులను గుర్తు చేస్తూ 'రౌద్రరసాన్ని' ఎంతో గొప్పగా వర్ణించారు కవి.

రంగారావు యుద్ధం చేస్తున్న వైఖరిని చెప్తూ

"కండలు మొండెలు గుండెలు ప్రేవులు తుండెముపై జార

దండధరుని వలె తుండె తుండెములు ఖండిస్తున్నాడా

జబ్బలు దొబ్బలు రక్తం గ్రక్కుచు దిబ్బలు దిబ్బలుగా

సిబ్బందిని పడ నరుకుచుండెనా బొబ్బిలి రంగారావు"

| పుట - 39 |

అంటూ రంగారావు వీరత్వాన్ని కవి 'వీరరసం'లో అత్యద్భుతంగా వివరించారు.

పాపారాయుని యుద్ధ ప్రావీణ్యాన్ని తెలుపుతూ

"దున్నించుతావా బొబ్బిలి పట్నం - విజయ రామరాజు

దున్నక మున్నే నిను నా బాకున - కుమ్ముచునున్నాడ

నారసింహుడా హిరణ్యకశ్యపు - చీరిన చందాన

ఆరక పగ చల్లారక - ఎన్నో బాకుపోట్లు పొడువ

విలవిల దున్నుక వీడి ప్రాణములు విజయరామరాజు

కలలన్నీ కల్లాయె కోరికలు - గాలిమేడలాయె"

| పుట - 40 |

అంటూ పాపారావు ప్రతాపాన్ని 'వీరరసం'లో కవి అత్యున్నతంగా చెప్పారు.

## పల్నాటి యుద్ధం

గురజాల కోడి ఓడిపోగా ఆ కోపంలో

"గురజాల వీరులు రోషమెక్కి బల్ - కొర కొర లాడగ

కామరాజు గుడ్లెర్ల జేసి బల్ - తామసమున లేచి

కాచుకొండి కడసారి పందెమని - గదిమి పలికినాడు

వోడిన వారము రాజ్యము వీడుద - మేడు యేడులనియె"

| పుట - 14 |

ఏడేళ్ళు రాజ్య బహిష్కరణ అని ఉక్రోషంతో చెప్తున్న పందెం దాని పర్యవసానం చెప్పే సందర్భంలో కవి 'రౌద్రరసాన్ని' చిత్రించారు.

నలగాముని వద్దకు రాయబారిగా వచ్చిన అలరాజు బ్రహ్మన్న మాటగా

"పగ వృద్ధి పొందించు భ్రష్టులే

పోరుమాన్పు పుణ్యాత్ములు లేరు

పోరు నష్టము పొందు లాభమందురు

పోరు తగదు భూమి నేరికైనా" | పుట - 17 |

అంటూ యుద్ధం వల్ల నష్టాలను, పొందు వలన సుఖాలను, రాజనీతిని గూర్చి వివరిస్తూ 'శాంత రసాన్ని' కడు లలితంగా చిత్రించారు కవి.

అలరాజు మాటలకు ఉగ్రరూపం దాల్చిన నాగమ్మ

"తెలుసునులే నీతి బోధ పొమ్మన్నది నాగమ్మ

రాజ్యము వీర భోజ్యమన్నదే - రాజనీతి రాజా

భిక్షపెట్టునది కాదు పోవయా - రాజ్యం అలరాజా

రోసమున్నచో - మమ్ము గెల్వమని పలికెను నాగమ్మ" | పుట - 18 |

రాజ్యం భిక్షకాదు, వీరభోజ్యం అని నాగమ్మ చెప్పుటలో 'రౌద్రరసాన్ని' కడు నిపుణంగా చెప్పారు కవి.

నాగమ్మతో అలరాజు పల్నాటి స్థితిని చెప్తూ
"పందెము బెట్టి అన్నదమ్ములా - పగలు బెట్టినావూ
కలతలెరుంగని పలనాటికి - గతులు తెచ్చినావూ
యింకాపైన నీవేమి చేతునో - చేయుము నాగమ్మా
యేమిజేసినా నీకెదురేదీ - సీమలో అన్నాడు
నాకెందులకీ గొడవలన్నీ - నేనేగెద తపమునకు"

।పుట - 18।

అనుచోట ఉమ్మడి కుటుంబం చీల్చి కుమ్ముకునేట్లు చేశావు. సంధి పొసగనీయటం లేదు. నీవు ఇంకేమి చేయాలనుకుంటే అదే చేయి అని అశాంతి నిండిన మదితో అలరాజు చెప్పుటలో కవి ఎంతో ప్రశాంతంగా 'శాంత రసాన్ని' చెప్పారు.

అలరాజు రాయబారాన్ని నాగమ్మ తిరస్కరించగా నలగామరాజు
" కన్నుల నిండనీరు నింపె నల - గామ రాజు దేవ
ఎన్ని గతులు నాకింకపైన రానున్నవో పరమేశ
కన్న తండ్రి వలె పెంచిన నాయుడు - కడకు దూరమాయె
ఎన్నో ఆశలు పెట్టుకున్నానా - అల్లుడలిగి పోయె
ఇరువురి మధ్యన నలిగిపోయెనా - జీవితాశలన్ని
దరి దోచని నలగామరాజు ఈ తీరున నుండంగ"

।పుట - 19।

అనుచోట కన్నతండ్రి మిన్నగా పెంచిన బ్రహ్మయ్య దూరం కాగా, ఒక్కగానొక్క కుమార్తెకు మేనల్లుని అలరాజుపై ఎన్నో ఆశలు పెట్టుకుంటే అతను అలిగిపోయాడు. ఎటూ తేల్చుకోలేని సందిగ్ధ పరిస్థితిలో నలగామరాజు హృదయంలోని సంఘర్షణను కవి హృద్యంగా 'కరుణరసం'లో చెప్పారు.

అలరాజు మరణించగా పేరిందేవి పరిస్థితిని చెప్తూ
"మాయలేదురా పసుపుగుడ్డలే మాకో పిన్నయ్యా
పెండ్లి ముచ్చటే తీరలేదు రా పిన్నయ్యా మాకు
కంటి నీటితో భర్త పాదములు కడిగి పేరిందేవి
కాలిపోయెనా కాటి మీద నా కాంత పేరిందేవి" । పుట - 21 ।

నరసింగరాజుతో చిన్నాన్నా! బొమ్మల పెళ్ళిలా ముగిసిన నా జీవితానికి కారకులు మీరు అని సహగమనం చేయు సందర్భంలో ఆ హృదయ విదారక స్థితిని 'కరుణ రసం'లో చిత్రించారు కవి.

యుద్ధ సన్నద్ధుడైన బాలచంద్రుడు మాంచాల వద్దకు వెళ్ళి
"అమె అందము పొగుడుతాడా ప్రేమ భిక్ష వేడుతాడా
కామాన్ని తీర్చమంటాడా కౌగిట చేర్చమంటాడా
పిచ్చి యెత్తిన కోతి చందాన బాలుడా వచ్చిన పని మరచినాడా
। పుట - 23 ।

అందానికి కామాంధుడై ప్రవర్తించుటలో 'శృంగార రసాన్ని' కడు సరసంగా చెప్పారు కవి.

కదనంలో బాలుడు నరసింగరాజుతో తలపడగా
"సూటిగ బాలుని డొక్కలో బల్లెము - నాటె నరసరాజు
వేటుబడ్డ పులిబిడ్డ చందమున - గీటుచు దంతములు
తెప్పరిల్లి నరసింగరాజుపై - కుప్పళించి దూకి
దెబ్బకు నరికెన నరసరాజు తల - దొర్లె ధరణిపైన"

రెండు కొండలు ఢీకొన్నట్లు పోరు సలుపుచుండగా బాలుని నరసింగరాజు బల్లెంతో పొడవగా కొంతసేపటికి తేరుకున్న బాలుడు నరసింగరాజు తలను ఒక్క వ్రేటుతో నరికాడని, వీరుల ఘనతను 'వీర రసం'లో చిత్రించారు కవి.

బ్రహ్మనాయుడు నాగమ్మతో

"అన్నదమ్ములను చీలదీసి - యిట్లిందర్ని చంపావా
పలనాటి కుల స్త్రీల పుస్తెలు - పసుపు కుంకాలు
నేలగలిపితివి నాగమ్మా నీ నీతి పాడుగాను
కట్టుకొనుము యీ శవాల గుట్టకు - పట్టము అన్నాడు
యేలు కొనుము యీ శ్మశాన భూమిని - యేక ఛత్రముగను"

। పుట - 29 ।

'కోడిపోరు సోదరపోరు' చేసి పల్నాడు శ్మశానం చేశావు, దాన్ని ఏలుకో అని అసహ్యించు కొనుటలో కవి వైరాగ్యాన్ని, దాని ద్వారా 'శాంత రసాన్ని' చిత్రీకరించారు.



**గురువుగారు కీ॥శే॥ పద్మశ్రీ నాజర్ విగ్రహంతో జమున - బాబూజి**



బుర్రకథా గానంలో లీనమైన శ్రీ షేక్ నాజర్

**అల్లూరి శ్రీరామరాజు యుద్ధం**

బాస్టియన్ మన్యం ప్రజలను రోడ్డు పనికి రావడం లేదు అని తిడుతూ ఉంటే రామరాజు వచ్చి అన్యాయాలను ఏకరువు పెట్టగా బాస్టియన్ లాఠీ ఛార్జీ చేయమనగా

"పెఠల్ పెఠిల్లున పోలీస్ లాఠీ - వేట సాగినాదా
కఠోరముగ పసి బాల వృద్ధులను - పట్టి బాదుచుండ
గుట్టల పైగా రాళ్ళు బండలా వర్షం రేగిందా
గచ్చ పొదల్లో బాణాల్ పోలీస్ - బుట్టలెగరగొట్టెన్"

। పుట - 15 ।

అంటూ ప్రతి ధ్వనితో తిరగబడి రాళ్ళ వర్షం కురిపించారని 'వీరరసం'లో వర్ణించారు కవి.

పండిన పంటనంతా అప్పుల పేరుతో నాగులు లాగదల్చుకుంటే

"సంత సరుకు మా కష్టార్జిత మెవడబ్బ దింతలేదు
నంజు కుంత్రి మారగత మాంసములు - నంజ కొడుకులంత
అప్పులు నాగులు ఎపుడో కట్టాం వెళ్ళండనె రాజు
చిల్లి గవ్వ చెల్లించం చిట్టాల్ - చించండనె రాజు" । పుట - 20 ।

రామరాజు ఆ చిట్టాలు చించి మా కష్టార్జితం ఇది అని 'ఉగ్రుడైన సందర్భంలో రౌద్ర రసాన్ని మేళవించారు కవి.

జైల్లో తల్లితో మాట్లాడుతున్న రాజుకు మిరపకాయ టపా రాగా

"కసి బట్టి రౌడీ - రా          క్షసులు నడి వీధుల్లో
కట్టుబట్టలు విప్పి          కట్టేసి కొట్టారు - తకిట దకధిమి
భర్త ముందే భార్య శీలము          చెరపగా వెనుకాడరకటా"

। పుట - 25 ।

ఆంగ్లేయుల దురాగతాలను, అమానుష కృత్యాలను వర్ణిస్తూ, అంతేకాక బ్రిటిష్‌వారు మన్యం ప్రజలను పెట్టే హింసలు చెప్తూ"

చెప్పునెలండీ నీ మగడేడని చీరె లాగినారా
గొప్ప కేకతో చతికిల పడెనా కొండబండపైనా
అమ్మ గుండెపై దాగిన బిడ్డను రెక్కబట్టి లాగి
కెవ్వున కేకా బిడ్డతొలక్ష్మి - బతికిన శవమాయె
బతికిన శవాన్ని పొదలోకీడిచి - నెత్తురు తాగారా" ।పుట - 26 ।

అంటూ ఆంగ్లేయుల దురాగతాలను వర్ణిస్తూ, అవి పరాకాష్ఠకు చేరాయని 'భీభత్స రసాన్ని' మేళవించి చెప్పారు కవి.

రామరాజు యుద్ధాన్ని గూర్చి చెప్తూ
"శరవేగంబున రామరాజు అశత్రుసేన నెదిరి
ఘాటిలో కాలెట్టిన సిపాయి ఖతం చేయుచుండ
నెత్తురు జిమ్ముచు తలలు మొండాలు తన్నుకొనుచుండ"

।పుట - 32 ।

ఇక్కడ రాజు శౌర్యాన్ని చాటుతూ 'వీరరసాన్ని' చెప్పారు కవి. రాజును అంతమొందించే సందర్భంలో

"అబ్బా సూటిగ నాటెను తుపాకి గుండు రాజు గుండెలోనా" అంటూ 'భీభత్స రసాన్ని' చిత్రించారు కవి.

## అభిమన్యు యుద్ధం

ఉత్తర దీవెనలందగోరి వెళ్ళిన అభిమన్యుడు
"అర్ధాంగిరో వినవె - అలినీలవేణి
ముద్దు చెల్లించవె - మురిపాల మూట" । పుట - 31 ।

అని అభిమన్యుని కోరికను 'శృంగార రసం'లో వర్ణిస్తూ తెలియజేశారు కవి.
పద్మ వ్యూహాన్ని ఛేదిస్తున్న అభిమన్యుని యుద్ధ నైపుణ్యాన్ని గూర్చి చెప్తూ

"బాలుడకాను మీ పాలికే - కాలుడనే తాతా
అంపశయ్యకా ప్రక్కన సమాధి - తప్పదింక తాతా
విల్లు ద్రుంచి సారథిని చంపి - గుఱ్ఱాల కూల్చినాడ
త్రుళ్ళి తేరుకుని గుల్లున దూకటు వెళ్ళెను ద్రోణుండ
శత్రు సేనలా నలినలి చేయా - చెల్లా చెదురాయె
విల్లు విరచి దుశ్శాసనునట మూర్ఛిల్ల జేసినాడ
చెల్లెకాలమని రొమ్మున కాలిడి - బల్లె మెత్తుకుఱ్ఱా
వేడుకొనుమురా సుయోధనా ఇలవేల్పుల నన్నాడ
విషాంబునప్పుడు సంధించాడా - వీరాభిమన్యుండ"

। పుట - 23 ।

అంటూ వీరులనెలా తన వీరత్వంతో వణికించాడో చెప్తూ కవి 'వీరరసాన్ని' ఘనంగా చెప్తూ

"వచ్చే పెద్దలపై బాలుడు శర - వర్షం వర్షింపా
చిచ్చును తాకిన మిడుత రీతిగ - చచ్చెరుక్మధరుడు
ద్రచ్చ వికర్ణని వసాధిపతులను - అచ్చట జంపాడు
చచ్చె లక్ష్మణుడు తుచ్చులెందరో - చచ్చె బ్రొహభ్ఫలుడు
చిత్తు వత్తుగ నెత్తుగ పీన్గుల - గుట్టల గన్నారా
తత్తర గత్తర బుట్టిన పెద్దలు - గుట్టకూడి నారా" । పుట - 27 ।

ఇక్కడ శూరుడైన అభిమన్యుడు అరివీర భయంకరమైన సామర్థ్యంతో శవాల గుట్టలు చేస్తున్నాడని కవి 'బీభత్సరసాన్ని' చెప్పారు కవి.

అభిమన్యుని అవసాన దశలో

"విల్లు గుర్రాల రథసారథులను కూల్చెను గురువాజ్ఞ
విప్లవించి గదచే - పట్టి నిల్లినాడ
ఇంతలో దుశ్శాసన తనయుండు అరదముతో ఎక్కించ
ఒరే దుర్మార్గ నిలు నిలు అరెరే
పటపట పండ్లు కొరుకుతూ - పటు తరగతి వేగ
కలబడి వచ్చే దండును గదచే - గదిమి చంపినారు
కర్ణ శల్యులను దిమ్మర పోవగ - గదచే మోదాడ
కదబడి కయ్యం చేయసాగె దుశ్శాసన పుత్రుండ
విడివడి యుద్ధం చేయుచుండిరా వీరులు రోసాన"

। పుట - 28, 29 ।

అందరూ కలసి అన్యాయంగా బాలునిపై పోరు సల్పినా వీరావేశంతో రుద్రుడై యుద్ధం చేస్తున్న రీతిని కవి 'వీర రసోద్దీపితం'గా చిత్రించారు.

అభిమన్యుని అందరూ కలసి

"ఒకరి గదొకరికి గట్టిగ తాకీ ఒరిగెను అభిమన్యు" అయ్యో పడినఅభిమన్యు బరిశె ఈటెలతో పొడిచిరి అందరును, ఈ దుర్వార్త విన్న ధర్మజాదులు

"వీర కుమారుని చంపుకుంటిమని యేడ్చె ధర్మరాజు
కడుపు శోక మొడి గట్టె కొడుకని, కుమిలె కన్న తల్లి
నీవు లేని నేనేల ప్రాణపతి నన్నూ గొని పొమ్మా
నీ వంశము నిల్పేందుకుంచితివా నన్నూ పుణ్య పురుషా"

। పుట - 29 ।

ఆ కుటుంబం మొత్తం ఉన్న ఒక్క వంశాంకురం అంతరించిందని శోక సముద్రంలో ఉన్న పరిస్థితిని 'కరుణ రసం' పెల్లుబికి పాఠకుల హృదయాల్లో కలకాలం నిలిచిపోయేట్టు చిత్రించారు కవి.

**రాయలసీమ కరవు**

వర్షాధారమైన రాయలసీమలోని రాయపేట పొలాలు వర్షాలు లేక కరవు రాగా ఆ ఊరి పరిస్థితిని గూర్చి చెప్తూ

"గొడ్లూ మనుషులు చచ్చీ పోయెడి - గడ్డు రోజులాయె
సందెడు మేతకు చారెడు గంజికి - సతమతమగుచుండ"

అనుచోట చేయటానికి పనిలేదు. తినటానికి తిండిలేక అటు పశువులు, ఇటు మనుషులు కూడా అల్లాడిపోతున్నారని హృదయ విదారకమైన దుస్థితిని కవి 'కరుణ రసాత్మకం'గా చెప్పారు.

కామందు బ్రహ్మయ్యను రైతు భూపతయ్య అప్పు అడగగా
"పట్టుకెళ్ళి మరి యిచ్చే నీతి - పుట్టలేదు ప్రజకు
పండినేడు తిని పండనేడు - ఎగబెడ్తానంటారు"

। పుట - 26 ।

ఇక్కడ పంటకోసం ఇంతకుముందు తీసుకున్న అప్పు తీర్చలేదు, అంతకు ముందు సంవత్సరం పంటలు బాగా పండాయి కదా అప్పుడు ఎక్కువ ఇచ్చారా? అని సన్నకారు రైతు భూపతయ్యపై దుర్మార్గుడైన బ్రహ్మయ్య ఉగ్రుడైన సన్నివేశంలో కవి 'రౌద్ర రసాన్ని' వర్ణించారు

రైతులు కూలీ చేసుకునైనా బ్రతుకుదామనే నిర్ణయాన్ని
"కులము వంశమని పెగ్గెకుపోతే - కూటికి వస్తాము
కూలో నాలో చేసి పావల - కొంపకు తెస్తాము
కరువుకు బ్రతికితె తదుపరి జూతము - కులము గోత్రాలు"

। పుట - 7 ।

ఇచ్చట కూలీలతో వ్యవసాయం చేయించిన రైతులు తామే కూలి చేయు పరిస్థితిని కరవు కల్పించిందని చెప్తూ ఆ దయనీయ స్థితిని 'కరుణ రసం'లో చెప్పారు కవి.

పశువులకు మేత లేక చనిపోయేట్లు తయారవ్వగా

"మేతలేని పశువులాను    కోతకే తానమ్మజూచె

కోపుటెడ్లను బేరమిచ్చే    కోడెనావును బేరమిచ్చే" | పుట - 8 |

అట్టి పరిస్థితిలో వేరే దారిలేక పశువులను కటిక వానికి భూపతయ్య అమ్మి వేయగా సీతమ్మ

"అమ్మవద్దావు నన్నాదా    ఆ తల్లి గోడు విన్నారా

కోడెనావును వీడినారా" | పుట - 8 |

ఇక్కడ విలాపాన్ని మన్నించడాన్ని పశువులపై జానపదులకు గల ప్రేమను కవి 'కరుణరసం'లో చెప్పారు.

పనికెళ్ళిన సీతమ్మ ఏడుస్తూ బిడ్డ నెత్తుకుని ఇంటికి రాగా, వెంటనే బ్రహ్మయ్య రారా

"బాకీ క్రింద ఆవును కోడెను - పట్టుకు నెళ్తాను

అడ్డము రావే గొడ్డట నరికెద - నంటూ బ్రహ్మయ్య" | పుట - 10 |

తన కోరిక సీతమ్మ కాదన్నదని తిడుతున్న దుర్మార్గాన్ని, పేద ధనిక వర్గాల తారతమ్యాలను కవి 'రౌద్ర రసం'లో చెప్పారు.

భర్త దూరమై పల్లెలో బ్రతకటం కష్టమై పట్నం వెళ్లి ఏదో కూలి చేసుకుని పరువుగా బ్రతుకుదాం అనే 'సీతమ్మ అభిప్రాయాన్ని చెప్తూ

"వెళ్ళిపోదా - మామను    వెళ్ళిపోదాము - పట్నవాసపు

కుళ్ళు కంపు వీధులలోనబడి    పుట్టి పెరిగిన గడ్డ మీదే

పుట్ట గతులూ - మాసిపోగా    కొంప గోడే వీడి - పట్టెడు

కూటికై - ఊరేగ వలెనా" | పుట - 10 |

ఇక్కడ సొంత ఊరిపై గల మమకారాన్ని, బతుకు తెరువుకై పట్నం వెళ్ళటం ఇష్టం లేకపోవటాన్ని కవి 'కరుణ రసాత్మకం'గా వర్ణించారు.

వాంతులు, విరేచనాలై మామ చనిపోగా సీతమ్మ

"మామా మాకిక మాయను దిక్కే - మాయమయె నయ్యో
మాయజేసి ముమ్మొంటిగ విడిచి - పోయితివా మామా"

। పుట - 12 ।

అంటూ పెద్ద దిక్కు, అండ పోయిన మానవతి సీతమ్మ ఆర్ద్రతను కవి 'కరుణ రసం'తో చెప్పారు.

సీతమ్మ తెగించి క్రోధంతో బ్రహ్మయ్యను

"కరవుకు తోడై మా కాపురమును - గంగ పాలు జేసి
సిగ్గు వీడి నా శీలము నిప్పుడు - చెరుప నెంచినావా?
పరువుకోస మీ శీలమమ్ముకొను - పాపిని కానయ్యా!"

। పుట - 12 ।

ఇక్కడ కరవొక పక్క, నీ దుష్ట చేష్టలొక పక్క సంసారాన్ని నాశనం చేసినా, పరువు, ప్రాణం కోసం శీలంతోనే చస్తాం అని సీతమ్మ ఆత్మస్థైర్యంగా మాట్లాడే విధానాన్ని కవి 'రౌద్రరస' పోషకంగా గొప్పగా చిత్రించారు.

అక్రమ శీలియైన బ్రహ్మయ్య సీతమ్మతో

"పాపము కడు పసి పాపడు వీడూ - వీణ్ణి చంపుతావా
పోయిన మగడూ పోయినాడూ - మరి రాడూ తిరిగిరాడూ
చచ్చిన మామ చచ్చినాడూ - తిరిగొచ్చుట దుర్లభమే
చూడు సీత యీ చుట్టుపట్ల పడియున్న పీనుగులనూ
నేడో, రేపో నీవు కూడా - యిట్లగుట నిశ్చయంబో
అప్పుడు నీ మురిపాల పాపడే - పీనుగు మీద పడునో"

। పుట - 12 ।

అనుచోట ఇప్పుడు చెప్పు నీ బిడ్డ సంగతి అని బ్రహ్మయ్య పరిస్థితిని తనవైపు

మరల్చుకొని భయపెట్టే సన్నివేశంలో కవి 'భయానక రసాన్ని' వివరించారు.

సీతమ్మకు బ్రతుకుపై విరక్తి కలిగి ఉగ్రురాలై

"పెట్టక మానడు పుట్టించిన వా-డంటే మీరూ
తిండిలేని మా చావూ బతుకూ - తెలియదా దేవునికీ
మానమా బిడ్డల ప్రాణమా రక్షణ - మార్గమేది నాకూ" | పుట - 13 |

దేవుడు కూడా దిక్కు చూపలేదు మాకు అని సీతమ్మ దేవుణ్ణే నిలదీసిన సన్నివేశంలో కవి 'రౌద్రరసాన్ని' చిత్రించారు.



శ్రీ నాజర్ గీతాలను ఆలపిస్తున్న కుటుంబ సభ్యులు



కీర్తిశేషులు పద్మశ్రీ నాజర్
విగ్రహ పూజాకార్యక్రమం
ది.21-2-2009 పొన్నెకల్లు
బుర్రకథకళా మహోత్సవం

# అలంకారములు

## నేటి రాయలసీమ

రాయలసీమలోని రాయపేట కామందైన బ్రహ్మయ్య స్వభావాన్ని తెలుపుతూ 'బ్రహ్మ రాక్షసి వంటి వాడని" 'అర్థాలంకారమైన ఉపమాలంకారము'ను చెప్పారు కవి.

సీతమ్మ మిట్ట మధ్యాహ్నం పని నుంచి తిరిగి వస్తుంటే ఎండ తీవ్రతను గూర్చి వివరిస్తూ "అగ్గి చెరుగు నడి ఎండలోన" అని 'అర్థాలంకారమైన అతిశయోక్తి అలంకారము'ను కవి చెప్పారు.

కరవు తాళలేక బతుకు తెరువుకై పట్నం వెళ్తున్న మధ్య దారిలో "స్పృహ తప్పిన జనముల తోరణముందన్నా" అను చోట వరుసగా జనం తోరణంలా పడిపోయారని 'అర్థాలంకారమైన ఉపమాలంకారము'ను కవి చెప్పారు.

వలస పోతున్న ప్రజల పరిస్థితిని గూర్చి చెప్తూ "మండుటెండలో కాళ్ళకు చెప్పులు లేకపోవటంతో అరికాళ్ళు బొబ్బలెక్కి నీళ్ళు కారటం, ఆకలికి తనువు తూలి సోలి పోవటం, వడగాలికి దప్పికతో నోరెండి ఏడుస్తూ చంక నుంచి జారుతున్న పిల్లలను తల్లులు సముదాయించే ఓపిక కూడా లేదని" కవి ఎంతో సహజంగా విశదపర్చి 'అర్థాలంకారమైన స్వభావోక్తి' అలంకారమును చెప్పారు.

బ్రహ్మయ్యతో బిడ్డనెత్తుకుని వెళ్తున్న సీతమ్మకు భూపతయ్య కన్పించగా
"దుమ్ము ధూళిపై గమ్మి మారు రూపము పడెను వాడూ
వచ్చుచున్న నా భూపతయ్య నా - వనిత గుర్తుపట్ట
అయ్యయ్యోయని సీత భూపతిని - అదిమి పట్టినారు
సొమ్మసిల్లినది రోడ్డు మీదనే - దిమ్మర పోయారూ

అన్నుబట్టి ప్రాణాలు దంపతులు - అసువులు వీడారూ
అతని తల్లి హృదయానికి వారిని హత్తుకున్నదయ్యా
పడిన దంపతులు లేవకుండానే - పాపి కరవు మ్రింగే
బువ్వా బువ్వా అమ్మా బువ్వా అని - బుడ్డడు యేడ్చుచుండా"

। పుట - 14 ।

ఇక్కడ భర్తతో ప్రాణాలు వదలగా అవని హత్తుకొనగా, కరవు మ్రింగగా, పిల్లాడు అన్నమో అని ఏడ్వడం హృదయాన్ని కలచివేసే కరుణ రసోపేతంగా కవి వర్ణించి, ప్రేక్షక హృదయాలను చూరగొనడం మనం చూడగలము.

## అల్లూరి శ్రీరామరాజు యుద్ధం

రచయిత ఏది రాసినా ఆలంకారికంగా చెప్పారు. అలా చెప్పడం మూలంగా రచనా శైలిలో శోభ చేకూరుతుంది. శ్రీ నాజర్ బుర్రకథల్లో అలంకారాలను సందర్భశుద్ధిగా రచించారు.

రామరాజు మన్యంలో "కొండబండయే పట్టి మంచముగ, ఎండుటాకులు పట్టు పరుపులుగా, ఆకాశం అద్దాల మేడగా, మృగాల గోల జోలగా, కోడికూత వీర గీతముగ" ఎంచిన స్థితిని కవి ఎంతో సమర్థంగా 'అర్థాలంకారమైన ఉపమాలంకారం'లో వర్ణించారు.

మన్య ప్రజలను కలవారు అప్పులు ఇచ్చి మోసం చేస్తున్న రీతిని "గబ్బు నూనె డబ్బాకో తేనెల డబ్బా యిమ్మనిరా" అను చోట 'బ' పలుమార్లు వచ్చుటను బట్టి ;

"పచ్చి మోసం తచ్చ దోపిడి - ముచ్చులగుమీ మెబ్బుమిచ్చుట
మెచ్చి మ్రొక్కి పచ్చి ప్రజలేరు" - అనుచోట 'చ' అనేకసార్లు ;
"మంది సొమ్ము తినమరిగిన దొరలు - వందల కొందలు చందాదారులు"

అనుచోట 'ద' ఎక్కువసార్లు ప్రయోగించడం చేత 'శబ్దాలంకారమైన వృత్యను ప్రాసాలంకారము'ను చెప్పారు కవి.

## పల్నాటి యుద్ధం

బ్రహ్మనాయుడు చేస్తున్న సంస్కరణలను గూర్చి చెప్తూ "వర్ణ ధర్మమను ఉక్కు చట్రమును" అనుచోట వర్ణ వ్యవస్థ అనే ఉక్కు చక్రాన్ని ఛేదించి అనే విషయాన్ని వివరిస్తూ 'అర్థాలంకారమైన రూపకాలంకారము'ను చెప్పారు కవి.

కోడి పందెములకు వస్తున్న నాగమ్మ పక్షం వారిని గూర్చి చెప్తూ

"పేరుగొన్న పందెగాళ్ళురా
పోరుగల కోళ్ళ నెత్తిరా
సాధన జేసి వారురా
సారా జాడీ బండ్లురా
భేరీ వాయిద్యాలు రా
జోరు జోరుగా త్రాగిరా
దారులన్నీ తెగ నడిచారా"

అనుచోట 'ర' అనేక సార్లు వాడడం చేత, 'రా' అంతకు ముందు వాడడం చేత శబ్దాలంకారమైన 'వృత్యను ప్రాస', 'అంత్య ప్రాస'లను కడురమ్యంగా చెప్పారు కవి.

మాంచాలి దీవెనందుట కెళ్ళిన బాలచంద్రుని స్థితిని గూర్చి చెప్తూ "కన్ను చెదిరి కామాంధకారమున" అనుచోట కామంచేత కళ్ళు పొరలు కమ్మాయి అని చెప్తూ 'అర్థాలంకారమైన రూపకాలంకారమును;

ఆమె అందము పొగడుతాడా
ప్రేమ భిక్ష వేడుతాడా" అనుచోట మాంచాల అందానికి ప్రేరితుడై ప్రేమ అనే భిక్షం అడిగాడని వివరిస్తూ 'రూపకాలంకారము'ను హృద్యంగా చెప్పారు కవి.

"పిచ్చియెత్తిన కోతి చందాన బాలుడా" అనుచోట అసలే కోతి అందునా పిచ్చెత్తింది అంటూ వయనం చేసే తుంటరి పనులను వివరిస్తూ 'ఉపమాలంకారము'ను సరసంగా చెప్పారు కవి.

మాంచాల బాలచంద్రునితో "దేశానికి వెన్నెముకలు యువకులు" అనుచోట దేశ భవిష్యత్తుకు మూలం యువత అనే విషయాన్ని చెప్తూ 'అర్థాలంకారమైన ఉపమాలంకారము'ను చెప్పారు.

యుద్ధ సన్నద్ధమైన నాగమ్మ "ప్రళయ కాళివలె నాగసాని పయనము అయినాది" అనుచోట యుద్ధ సన్నద్ధమైన నాగమ్మ యుద్ధ కాళిలా ఉందని' అర్థాలంకారమైన ఉపమాలంకారము'ను చెప్పారు కవి.

బ్రహ్మనాయుని యుద్ధ సన్నాహాలు గూర్చి చెప్తూ

" రణ వీర కొణం బట్టునో - రణమో రణమో యంటి వో"

అనుచోట 'ణ' పలుమార్లు ఉపయోగించుటను బట్టి 'శబ్దాలంకారమైన వృత్యను ప్రాసాలంకారా'న్ని చెప్పారు కవి.

బాలచంద్రుని యుద్ధమును గూర్చి చెప్తూ

"పిడుగు చందమున" అనుచోట బాలుని పిడుగులా పోల్చి చెప్తూ ఉపమాలంకారమును, "వేటు బడ్డ పులి బిడ్డ చందమున" అనుచోట దెబ్బతిన్న పులిలా అని విశదీకరిస్తూ 'ఉపమాలంకారము'ను చెప్పారు కవి.

యుద్ధానంతరం "వీర యోధులా వేడి రక్తమట యెర్ర బారె నింగి' అనుచోట ఉపమాలంకారాన్ని రసోచితంగా వివరించారు.

## బొబ్బిలి యుద్ధం - అలంకారములు

విజయనగరమును గూర్చి చెప్తూ

"నా జాతి రతనమ్మ - విజయ నగరమ్మ

విజయనగరము నేలు - వీరులెవరన్నా" అనుచోట ;

"విజయనగరము యుక్తిగనేలే - విజయరామరాజు

రాజు మంత్రి యసాధ్యుడు బుర్రా - బుచ్చన్నున్నాడా"

ఇక్కడ శబ్దాలంకారమైన ముక్తపద గ్రస్తాలంకారమున చెప్పారు కవి.

రాణి మల్లమ్మదేవిని గూర్చి చెప్తూ

"రాణి మల్లమ దేవి - రంగయ్య కులపత్ని

రమణుల చేమంతి - సుగుణాల దొంతి

పతి పాదలముల నాని - పలికెనలివేణి" ఇచ్చట 'ణ', 'ల' అనేకసార్లు చెప్పబడింది, కావున 'శబ్దాలంకారమైన వృత్యను ప్రాస', ఇందులోనే పాదాంతమందు 'అంత్యప్రాస' కూడా చెప్పారు.

రాణి మల్లమదేవి గర్భవతి అయిన సందర్భంలో

"మందు మాకులో దేవుళ్ళ మహిమలేమొ

కుందరదనకు గర్భంబు కుదురుకొనియె

మందయానకు తొమ్మిదో మాసమేగె

ఇందుముఖి బిడ్డ నొప్పుల కుందుచుండ" ఇందు 'మ', 'ద' అక్షరాలు పలుమార్లు ఉపయోగించబడినవి, కావున శబ్దాలంకారమైన వృత్యనుప్రాసము చెప్పారు కవి.

బొబ్బిలికి విజయనగరానికి మధ్య కోడి పందెముల మూలంగా పెరిగిన ద్వేషాలను చెప్తూ "కక్షల వలె కారు చీకట్లు లోకం" ఇట ఆవేశంలో మనసు

పొరలు కమ్మిందని చెప్తూ' అర్థాలంకారమైన ఉపమాలంకారము'ను చెప్పారు కవి.

రంగారావు మరణం గూర్చి చెప్తూ

"సూర్యుడపుడు

మృత్యువు రీతికి రాజును చీకటి - ముట్టడించెనపుడు"

అనుచోట సూర్యుని ఆవరించిందని 'అర్థాలంకారమైన ఉపమాలంకారాన్ని' కవి చెప్పారు. ఆకాశం ఎర్రబారుటను చూపి ఉపమాలంకారమును, తదనంతరం కొంతసేపటికి "కక్షల రీతిగ కారు చీకటుల క్రమ్మెను నల్దిశల" అనుచోట కక్షల్లా ఆకాశం చీకటి మయమైందని అర్థాలంకారము అయిన 'ఉపమాలంకారమును, అంతేగాక ప్రకృతిలోని సహజత్వం కూడా చెప్పబడింది కాబట్టి ఇందులోనే 'స్వభావోక్తి' అలంకారం కూడా చెప్పారు కవి.

## అభిమన్యు యుద్ధం

భారతదేశాన్ని గూర్చి వర్ణిస్తూ "శ్రీరంజిల్లెడి భరతగడ్డ ఈ - ధరణికి మణిపూస" అను చోట అడవికి భరతభూమి మణిపూస వలె ఉంది అని 'అర్థాలంకారమైన ఉపమాలంకారాన్ని కవి చాలా ఉన్నతంగా చెప్పారు.

గర్భవతియైన సుభద్రను గూర్చి చెప్తూ "రుచిగల తినుబండారములు తినాలనిపిస్తుందని, మధుర సంగీతం వినాలని, మంచి చిత్రాలు, శిల్పాలు చూడాలని, గొప్ప కవిత్వంతో కూడిన కథల కోసం ఉవ్విళ్ళూరుతుందని" చెప్పటంలో గర్భిణీ స్త్రీల సహజ స్వభావాన్ని తెలుపుతూ 'అర్థాలంకారమైన స్వభావోక్తి'ని కవి చెప్పారు.

పాండవులు అరణ్య, అజ్ఞాత వాసాలు పూర్తయి సుభద్రను తీసుకురమ్మన్నారన్న వార్త విన్న సుభద్రకు "ఆ వార్త అమృతమ్మాయె" అనుచోట

ఆ శుభవార్త ఆమెకు అమృతం లాంటిదని కవి ఉపమాలంకారమును చెప్పారు.

పెళ్ళి కూతురైన ఉత్తరను గూర్చి చెప్తూ

"నీలి చుక్కను నుసిగ్గుల బుగ్గల - తళుకుల గులికింపా

మేలి ముసుగులో కలువల చెలివలె - చెలియల వలపింపా"

ఇచట 'ల' కారం అనేకసార్లు చెప్పబడింది. కావున 'శబ్దాలంకారమైన వృత్యనుప్రాస', 'కలువల చెలివలె' అనుచోట 'అర్థాలంకారమైన ఉపమాలంకారము'ను కవి ఎంతో చక్కగా చెప్పారు.

ధర్మజుని బంధించెదనని ద్రోణుడు చేసిన ప్రతిజ్ఞ తెలిసిన అభిమన్యుడు

"అట్టి ప్రతినకు అభిమన్యుం

డగ్గిపిడుగై భగ్గుమని తా" సందర్భంలో అగ్గిపిడుగులా భగ్గుమన్నాడని 'ఉపమాలంకారాన్ని' కవి చెప్పారు.

అభిమన్యుని కోపాన్ని గూర్చి చెప్తూ "కొర కొర లాడుచు తండ్రుల కొల్యుకు చెర చెర వచ్చాడా" అనుచోట 'శబ్దాలంకారమైన ఛేకానుప్రాస'ను చెప్పారు కవి. "తోక తొక్కిన త్రాచువలె కస్సు బుస్సుమన్నాడు" అనుచోట 'ఉపమాలంకారాన్ని' చెప్పారు కవి.

తల్లి సుభద్రను అభిమన్యుడు దీవించుచున్నపుడు 'స్త్రీ జాతి గుండె నీరు కాలేదురా", "భీరువై మాట్లాడుట కాదు స్త్రీ మానసిక స్థితి" అన్నపుడు 'స్వభావోక్తి' అలంకారాన్ని కవి సమర్థంగా చెప్పారు.

"యుద్ధ వీరుల రక్త-మేరులై పొంగ" అనుచోట అభిమన్యుడు యుద్ధం చేస్తుంటే రక్తం ఏరులై పారుతుందని కవి 'ఉపమాలంకారాన్ని' చెప్పారు.

"తాపు తగిలిన తాచువలె", "దెబ్బతిన్న నాగు వలె" అనుచోట ఉపమాలంకారమును, "అగ్గికి వాయువు తోడైనట్లు" అభిమన్యునికి ఘటోత్కచుడు

తొడగుటను ప్రకృతి ధర్మం చెపుతూ సహజమైన 'స్వభావోక్తి' అలంకారమును చెప్పారు కవి.

"చిత్తజల్లు వలె చిటపట శరములు" అనుచోట శర ప్రయోగం గూర్చి చెప్తూ 'ఉపమాలంకారాన్ని' చెప్పారు కవి.

"మధ్యాహ్న మార్తాండుని వలె" అన్నపుడు 'ఉపమాలంకారాన్ని' కవి చాలా సమర్థంగా వర్ణించారు.



# నామౌచిత్యం

## అల్లూరి శ్రీరామరాజు యుద్ధం

ఆంగ్లేయుల దౌష్ట్యాన్ని అంతమొందించి భారతదేశానికి స్వేచ్ఛ కావాలనే ఉద్దేశంతో రామరాజు చేసిన త్యాగం, కృషి భారతంలో మరో పర్వం అనదగ్గ ఘనచరితగా కవి 'అల్లూరి శ్రీరామరాజు యుద్ధం' అని పేరు పెట్టటంలో ఔచిత్యం ఎంతో ఉంది.

## పల్నాటి యుద్ధం

మత, కుల వైషమ్యాల మూలంగా దాయాదుల మధ్య వచ్చిన తేడా దళిత నాయకత్వాన్ని, అంతా సమానులే అన్న విషయం అంగీకరించలేని అగ్రవర్ణాల ఆధిపత్య అధికారాలే కారణాలుగా ఆంధ్రలో మరో కురుక్షేత్రం జరిగిందనే ఉద్దేశంతో కవి 'పల్నాటి యుద్ధం' అని నామ నిర్ణయం చేయడంలో ఔన్నత్యం ఎంతో ఉంది.

## బొబ్బిలి యుద్ధం

రాజ్యకాంక్షతో, సింహాసనం కోసం సహజంగా రాజులు యుద్ధాలు చేస్తూంటారు. ఆంగ్లేయుల 'విభజించు-పాలించు' అనే సూత్రం ప్రకారం విజయనగరానికి, బొబ్బిలికి మధ్య యుద్ధం బ్రిటిష్ వారి మద్దతుతోనే జరిగింది. ఈ యద్ధానికి కారణం అధికార దాహం అని కవి సూత్రప్రాయంగా చెప్పి 'బొబ్బిలి యుద్ధం' అనే నామకరణ చేయడంలో ఔచిత్యం ఉంది.

## అభిమన్యు యుద్ధం

భారతంలో దేశభక్తి కల్గిన అభిమన్యుని ఒక్కని చేసి పెద్దలంతా అన్యాయంగా, అక్రమంగా తమ ఉన్నతిని నిలబెట్టుకోవటం కోసం వీరుడైన

అభిమన్యుని వధించటం చరిత్ర మరువలేని నిజం అభిమన్యుడు యుద్ధంలో వీర మరణం చెందటం క్షత్రియ ధర్మం, కావున ఈ పేరు సార్థకమైందని కవి ఉద్దేశం. అదీ కాక ఇరువర్గాల మధ్య పోరు కూడా దృష్టిలో ఉంచుకుని కవి 'అభిమన్యు యుద్ధం' అని నామ నిర్ణయం చేయడంలో ఎంతో ఔన్నత్యం ఉంది.

## నేటి రాయలసీమ

సకల సంపదలకు నీతి, నియమాలకు ఆలవాలమైన ఆంధ్రదేశం రాయల పాలనలో లలిత కళలతో విలసిల్లినదిగా చరిత్రలో ఓ స్థానం ఉంది. "కొండ వాగులతో నిండి, తుంగభద్రానది కొంగు బంగారంలా, సిరులు పండు బంగారు భూమిగా, వీరగడ్డగా పేర్గాంచి, వర్తకానికి ఒరవడిపెట్టి విజ్ఞానవంతులకు నిలయమైన రాయలసీమ నేడు రాలసీమగా మారిన దుస్థితిని తెలిపేందుకే రాయలసీమ" అని పేరిడి నామ నిర్ణయం చేయడంలో ఎంతో ఔన్నత్యం ఇమిడి ఉంది.



నాజర్‌కు గండపెండేర ధారణ

# సామెతలు

సమస్త ప్రాణుల్లోకెల్లా మానవునికి గల అమూల్యమైన శక్తి మాట్లాడగలగడం. మానవుడు తన అభిప్రాయాలను వ్యక్తపరచడానికి భాష ఉపకరిస్తుంది. జంతువుల అరుపుల కన్నా మానవ భాషలో వైవిధ్యం ఎక్కువగా ఉంది. మానవులు ఇతర ఆచార వ్యవహారాల వలెనే భాష కూడా ఒకరి నుంచి ఒకరు నేర్చుకుంటారు. అంతేకాక భాష ఒకతరం వారి నుంచి ఇతర తరాల వారికి నేర్చుకోవడం ద్వారా సంక్రమిస్తుంది అలా భాష సంక్రమణలోనే సామెతలు ఉద్భవించి ఉండవచ్చు.

ఒక్కొక్క సామెతలో అనుభవం వెనుక సంపూర్ణ జీవిత సత్యమే దాగి ఉండవచ్చు. ఒక సంపూర్ణ జీవిత సారమంతా ఒకే వాక్యంలో అడగి ఉండవచ్చు. తెలుగువారి సామెతల్లో తెలుగువారి జీవితంలోని అనేక ముఖాలు తొంగి చూస్తుంటాయి. అట్లే కన్నడిగుల సామెతలు, తమిళ, వంగ భాషల వారివి, చైనా వారివి, జపాన్ వారివి, అమెరికా వారివి.

సామెత అనే మాట 'సామ్యత' అనే పదం నుంచి ఉద్భవించింది. వీటి ముఖ్య గుణాలలో సామ్యతను చెప్పడం కూడా ఒకటి. 'దృష్టాంత' మనే అర్థంలోనే హంగరీ భాషలో 'పెల్డ బెగెడ్' అనీ, అరబ్బీలో 'మతల్' అని సామెతకు పేర్లున్నాయి. ఆంగ్లంలో సామెతను 'ప్రోవెర్బ్' అంటారు. సంస్కృతంలో 'సూక్తి' అని, 'సుభాషిత'మని, తమిళంలో 'పళమొళి' అని, కన్నడంలో 'గాదె' లేక 'నాణ్ణుడి' అని అంటారు.

జానపద విజ్ఞానంలోని అన్ని అంశాల లాగే సామెతలు కూడా సాంప్రదాయకమైనవి. వాటి ప్రత్యేకత వివేకవంతమైనవి కావడం, సంక్షిప్తంగా ఉండడం వివేకవంతంగా ఉండడమన్నది సామెతల పుట్టుకకు సంబంధించినది. సంక్షిప్తంగా ఉండడమన్నది 'స్వరూపాన్ని' గురించి చెప్తూంది. 'అల్పాక్షరాలలో

అనల్పార్థ రచన' అన్న వాక్యానికి సామెతలు ఉదాహరణలుగా ఉంటాయి. సామాన్యంగా సామెతలతో ఒక్క వాక్యం మాత్రం ఉంటుంది, లేదా ఒక వాక్యంగానీ ఒకే పరిమాణంగల రెండు వాక్యాలుగాని ఉండవచ్చు. అక్షరాల సంఖ్యలో కూడా పోలిక కన్పిస్తుంది.

ఉదా "నలుగురు నడిచిందే బాట - పలువురు పలికిందే మాట"

సామెతల్లో సమాన భాగాలు లేకున్నా ప్రాసాను ప్రాసలతో గూడిన లయ కన్పిస్తుంది. 'ఛందో' దృష్టితో చూస్తే వీటిలో 'ద్విపద పాదాలూ, తేటగీతి పాదాలూ, ఆటవెలది పాదాలు' కనిపించవచ్చు. ఛందస్సు పేరు ఏదైనా ఇంగ్లీషులో, కన్నడంలో, తమిళంలో కూడా ఈ 'ఛందోబద్ధత' కనిపిస్తుంది. లయ అన్నది ప్రాచీన కవితా గుణాలలో ఒకటి. ప్రాక్తన మానవుని భాష మామూలుగా లయబద్ధంగానే ఉండేదని మానవ శాస్త్రం చెప్తుంది. అందుచేత ప్రాచీన మానవ సంస్కృతిని ప్రతిబింబించే సామెతల్లో కూడా లయ ఉంటుందని చెప్పవచ్చు. ఈ సామెతలను గుర్తు పెట్టుకోవడానికి ఉపకరించేది లయ. కవితా గుణం సామెతల్లో ఉంటుందని చెప్పవచ్చు.

పదునైన భావాల్ని పదునైన మాటల్లో చెప్పడం సామెత లక్షణం. చెప్పే విషయాన్ని సాధ్యమైనంత సూటిగా చెప్తాయవి. మానవుని దీర్ఘానుభవం ఆధారంగా రూపుదాల్చిన సంక్షిప్త వాక్యాలు కావడం చేత సామెతలకు ఈ తీక్షణత లభ్యమైందని చెప్పవచ్చు. చెప్పే విషయాన్ని ఆలంకారికంగా, గూఢార్థద్యోతకంగా చెప్పడం సామెతకు మరో లక్షణంగా చెప్పుకోవచ్చు. సామెతలలోని భాష సాంకేతికంగా ఉంటుంది. 'రూపకం, ఉపమ, దృష్టాంతం' సామెతల్లో తరచుగా కనిపిస్తూంటాయి. అయితే స్వభావోక్తులు కూడా కొన్ని ఉంటాయి. మొత్తం మీద 'సంక్షిప్తమైన, వివేకయుతమైన, తీక్షణమైన, సాంప్రదాయకమైన, జన ప్రియమైన, అనుభవ మూలమైన అభివ్యక్తి సామెత' అని నిర్వచించవచ్చు.

జానపద సాహిత్య రూపాలలో సామెత అన్నిటి కంటె చిన్నది కావడం వల్ల దానిలో చరిత్రకు సంబంధించిన ఆధారాలను వెతకడం చాలా కష్టం. అందువల్ల 'సామెత పుట్టు పూర్వోత్తరాలు తెలుసుకోవడ మంటే ఇసుకలో తైలం తీసినట్లే'. మౌలికమైన ప్రతిభ, కల్పనాశక్తి, అన్వేషణాసక్తి ఉండిన అతి ప్రాచీన మానవుడే సామెతలను సృష్టించాడనడంలో సందేహం లేదు.

కొన్ని సామెతలు పురాణాలు, ఇతిహాసాలు, కథలు మొదలైన వాటిని ఆధారంగా చేసుకుని ఉద్భవిస్తాయి. పురాణేతి హాసాలు చాలా సామెతలకు ప్రేరణ నిచ్చాయి. రామాయణ మహాభారతాలు, బైబిలు, పంచతంత్రం మొదలైనవి ఇలాంటి గ్రంథాలు.

ఉదా:- "రామాయణంలో పిడకల వేట", "వింటే భారతం వినాలి - తింటే గారెలు తినాలి", "రామాయణమంతా విని రాముడికి సీతేం కావాలి" అని అడిగినట్లు మున్నగునవి.

సామెతలను విభజించడంలో ముఖ్యంగా రెండు పద్ధతులున్నాయి. అకారాదిగా విభజించడం మొదటిది. దీనిలో మళ్ళీ రెండు ఉపమార్గాలున్నాయి. సామెతల మొదటి మాటను తీసుకుని అకారాదిగా మార్చడం లేక సామెతల్లో ముఖ్యమైన పదాన్ని తీసుకుని అకారాదిగా కూర్చడం. ఈ మొదటి పద్ధతి కాక మరో పద్ధతి ఉంది. అది వస్తువును ఆధారంగా చేసుకుని వర్గీకరించడం. మొదటి దానికంటే ఇదే ఉత్తమమైనదనిపిస్తుంది. లేకుంటే సామెత ఏదైనా కావాలంటే పుస్తకమంతా వెదకవలసి వస్తుంది.

సామెతలలో కొన్ని ఏదో సత్యాన్ని గాని, నీతిని గాని చెప్పేవిగా ఉండవచ్చు. ఉదా: "పరుల సొమ్ము పాపిష్టి సొమ్ము". ఒక సూత్రాన్ని గాని, అనుభవాన్ని గాని చెప్పేవి కొన్ని. ఉదా: "మౌనం అంగీకార సూచకం", "మౌనం అర్ధాంగీకారం". కొన్ని సామెతలు కథలను సూచించేవిగా, పాతకాలపు

సంప్రదాయాలను సూచించేవిగా ఉంటాయి. సామ్యతను చెప్పే సామెతలది ఒక వర్గం.

ఉదా:-"కూటికుండ కుక్క ముట్టినట్లు"

"కూడిన కొద్ది కుండలమ్ముకుని తిన్నట్లు"

వైద్యానికి సంబంధించిన సామెతలను ఒక వర్గంగా విభజించవచ్చు. 'గృహ వైద్యానికి అనుభవమే జీవగఱ్ఱ'. శాస్త్రీయాధారం లేకున్నా గృహవైద్యం ఒక్కొక్కసారి చక్కగా పని చేస్తుంది. "ఉల్లి చేసిన మేలు తల్లి కూడా చెయ్యదు" అని అనుభవజ్ఞుల మాట.

వాతావరణానికి సంబంధించిన సామెతలు కూడా అనుభవ మూలకమైనవే. "కృత్తికలో విత్తితే కుత్తుకలు నిండవు" అని వ్యవసాయదారుడు అనుభవంతో తెలుసుకున్నాడు.

ఉదా:- 'ఆరుద్రలో అడ్డెడు చల్లితే పునాసకు పట్టెడు పండుతాయి.

సమాజంలో సామెతలకుండే ప్రాధాన్యాన్ని ప్రాచీన కవులు కూడా గుర్తించారు. నన్నయ నాటి నుండి కావ్యాలలో ఎన్నో సామెతలు కనిపిస్తాయి. కాని వాటితో వచ్చిన చిక్కల్లా కవి కల్పితాలా లేక జన వ్యవహారాలా అన్నదే తెలీకపోవటం.

"గతకాలము మేలు వచ్చు కాలము కంటెన్" - (నన్నయ)
"పాలలో బడిన బల్లి విధంబున నుండకుండునే - (తిక్కన)
"పతులు మెచ్చని చెలువు నిష్ఫలము గాదె - (శ్రీనాథుడు)
"కలంచునే సతుల మాయల్ ధీర చిత్తంబులన్ - (పెద్దన)

'వేమన' పద్యాల మూడవ పాదాలు చాలావరకు సామెతల వంటివే. వేమన జీవితానుభవంతో కవిత చెప్పిన వాడు కావడం చేత అనుభవమే మూలద్రవ్యమైన సామెతలు వేమన సూక్తులలో కోకొల్లలు.

ఉదా:- "అనువుగాని చోట అధికులమనరాదు"

"పదుగురాడు మాట పాటియై ధరజెల్లు"

"స్థాన బల్మి కాని తన బల్మి కాదయా"

"తప్పులెన్ను వారు తమ తప్పులెరుగరు"

"కంచు మ్రోగినట్లు కనకంబు మ్రోగునా"

"సాధనమున పనులు సమకూరు ధరలోన"

"మనసు విరిగెనేని మరియంట నేర్చునా"

"పంది బురద మెచ్చు పన్నీరు మెచ్చునా"

"బొగ్గుపాల కడుగ పోవునా మలినంబు"

శిష్ట కవుల కావ్యాలలోనే తొంగి చూసే సామెతలు జానపద సాహిత్యంలో అసంఖ్యాకంగా కనిపిస్తాయనడంలో సందేహం లేదు. గేయాలలో, కథా గేయాలలో, గద్య కథలలో సామెతలు బోలెడన్ని కనిపిస్తాయి.

"పేదవాని కోపము పెదవికి చేటు"

"చల్లకోసం వచ్చి ముంత దాచంగ నేల మనకూ"

"ఆడబోయిన తీర్థమరయ నెదురైనట్లు"

"తాతకు దగ్గులు నేర్పిన గతి నా దగ్గర వదరెదవు"

"ముందు చెవుల కన్నా వెనుక కొమ్ములు వాడి"

"కడవంత గుమ్మడి కత్తిపీటకు లోకువ"

సామెతల విలువలను, సమాజంలో నాటి పాత్రను పరిశీలించవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది.

ఉపయుక్త గ్రంథం: ఆంధ్రుల జానపద విజ్ఞానం

గ్రంథకర్త: డా॥ఆర్.వి.యస్. సుందరం

# నాజరుగారి కథల్లో సామెతలు

## రాయలసీమ కరవు

మోతుబరి బ్రహ్మయ్యను రైతు భూపతయ్య మళ్ళీ కొంత అప్పు అడగగా ముందు పాత బాకీ సంగతి చెప్పు అని "తాగిన వాడే కడతాడు తాళ్ళ పన్ను" అనే సామెతనుపయోగించారు కవి. తాటికల్లు తాగినవాడు పన్ను కడతాడు, తాగని వాడికి పన్నుల గురించి తెలియదు. అలాగే నీవు తీసుకున్న బాకీ నీవు గాక వేరొకరు తీర్చరు అనే భావంతో కవి దీన్ని వాడారు.

రాయపేటకు కరవు సంభవించినపుడు ప్రజలు దైవం సహకరించటం లేదని, ఈ ఏడు పంటలు అధికంగా పండితే ఏ చీకూ చింతా లేకుండా హాయిగా బ్రతకొచ్చని ప్రజలు తలంచితే, పూర్తిగా తిండి కూడా లేకుండా కడుపు చేత పట్టుకుని రోడ్డున పడే పరిస్థితిని ఆ దేవుడు కలిగించాడని చెప్పటం కోసం "తానొకటి తలంచితే దైవమొకటి తలచినట్లు" అనే సామెతను కవి సందర్భోచితంగా వాడారు.

కరువు ఫలితంగా పనులు లేని ప్రజలు అభివృద్ధి పథకంలో రోడ్లు వేస్తుంటే, వారికివ్వాల్సిన కూలీ సరిగా ఇవ్వక ఇబ్బంది పెడుతున్నారు. అందుకు ప్రజలు వారిని నిందిస్తూ "దొరక్క దొరక్క దొరికిన అన్నంలో మట్టి పడిన చందాన, నోటి దాకా వచ్చిన ముద్దను నేల పాలు చేయడమంటే ఇదే" అనే ఉద్దేశంతో భిక్షపు కూట్లో శనీశ్వరంలా" అనే సామెతనుపయోగించి అర్థవంతమైన భావాన్ని చేకూర్చారు కవి.

రాయపేటలోని రైతులు పంటలు పండక తాము కూలి పనులు చేస్తున్న సందర్భంలో "పూలమ్మిన చోటనే కట్టెలమ్మినట్లు" అనే సామెతనుపయోగించడంలోని భావం పూలమ్మడం అనేది సుఖ జీవనానికి వేదిక అయితే, కట్టెలమ్మడం అనేది కష్టానికి చిహ్నం. పూలను సేకరించడం తేలికయిన విషయమే, కానీ కట్టెలు కావాలంటే అడవికి వెళ్ళి ఒక వృక్షాన్ని నరికి చిన్న

ముక్కలుగా చేయడం కాస్త కష్టమయిన పనే. సాధారణంగా ఈ పదబంధాన్ని బాగా బ్రతికి, గడ్డు పరిస్థితులను ఎదుర్కొనడం అనే విషయాన్ని తెలిపే పరిస్థితిలో వాడతారు. ఇది భూపతయ్యలా చితికిన కుటుంబాలను గూర్చి వాడారు కవి.

బ్రహ్మయ్య బూతులు తిడుతూ బాకీ క్రింద ఆవును, కోడెను తీసుకువెళు తుంటే ముసలి మామకు కోపం వచ్చినా తమాయించుకున్నాడని తెలిపే సందర్భంలో "పేదవాని కోపం పెదవికి చేటు" అని అనటంలో ధనవంతుడు ధన బలంతో ఎంతకైనా తెగిస్తారని, పేదోడికి కోపం వస్తే మొదటికే మోసం వస్తుందని తెలియజేయడం కోసం ఆ సామెతను వాడారు కవి.

కోడలు సీతమ్మతో మనకు అండ లేదనే విషయాన్ని మామ అనే సందర్భంలో "కొండలనైనా పాకవచ్చు అండలున్నచోట" అని అనటం పెద్ద కొండల్ని ఎక్కడానికి తాడును ఆసరాగా తీసుకుంటారు. ఆ తాడు లేకుండా ఎక్కడమనేది కష్ట సాధ్యమౌతుంది. అలాగే మానవ కుటుంబాలను గూర్చి చెప్పేటప్పుడు వెనుక ఎంతో కొంత ఆస్తి అనేది ఉండటమో లేక ఎవరైనా పెద్దవారు అండగా ఉండి ఆదుకోవడమో చేస్తే ఉన్నత స్థితికి చేరుకోవచ్చు అనే విషయాన్ని తెలియజేశారు.

## పల్నాటి యుద్ధం

నాగమ్మకు గురజాలలో ఎదురు లేదనే విషయాన్ని తెలిపే సందర్భంలో "ఆడింది ఆట పాడింది పాట" అని అనటంలో గురజాలలో నాగమ్మ తన ఇష్టానుసారం ప్రవర్తిస్తుందని, అధికారాన్ని తన గుప్పిట్లో ఉంచుకున్నదని కవి ఈ సామెతను వాడారు.

రాయబారిగా వచ్చిన అలరాజుతో నాగమ్మ రాజనీతిని చెప్పు సందర్భంలో "రాజ్యం వీర భోజ్యం" అని కవి సామెతనుపయోగించడంలో రాజ్యమనేది వీరుడైన వాడికేనని, బలవంతునిదే రాజ్యమని, అతనే భోగాలు అనుభవించాలని అంటూ తెలియజేశారు.

బ్రహ్మయ్యకు, నాగమ్మకు మధ్య విభేదాలు చూపిన నలగామరాజు "రెండు కత్తులు ఒక ఒరలో ఇమడవని" నిర్ణయించుకున్నాడని కవి సామెతను వాడటం, పూర్వం కత్తులు పెట్టుకోవటానికి చర్మంతో ఒక కత్తి పట్టేలా సంచిలా కుట్టేవారు. అందులో కత్తిని ఉంచి నడుమునకు వ్రేలాడదీసుకునేవారు. కత్తివలన ప్రమాదం జరగకుండా ఉంటుంది. అలాంటి ఒరలో రెండు కత్తులు పట్టవన్నది జగమెరిగిన సత్యం. అలా కాకుండా ఈ పదబంధాన్ని వాడి సాధారణంగా ఇద్దరు సమఉజ్జీలుగా ఉంటే, అదీ వైరంతో ఉంటే వారి మధ్య సఖ్యత ఉండదని తెలియజేశారు.

అలరాజు రాయబారంలో "పోరు నష్టి పొందు లాభమందురు" అని నలగామరాజుతో యుద్ధం వద్దని చెప్పే సందర్భంలో కవి ఈ సామెతను వాడారు. యుద్ధం వలన ధన, ప్రాణ నష్టం జరుగుతుందని, సఖ్యత వలన లాభమని చెప్తూ, మనం, మనం కొట్టుకుంటుంటే మూడవ వాడు లాభాన్ని పొందుతాడని" తెలియజేశారు.

నరసింగరాజుతో నాగమ్మ, అలరాజు నీకు భవిష్యత్తులో శత్రువు అని చెప్పే సందర్భంలో "పక్కలో బల్లెం" అనే సామెతను కవి వాడడంలో నిద్రించాలనుకునే వానికి పక్క సరిగా కుదిరితే ప్రశాంతంగా నిద్రిస్తాడు. ఆ పక్కలో బల్లెం ఉంటే చీటికీ మాటికీ గుచ్చుకుని నిద్రా భంగమవుతుంది. అలాగే అలరాజు నరసింగరాజుకు శత్రువులా మారి ఇబ్బంది పెడతాడనే ర్థంతో చెప్పారు.

**బొబ్బిలి యుద్ధం**

ప్రభువు రంగారావుతో రాణి మల్లమ దేవి సంతానం లేని చింత చాలా నరకమని చెప్తూ "పుట్ట గతులు లేవందురే పుడమిలోన మరి పుత్రులు లేకున్న" అంటూ పుత్రులు తల్లిదండ్రులకు తల కొరివి పెట్టి, శ్రాద్ధ కర్మలు నిర్వహించి పున్నామ నరకం నుంచి తప్పిస్తారని, అలా జరగని పక్షంలో మళ్ళీ జన్మంటూ ఉంటే ఆ జన్మలో పుట్టగతులుండవని మల్లమ దేవి యొక్క ఆవేదనను ఈ సామెతలో ఇమిడ్చారు కవి.

విజయరామరాజు తమ్ముని కుమారుడైన ఆనందరాజుతో బొబ్బిలి వారిని రెచ్చగొట్టు, ఆపై పడగొట్టు అని చెప్తూ "తగవు పెట్టుకుని తడాఖా చూపుము" అనే నానుడిని ఉపయోగించుటలో ఎలాగైనా సరే గొడవ పెట్టుకో, నీ బలాన్ని నిరూపించి, యుద్ధానికి సన్నద్ధం చేయమని అర్థం వచ్చేలా కవి సామెతను చక్కగా చెప్పారు.

విజయరామరాజు కోడి ఓడగా, బొబ్బిలి వాళ్ళతో అప్పుడే ఏమయింది, త్వరలో తెలుస్తుందనే సందర్భంలో "ముందున్నది ముసళ్ళ పండగ" అనే సామెత ఉంది. (బూదరాజు రాధాకృష్ణ : మాటలు వాడుక - వాడుక మాటలు ఏప్రియల్ 9, 1995, ఈనాడు-ఆదివారం) మొదటిమాట అర్థం స్పష్టంగా తెలియదు. ముసలి శబ్దానికి ముదుసలి వ్యక్తి అనే అర్థమే గాక మొసలి అనే జలచరం కూడా అర్థంగా కుదురుతుంది. రాబోయేది పెద్ద ప్రమాదమని, ఇప్పుడు గడచి గట్టెక్కినా ముందు ముందు ప్రమాదాలను ఎదుర్కొనక తప్పదని భావించే సమయాల్లో ఈ పదబంధాన్ని వాడుతుంటారు. ఈ సమాసంలోని ముసలి శబ్దానికి ముసలివాడు, వయోవృద్ధుడు అనే అర్థముంటే ముసళ్ళ పండుగకు భయమని అర్థం చెప్పవచ్చు. బాటసారికి ఎదురుగా ఏరో, నదో ఉంటే మొసళ్ళ వల్ల ప్రమాదం రావచ్చు. ఆహారం దొరికిన మొసళ్ళు ఆనందించవచ్చు. అది మొసళ్ళ(కు) పండుగ వంటిది కావచ్చు. ఇది మరో విధమైన వ్యాఖ్యానం. సమాసంలోని మొదటి మాటకు సరైన అర్థమేమయినా పదబంధానికి ప్రమాదం, మరణం అనే అర్థాలు వాడుకలో ఉన్నాయి. ఇక్కడ కవి ఈ సామెతను వాడటంలో విజయరామరాజు వలన బొబ్బిలి వారికి ముందు ముందు గడ్డు పరిస్థితులను ఎదుర్కొనక తప్పదని రాజు హెచ్చరికను తెలిపారు.

బుస్సీ పాపారావుని తిట్టబోగా విజయరామరాజు ఆపి "గోడలకు చెవులుంటాయి" అనే జాతీయాన్ని చెప్పడంలో మనం మాట్లాడే విషయాలు ఎవరైనా వింటే అవి పాపారావుకు చేరవేస్తారనే అర్థంతో వాడారు కవి.

**అభిమన్యు యుద్ధం**

అభిమన్యు అక్షరాభ్యాసం సందర్భంగా విద్య అనవసరం అని హాస్య వంత "చదువేల చంకనాకను పది గేదెల మేపుకున్న పాలు, వెన్న" అని అనటంలో చదువుకున్న వాడు నేటి రోజుల్లో పని లేక సోమరిగా తయారవుతున్నాడని చదువు ఎందుకూ పనికి రాదని పది గేదెలు మేపుకుంటే కనీసం పాలు, వెన్న అయినా అమ్ముకుని బ్రతకొచ్చని చెప్తే, రాజకీయ వంత చదువు గొప్పతనం చెప్తూ "విద్యలేనివాడు వింత పశువు" అంటూ సామెతను చెప్పడంలో విద్యను గూర్చి కవి వివరిస్తూ అది అందరూ నేర్చుకోవాలని తెలియజేశారు.

పాండవులు మాయాద్యూతంతో ఓడిపోయిన విషయం చెప్పే సందర్భంలో "బండ్లు ఓడలు, ఓడలు బండ్లు" అనే సామెతనుపయోగించడంలో కాలం కలసిరానపుడు ఉన్నవారు లేనివారుగను, లేని వారు ఉన్న వారుగను మారవచ్చును, అది విధి వైపరీత్యమును గూర్చి తెలుపుటకు ఈ జాతీయము వాడతారు. పాండవులు మాయా ద్యూతంలో ఓడిపోయి రాజభోగాలు కోల్పోయి సాధారణ పౌరులుగా అరణ్య వాసమునకు వెళుతున్నారని కవి ఈ సామెత ద్వారా తెలియజేశారు.

తల్లి సుభద్ర అభిమన్యునితో సత్ప్రవర్తన కలిగి ఉండమని చెప్తూ "సొమ్ము లొకరివి సోకు ఒకరిది" అని అనటంలో మనం మా పుట్టింట్లో ఉంటూ వారి సొమ్ముతో గడుపుతున్నామని అందుకే జాగ్రత్తగా ఉండాలని సుభద్ర మాటలను కవి ఈ సామెత ద్వారా వివరించారు.

ద్రోణుడు దుర్యోధనునితో ధర్మరాజును ప్రాణాలతో పట్టి తెస్తాను అర్జునుడు లేని సమయంలో అని ప్రతిన చేస్తూ "ఇటు సూర్యుడటు పొడిచినా మాట తప్పను" అనటంలో ధర్మరాజుని ఎంత కష్టమైనా సరే బంధించి తెస్తానని, తూర్పున ఉదయించే సూర్యుడు పడమరన ఉదయించినా సరే నేనిచ్చిన మాటను తప్పనని ద్రోణుడు ప్రతిజ్ఞ చేశాడని కవి తెలిపారు.

అభిమన్యుడు పద్మవ్యూహం ఛేదిస్తానంటే, భీముడు సందు దొరికితే చాలు బాదేస్తాననే సందర్భంలో "బంతి తిప్పేవాడూ, గడ్డి తినేవాడుంటే కుప్పకోతి కొట్టిందన్నట్టుంది" అని అనటంలో కుప్ప నూర్పిళ్ళపుడు బంతి కట్టి ఎద్దులను తోలేవాడొకడు, గింజలు రాలిన తర్వాత గడ్డి ఏరే వాడుంటే కుప్పను కోతి కొట్టిందనడం ఆశ్చర్యకరమైన విషయమేమీ కాదు. అలాగే పద్మవ్యూహాన్ని అభిమన్యుడు ఛేదిస్తే భీముడు చేసేదేమీ లేదని, పనంతా ఎవరో చేస్తే పేరు నాది అనే విధంగా ఉందని కవి సామెత రూపంలో వివరించారు.

దీవెనందిన అభిమన్యుడు ఉత్తరతో మన కుమారుడు మన వంశ ప్రతిష్ఠ నిలువవలెనని చెప్పున్న సందర్భంలో ఉత్తర "విత్తొకటేసిన - చెట్టొకటగునా" అని అనటంలో మనం వేసే విత్తనాన్ని బట్టే మొక్క వస్తుందని తెలియజేస్తూ, మిమ్మల్ని బట్టే మీ వంశాంకురం ఉంటుందని ఉత్తర మాటలుగా ఈ సామెతను కవి ఉపయోగించారు.

యుద్ధంలో అభిమన్యుడు దుశ్శాసనుని చంపక వదలివేయగా "చావు దప్పి కన్ను లొట్టబోయినట్లు" అని కవి సామెతను వాడటంలో దుశ్శాసనుడు చిన్నవాడయిన అభిమన్యుని చేతిలో ఓడిపోయి, చావు నుండి తప్పించుకుని కన్ను పోగొట్టుకున్నట్టుగా అవమానం పాలయ్యాడని తెలియజేశారు.

అభిమన్యుని యుద్ధం చూసి కౌరవ సేనలు బ్రతికితే చాలని పారిపోతున్న సందర్భంలో "బతికితే బలుసాకు తిని బతకొచ్చ"నే సామెతనుపయోగించి యుద్ధంలో ప్రాణం పోగొట్టుకోవటం కంటే బ్రతికుంటే మంచిదని, తిండి లేకపోయినా సరే కనీసం ఏ ఆకులో, అలములో తిని బ్రతకొచ్చని సైన్యం తలపోసినట్లు కవి తెలియజేశారు.

## అల్లూరి శ్రీరామరాజు యుద్ధం

అల్లూరి వెంకటరామరాజు, నారాయణమ్మల పెద్ద కుమారుడైన రామరాజు పుట్టిన సందర్భాన్ని చెప్పే సమయంలో హాస్యవంత "జ్యేష్ఠపుత్రా కొంప పీకరా" అనే సామెతను కవి వాడటంలో సాధారణంగా పెద్ద కుమారుని తల్లిదండ్రులు గారాబంగా పెంచుతారు. పెరిగి పెద్దవారయిన పిదప వారు తమ ఇష్టానుసారం ప్రవర్తిస్తుంటారు. 'ఆడింది ఆట పాడింది పాట'గా చివరకు తమ పంతం నెగ్గించుకునేందుకు ఏమైనా చేయడానికి సిద్ధపడతారు అని తెలియజేయడం కోసం ఈ సామెతను వాడారు.

రామరాజును స్కూల్లో చేర్పించిన సందర్భంగా హాస్యవంత విద్యా విధానం బాగుండలేదని చెప్తూ "చదువేల చంకనాకను పది గేదెల గాచుకున్న పాలు, వెన్న" అనే నానుడిని వాడటంలో 'చదువుకోవటం వలన ప్రయోజనం లేదని, నేడు నిరుద్యోగం పెరిగిన ఈ రోజుల్లో స్వయం వృత్తి చేయుట మంచిదని చెప్తూ, 'చదువు ఎందుకు పది గేదెలను పెంచుకున్న పాలు, వెన్న అమ్ముకుని బ్రతకొచ్చు అని చెప్పుటలో వృత్తి విద్యలు, కులవృత్తులు అవసరమని కవి భావన.

బ్రిటీష్ విద్యా విధానం నచ్చక రామరాజు అడవులకు చేరాడన్న విషయం చెప్పే సందర్భంలో "విద్యలేనివాడు వింత పక్షి" అని చెప్పడంలో విద్య అనేది విజ్ఞానం కోసమని, ఆ విజ్ఞానం లేనివాడు వింత పక్షితో సమానమని చెప్పడం, విద్య అనేది ఉద్యోగానికి ఒక మార్గమేనని, విద్యే ఉద్యోగం కాదని తెలియజేయడం కోసం పై సామెతను ఉపయోగించారు.

రాజు గిరిజనులకు కొండంత అండగా ఉండడం నచ్చని ఆంగ్లేయుల తొత్తులైన మన భూస్వాములు రాజుపై విరుచుకు పడ్డారని "ఉరుము ఉరిమి మంగళం మీద పడ్డట్టు" అను సామెతను వాడటంలో మంగలం అనేది అతి తేలికయిన వస్తువు. దానిపై పిడుగు పడితే నామరూపాలు లేకుండా పోతుంది.

అలాంటి సందర్భంలో ఆంగ్లేయులతో కలిసిన భూస్వాములు కూడా తిరగబడ్డారని కవి తెలియజేశారు.

జైల్లో ఉన్న రాజుతో తల్లి కుటుంబ బాధ్యత తీసుకోమని చెప్తూ పెద్దల మాట గౌరవించమని "పెద్దల మాట చద్ది మూట" అనే సామెతను చెప్పటంలో పెద్దలు చెప్పే మాటలు భవిష్యత్తులో ఉపకరిస్తాయని, వారు చెప్పే విషయాలు అనుభవంతో చెప్పేవని తెలియజేయడం కోసం కవి వాడారు.

రామరాజు పోరాటాన్ని ప్రకాశం పంతులు గారు సమర్థించటం లేదనే విషయం తెలిపే సందర్భంలో "అమ్మ పెట్టా పెట్టదు అడుక్కు తిన నియ్యాదు" అనే సామెతనుపయోగించడంలో తల్లి అన్నం సరిగా పెట్టదు, అడుక్కు తిందామనుకుంటే తిన నివ్వదు అని, అలాగే వాళ్ళు ఉద్యమం చేయరు, చేసే వాళ్ళను ప్రోత్సహించరు అని కవి తెలియజేశారు.



# వర్ణనలు

## బొబ్బిలి యుద్ధం

బుర్రా బుచ్చన్న మంత్రిగా, లక్షదండుతో నిజాం నవాబుకు లక్ష కప్పం కడుతూ, తెలుగుదేశం మొత్తం తానే ఏలాలని విజయనగరమును పరిపాలిస్తున్న విజయరామరాజు రాజ్యకాంక్షను కవి ఎంతో హృద్యంగా వర్ణించారు.

సర్వారాయుడు మంత్రిగా, ధర్మారావు సర్వసేనానిగా సోదరుడు వెంగళరావు అంగరక్షకుడుగా, అజేయుడు తాండ్ర పాపారావు అండగా రంగారావు బొబ్బిలిని పాలిస్తున్నాడని, రాజుకు రక్షణ కవచం వలె పఠాకత్తి యుద్ధ ప్రవీణుడు పఠాల రామన్న, ముకుంద బల్లెం రణ వీరుడు ముత్యాల అప్పన్న, కత్తులతో తెగించిన తెలగలు, వీరులైన వెలమలు రంగారావుకు సహకరిస్తూ బొబ్బిలిని కాపాడుతున్నారని కవి సమర్థంగా చిత్రీకరించారు.

పతిభక్తి గల రాణి మల్లమ్మ కడుపు పండి కలల పంటగా వెంకట్రావు జన్మించాడు. బొబ్బిలి అంతా విందులు, వినోదాలు, పచ్చ తోరణాలతో హాయిగా ఉందని, అట్టి ఆనంద సమయంలో పన్నెండు మంది పాలె కాపులతో వెంగళరావు వేటకు వెళ్ళి, అడవి పందిని వెంటాడుతూ విజయరామరాజు రాజ్యంలోని కోడేరు చేరగా సరిహద్దు భటులు నిలిపివేశారు. వెంగళరావు అవమానంతో వెనుతిరిగి రావడాన్ని, రాచరికంలో అతి విలువైన వేటను గూర్చి కవి అత్యద్భుతంగా వర్ణించారు.

రాజు కయ్యానికి కాలు దువ్వుతుంటే, మంత్రి తుమ్మల గుంట, బలుసుపాటి యుద్ధాలతో చాలా నష్టం జరిగిందనగానే, రాజు వెంటనే "తృప్తి లేని బ్రాహ్మణుడు, తృప్తి చెందిన క్షత్రియుడు, లజ్జాశీలియైన వేశ్య, లజ్జ లేని కులాంగనలు చెడుదుర"ని - ఆర్యోక్తి మీకు తెలియనిదా?! అని అన్నాడు. యుద్ధం వల్ల కలిగే నష్టాన్ని తెలిపిన మంత్రి రాజనీతిని కవి ఎంతో చక్కగా వర్ణించారు.

రాజు సేనలు బొబ్బిలి పైరులన్నీ నాశనం చేయగా ప్రజలంతా ప్రభువు రంగారాయునికి నివేదించారు. రంగారావు జనంతో మీకు శిస్తులు రద్దు చేస్తున్నాను, ధాన్యాగారంలోని ధాన్యం తీసుకెళ్ళండి అని చెప్పి, రాజు అన్న కొడుకైన ఆనందరాజు నారాయణపట్నం నుండి పన్నులు వసూలు చేసుకు వస్తూండగా నష్ట పరిహారం వసూలు చేసి పంపించడాన్ని, ప్రభువు నేర్పును, పాలనా సామర్థ్యాన్ని కవి కడు సమర్థంగా వివరించారు.

కోడి పందాలకు ఇరు రాజ్యాలు సిద్ధమై బొబ్బిలి పక్షాన మద్దాల వెంకన్న, విజయనగరం పక్షాన విజయాల చంద్రయ్యలను పందెగాళ్ళుగా నిర్ణయించారు. బొబ్బిలి వారి 'పర్లాజాతి పుంజు'తో విజయనగరం వారి 'పచ్చ కాకి' పోరాడి బరిలో ఒరిగి పోగా బొబ్బిలి సుద్దుల వాళ్ళు "బొబ్బిలి కోళ్ళకు రోసాలెక్కువ, బొబ్బిలి దొరలకు మీసాలెక్కువ" అని ఎగతాళి చేశారు. విజయనగరం వారి 'నెమలి వర్ణం గల పుంజు'ను బొబ్బిలివారి 'అస్లీ జాతి పుంజు' ఒక్క దెబ్బతో నెత్తురు మడుగులో తేల్చింది. వెంటనే బొబ్బిలి సుద్దులు మళ్ళీ ఎద్దేవా చేశారు. అంతట రాజు బొబ్బిలిని త్వరలో దుక్కి దున్నిస్తానని తన దురాలోచన వ్యక్తపర్చగా పాపారావు కోపంగా నీ అబ్బతరం కాదని గర్జించి, కత్తి దూసి మీదకు వెళ్ళబోగా రంగారావు వారించి రాజుతో 'మరో పల్నాడు చేయకండని' మందలించటంతో, ప్రభువులకు ఉండాల్సిన ఓర్పు, నేర్పులను కవి ప్రశంసనీయంగా వర్ణించారు.

రాజమండ్రిలో బుస్సీ బస చేసి అందరికీ వార్తలు పంపమనగా, రాజు బొబ్బిలికి వార్త మేము పంపెదమని హైదరుకు లంచమిచ్చి, బుస్సీకి కానుకలిచ్చి, రంగారావు వీలు చూసుకుని వస్తాడట, అయినా కొండంత అండగా పాండవులను, వానరులను ఎదురించగల వెలమ, తెలగల బలం అండగా ఉందన్నారని, అదరిపాటని, రాజు బుస్సీకి దుర్బోధ చేయగా, బొబ్బిలి మీకు ఫర్మానాగా రాసిస్తాం అని బుస్సీ చెప్పాడు. అందుకు రాజు పాపారావు ఉండగా కుదరదు. కావున యుద్ధం కిలివిగా చేయాలని చెప్పి అడవి దారిన మల్లమ్మ చెరువు గట్టుకు చేరి రణభేరి

ప్రయోగించడంలో కవి కథా కథనాన్ని, కుయుక్తులను ఎంతో యుక్తా యుక్తంగా వర్ణించారు.

వెంగళరావు పెళ్ళితో బాటు మరో యాభై సామూహిక పెళ్ళిళ్ళు జరుగుతుండ, కంకణం కట్టుకున్న వెంగళరావుకు రణభేరి విన్పించగా అన్నయ్యా! ఏమది అని రంగారావును అడగ్గా దొమ్మరోళ్ళ డోలు అని సర్ది చెప్పాడు. అరుపులు విని మరల అడగగా గొర్రెల మందను కుదర దోలుతున్నారు అని తడబడుతూ చెప్పబోగా, వెంగళరావు కోట పైకెక్కి చూస్తాడు. ఆవేశ పడుతున్న తమ్ముని వారించి, నష్టపరిహారం ఇచ్చి, దారి ఖర్చులు ఇస్తాం అని ధర్మారావును రాయబారిగా పంపగా అవమానం జరిగింది. దామెర్ల ధర్మారావుతో రాజీ లేదు, రాజే బొబ్బిలికి రాజు అనగానే తిరగబడి, తప్పించుకుని వచ్చిన మామను వెంగళరావు తూలనాడగా రంగారావు క్షమాపణ చెప్పించాడు. రంగారావును రాజనీతి గలవానిగా, సాటి వారిపై అభిమానం గల రాజుగా చాలా చక్కగా చిత్రించారు కవి.

రంగారావు పాపారావుకు జాబురాసి, రొట్టెలో పెట్టి భోగీరావుతో పంపగా మార్గమధ్యంలో విజయ రామరాజు అడ్డగించి జాబును చూసి బెబ్బులి కోటలో లేదని, భోగీరావును సంహరించి కోటను ముట్టడించమన్నాడు. కోలాహలం గమనించిన బొబ్బిలి వీరులు పరాసు గుర్రాల నెక్కి పతాకత్తి, ముకుంద బల్లెం, భేరీ రామక్క రాళ్ళతో విజృంభిస్తుండగా అరివీర భయంకర పోరు జరుగుతుంది. రామరాజు వేరే గత్యంతరం లేక నల్ల మందు మాటులు ఏర్పాటు చేశాడు. అందు పతాల్ రామన్న, ముత్యాల పాపన్న, రామక్క మరణించారు. ఆ వార్త విన్న వెంగళరావు పాపారాయుడు ఇంకా రాలేదు ఏమైందోనని, యుద్ధంలో లాడూఖాన్‌ని చంపి తాను బాగా గాయపడి బుస్సీ డేరా వైపు పాకుతూ వెళ్తున్నాడని తెలిసిన రంగారావు కాళ్ళ పారాణి ఆరలేదని ఎంతో బాధతో పసుపుకుంకమలు పంపవలసిన రోజు, కానీ వీర తిలకం దిద్దమని, ఎవరూ ఏమీ 'శత్రువులకు దొరక్కుండా వీర మరణం లేదా ఆత్మాహుతి' అని అంతఃపురంలో చెప్పి తాను యుద్ధ రంగానికి

వెళ్ళాడు. అంత:పుర స్త్రీల రక్షణ, యుద్ధనీతిని కవి ఎంతో మెలుకువతో వర్ణించారు.

కడసారి ప్రయత్నంగా మల్లమ్మ రాజును కలసి అన్నా 'పతిభిక్ష' పెట్టమనగా, 'వలసపొండి' అన్నాడు రాజు. "స్త్రీని కష్టపెట్టి చరిత్రలో ఎవ్వరూ బాగు పడలేదు" అని చెప్పి వచ్చి, దాసి లక్ష్మికి తన కుమారుడైన వెంకట్రావును అప్పగించి పాపారాయుని వద్దకు చేర్చమని చెప్పటంలో రాజ్యక్షేమం, వంశ క్షేమం రాణి కోరటం, రాజు తిరస్కారం, స్వార్థం వంటి ప్రతి చిన్న విషయాన్ని మనోజ్ఞంగా వర్ణించారు కవి.

పాపయ్యకు కలలో మల్లమ్మ ఏడుస్తున్నట్లు కన్పించగా దిగ్గున లేచి పెద్దన్న, వెంకన్నలతో చర్చలు జరుపుతుండగా లక్ష్మి వచ్చి బాబూ! బొబ్బిలి పరాయి సొత్తు అయిపోయింది అని వివరించగా, ఆత్మాహుతి చేసుకోబోతున్న పాపయ్యతో ఈ బిడ్డను మీ సంరక్షణలో ఉంచమని అక్కగారి ఆజ్ఞ, అంతేకాక దారిలో శత్రుశేషం ఉండకూడదని రాజు అంటే బుస్సీ బాబుని చూసి 'బొబ్బిలి పులి బిడ్డ'ను చంపవద్దు అని పంపాడని చెప్పగా పెద్దన్న, వెంకన్నల సాయంతో రాజుల వేషాలు ధరించి శత్రు డేరాలవైపు బయలుదేరారు. దాసి కర్తవ్యాన్ని, సమయస్ఫూర్తిని కవి ఎంతో గొప్పగా వర్ణించారు.

పాపయ్య శత్రుశిరములు తురిమి, ప్రేగులు జందె మేసి, నెత్తురుతో వసంతమాడెదనని వస్తున్నాడు రంగారావు దండధరుని వలె సంగ్రామం చేస్తున్నాడని విన్న బుస్సీ, రాజు లిరువురూ పారిపోగా, లాల్ ఖాన్ వెనుకనుంచి రంగారావు తలపై కొట్టగా ఒక్క వేటుతో ఖాన్ తల నరికి, హైదర్‌ను వెంబడిస్తూండగా నల్ల మందు మాటుతో రావు అంతమయ్యాడు. రంగారావు మరణంతో హాయిగా నిద్రిస్తున్న రాజు గుండెలపై కెక్కిన పాపారావు కసితీరా కత్తితో పొడిచి చంపి తన అనుచరులతో రచ్చబండ రేవుల వద్ద విచ్చు కత్తుల్లా దూకి అంతమొందారు. 'పోరాట పటిమను, వీరత్వాన్ని, దుష్ట శిక్షణ' కవి ఎంతో సమర్థంగా వర్ణించారు.

## నేటి రాయలసీమ

రతనాల సీమగా నుతికెక్కిన రాయలసీమ కరవు సంభవించి రాళ్ళసీమగా మారింది. రాయపేట అను గ్రామంలో బ్రతికి చెడిన కుటుంబం భూపతయ్యది. ఆ కుటుంబాన్ని గూర్చి తెలియజేస్తూ కల్లా కపటం తెలియని అంకిత భావం గల కష్టజీవి అయిన భూపతయ్యకు, అన్ని విధాల అనుకూలవతి అయిన భార్య సీతమ్మ, వారి యోగ క్షేమాలు చూసి సంతసించే తండ్రితో అన్యోన్యంగా జీవిస్తున్నారని కవి వర్ణించారు.

అలాంటి కుటుంబాలను దోచుకుంటున్న ధన మదాంధుడు, కామాంధుడైన బ్రహ్మయ్య అదే ఊరిలో ఉంటున్నాడు. బ్రహ్మయ్య తన పొలాన్ని రైతులకు కౌలుకిచ్చి, వడ్డీకి డబ్బులిచ్చేవాడు. ఆ రైతులకు గంజి త్రాగేందుకు ఉన్నా లేకున్నా వాళ్ళ రక్తం పీల్చే జలగ వంటి వాడని బ్రహ్మయ్యను వర్ణిస్తూ కవి చిత్రించారు.

తొలకరి వాన కురవగానే రైతులు నాగళ్ళకు పూజ చేసి, ఎద్దులను సింగారించి, దేవతలకు కొలుపులు చేసి వ్యవసాయ పనులు ప్రారంభిస్తారని, అదే 'ఏర్వాక' అని కవి ఏర్వాక గూర్చి వివరించారు. ఇక్కడ కవికి జానపద సంస్కృతిపై గల మక్కువ మనకు అవగతమౌతుంది.

వర్షాధారమైన పొలాలు, వర్షాలు లేక పంటలు పండని పరిస్థితిలో రైతుల కాపురాలు కరవుల సంతలా, నిత్యావసర వస్తువులు ఒకటి ఉంటే ఒకటి లేక, రాజనాలు పండించిన వానికి పని లేక ఏమీ తోచని అయోమయ స్థితిలో ఉన్నారని కరవును నిశిత దృష్టితో పరిశీలించి వివరించారు.

ఆకలిని తట్టుకోలేక అప్పులకై బ్రహ్మయ్య దగ్గరకు వెళ్ళి భూపతయ్యే అప్పు అడిగితే తిట్టి, పాత బాకీకి కూడా చక్రవడ్డీ నోటు రాయించుకుని ఇస్తే, చిల్లర అప్పుల వాళ్లు ఎగబడగా పశువులను అమ్మినా అప్పు తీరని అనంత దరిద్రాన్ని కవి సమర్థంగా వర్ణించారు.

తన కొడుకుతో సమానంగా చూస్తున్న దూడను, ఆవును అమ్మ వద్దని భార్య సీతమ్మ ప్రాధేయపడగా బేరగాళ్లు విడిచి వెళ్ళిపోతారు. ఈ ఘట్టంలో కవి పశువులకు, రైతులకు మధ్యగల అనుబంధాన్ని చక్కగా వర్ణించారు.

జీతగాళ్ళను గూర్చి చెప్తూ రోజూ గంజి, చద్ది కూడు, కూర ఉండదు, రోగం వచ్చినా సెలవుల్లేని పరిస్థితిని, కామందులు సోమరులై తింటూ ఉంటారని 'పెద్దోడు పేదోణ్ణి దోపిడి చేస్తున్న విధానాన్ని' కవి ఎంతో నేర్పుగా వర్ణించారు.

వాతావరణం బాగుండడం చేత, పంటలు బాగా పండాయి. రైతులు 'వలియ వలియో' అంటూ జానపద పద్ధతుల్లో 'కల్లమంతా కాలం మునగాల' అని పాడుతూ కుప్ప నూర్పిళ్ళు చేసుకుంటున్నారు అని కవి వర్ణించారు.

భూపతయ్య పొలం పనిలో ఉంటే సీతమ్మ ఇంటి పని పూర్తి చేసి, భర్తకు అన్నం తీసుకు వెళ్ళేది. తిరిగి వచ్చేప్పుడు పచ్చగడ్డి తెచ్చి పశువులకు వేసి వాటిని స్వంత మనుషుల్లా భావించి చూసుకునేదని వివరిస్తూ, ఇలాంటి మనస్తత్వం ఒక్క పల్లె ప్రజలకు మాత్రమే ఉంటుందని కవి తెలియజేశారు.

చేదోడు వాదోడుగా భార్యాభర్తలుండడాన్ని, పిల్లలు పుట్టి, పంటలు పండి, పశువృద్ధి జరిగితే కొండకొస్తామని, జాతర్లు చేస్తామనే పల్లె ప్రజల నమ్మకాలను కవి వర్ణిస్తూ చక్కగా వివరించారు.

ప్రథమంగా కొడుకు పుట్టగా అప్పు చేసి బారసాలను ఘనంగా చేసే మధ్య తరగతి వారి మనస్తత్వం, రైతులు తమ ఇంటి పశువుకు దూడ పుట్టినా చాలా సంతోషిస్తారనే విషయాన్ని కవి చాలా చక్కగా గ్రామీణ వాతావరణాన్ని చిత్రించారు.

కొడుకునకు వెండి మొలత్రాడు, దూడకు ఇత్తడి గంట మెడలో కట్టి సమానమైన ప్రేమను రైతులు పంచుతారనే విషయాన్ని కవి అద్భుతంగా వర్ణించారు.

ఉన్న పొలం బ్రహ్మయ్య స్వాధీనం చేసుకోగా ఊరంతా అప్పులు, ఆ

పరిస్థితిలో ఏం చేయాలో తోచక ఊరు విడిచి వెళ్ళిన భూపతయ్యను కవి సన్నకారు రైతుకు ఉదాహరణగా పేర్కొన్నారు.

ఇల్లు గడవని స్థితిలో భర్త వియోగం, అండలేదు, చిన్న పిల్లాడు, ముసలి మామతో ఆ తల్లి సీతమ్మ పడే కష్టాలను సగటు మనిషి జీవితానికి మారుగా కవి చిత్రించారు.

బ్రహ్మయ్య కరవు పనుల క్రింద సర్కారుకు లంచమిచ్చి రోడ్లు వేయిస్తుంటే, సీతమ్మ ఎలానో బ్రతకాలి కాబట్టి బిడ్డను చంకనెత్తుకుని రోడ్డు పనికి వెళితే బ్రహ్మయ్య ప్రవర్తన నచ్చక తిరస్కరించగా సీతమ్మను పనికి వద్దని చెప్పగా, రోదిస్తున్న కోడలిని సముదాయిస్తూ ఇక్కడ ఉండలేము పట్నం వెళదామని నిర్ణయించుకున్న పరిస్థితిని ఏమీ చేయలేని బడుగు జీవుల జీవితాలు అని కవి చాలా చక్కగా చిత్రించారు.

ఉన్న ఊరు, అయిన వారిని వీడి, మంచి వాతావరణం విడిచి మురికి పట్నవాసం వెళ్ళిపోదామా అంటూ కవి పల్లె, పట్న వాసపు తారతమ్యాలను చాలా బాగా వర్ణించారు.

ఊరొదలి వెళ్తున్న జనం ఎండకు, ఆకలికి కళ్ళు తిరిగి పడిపోవటం, పట్నం వచ్చి కరువు గంజి కేంద్రాల వద్ద ముసలాయన ఓ ముంత గంజి తాగి పడుకుంటారు. వాంతులు, విరేచనాలతో ముసలాయన చనిపోగా, బిడ్డ ఆకలితో ఏడుస్తుంటాడు. అప్పుడు కామాంధుడు బ్రహ్మయ్య వచ్చి సీతమ్మా నీవు కూడా చస్తే నీ బిడ్డ పరిస్థితి ఆలోచించు అని తల్లి మమకారాన్ని అడ్డు చూపి తనతో రమ్మంటే వెళ్ళటానికి నిశ్చయించుకుని వెళ్తుంటే, బాగా క్షీణ దశలోకి వచ్చిన భర్త భూపతయ్య కన్పించగా నీరసంతో సొమ్మసిల్లి భార్యాభర్తలిరువురూ పడిపోతారు. బిడ్డ ఏడుస్తుంటే బ్రహ్మయ్య నిర్దాక్షిణ్యంగా వెళ్ళిపోవటంలోని కాఠిన్యాన్ని కవి గొప్పగా వర్ణించారు.

అన్నదాత రైతన్న పరిస్థితిని అంచెలవారీగా కనిపెట్టి చూపారు. అంతేకాక

కరవు నివారించటానికి యుద్ధం రాకుండా ఉండాలి, నదులపై ఆనకట్టలు కట్టాలి, అప్పుడు దేశం సుభిక్షం అవుతుందని పరిష్కారం కూడా చూపి కవి ఆసాంతం వివరంగా వర్ణించారు.

## పల్నాటి యుద్ధం

సకల సంపదలతో విలసిల్లుతున్న తెలుగు సీమలో వీరగడ్డగా వాసికెక్కి, పౌరుషానికి మారుపేరుగా కోడిగిత్తలు, పాడి పశువులు, కొమ్ము పొట్టేళ్ళు, కోళ్ళలో శ్రేష్ఠమైన అస్లి జాతి పుంజులతో అనుగురాజు పాలనలో బ్రహ్మనాయుని మంత్రాంగంలోని పల్నాడు ఘనతను చక్కగా వర్ణించారు.

పిన్న వయసులోనే విల్లెక్కు బెట్టి మిన్నున హాయిగా విహరించే విహంగాలను కూల్చి, నీటిలోని మీనాలను గురిచూసి బల్లెంతో కొట్టే నైపుణ్యాలతో పాటు, నిర్దాక్షిణ్య వైఖరితో కత్తి దూసి సాము గరిడీలు చేసి, పంచ కళ్యాణి గుర్రమెక్కి స్వారీ చేసేటి నాగమ్మ పేరు చెప్తే పిల్లలు పాలు తాగరు, గోల చేయరు అని నాగమ్మను కవి ఎంతో గొప్పగా చిత్రించారు.

బ్రహ్మన్న నేతృత్వంలో మలిదేవుల ఏలుబడిలోని మాచర్లలో చెన్నకేశవ ఆలయం కట్టించి అన్ని వర్గాల, కులాల వారికి ప్రవేశం కల్పించి, పల్లెకో పాఠశాల, గ్రంథాలయం నిర్మించి మనుషులంతా ఒక్కటే అన్న ఆయన ఆదర్శాన్ని ఆబాల గోపాలం నుతించడాన్ని కవి ఎంతో హృద్యంగా చిత్రీకరించారు.

మాచర్ల పందెగాళ్ళు కత్తులు సానబెట్టి, జాతి పుంజులను తీసుకుని, గజ్జెల చెడ్డీలు కట్టి వచ్చారని, పోరగల కోళ్ళను తీసుకుని సారా జాడీలతో గురజాల పందెగాళ్లు కోడేరు గుట్టకు వచ్చారని అలరాజును మధ్యవర్తిగ నియమించి, మలిదేవుల పక్షాన బాల గోపన్న, నాగమ్మ పక్షాన మువ్వల భీమన్నలను పందె గాళ్ళుగా నిర్ణయించి పందానికి సిద్ధమైన తీరును ఎంతో నేర్పుగా వర్ణించారు కవి.

ప్రథమంలో అధమంగా మాచర్ల పుంజు పారిపోగా గురజాల సుద్దుల వాళ్ళు "పల్నాటి మిద్దెలకు వాసాల్లేవు, కొండేటి బ్రాహ్మలకు మీసాల్లేవు, మాచర్ల కోళ్ళకు రోషాల్లేవు" అని ఎద్దేవా చేశారు. అంతట మాచర్ల వారికి కోపం వచ్చి 'కాకి డేగ'ను బరిలోకి దించగా మాచర్ల పుంజు పలాయనం చేస్తుంది. మాచర్ల సుద్దుల వాళ్ళు "పల్నాటి మిద్దెలకు వాసాల్లేవు, కొండేటి బ్రాహ్మలకు మీసాల్లేవు, గురజాల కోళ్ళకు రోషాల్లేవు" అని ఎగతాళి చేశారు. అప్పుడు గురజాల వాళ్ళు కడసారి పందెం ఓడినవారు ఏడేళ్ళు రాజ్య బహిష్కరణ, నిర్ధారించగా మాచర్ల వారు గెల్చిన కైపులో సరేనన్నారు.

మాచర్ల వారు 'జాతి పుంజు'ను దించగా, గురజాల వారు 'పెట్టమారి'ని దించగా, దెబ్బమీద దెబ్బ కొట్టగా గురజాల పుంజు నేలపై పడిపోగా నాగమ్మ వచ్చి పుంజును లేపి మళ్ళీ ఉసిగొల్పమంది. తేరుకున్న పెట్టమారి పుంజును మళ్ళీ మాచర్ల జాతి పుంజు చితక పొడవగా, పెట్టమారి పారిపోగా, జాతి పుంజు బరిలో ప్రాణాలు విడిచింది. అంతట విజయం మాదేనని నాగమ్మ కంచు ఢక్క మ్రోగించింది. పందెగాళ్ళ మనస్తత్వాలను, అందున్న కుటిలత్వాన్ని కడు చక్కగా విశదపర్చారు కవి.

బ్రహ్మన్న బృందం అడవిలో గడుపుతుంటే నాగమ్మ గిరిజనులతో దాడి జరిపించగా, అడవి వదలి వీర మేడపిలో ఏడేండ్లు గడిపి అలరాజును రాయబారిగా పంపించారు. అలరాజు రాయబారం విన్న నాగమ్మ భారతంలో దుర్యోధనుడు రాజ్య భాగం ఎందుకు ఇవ్వలేదో తెలుసా? రాజ్య విచ్ఛిన్నం శత్రువులకు సులభ జయం' కావున. అదీగాక పెద్దవాడు రాజ్యాధినేత, అంతేకాదు 'రాజ్యం వీర భోజ్యం' నీకు తెలియనిదా! అయినా నీ మామ అనంతరం నీవే రాజు అవుతావని తన కుటిల స్వభావాన్ని తెలియ చెప్పింది. అందుకు అలరాజు చలించి అన్నదమ్ముల మధ్య పోరు పెట్టావు చాలదా? ఈ కుతంత్రాలు నేను చూడలేను, నే సన్యసించెదనని వెళ్ళిపోగా, నాగమ్మ కుట్ర చేసి నరసింగరాజుతో అలరాజును చంపించి, బ్రహ్మయ్య

చూపించినట్లు పుకారు లేపింది. ప్రతి చిన్న విషయాన్ని రాజకీయ ఎత్తుగడలను అతి జాగ్రత్తగా కవి వర్ణించారు.

కన్న తండ్రి కన్నా మిన్నగా పెంచి పెద్ద చేసి రాజ్యాభిషేకం చేసిన అంతరంగికుడు బ్రహ్మయ్య దూరమై, ఒక్కగా నొక్క కుమార్తెకు యోగ్యుడైన అలరాజును అల్లుని చేసుకున్నా, నేడు నాగమ్మ కుయుక్తులకు అలిగి తొలగిపోయె, పెళ్ళి ముచ్చటైనా తీరని అమాయకురాలు, నా ముద్దుల కుమార్తె పేరిందేవి. భర్త కోసం నిరీక్షిస్తుంటే ఈ వార్తను ఎలా చెప్పేదని నలగామరాజు తనలో తాను బాధపడుటను కవి ఎంతో గొప్పగా చిత్రించారు.

పేరిందేవి సతీ సహగమనానికి వెళ్తూ అమ్మా నాగమ్మా ! నీకిప్పుడు మనశ్శాంతిగా ఉందా? అయినా మాలో సఖ్యత లేదులే అని వెళ్తుంటే నరసింగరాజు ఎదురవ్వగా అల్లుని పెంచిన చేత్తోనే తుంచావా? చిన్నాన్నా! అని చితిలో దూకింది. ఇక్కడ స్త్రీ వేదనను, సహగమనాన్ని కవి వర్ణించారు.

మంచికి మారుపేరై, రాయబారిగా వెళ్ళిన అలరాజు మరణంతో బ్రహ్మయ్య రణభేరి మ్రోగించి కార్యంపూడికి సైన్యంతో చేరడాన్ని కవి గొప్పగా చిత్రీకరించారు.

బాలచంద్రుడు యుద్ధానికి బయలుదేరుతూ "తల్లీ ! తండ్రిగారితో నేను వీరుడనై నిన్ను వీర మాతను చేస్తానమ్మా దీవించు" అంటే వీరపత్నివైయుండీ చిన్నవాడని అంటావా?'' సముద్రం ఉప్పొంగితే ఎవరాపగలరు'', కాబట్టి నన్నాపకమ్మా! అనగా తల్లి దీవించి, బాలచంద్రా ! మాంచాల దీవెనలందుమనగా మాంచాల వద్దకు వెళ్ళాడు. మాంచాల అందాన్ని చూసి మనసు చలించి కౌగిలించుకొనగా విడిపించుకొని "దేశానికి వెన్నెముక లాంటి యువత కర్తవ్య హీనులైతే దేశం పరుల సొత్తౌతుందని" మందలించి ధర్మ యుద్ధం చేసి విజయుడవై తిరిగి రమ్మని దీవించుటలో కర్తవ్యాన్ని కవి ఎంతో స్ఫూర్తితో వర్ణించారు.

కడసారిగా భట్టుమూర్తిని రాయబార మంపగా నాగమ్మ తూలనాడింది.

సమర భేరి మ్రోగించండని బాలుడు చెప్పగా, నాగమ్మ సేనతో నాగులేటి దరిదాపుకు వచ్చిందని వేగులవారు చెప్పారు. బ్రహ్మయ్య నేతృత్వంలో, కన్నమ సేనాని ఆధ్వర్యవంలో సాటి రాజులు, ప్రతి పౌరుడూ యుద్ధ సన్నద్ధులై రణభేరి మ్రోగించగా ప్రళయకాళివలె నాగమ్మ బయలుదేరిందని కవి వర్ణించారు.

యుద్ధమందు ఆయుధాల ఒరిపిడికి నిప్పులొచ్చి చిటపట మంటుండగా బాలుడు తలలు తరుగుచు, విచ్చు కత్తులు అరివీరుల గుండెల్లో గుచ్చుతూ, తలలు, మొండెములు వేరుచేస్తూ, నెత్తురు చిందిస్తూ, చెట్టుకు, గుట్టకు దొర్లుతూ గుట్టలు పడుచుండగా నర్సింగరాజు కన్పించాడు. దొంగ దెబ్బకాదురా అని అనగానే బల్లెముతో పొడవగా, బాలుడు ఒక్క వ్రేటుతో రాజు తల నరికి వేశాడు. అలా వీరులు చనిపోవటం చూసిన బ్రహ్మయ్య నాగమ్మతో 'శవాల గుట్టపై పట్టము కట్టుకో, ఈ శ్మశానాన్ని ఏలుకో'' అని గుత్తికొండ బిలం వైపు వెళ్ళిపోయాడు. అలా యుద్ధం కళ్ళకు కనబడేట్లుగా చిత్రించి, 'యుద్ధ వ్యతిరేకతను చెప్తూ, శాంతిని కాంక్షిస్తూ' కవి గొప్పగా వర్ణించారు.

వీర మరణం పొందే వీరునిలా సూర్యుడు పశ్చిమాన అస్తమించాడు. యోధుల రక్తంలా నింగి ఎర్రబారి, పిదప కక్షల వలె కారు చీకట్లు ఆకాశంలో కమ్మి, ఆర్తనాదాల హెూరులో కొండలు మార్మోగుతున్నాయి. రాబందుల రెక్కల చప్పుడు, నక్కల కూతలు కూస్తుండగా పల్నాడు శ్మశానమై పోయిందని, అంతా కలసి ఉండాలనే ఆశయాన్ని కవి తన ప్రతిభతో సమర్థంగా వర్ణించారు.

## అల్లూరి శ్రీరామరాజు

మన్నెం ప్రజలు వన్య ప్రాంతంలోని మైదానాలను చదును చేసి పంటలు పండించుకోడానికి ప్రయత్నిస్తూ ఉన్నారు. వారికి నాగులు అనే వడ్డీ వ్యాపారి అప్పులిస్తూ అన్ని విధాల వాళ్ళను దోచుకుంటూ ఉండేవాడని కవి శ్రీరామరాజు బుర్రకథలో వర్ణించారు.

కస్తూరి, పునుగు, జాజి, జాపత్రి, లవంగ, యాలకులు మొదలగు సుగంధ ద్రవ్యాలు, వెదురు, ఏగీశ, టేకు వంటి మానులు మొదలైన అడవి సంపదనంతా మన్యం ప్రజలతోనే ఆంగ్లేయులు అక్రమంగా రవాణా చేయించుకుంటున్నారు. ఇందులో నాగులు ప్రత్యక్షంగా సహకరిస్తున్నాడనే విషయాన్ని గొప్పగా చిత్రించారు.

మన్యంలోని జనం బ్రతుకు తెరువుకై ఎండు పుల్లలు కొట్టుకెళ్తే రేంజరు మామూళ్ళు, కొండగడ్డితో గుడిసె కప్పుకుంటే గార్డుకు లంచాలు, కల్లు వాసన చూసినా కేసు, పుట్టినా, చచ్చినా, చుట్టమొచ్చినా జరిమానా, ఇంటికి, తలకు పన్నులు వసూలు చేస్తూ అనునిత్యం హింసిస్తున్న తెల్లోడు దుర్మార్గుడని, వాడికి తొత్తులైన నల్లోడు ఇంటి దొంగ అని కవి ఈ వర్ణనలో వివరించారు.

రామరాజును స్కూల్లో చేర్చిన కొన్నాళ్ళకు ఈ చదువు పెట్టుబడిదారులను పెంచి పోషించటానికే కాని సామాన్యుని మనుగడకు పనికిరాదని నిర్ణయించుకొని 'సాము గరిడీలు, విలువిద్య, లలిత కళలపై ఆసక్తి చూపటంలో ఉన్న వ్యక్తిత్వాన్ని, రాజు ఉన్నతత్వాన్ని కవి ఈ వర్ణనలో ఎంతో హృద్యంగా చిత్రీకరించారు.

రాజు మన్యం ప్రజలతో నాగులులాంటి వాళ్ళు వడ్డీకి డబ్బులిచ్చి మీ శ్రమను దోచుకుంటున్నారు కాబట్టి మీరంతా ఒకే బాట, ఒకే మాటగా రండి మీకు స్వేచ్ఛ వస్తుంది, అని అనగానే అక్కడి ప్రజలు కల్పించుకుని అసలు మాకు ఇవన్నీ అలవాటు చేసింది మీలాంటి తెలివి కల వాళ్ళేనని ఖండించి చెప్పటం ద్వారా వాళ్ళు అలాంటి జీవితానికి ఎలా అలవాటు పడ్డారో ఈ వర్ణన ద్వారా చక్కగా తెలియపర్చారు.

రాజు పడకకై బండపై ఆకులు పర్చుకుని, ఆకాశమే అద్దాల మేడగా, మృగాల గోల జోలగా, పక్షుల కూతలే వీరగీతాలుగా తూరుపు రేఖలై, బుద్ధునికి బోధివృక్షంలా మోదుగ చెట్టే మార్గదర్శి అయిందని, ఆ ధర్మ పురుషుని ఆదర్శంగా

చెప్పడంలో కవి రచనా రమణీయత విశదమవుతుంది.

రాజు గూడెంలోని వారితో తాను కూడా వ్యవసాయం చేస్తూ వాళ్ళలో ఒకడై సాయుధ పోరాటానికి వారిని తయారు చేస్తుండేవాడు. అప్పుడే తహసీల్దారు బాస్టియన్ గూడెంలోకి వచ్చి రోడ్డు పనికి రావడం లేదేమని గద్దిస్తున్నాడన్న వార్త తెలిసిన రాజు వచ్చి అయ్యా! అరణాల కూలికి మూడణాలే ఇచ్చి తీరిక లేకుండా తలకు మించిన పని చేయించడం న్యాయమా? అని రాజు అడుగుతుంటే, వెంటనే బాస్టియన్ మమ్మే ప్రశ్నిస్తావా?! అని లాఠీ ఛార్జీ చేయించాడు. తర్ఫీదైన మన్యం ప్రజలు కొందరు బాణాలు, మరికొందరు రాళ్ళు వేయడంతో ఊహించని పరిస్థితిలో నుంచి ఎలానో తేరుకుని బాస్టియన్ తన బృందంతో పారిపోవటాన్ని మన్యం వీరుల తిరుగుబాటుగా కవి వర్ణిస్తూ ఎంతో సమర్థంగా వివరించారు.

పండిన పంటనంతా మన్య ప్రజలు సంతకు తేగా నాగుల బృందం సరుకంతా తీసుకుని, అప్పుల చిట్టాలు చూపి, తట్ట చింతపండుకు ఓ ఉప్పు కట్ట, డబ్బా తేనె తీసుకుని గబ్బు నూనె, పెద్ద అరటి గెలకు గుప్పెడు చుట్టలిస్తుంటే రాజు వచ్చి దుర్మార్గులను అడ్డగించటం, చిట్టాలు చించి వేయడం వంటి సంఘటనలను విపులంగా చెప్తూ కవి విప్లవాత్మకంగా వర్ణించారు.

బాస్టియన్ లంచాలు తీసుకుని గంటం దొర మునసబు గిరీని రద్దు చేసి, మల్లు దొర ఆధీనంలోని రిజర్వు భూములను వేరే వారికిచ్చి, రాజుతో మీ చిన్నాన్న నాకు స్నేహితుడు కాబట్టి ఈ మన్యం నీకు ఫర్మానాగా ఇస్తాను అనగానే రాజు అది ప్రజలకు ఇవ్వండి అన్నాడు. 'ఈ జనాన్ని నమ్మి ఎవరూ బాగుపడలేదు' అని బాస్టియన్ చెప్పగా, మన్య ప్రజలకు రక్షణ ఇవ్వండి నాకు సంతోషం అన్నాడు రాజు. అందుకు ప్రభుత్వం ఉంది అన్నాడు బాస్టియన్. 'కష్టజీవులను కూడు తిననీయని చట్టాలెందుకు?' అని బాస్టియన్‌ను ప్రశ్నించగా రాజును దేశ ద్రోహిగా అరెస్టు చేయమన్నాడు. వెంటనే రాజును తాకితే ప్రాణాలుండవని స్పందించిన జనాన్ని చూసి రాజు బాస్టియన్‌తో అమాయకులను రెచ్చగొట్టకండి. "క్రీస్తు

నమ్మకస్తులు కదా, మీకు ఆయన చెప్పింది ఇదేనా!?" అని ప్రజలతో మిత్రులారా ఉన్నతాశయాలతో, సాహసంతో, త్యాగంతో ఉన్నవాడు నాయకుడు. 'ఐకమత్యం పేదలకు రక్ష, అనైక్యతే ఉరిశిక్ష' కావున ఆవేశం మాని, ఆలోచనతో విజ్ఞానాన్ని, ఆచరణని అభివృద్ధి చేయండి అని ప్రబోధించిన తీరును వర్ణిస్తూ కవి నైపుణ్యాన్ని తెలియజేశారు. జైల్లో ఉన్న రాజును తల్లి కలిసి నాయనా, చెల్లి పెళ్ళి, తమ్ముడి జీవితం, నేను ఎంతకాలం ఉంటాను, కుటుంబ పెద్దవు నీవు అని బాధ్యతను గుర్తు చేస్తుండగా మిరపకాయ టపా వచ్చింది. అప్పుడు అమ్మా విను 'పని చేస్తే కూలివ్వరు, దొంగ లెక్కలు రాస్తారు, చంటి పిల్లల్ని చంపటం, స్త్రీలను చెరబట్టడం, అదేమంటే జైలు, జరిమానాలే కాక కాల్చివేస్తారు. 'నేను నీకు మాత్రమే కొడుకును కాదు, భారతమాతకు కూడా కొడుకునే' అని కానల లోనికి వెళతానంటాడు. రామరాజు మాటలలోని వసుధైక కుటుంబ భావనను కవి అతి జాగరూకతతో ప్రబోధంగా వర్ణించారు.

సాయుధ పోరాటం దిగ్విజయంగా సాగుతుంటే మన్య వీరులను మేము ప్రోత్సహించము అని కాంగ్రెస్ నిర్ణయించిందని అగ్గిరాజు ద్వారా రాజుకు తెలిసింది. ఇదే అదనుగా ఆంగ్లేయులు లార్డింగ్ వెల్లింగ్‌టన్ నేతృత్వంలో వేలాది దళాలను, స్టెన్ గన్‌లను, ప్యారిస్ గుర్రాలతో మన్యం వచ్చాయని తెలిసిన రాజు 'విజయం లభిస్తే రాజు ధన్యజీవి, అపజయం అయితే రాజు చిరంజీవి' కావున పోరుకు సిద్ధం కండి అని ప్రజలకు పిలుపు నివ్వడాన్ని, పోరాట పటిమ పెంచి ప్రోత్సహించడాన్ని కవి చాల బాగా చిత్రించారు.

దేశ రక్షణకై ప్రాణాలర్పించాలనే ఉద్దేశంతో కవి రాజు చరిత్రను ఎంతో గొప్పగా తీర్చిదిద్దారు.

## అభిమన్యు యుద్ధం

సుభద్రార్జునులు అన్యోన్య దాంపత్యానికి నిదర్శనమా! అన్నట్లు కాలం గడుపుతున్న సందర్భంలో, గర్భవతి అయిన సుభద్ర కథలు చెప్పమని అర్జునుని

కోరగా పద్మవ్యూహ రహస్యాన్ని చెప్తుండగా సుభద్ర నిద్రించింది. అది చూసి అర్జునుడు మధ్యలోనే ఆపేశాడు. గర్భవతి అయిన సుభద్రకు నోటికింపైన తినుబండారములు, సమస్యల్లేని వాతావరణం, చూడ చక్కని చిత్రపటాలు ఏర్పాటు చేయగా కథలు చెప్పమని అర్జునుని కోరటంలో గర్భవతుల స్వభావాన్ని కవి చాలా సహజంగా వర్ణించారు.

తమ సంతానం గొప్పవాళ్ళు కావాలనే ఆశ ప్రతి తల్లిదండ్రులకూ ఉంటుందనే విషయాన్ని చెప్తూ, అభిమన్యుని అన్నప్రాసన రోజు ఎన్నో వస్తువులు ఎదురుగా ఉన్నను విల్లును తాకాడు. అన్నప్రాసన తంతును కవి కడు రమ్యంగా వర్ణించారు.

సుభద్రను పుట్టినింట ఉండమని, మన కుమారుని వీర పుత్రునిగా చేయమని అర్జునుడు చెప్పటంలో తల్లిదండ్రుల బాధ్యతను కవి హృద్యంగా వర్ణించారు.

సుభద్ర అభిమన్యునికి విద్యతో పాటు పరిస్థితిని గూర్చి చెప్తూ, తండ్రులు అరణ్యంలో కష్టపడుతున్నారు, కానీ మనం అంత:పురంలో ఉంటున్నాం. వారి ఆశలకు ప్రతిరూపమై, రాజనీతితో వారి ఆశయాలను సాధించే వీర పుత్రునిగా నిన్ను చేయాలన్నారని బాధ్యతాయుతంగా ప్రవర్తించమని కర్తవ్యాన్ని బోధించటాన్ని సమర్థంగా వర్ణించారు కవి.

ఆడపడుచులు పుట్టింట ఉండటం అనేది పగవాళ్ళకు కూడా వద్దని, బ్రహ్మ మతిలేని రాత రాశాడని, స్త్రీల సమస్యలు తెలియవని సృష్టికర్తను సుభద్ర నిందించటంలో పుట్టినింట పెళ్ళైన ఆడపిల్లల సమస్యలను కవి ఎంతో గొప్పగా వర్ణించారు.

అరణ్య, అజ్ఞాత వాసాలు పూర్తయిన పాండవులు సుభద్రను విరాటుని కొలువుకు రమ్మన్నారన్న వార్త విని ఎంతో ఆనందించి, భర్తతో పునస్సమాగమానికి

కుమారునితో బయలుదేరుటలో, నిరీక్షణా ఫలితంలోని మాధుర్యాన్ని గొప్పగా వర్ణించారు కవి.

భార్యా బిడ్డలను ఒక్కసారిగా అక్కున చేర్చుకుని వియోగవ్యధను మర్చిపోతూ అర్జునుడు సుభద్రతో విరాటరాజు కుమార్తె ఉత్తర నీకు కోడలు కాగలదు అని చెప్పగా, సుభద్ర నా కోడలు మీ కోడలు కాదా? అని చమత్కరించటలో భార్యాభర్తల సరస సంభాషణను కవి చక్కగా వర్ణించారు.

అభిమన్యుని పన్నీటి స్నానం చేయించి, సుకుమార పట్టు వస్త్రాలు కట్టి, కస్తూరి తిలకం దిద్ది, నొసట బాసికం కట్టి, పట్టుబట్టనే తలకు చుట్టి, మణిహారం వేసి పెండ్లి కుమారునిగా చేశారని, అందంలో మన్మధునే మరిపించాడని ఉత్తరతో చెలికత్తెలు చెప్తున్న వైనాన్ని కవి చక్కగా వర్ణించారు.

ఉత్తరను ఇష్ట సఖులు పన్నీటి స్నానం చేయించి, సుగంధ ద్రవ్యాలు మేనిపై రాసి, పొడవైన ఉంగరాల నీలి కురులను దువ్వి, పూలజడ వేసి, మక్కెర పెట్టి, అద్దాల రవిక తొడిగి, చిక్కని బంగారు రంగు, వెండి జరీ పట్టు చీర కట్టి సింగారించారు. అక్కడ యుద్ధంలో బరితెగించి సాగి పోతుంటే ద్రోణుడు ఉ పేక్షించక అధర్మయుద్ధం చేయనెంచి పురమాయించాడు.

అంతట నిప్పును తాకిన మిడతలా రుక్మధరుడు అభిమన్యు ధాటికి అంతమొందాడు. మధ్యాహ్న సూర్యునిలా అభిమన్యుడు కురు సేనలను చీల్చి చెండాడుతుంటే ద్రోణుడు నిర్మించినట్లుగా కర్ణుడు ధనుస్సు త్రుంచగా శల్యుడు గుర్రాలను కూల్చాడు. కృపుడు సారథిని చంపగా, కురుపతి సోదరులు రధం ముక్కలు చేశారు. విరథునిపై దుశ్శాసన తనయుడు రధము పోనివ్వబోగా తప్పించుకొని, గదతో ఎదుర్కొనగా, అంతా అధర్మంగా ఒక్కని చేసి ఉక్కడగించారు. ఆనాటి యుద్ధ తంత్రమును కవి ఎంతో సమర్థంగా వర్ణించారు.

సైంధవుడు పాండవులను నిలువరించగా ఈ ఘోరం జరిగింది.

ఈ వార్త విన్న ధర్మజాదులు త్రిగర్తలాధిపతులైన సంశప్తకులపై యుద్ధం ముగించి వచ్చిన తండ్రికేమి సమాధానం చెప్తాం, ఆ తల్లికి పుత్ర శోకం, చిన్న పిల్ల, తల్లి కాబోతున్న ఉత్తరకు ఏమని సమాధానం చెప్పాలనే ధర్మరాజు ఆత్మ సంఘర్షణను, హృదయావేదనను కవి సునిశితంగా వర్ణించారు.

ఒక్కొక్కడుగా ఎంత సమర్థత ఉన్నా అన్యాయంగా చంపేస్తారనే విషయాన్ని, దేశం కోసం ప్రాణాల్నైనా అర్పించాలని, 'తనకన్నా దేశం మిన్న' అనే విషయాలు వివరిస్తూ, అభిమన్యుని ఆదర్శంగా తీసుకోవాలనే సందేశంతో వర్ణించారు కవి.

"లక్షా ఇరవై ఒక్క వేల డెబ్బై ఒక్కవేల డెబ్బై గుర్రములు రథంబులు, ఇరవై ఒక్క వేల ఎనిమిది వందల డెబ్బై ఏనుగులు, పది వేల మూడు వందల ఇరవై కాలి బంట్లు' కలసి ఒక 'అక్షౌహిణి' అవుతుందని యుద్ధమందు లెక్కను చక్కని వివరణతో కూడిన వర్ణన చేశారు కవి.

పద్మవ్యూహాన్ని ఛేదిస్తున్న అభిమన్యుని చూసిన ద్రోణుడు 'భామల కౌగిలి కాదిది యుద్ధం' అని హేళన చేయగా అభిమన్యుడు కోపంగా 'మూడు కాళ్ళ ముదుసలీ నే బాలుడ కాను నీ పాలిట కాలుడను కాచుకో' అని విల్లును త్రుంచి, సారథిని, గుర్రాలను చంపగా ద్రోణుడు తటాలున ప్రక్కకు తప్పుకున్నాడు.

అగ్నికి వాయువు తోడైనట్లు అభిమన్యునకు ఘటోత్కచుడు తోడై చిచ్చర పిడుగుల్లా, చిత్తజల్లుల్లా, చిటపట చినుకుల్లా శరములను వదుల్తూ చెలరేగి యుద్ధం చేస్తున్నారు.

అలా యుద్ధం చేస్తున్న అభిమన్యునకు దుశ్శాసనుడెదురై 'గోలీలాట కాదిది కదనం' అని ఎగతాళి చేయగా, ఉగ్రుడైన అభిమన్యుడు 'అబలలను అవమానపర్చుట కాదు' అని విల్లు విరిచేసి, మూర్ఛిల్లిన దుశ్శాసనుని బల్లెమెత్తి చంపబోగా భీమ ప్రతిన గుర్తొచ్చి వదిలేసి ముందుకు సాగిపోయాడు.

అగ్గి పిడుగై స్వైర విహారం చేస్తుంటే సుయోధనుడు కన్పించగా, 'కురురాజా! నిలు, అన్నిటికీ నీవే కారకుడవు' అంటూ ఏనుగుపై దూకే బెబ్బులిలా, ఊపిరి నలపనీయకుండా బాణ పరంపరలచే పోరు చేస్తూ, అస్త్రం సంధించబోయిన అభిమన్యునకు వాయు పుత్రుని ప్రతిన జ్ఞప్తికి రాగా "ఇంకా కొంతకాలం జీవించమని వదిలేస్తాడు.

ప్రశాంత వాతావరణంలో ప్రియుని సమీపంలో చిరు చెమట పోయగా, నేలపై బొటన వ్రేలితో రాస్తూ, గుండె దడతో తలవంచి దృష్టిని నేలపై నిలిపి ఉన్న ఉత్తరను మదన ప్రేరితుడైన అభిమన్యుడు తీయని అనుభూతి ఇద్దరినీ అలుముకొని సిగ్గు, బిడియం పటాపంచలై, ఇరువురు ఒక్కరై ప్రపంచంతో సంబంధం లేని ఆనందాతిరేకంతో, ఊహలను నిజం చేస్తూ మదన సామ్రాజ్యాన్నేలుతూ, స్వర్గంలో తేలుతున్నారని ఉత్తర, అభిమన్యుల తొలిరేయి హాయిని గూర్చి స్పష్టంగా వర్ణించారు.

అభిమన్యుడు యుద్ధానికి వెళతానని తల్లి ఆశీస్సులు అడగ్గా మాతృ హృదయం కలవరపడి, రణభూమిలో అంతా అన్యాయం ఉంటుంది. నీవా చిన్న వాడవు, అందులోనా తండ్రివి కాబోతున్నావు. మీ తండ్రి లేని సమయంలో రణభూమికి పంపలేను అని సుభద్ర చెప్పుటలో బిడ్డపై తల్లికి గల మమకారాన్ని గూర్చి ఈ వర్ణనలో తెలియజేశారు కవి.

అభిమన్యుడు క్షత్రియ ధర్మం చెప్తూ మాతా! నీవు వీరపత్నివే కాదు, వీర మాతవు కూడా అని బదులిస్తాడు. తల్లిని ఒప్పించి, దీవెనలందుకుని, భార్య ఉత్తరను సమీపించి ప్రణయ వచనాలు పల్కుచుండ, యుద్ధ భూమిలో రక్తం ఏరులై పారుతుంటే ఈ ప్రవర్తన వింతగా ఉంది అని మందలించగా, నీవు తల్లివి కాబోతున్నావని అమ్మ చెప్పిన ఆనందంలో ఇలా ప్రవర్తించానని చెప్పగా 'యుద్ధమందు వెను తిరిగిన వారిని, చేతులెత్తిన వారిని చంపవద్దు. ధర్మయుద్ధం చేయుము నాథా! అని యుద్ధమునకు ప్రేరేపించుటలో యుద్ధనీతిని,

ధర్మాధర్మములను కవి స్పష్టంగా చెప్తూ అద్భుతంగా వర్ణించారు.

సిగ్గులొలుకు బుగ్గపై నీలి చుక్కను పెట్టి మేలి ముసుగులోనున్న రతిలా ఉత్తరను పెండ్లి కుమార్తెను చేసి తోడ్కొని వచ్చి అభిమన్యు సరసన కూర్చుండబెట్టారు. పెండ్లి కుమార్తె వర్ణనను కవి అతి రమణీయంగా వర్ణించారు.

కళ్యాణ మంటపం నిండా పచ్చని తోరణాలు, ముత్యాల తోరణాలు కట్టి, మంగళ వాద్యాలు మోగుతుండ, పుణ్యాంగనలు హారతులీయ వేద మంత్రాల సమక్షంలో అగ్ని సాక్షిగా వివాహం జరిగిందని, వివాహ వైభవాన్ని కవి ఎంతో ఘనంగా వర్ణించారు.

నూతన వధూవరులను కలుపుటకా అన్నట్లు సూర్యుడు పశ్చిమ కనుమలకు పయనమయ్యాడని, ఉత్తరాభిమన్యుల సంగమానికి శుభముహూర్తాన్ని నిర్ణయించి, ఉత్తరతో ఇష్ట సఖులు భర్తతో ఎలా మసలుకోవాలో తెలియజేసి, అభిమన్యునకు ఉత్తర అమాయకురాలని చెప్పి సుఖంగా, జీవితాన్ని ఆనందంగా గడపమని చెప్పుటలో భార్యాభర్తలు ఒకరినొకరు తెలుసుకుని జీవించాలని కవి ఈ వర్ణన చిత్రించారు.

అంతరంగికులు ఉత్తరతో ప్రతి పలుకు వలపు లొలుకుతూ, మత్తుగా, కైపుగా పలకాలని, మగడు తాంబూలం అందిస్తే వద్దు అనకుండా సిగ్గుపడుతూ స్వీకరించాలి, అంతేకాక బిడియం, దడుపు లేక చనువుగా ఉన్న పతికి చొరవతో మౌనంగా అంగీకారం తెలపాలని తమ అనుభవాలను రంగరించి చెప్పడంలో తొలిరేయిని గూర్చి కవి రమణీయంగా వర్ణించారు.

ఉత్తరను ఇష్ట సఖులు అభిమన్యుని దగ్గరకు తీసుకొచ్చి కుమారా! ఉత్తర కుమారి సుకుమారి, వగలు, వలపులు తెలియని అమాయక ముగ్ధ అని సరసంగా చెప్పుటను కవి గొప్పగా వర్ణించారు.

# అయిదవ ప్రకరణం

## 1. నాజర్ బుర్రకథల్లో ప్రార్థనలు, పాటలు - విశ్లేషణ

## 2. వంతల ప్రాధాన్యం

# నాజర్ బుర్రకథలలో ప్రార్థనలు-విశ్లేషణలు

## నేటి రాయలసీమ

"శ్రీగల భారత వీరుల్లారా ॥తందాన॥
వీర మాతలౌ తల్లుల్లారా
శ్రీ గల భారత మాతను దలచి
కాళిదాస వర కవులను దలచి
భారత శాస్త్ర పండితులను దలచి
జోడు గుమ్మెటలు తాధిమియనగ
తోడుగ వంతలు ఆడిపాడగా
రాగ తాళ గీతాది నృత్యముల తంబుర కథ వినుడీ"

వర కవితా దురంధరులైన కాళిదాసాది కవులను, కళా నిష్ణాతులైన భారత శాస్త్రకారులున్న భారతదేశపు ఔన్నత్యాన్ని చాటుతూ, వంతలు గుమ్మెటలు ధరించి; రాగ, తాళ, నృత్యములతో కథకునికి శృతినందిస్తూ 'తంబుర కథ' ఆరంభమౌతుంది.

## పల్నాటి యుద్ధం

"శ్రీ భారతమాతా
మాం పాహి జనహిత
సంపూర్ణ స్వరాజ్య కాంక్షి
సుఖశాంతికి మకుటంబగు
సువిశాల సమభావ సమన్విత పూజిత ॥సా॥
వందలాది ప్రవహించెడి నదులే

వింధ్యా హిమ శైలముల్
బంగరు పొలములతో నలరారెడు
అందచందాల బృందావన వాసిని ॥సా॥
సోదర భారత వీరుల్లారా ॥తం॥
వీరమాతలౌ తల్లుల్లారా ”
శ్రీగల భారత మాతను దలచి ”
శ్రీనాథుని పోతన్నను దలచి ”
కాళిదాస వర కవులను దలచి ”
భారత శాస్త్ర పండితులను దలచి ”
జోడు గుమ్మెటలు తాధిమియనగ ”
తోడు వంతలు జోరుగ పాడగ ”
రాగ తాళ గీతాది నృత్యముల తంబుర కథ వినుడీ” ॥తం॥

జీవనదులతో, పర్వత శ్రేణులతో, పచ్చని పంట పొలాలతో హృద్యమైన బృందావనం వంటి, సమతా శాంతులతో స్వేచ్ఛగల ఓ భారతమాతా నీకు వందనం.

సోదరులైన భారత వీరులను, సకల సంపదలు కలిగిన భారతమాతను, మహాకావ్యకర్తలైన శ్రీనాథ పోతనలను, సంస్కృతంలో వర కవులైన కాళిదాసు వంటివారు, భారత శాస్త్రమందు ఉద్దండ పండితులను మదిలో తల్చుకొని జోడు గుమ్మెటలు తాధిమియని ఒకేసారి మ్రోగిస్తూన్న వంతలు జోరుగా పాడుతూండగా, కథకుడు రాగం, తాళం, గీతం, నృత్యాలను కల గలిపి ఆలపిస్తున్న తంబుర కథ వినమని కథ ప్రారంభమౌతుంది.

భారతదేశ సంపదలు, జనులంతా ప్రశాంత జీవనం చేయాలని కవి

ఆకాంక్ష మనకు తెలుస్తుంది. వీరులను, కవులను, సంగీత నృత్యములను మేళవించి పల్నాటి యుద్ధం తంబుర కథగా చరిత్రలో గల దేశభక్తిని చెప్తూ దానిని పెంపొందించాలనే ఉద్దేశం కవి ప్రార్థనలో వివరించారు. ఈ ప్రార్థనను 'నీలాంబరి' రాగంలో పాడేవారు శ్రీనాజర్.

## అభిమన్యు యుద్ధం

"గీతము పాడెదరా - సం
గీతము పాడెదరా -
యతి గణ ప్రాసల
శృతిలయల మీరిన - గీత
రసభావాత్మక
రగడ దరువులా
అక్షర లక్షలా
యక్షగాన సంగీత
శ్రీ భారత జనులందర దలచి ॥తందాన॥
వీర మాతలను - మరి మరి దలచి "
యక్షగాన గా-యకులను దలచి "
తిక్కన కవి - దిగ్గజముల దలచి "
పోతన్నా శ్రీనాథుల - దలచి "
జోడు గుమ్మెటలు తాధిమియనగ "
తోడుగ వంతలు ఆడిపాడగ "
రాగ తాళ నటనాన్వితమగు - నీ "
తంబుర కథ వినుడోయీ"

ఛందోబద్ధమైన గీతాలకు సంగీతం అమర్చి, యక్షగానంలోని

దరువులను, రగడలను తీసుకుని జానపద రీతులైన యక్షగాన గాయకులను తలంచి, వంతలు గుమ్మెటలతో శృతి అందించగా, కథకుడు తంబుర కథను శ్రద్ధగా ఆలకించమని చెపుతూ ప్రారంభిస్తారు.

## అల్లూరి శ్రీరామరాజు యుద్ధం

"శ్రీగల ఆంధ్ర వీరుల్లారా ॥తందాన॥
ధీరుల గన్న మాతల్లారా "
యక్షగాన గాయకుల దలంచి "
దీక్షతో కవి పండితుల దలంచి "
జోడు గుమ్మెటలు తాధిమియనగా "
తోడుగ వంతలు నాడిపాడగా "
గీత వాద్య నృత్యాభినయములా "
తంబుర కథ వినుడోయీ "
ఇట్టి మహనీయుల మాన్యుల - మది దలంచి
వ్రాసె వ్యాసుడు పద్దెంది పర్వములను
వినుడు పందొమ్మిదో పర్వమనదగిన
వీర గర్జన పోరాట భారతమును
వినరా ఆంధ్రుడ మన్య సోదరుల - వీర గాథ వినరా
ధీర విచారా ఆంధ్ర కుమారా - దీన జనోద్ధారా"

వీరులున్న తెలుగు గడ్డపై, ధీరులను గన్న తల్లులున్న ఈ దేశంలో, యక్షగాన గాయకులను, కవి పండితులను తల్చుకుని, వంతలు గుమ్మెటలతో వాద్యసహకారం చేస్తూ కథకునికి శృతి అందిస్తూ ఆడుతూ, పాడుతూ పందొమ్మిదో పర్వం అనదగే మన్య పోరాటాలు చేసిన, దేశభక్తి కల్గి, మాతృదేశ దాస్య విముక్తికై అసువులు బాసిన శ్రీరామరాజుకు చరిత్రలో గల స్థానం

వివరిస్తూ యువతను చైతన్యవంతులను చేయడమే కవి ఉద్దేశం అని మనకు అవగతమౌతుంది.

## బొబ్బిలి యుద్ధం

రాగం : నీలాంబరి - ఆదితాళం

"శృంగార లహరి - ఆ

శ్రిత జన శుభకరి ॥శృంగార॥

సంగీత బోధానందా

మధుమాధురి, మధుమాకరి

మంగళాంగి మదనారి

మనోహరి మామవ ॥సా॥

అంగజారి హృదయంగమ దరహాసితే

అఖిలాగమ సన్నుతే

భృంగ చికుర - కరుణా భర భరితే

తంగ జంఘన లలితే సురసేవితే

లింగరాజ వచనాంభుజ పూజితే ॥సా॥

రిసరిప సనిపమ గమపా గమపసనిప

గమపని సరిసని సనిపమ పయగమరిగమ

రిగరి పామా గామపని సమనిస

నినిపమ పపమగ మమగస మగపమ

నిపసని సమగమపని దనిపద పపమగస

పమగస నిపమగస సనిపమస రిసనిపమ గామపని

॥శృంగార॥

అ ॥చం॥

శ్రీగల ఆంధ్రమాతను దలతున్
త్యాగరాజ శ్రీనాథుల గొలుతున్
భరత మునీంద్రుని మది పూజింతున్
జోడు గుమ్మెటలు తాధిమియనగన్
తోడుగ వంతలు నాడుచు పాడన్
రగడలు, దరువులు, కందార్థములన్
రాగతాళ నృత్యాదుల మరగన్
తంబుర కథ గానంబు చేసెదన్"

॥శృంగార॥

సకల సిరులతో తులతూగు భారతదేశంలో 'నాద బ్రహ్మ త్యాగరాజు', కవి సార్వభౌముడైన శ్రీనాథుని, నాట్యశాస్త్రకారులైన భరతమునిని తల్చుకుని రగడ, దరువు, కందార్థములను, వంతలు గుమ్మెట వాయిస్తూ, ఆడుతూ, పాడుతూ కథకునికి శృతి అందిస్తుండగా కథ ప్రారంభమౌతుంది.



# నాజర్ బుర్రకథలలోని పాటలు-విశ్లేషణ

## పల్నాటి యుద్ధం

రాయబారిగా వచ్చిన అలరాజు నలగామరాజుతో బ్రహ్మన్న మాటలను వినమని చెప్పే సందర్భంలో

"బ్రహ్మన్న మాటలను మామా వినుమా
పగను వృద్ధిబొందించు భ్రష్టులే
పోరు మాన్పు పుణ్యాత్ములు లేరు
పోరు నష్టి పొందు లాభమందురు
పోరు తగదు భూమి నేరికైనా
బ్రహ్మన్న మాటలను - మామా వినుమా" ।పుట - 17।

ఈ పాటలో పగను పెంచేవారే కన్పిస్తున్నారు కానీ తుంచే వారే కనిపించడం లేదు. ఎట్టి పరిస్థితుల్లోనూ యుద్ధం వద్దు అని బ్రహ్మయ్య అభిప్రాయం. ఎందుకంటే యుద్ధం వల్ల జన, ధన, స్థిర ఆస్తులన్నీ నశిస్తాయి. అంచేత యుద్ధం అనేది ఎవ్వరికీ, ఏ దేశానికీ క్షేమం కాదనే విషయాన్ని అలరాజు చెప్తాడు. కవి యుద్ధం వద్దు అనే విషయాన్ని ఎంతో గొప్పగా రచించారు.

మాంచాల దీవెనలంద వచ్చిన బాలచంద్రుడు కామపీడితుడు కాగా, వీరపత్నిగా తన ఉద్దేశాన్ని చెప్తున్న సందర్భంలో రచించిన పాట

"నగరా నిను జూచినా - బాలచంద్ర ॥నగరా॥
పగతురు విన్నచో - "
దేశము హరియించి - అలరాజును వధియించి
పాలించు నాగమ్మ పస తేల్చుకొని రమ్మా
శత్రు యురములు క్రుమ్మిచిమ్మి
ధాత్రిపై విజయము తెమ్మీ

బానిసత్వము నోర్వలేము
బ్రతికినా చచ్చినా స్వర్గము ॥నగరా॥

సింగాల జగడమా - రంగాన జరుగగా
అంగాన చెలిమేమీ - సింగారముగ నుండు
రక్త తిలకము నుదుట బెట్టి
కరకు కత్తి కరము బట్టి
శత్రు మూకను చెదరగొట్టి
జయము చేకొనకున్న శత్రువులు" ॥నగరా॥ ।పుట-24।

ఈ పాటలో అన్యాయపు కోడిపోరులో దేశాన్ని అపహరించి, ఒప్పందం ప్రకారం రాజ్యమీయక, రాయబారియైన అలరాజును చంపిన దుర్మార్గపు నాగమ్మ పాలన అంతం కావాలి - మనకు బానిసత్వం నుండి విముక్తి కావాలి అని వీర తిలకమిడి వీరపత్నిగ జయము చేకొని రమ్ము అని బాలచంద్రుని దీవించి పంపింది. బానిసత్వం పోయి స్వతంత్ర జీవనం చేయాలని, అలా జీవించాలంటే పోరాటం చేయాలనే కర్తవ్యాన్ని కవి తెలియజేశారు. చారిత్రాత్మక కథలలో కూడా కథా కథనం దెబ్బ తినకుండా పాటల్ని రచించిన మేటి దిట్ట శ్రీనాజర్.

## నేటి రాయలసీమ

ఏర్వాకను గూర్చి తెలియజేయు సందర్భంలో
"కురిసెరా తొలకరీ ఓరన్నా
కోటేరు వేయరా రైతన్నా
కరవుతో దేశంబు
సుగిపోనున్నాది
పరువులు ఏర్వాక

పడగెత్తి వచ్చింది
పంట పైరేయరా ఓరన్నా!
ప్రజల బ్రతికించరా రైతన్నా
వజ్రాలు పండెడి
వరలక్ష్మి నీగడ్డ
రాజనాల పంట
రాలురా నీ యింట
బ్రతుకు రవ్వల బంతి ఓరన్నా!
చితికి పోనీకురా రైతన్నా!
నీగాటి బసవన్న
నీతోటి రైతన్న
నీకు తోడౌతారు
మాకు తిండంటారు
డబ్బాశ పడకు ఓరన్నా
ఇబ్బంది పడతావు రైతన్నా!" (పుట - 2)

ఈ పాటలో తొలకరి వానలు కురవగా కరవుతో దేశం సురిగిపోతూండ పరుగెత్తి ఏర్వాక వచ్చింది. రాజనాలు పండే రతనాల భూమిలో పైరు వేయడానికి సాటి రైతులు, ఎద్దుల తోడుతో పండించి డబ్బాశలేక దేశాన్ని బ్రతికించి, నీవు బ్రతుకు అని రైతులకు ఏర్వాక ముఖ్యమైన రోజని జానపదుల నమ్మకం అని కవి తెలియజేశారు.

పండిన పంటను రైతులు కుప్ప నూర్చే విధానాన్ని తెలిపే సందర్భంలో
"వలియ వలియో వలియా - రా
వేలుగలవాడ రార పొలిగాడ
పండి వంగిన పంట తల్లి

జీవులను బ్రతికించు తల్లి
కల్లమంతా కాలు మునగాలి ।వలియ॥

చేలు పండే మూల నిండా
పల్లెపట్టు చల్లగుండ
రాజనాల రాసి పెరగాలి
పొలి దిరిగే చేనమాల
కాట కాలను కాలదన్నాలి
గాట యెద్దులు బంతిగట్టి
కూలి రైతులు గొంతు కలిపి
పొలి గలుగ వలియ బలుకండోయ్" ॥వలియ॥ ।పుట-3।

అమితంగా పండిన పంటను కుప్ప నూర్చేప్పుడు ఎడ్లను బంతిగా ఓ మనిషి తోలుతూ కల్లంలో కాలు మునిగే రాశి రావాలి అది దేశ కరవు కాటకాలను పారద్రోలాలని పాడుతుంటే తోటి రైతు కూలీలు కూడా గొంతు కలుపుతారు. ఇక్కడ జానపదుల సంప్రదాయాన్ని, రైతుల ఆశయాన్ని కవి హృద్యంగా చెప్పారు.

సీతమ్మకు కొడుకు, అవుకు కోడె పుట్టగా మామ ఆనందాన్ని తెలిపే సందర్భంలో

"ఆనందమూ మహదానందమూ బ్రహ్మానందమూ
మన చిట్టిబాబు పుట్టిన ఘడియే ఆనందము
సీతమ్మ చేతి సలువన ఆవు వేసెను
కుందనపు బొమ్మ వంటి కోడె నేసెను
చలగోల వలె కన్ను చెదురుచుండెను
చక్కని గొడ్డు ఓలె చక్కగుండెను

పాలపిట్టల దూడ బారెడున్నది కోడె
పుట్టు బుధవారాన బుట్టియుండెనూ"  ॥ఆనందమూ॥ ।పుట-4।

ఈ పాటలో సీతమ్మకు కొడుకు, ఆవుకు కోడె పుట్టుటను జానపదులు పశువులను కూడా తమతో పాటు సమానంగా చూసుకుంటారనే విషయాన్ని చెప్పారు కవి.

తల్లి సీతమ్మ బిడ్డకు లాలిపాట ఇలా పాడుతుంది
"లాలి బంగారు కొండా - నా తండ్రీ
పాలు త్రాగుము బొజ్జ నిండా
నీకు తమ్ముడు బుట్టెనంటా - నా తండ్రీ
నీకు తోడుగా ఆడునింటా ॥లాలి॥
వెండి గజ్జెలు నీదు మొలకు
పసిడి మువ్వలు తమ్ము మెడకూ
ఘల్లు ఘల్లు నాడతారా - నా తండ్రీ
కలిసి సుఖములు పొందుతారా ॥లాలి॥
విద్యలన్నీ నేర్చుతారా - నా తండ్రీ
బుజ్జాయి అరక కడతావా
రతనాలు పండించుతారా - నా తండ్రీ
స్థితి గలిగి జీవించుతారా" ॥లాలి॥ ।పుట-4।

ఈ పాటలో పాలు తాగు నీకు కోడె తమ్ముడు పుట్టాడు. మీరు ఆడుకుంటుంటే వెండి గజ్జెలు నీ మొలకు, పసిడి (ఇత్తడి) మువ్వలు కోడెమెడలో కట్టగా అవి ఘల్లుఘల్లునా మ్రోగుతుంటే, సుఖంగా చదువుకుంటూ, వ్యవసాయం చేసుకుని ధనం సంపాదించి, హాయిగా జీవించండి అనే తల్లి నమ్మకం, ప్రేమ జానపద రీతిలో 'లాలి పాట'ను కవి కడురమ్యంగా రచించారు.

రాయపేటకు కరవురాగా ఆ ఊరిని వివరించే పాట

"యట్టా యీ కాపురాము
యే శరోశురో బడి చేతామన్నా ॥యట్టా॥
కాపురమంతా - కరవుల సంతా
జీవితమంతా - చిరుగుల బొంతా
గాలి కొంపలో - కాళీ కుండలు
చాలీ చాలని రేషను - కూలి గింజలు ॥యట్టా॥
ఉప్పుంటే పప్పుండదు యంటూ
యెప్పుడూ అప్పెవరిస్తారంటూ
పూట పూటకూ చాట బట్టుకుని
గడప గడప గాలించే దెట్టా ॥యట్టా॥
చేతామా పని లేనే లేదూ
తిందామంటే గింజలు లేవూ
చచ్చే చావో బ్రతికే బ్రతుకో
అంతూ పంతూ అగుపడదెంతకూ" ।పుట-5।

ఈ పాటలో కరవుల సంతలాంటి కాపురం, చిరుగుల బొంతలాంటి జీవితం, పడిపోయే పాకలో ఖాళీ కుండలు, ఉప్పుంటే పప్పుండదు, ప్రతి పూటా అప్పు ఎవరిస్తారు, పని లేదు, తిండి లేదు, చావాలో బ్రతకాలో తెలియని అయోమయంలో పల్లె ఉందని కవి వివరించారు.

రాయపేటలో కరవు రాగా పల్లె వీడి బ్రతుకు తెరువుకై పట్నం వెళ్ళు సమయంలో సీతమ్మ మామతో

"వెళ్ళిపోదాము మామ ॥వెళ్ళి॥
వెళ్ళిపోదాము పట్న వాసపు
కుళ్ళు వీథులలో బడి ॥వెళ్ళి॥

పుట్టి పెరిగిన గడ్డ మీదే
పుట్టగతులూ మాసిపోగా
కొంప గోడే వీడి - పట్టెడు
కూటికై - ఊరేగవలెనా ॥వెళ్ళి॥
గడచి పోయినవ - సువాసన
ఘడియలిక మన - బ్రతుకు తెరువున
కాలమొక్క మహాగ్ని - గుండము
కాచుకున్నది - ముందు మనకై ॥వెళ్ళి॥
రాజసపు - రతనాల భూమిని
ఏమని సెలవడగి పోదము
ఏ కడలమన్నైన - తనలో
యిమిడి పోవక - తీరదన ॥వెళ్ళి॥
ఒడలు పెంచిన - గడ్డ మీదే
ఒరిగి పొయ్యే రాత - లేదో
ఊరుగాని ఊరిలో - చితి
పేర్చుకొమ్మని - నొసటి వ్రాలు" ॥పుట-10॥

ఈ పాటలో పుట్టి పెరిగిన గడ్డను వీడి బ్రతుకు తెరువుకై కుళ్ళు కంపుల పట్నం వెళ్తూ, నేల తల్లిని ఏమని సెలవడిగి వెళదాం, పుట్టినగడ్డపై మట్టి అయ్యే పరిస్థితి లేదు. ఊరుకాని ఊరిలో, మనవారు కాని జనంలో చచ్చిపోయే స్థితి వచ్చిందని కవి ఆవేదనను విడమర్చారు. సొంత ఊరిపై గల అభిమానం గురించి చెప్తూ అందరికీ మాతృదేశంపై అట్టి భక్తి ఉండాలనే ఉద్దేశాన్ని కవి చెప్పారు.

సీతమ్మ ఎట్టి రాయలసీమ ఎలా మారిందో వివరించే సందర్భంలో
"రతనాల సీమయ్య బాబులారా
రాయలసీమయ్య బాబులారా

కూటి కరువొచ్చింది నీరు కరువొచ్చింది
సాటి సంసారులం తోటి రైతులమయ్యా
చెట్టుకొకరమయ్యాము బాబులారా బాబులారా
గుట్టకొకరమయ్యాము బాబులారా
పాడి పశువులతోనూ కోడెగిత్తలతోనూ
పచ్చగా బ్రతికామూ పరువుగా తిరిగామూ
పండంటి కాపురం బాబులారా బాబులారా
పాడు పడిపోయిం బాబులారా
ఆ కొన్న వాళ్ళకు - అన్నమే బెట్టాము
చేయెత్తి దానాలు - చాలగా చేశాము
స్థితిగల వాళ్ళమూ బాబులారా
గతులు వచ్చెను నేడు బాబులారా" ।పుట-13।

ఈ పాటలో రతనాల సీమలాంటి రాయలసీమ వర్షాలు లేక నీటి కరవుతో రాళ్ళసీమగా మారి కూటికి కూడా లేక చెట్టుకొకరు పుట్టకొకరమయ్యాము. పండంటి రైతు కాపురాలు, అన్నదానాలు చేసిన మాకు అన్నీ పోయి నేడీ గతి వచ్చిందని సీతమ్మ ఆవేదనను చిత్రీకరించారు కవి.

వర్షాధార ప్రాంతాల దుస్థితిని చెప్తూ, సన్నకారు రైతుల ఇబ్బందులు వివరిస్తూ కరవుదేశం ఎలా మల మల మాడిపోతుందో కవి చక్కగా వివరించారు.

## అల్లూరి శ్రీరామరాజు యుద్ధం

ఏరువాక రాగా మన్యం ప్రజలు వ్యవసాయపు పనులు మొదలు పెట్టిన సందర్భాన్ని పురస్కరించుకుని ఈ పాటను వ్రాశారు.

"ఏరువాకా వచ్చిందన్నా - చందమామా రైతా
ఏరుపూసి రారామన్నా - కొండమామా "

దుక్కి చలువ పైరుల పెంచున్ - కొండమామా ”
దున్నకుంటే కొయ్యక పండున్ - కొండమామా ”
ముదురు పైరు పంటకు మెరుగు - చందమామా ”
ముందు కొడుకు ఇంటికి వెలుగు - కొండమామా రైతా
బండలన్ని బైటకు తోసెయ్ - కొండమామా ”
తల్లిచ్చే పాలకన్నా - చందమామా ”
ధరణిచ్చే పాలు మిన్న - కొండమామా” ”

|పుట-16|

పై పాటలో తొలకరి వానలు కురవగా బండలను తోసేసి, నేలను చదును చేసి, దుక్కి దున్ని నాటు వేస్తే ముదురు పైరు బాగా పండుతుందని, ఇంటికి పెద్ద కొడుకు వెలుగౌతాడని, సెలయేళ్ళకు దుంగలు అడ్డువేసి పంటలు పండించు. తల్లి పాలు తన సంతానం వరకే పరిమితమైతే భూమి తల్లి ఇచ్చే పంట ప్రజలందరిదీ అని కవి తన భావాన్ని, జానపద బాణీలో చందమామ, కొండమామ పదాలలో హృద్యంగా చెప్పారు.

మెట్ట పొలాల్లో జొన్న మొదలైన పైరులేయగా, పిట్టల గోలను గూర్చి చెప్పు సందర్భంలో

“వడిశాల వారు తెగనమ్మా - ఓలమ్మ
పిడసలకు అలుసైతినమ్మా - పిన్నమ్మ
పచ్చజొన్నలు మెక్కి - పాలేరు నీల్దాగి
ఊచబియ్యం బొక్కి - ఊట నీరే తాగి
బలిసింది పిట్టలకు - ఓలమ్మా
బయ్యమే లేదోలె - పిన్నమ్మా” |పుట-17|

పై పాటలో బాగా పండిన పంట చేలో పడి పక్షులు జొన్నలు

మొదలగునవి తిని తెగబలిసి రైతు వడిశలతో ఎంత తోలినా భయపడటం లేదనే రైతు ఆవేదనను ఎంతో గొప్పగా చెప్పారు. మెట్ట పొలాలకు వర్షాలు లేక కొంత, పండిన తర్వాత పక్షులు, ఇంటి కొచ్చిన పిదప అప్పులోళ్ళు ఇలా రైతుకు అన్నీ సమస్యలేనని కవి తెలియజేశారు.

జొన్న కోతకెళ్తూ అత్త కొడుకుపై గల ప్రేమను తెలియజేసే సందర్భంలో

"యల్తానమ్మా యల్తానే
జొన్న కోతకి నెల్తానోలమ్మా - ॥ఎల్తా॥
అందగాడే మాయత్త కొడుకు
సందెయేలే రమ్మన్నాడమ్మా
ఆడులేనీ అడ్డాల మునుమూ
కొడవలెత్తీ నే కోయలేను - ॥ఎల్తా॥ |పుట-17|

ఈ పాటలో ఇంటి వద్ద పని కారణంగా ఆలస్యం కాగా అందగాడైన అత్త కొడుకు తొందరగా రమ్మనగా హడావుడిగా వెళ్తూ వాడు కంటి కెదురుగా ఉంటే చాలు లేకపోతే జొన్న చేలో కొడవలి కదలదు;

అనే విషయాన్ని తెలిపారు కవి. జానపదులు ఒకరిపై ఒకరు ఎంతో అభిమానంతో ఉంటారనే విషయాన్ని కవి స్పష్టంగా వివరించారు.

మెట్ట పొలాల్లో పండిన పంటను చూచి రైతులు తమ కష్టానికి ఫలితం వచ్చిందని పాడుకునే పాట

"వలియ వలియో వలియారా
వేలుగల వాడా - రార పొలిగాడా ॥వలి॥
అల్లమూ వెల్లుల్లి కంది
తెల్లజొన్నా సజ్జ పండి
చిల్లరప్పులు చెల్లిపోయెనా ॥వలి॥

చక్రవడ్డీల్ ఖండగుత్తలు
సక్కరంగా - తీరిపోతే
చుక్క పండుగ - జోరుగుంతాదా" ॥వలి॥పుట-18।

పై పాటలో రైతులు పండించిన అల్లం, వెల్లుల్లి, కంది, పచ్చ, తెల్ల జొన్న, సజ్జలు తీరి అమ్మితే చిల్లరప్పులు, చక్రవడ్డీ అప్పులు తీరిపోతే చుక్క పండుగ జోరుగా హుషారుగా చేసుకుంటామనుకునే రైతుల ఆశల్ని గూర్చి, రైతు యొక్క సాధక బాధకాలను గూర్చి కవి ఎంతో రమణీయంగా చిత్రించారు.

రామరాజు బాస్టియన్‌తో మన్యం ప్రజల తరపున మాట్లాడే సందర్భంలో

"వందానమయ్యా అయ్యా - ఆంగ్లేయ దొరలకు ॥వందా॥
ఆరణాల కూలి యంటిరి - మూడణాలే ఇచ్చుచుంటిరి
కూలినడిగిన కుమల గుద్దిరి - మచ్చరంటే చేయి జాపిరి ॥వందా॥
।పుట-14।

ఈ పాటలో ఆంగ్లేయ దొర మన్యం ప్రజలతో రోడ్డు పని చేయించుకుని ఆరణాల కూలికి మూడణాలు ఇస్తూ, మచ్చరును బట్టి కూలి ఇమ్మంటే కుమల బొడిచారు. ఇది న్యాయమా? అని ప్రశ్నించడంలో కవి ఉద్దేశం పెత్తందారులపై తిరుగుబాటు చేయాలనే విషయం స్పష్టంగా చెప్పారు.

జైలులో ఉన్న రామరాజు వద్దకు వచ్చిన తల్లితో అప్పుడే వచ్చిన మిరపకాయ టపా రాగా అందులోని సారాంశాన్ని, ఆంగ్లేయుల దురాగతాలను తెలియజేసే సందర్భంలో

"దశదిశలా రామా - ఈ ఘోరబా
ధలు చెప్పతరమా ...
కసి బట్టి రౌడీ - రా
క్షసులు నడి వీధుల్లో
కట్టుబట్టలు విప్పి

కట్టేసి కొట్టూట - తకిట తకధిమి
భర్త ముందే భార్య శీలము
చెరపగా వెనకాడరకటా!
నీచమగు ఈ బ్రతుకు కన్నా
వీర మరణం మేలు రన్నా - దశదిశలా రామా!" | పుట-25 |

పై పాటలో ఆంగ్లేయులు పెడుతున్న బాధలను రామరాజుకు చెప్పుకుంటున్నారు మన్యం ప్రజలు. కూలడిగితే తెగ బలిసిన తెల్ల దొరలు, కండబట్టిన రౌడీలు రాక్షసుల్లా నడి వీధుల్లో బట్టలు విప్పి కట్టి కొట్టటం, భర్తల ముందే భార్యలను బలాత్కరించటం వంటి ఘోరమైన బాధలు చెప్పతరం కాదు. నీచమైన ఈ బ్రతుకు కన్నా తిరగబడి మరణించడం మేలనే మన్యం ప్రజల ఉద్దేశాన్ని, ఆనాటి ఆంగ్లేయుల కరుడు గట్టిన రాక్షసత్వాన్ని కవి మన కళ్ళముందు ఉంచారు.

## బొబ్బిలి యుద్ధం

బొబ్బిలి రైతులు పంట పొలాలను గూర్చి వర్ణించుకునే సందర్భంలో
"ఆడేటి పాడేటి తుమ్మెదా - వాన
జాడల్లు జూపేటి తుమ్మెదా
సువర్ణముఖి పొంగి తుమ్మెదా - మాకు
నవరత్నములు పండు తుమ్మెదా
వ్యాగావతి పొంగి తుమ్మెదా - ఢిల్లి
భోగాలు పండాలి తుమ్మెదా
మగనాలి నాటింది తుమ్మెదా - చేను
తెగపండి ఒరిగింది తుమ్మెదా
చేను గట్టున చూడు తుమ్మెదా - పెద్ద

ఏనుగంతున్నాడే తుమ్మెదా
మునుం వెనుకాయెనే తుమ్మెదా - అబ్బ
నడుము కొర్రాయెనే తుమ్మెదా" | పుట-12|

పై పాటలో రాబోయే వర్షాన్ని గూర్చి సూచిస్తూ కవి రైతుల భావాన్ని తెలియజేస్తున్నారు. వర్షాలు కురిస్తే సువర్ణముఖి, వ్యాగావతి వంటి నదులు పారుతుంటే, ఇల్లాలు నాట్లు వేయగా పంటలు విరగపండి రైతుల కష్టాలు తీరతాయని ఆనందంతో ఉన్నారు. మోతుబరి గట్టున నిలబడి కూలీలచే విశ్రాంతి లేకుండా పని చేయిస్తున్నాడు. వంచిన నడుం ఎత్తకుండా పని చేస్తుంటే నడుం లేవనీయక పోవడాన్ని, కూలీల కష్టాలను, రైతుల ఆశలను సమపాళ్ళలో జానపద బాణీలతో తుమ్మెదా అనే పదాలను ఉపయోగించి కవి ఎంతో హృద్యంగా వ్రాశారు.

బొబ్బిలి రైతులు కుప్ప నూర్పిళ్ళను చేస్తున్న సందర్భంలో
"వలియ వలియో వలియ రా
వేలుగలవాడ రారా పొలిగాడ ॥వలి॥

బంతినున్న బసవన్న
పొలిదిరిగే చానమాల
కాటకాల కాలదన్నాలోయ్ ॥వలి॥

పండి ఒరిగిన పంట తల్లీ
తిండి కొరతా దీర్చు తల్లీ
కల్లమంతా కాలు మునిగిందా ॥వలి॥

చేలు బండి మూల నిండ
కూలినాలి చల్లగుండ
రాజనాల రాశి పెరిగిందా ॥వలి॥

కుప్ప నూర్చి పోశాడమ్మా ॥చందమామా రైతు॥
అప్పులన్నీ దీర్చాడమ్మా ”
భూస్వామి బాకీ సాకి ”
సావకారి చిల్లర పద్దు ”
పనివాళ్ళ బాదరబందీ ”
ప్రభువుల్లా పన్నుల రంది ” ॥కుప్ప॥
కష్టించి పైరులం బెంచి ”
పండించి ప్రజలకు పంచి ”
మేలు సరుకులమ్ముతాడమ్మా ”
తాలు తరక తింటాడమ్మా ” ॥కుప్ప॥
లోకాన్ని బ్రతికిస్తాడే ॥చందమామా రైతు ॥
శోకాన్ని భరియిస్తాడే ”
వెన్నకన్న మెత్తని వాడే ”
నీకన్న చల్లని రేడే ”

పై పాటలో రైతులు కుప్ప నూర్చడానికి బంతిగా కట్టిన ఎద్దు కాలు రైతు కరవును తీర్చాలని, మెండుగా పండిన పంట కాలు మునిగేలా వడ్ల రాశి పెరిగి తిండి కొరత తీరాలని కూలి వాళ్ళకు, అప్పులోళ్ళకు, శిస్తులకు, కష్టించి పండించిన పంటను పంచుతూ, మేలురకం గింజలను అమ్మి, తాలు తరక తాను తింటూ శోకాన్ని దిగమింగి లోకాన్ని బ్రతికించే రైతు, వెన్న కన్నా మెత్తని మనసుతో, చందమామ కన్నా చల్లని రాజు వంటి వాడని చెప్తూ, రైతులు మేలు పంట అప్పులకు, తాలు తాము తింటూ బాధలకు అలవాటు పడ్డ రైతు చల్లని, మెత్తని మనసున్న వాడని, 'జానపద ప్రక్రియ'లో 'చందమామ' పదాలతో కవి ఎంతో గొప్పగా వర్ణించారు.

# అభిమన్యు యుద్ధం

ఉత్తరాభిమన్యుల వివాహ సమయంలో ఉత్తర ఇష్ట సఖులు అభిమన్యుని అందాన్ని గూర్చి చెప్పే సందర్భంలో

"ఎంతా చక్కని వాడే - ఇంతిరో నీమగడు
నీకూ తగిన జంటా - పండింది నీ పంట
వానికా వీ మోవిపై - క
స్తూరి పునుగూ కలిపి చల్లగ
అమ్మ తోడందాల చిలక భి
మన్యునిగ మలిచాడే బ్రహ్మ" ॥ఎంతా॥ |పుట-13|

పై పాటలో ఉత్తర ఇష్ట సఖులు అమ్మతోడు బ్రహ్మదేవుడు తన శక్తినంతా ధారపోసి అభిమన్యుని చేశాడని, చూడ చక్కని వాడు, నీకు తగినవాడు మగడుగా లభించాడని మరులు గొలిపేలా ఉత్తరతో చెప్పారు. కవికి సౌందర్యంపైగల మక్కువను ఈ సందర్భంగా చూపారు.

ఉత్తరాభిమన్యుల వివాహ వైభవాన్ని గూర్చి తెలిపే సందర్భంలో

"పెండ్లాయెనమ్మా అందాల పందిట ॥పెండ్లా॥
అభిమన్యునకు ఉత్తరాకన్యకు "
పచ్చ తోరణాల్ - పసిడి పండుచునుండ
ముత్యాల తోరణాల్ - మురిపాలు కురియంగ "

మంగళా వాద్యముల్ మ్రోయగ
దీక్షగా వేదములు చది - వ
క్షింతలందరు విసరి వైవగ" " |పుట-14|

పై పాటలో వివాహ సందర్భంగా కట్టిన పచ్చని తోరణాలు బంగారంలా మెరవగా, ముత్యాల తోరణాలు మురిపాలు చల్లగా, మంగళ వాద్యాలు మ్రోగుచుండ, ముత్తయిదువలు హారతులీయగా, పురోహితులు దీక్షగా వేద మంత్రాలను చదువుతూ ఉండగా అందరూ మహానందంతో ఉత్తరాభిమన్యులపై అక్షింతలు చల్లగా అతి వైభవంగా వివాహం జరిగింది. చూడముచ్చటైన జంట, కన్నుల పండుగగా వివాహం మనిషి జీవితంలో ఓ మధుర ఘట్టమనే విషయాన్ని కవి చక్కగా రచించారు.



**సుద్దాల హనుమంతు మరో బుర్రకథా కథకుడు**

# శ్రీ నాజర్ అముద్రిత పాటలు - విశ్లేషణ

రోజూ కూలీ చేసుకుని జీవించే కూలీలను గూర్చి చెప్తూ
"ఏనాటికానాడు ఎండ వానల్లోన
సేసి సేసి ప్రాణం విసిగిపోతున్నాది
కూడు చాలని కూడు ఓరన్నా - దొరల
కుక్కలే నయమురా కూలన్నా!

ఈ పాటలో ఏ రోజు కారోజు ఎండనక, వాననక పని చేస్తుంటే చాలీ చాలని కూడుతో ప్రాణం విసిగిపోతున్న కూలీలు మన బ్రతుకుకన్నా దొరల వద్ద నున్న కుక్కల బ్రతుకు హాయిగా ఉందని, అవి రెండు పూటలా కడుపు నిండా తింటున్నాయి. మనకన్నా వాటి బ్రతుకే నయం అంటూ సగటు రైతు కూలీ యొక్క మనోగతాన్ని కవి మన ముందు ఉంచారు.

"ఎండల్లో వానల్లో నీడనక నిద్రనక
పండిస్తాము సంపదలు(పంటలు) పస్తుంటాము రోరన్నా
ఉప్పుంటే పప్పుందా? ఉంటానిక్కొంపుందా?
బతుకంతా వెతలాయెనా చిన్నారి కూలన్నా
దినమంతా శ్రమ చేసి జనమంతా పస్తులురా ॥ఎండల్లో॥

నీ పొలము జనబలము పేదోళ్ళ శ్రమ ఫలము
సోమరుల సొత్తాయె శ్రామికుల సత్తాయె ॥ఎండల్లో ॥

నీ శక్తి, నీ యుక్తి, పేదోళ్ళ ధీశక్తి
ఏకంగా నిలవాలి లోకాల నేలాలి"

ఈ పాటలో ఎండ, వానల్లో నిద్ర, నీడ లేక కష్టించి పంటల్ని పండిస్తాము. అది తినకుండా పస్తుంటాము. ఉప్పుంది కాని పప్పు లేదు. ఉండటానికి కొంప లేక బ్రతుకంతా కష్టాలేనా, ఓ కూలోడా రోజంతా కష్టపడి

పనిచేసే జనం అందరూ పస్తులున్నారు. నీ పొలము, జనం బలం, పేదవాడి కష్ట ఫలం సోమరులైన భూస్వాములు ఆస్తిగా అనుభవిస్తున్నారు. నీ శక్తి, నీ యుక్తి, పేదవాడి గుండె నిబ్బరం ఏకమై ఈ లోకాన్ని ఏలాలి అంటూ కవి రోజు కూలీ చేసుకుని జీవించే కూలీలను, వారు దోపిడీకి గురౌతున్న విధానాన్ని, కూలీల జీవనాన్ని గూర్చి కవి ఈ పాటలో మనకు తెలిపారు.

ఈ క్రింది పాటలో సగటు మనిషి, రైతు కూలీ మనోగతాన్ని వివరిస్తున్నారు.

ఎన్నాళ్ళీ కాపురాలు
ఏ చెరో సురో బడి చేద్దామన్నా ॥ ఎన్నాళ్ళీ ॥
కాపురమంతా కరవుల సంత
జీవితమంతా చిరుగుల బొంత
గాలి కొంపలు ఖాళీ కుండలు
చాలీచాలని రేషన్ కూలి గింజలు ॥ ఎన్నాళ్ళీ ॥
పారపనుల్లో పారుకులాడి
సత్తువకొద్దీ కత్తవ దొక్కి
సతమతమై నేమెతుకులకెళ్తే
కుండడుగున కూడుండదురన్నా ॥ ఎన్నాళ్ళీ ॥
చేలన్నీ నా చెమటన దడిపి
నేల బురద నాటును నాటి
కళ్ళ ప్రాణాలతో ఇల్లు జేరితే
పిల్లలు తింటే తల్లులు పస్తు ॥ ఎన్నాళ్ళీ ॥
పంటలు కోసి కల్లాల నేసి
వీపున వేసి పాతట పోసి
కూలిమ్మంటే తాలిస్తుంటరు ॥ ఎన్నాళ్ళీ ॥

రాజనాలు పండించే వానికి
భోజనానికి బొత్తిగ లేదు
పేదల కష్టం ప్రభువుల పాలు
బాధలన్ని మన పల్లెల పాలు ॥ ఎన్నాళ్ళీ ॥

ఎంతకాలమీ మార్పులేని కాపురాలు. కరవుల సంతలో చిరుగుల బొంత లాంటి జీవితం, కూలి పోవుటకు సిద్ధంగా ఉన్న పాకలు, చాలీచాలని కూలి గింజలు, వంట లేక ఖాళీగా ఉన్న కుండలు, పార పనులు, సత్తువనంతా ఉపయోగించి కత్తవ తొక్కి, అలసి సొలసి కూటికోసం ఇంటికి చేరితే పిల్లలు తిని, భార్య పస్తులతో పలకరింపులు, పండిన పంటలు కోసి, కల్లంలోని గింజల్ని మూట గట్టి, వీపు మీద మోసుకొచ్చి నిల్వచేసి కూలిమ్మంటే తాలు గింజలిస్తున్నారు. మేలు రకం ధాన్యం పండించేవానికి, తినడానికి పూర్తిగా లేదు. పేదవాని కష్టం భూస్వాముల పాల్జేసి, బాధలన్నీ మన పల్లెలు అనుభవిస్తున్నాయి. అన్ని కష్టాలు భరిస్తూ ఈ కాపురాలు ఎన్నాళ్ళు చేస్తామనే రైతు కూలీల ఆవేదనను, కష్టాలను తనదైన బాణీలో మన కళ్ళముందు నిలిపారు శ్రీ నాజర్.

పాలేళ్ళను గూర్చి ఈ క్రింది పాటలో తెలుపుతున్నారు.

"ఏరన్నా రాక ముందే - ఏర్వాక వచ్చెరన్న
ఎవరింట ఉందువన్న - ఓరన్న జీతగాడ
భూమిని దుక్కిదున్ని - పైరూల నెల్లసాకి
సోమరిపోతులను - సాకాలి ఎల్లకాలం
తెలియార తెలివి తోడ - కలవారి జీతగాడ ॥ ఏరన్నా ॥
పండిన కూరగాయ - పంటిన కొరకవాయె
కమ్మని కందిపప్పు - కానరాదు నేతి బొట్టు
ఉప్పాకె నీ ముఖాన - గొప్పోరి జీతగాడ ॥ ఏరన్నా ॥

పొద్దున్నె సద్దికూడు - మద్దేల నీలకూడు
కొద్దీగ జీతమాయె - పద్దాక తోముడాయె
పెద్దోరి భాగ్యమట్ల - పోగాయె జీతగాడ ॥ ఏరన్నా ॥

కంటికి నిదుర లేదు - వంటికి సుఖం రాదు
రోగాలు వచ్చి పడిన - నాగాలు తప్పవన్న
ఇదేమి బతుకురన్న - ఓరన్న జీతగాడ
ఇన్నీటి కోర్చి ఉన్నా - ఏ రోజు తిట్టులన్న
గట్టిగ మాటలాడ - కట్టేసి తన్నుదురన్న
ఈ బతుకు వద్దు పదరో - పోరాడు జీతగాడ ॥ ఏరన్నా ॥

ఈగనులు మనవెరన్న - ఈ పనులు జనులవన్న
ఈ పంట భూములన్ని - కాజేసె దొరలు మున్ను
నీ బలం చూపుమన్న - ఈ పొలం పంచుమన్న
నీ వెతలు తీరునన్న - ఓరన్న జీతగాడ ॥ ఏరన్నా ॥

ఈ పాటలో భూమిని దుక్కి చేసి, పైరుల్ని పెంచి సోమరులైన భూస్వాములను ఎల్లకాలం సాకాలి అనే నిజం తెలివిగా తెలుసుకోర జీతగాడ. కూరగాయల్ని పండించి ఒక్క రోజైనా వాటిని వండుకోవు. కమ్మని కందిపప్పు, అందులో నెయ్యి వేసుకుని తినే రోజే లేదాయె. ఉప్పు, కారంతో తింటున్నా, ప్రొద్దున లేచి సద్దికూడు, మధ్యాహ్నం నీరులా అయిన అన్నం, చాలీ చాలని జీతం, నిద్ర లేచిన దగ్గర్నుండి పడుకునే వరకు పని చేయించుకోవడం భూస్వాముల అలవాటుగా మారింది. నిద్రలేక బ్రతుకుతున్నావు. ఇన్ని కష్టాల కోర్చినా ప్రతిరోజూ తిట్లు, గట్టిగా మాట్లాడితే కట్టేసి తంతున్నారు. ఇలా ¬తకలేము పదరా జీతగాడ పోరాటానికి. ఈ గనులు, వనాలు, పొలాలు అన్నీ

మనవే, భూస్వాములు కాజేశారు. నీ బలం చూపించి భూస్వాముల దౌర్జన్యం ఆపేసి, వారి దగ్గరున్న పొలాన్ని జనానికి పంచితే కష్టాలు తీరతాయి. అంటూ భూస్వాముల వద్ద నున్న పాలేళ్ళ సమస్యాత్మక జీవితాలను గూర్చి వివరిస్తూ, అలాంటి జీవితాలకు స్వస్తి పలికి భూస్వాముల దౌర్జన్యాన్ని ఎదురించమని, అప్పుడే వారి జీవితాలు బాగుపడతాయని, అందుకోసం పోరు చేయమని సందేశాత్మకంగా రచించారు శ్రీనాజర్.

ఈ పాటలను శ్రీనాజర్ కథలలో సందర్భానుసారంగా పాడేవారు.




నాజర్ శిష్యులు గొర్రెల రాము దళం

# వంతల ప్రాధాన్యం

## అభిమన్యు యుద్ధం

బుర్రకథా కథా గమనంలో రాజకీయ వంత చంద్రవంశము వారైన పాండవులు ఉత్తర భారతదేశాన్ని సుభిక్షంగా పరిపాలిస్తున్నారని అంటే, విదూషక పాత్ర పోషించే హాస్య వంత వెంటనే మంచం కోళ్ళ వలె ముగ్గురు అంటాడు. "పాండవులు నలుగురు అని మనసులో అనుకొని, మంచం కోళ్ళవలె ముగ్గురు అని నోటితో చెప్తూ, ఇద్దరు అని రెండు వేళ్ళు చూపించబోయి ఒక్క వేలు చూపించడం"లో కచ్చితంగా విషయం తెలియక పోయినా, చెప్పే మాటలకు చేసే పనులకు పొంతన లేకుండా గందరగోళం చేసే వారి మనస్తత్వాన్ని కవి హాస్యవంత ద్వారా స్పష్టంగా తెలియజేశారు.

అర్జునుడు పద్మవ్యూహం గురించి చెప్తుంటే సుభద్ర వింటూ నిదురించిందని చెప్తే, హాస్యవంత ప్రక్క నున్న ఆడాళ్ళతో అచ్చనగళ్ళో, అట్టా చెమ్మో ఆడక పెద్ద మూహం ఏందిరా దద్దమ్మా" అని అంటే రాజకీయ వంత గర్భవతులకు మంచి వంటకాలు, ఫండ్లు, శిల్పాలు, చిత్ర పటాలు, సాహిత్యం, గానం, సంగీతం వినాలనే సహజమైన కోర్కెను వివరిస్తూ, గర్భిణీ స్త్రీలు ఆనందంగా ఉంటే పుట్టబోయే బిడ్డ ఆరోగ్యంతో జన్మిస్తాడని, అందుకే వారు కోరుకున్న కోర్కెల్ని తీర్చాలని రాజకీయ వంత ద్వారా తెలియజేశారు కవి.

అభిమన్యునికి అక్షరాభ్యాసం చేయిస్తున్న సందర్భాన్ని వివరిస్తుంటే, హాస్యవంత, "చదువెందుకు చంకనాకను" అని అనగా, రాజకీయవంత "విద్యలేని వాడు వింత పశువు" అని విద్య ఔన్నత్యాన్ని చెప్తే, వెంటనే హాస్యవంత "ఉద్యోగం రానివాడు ఉట్రపక్షి, ఏ పనీ చేతగాక అక్కుపక్షి" అని ఎగతాళిగా చెప్పుటను బట్టి, నేడు విద్య అనేది విజ్ఞానం కోసమేనని, విద్యలేని వాడు

పశువుతో సమానమని వివరిస్తూ ఉద్యోగంకై వేచి వేసారి చివరకు ఏదో ఒక పని చేద్దామని నిర్ణయించుకునే కంటే ముందుగానే వృత్తి విద్యలు నేర్చుకొనుట మంచిదని కులవృత్తుల్ని చేపట్టి స్వయంప్రతిపత్తితో జీవించాలని అప్పుడే దేశం అభివృద్ధి సాధిస్తుందని కవి తెలియజేశారు.

అభిమన్యుని విద్యాభ్యాసం ఎంతో చురుకుగా సాగుతూ అస్త్ర, శస్త్ర, వేదాలు నేర్చుకుంటున్నాడని రాజకీయ వంత అంటే, వెంటనే హాస్యవంత "మా అబ్బాయి గడించెరా పక్కింట్లో రాగి చెంబు" అని చెప్పడంలో పిల్లలకు ఏదైనా పరిస్థితులను, పరిసరాలను బట్టి అలవాటు పడతారనే విషయాన్ని చెప్పారు కవి.

మాయా జూదంలో ఓడిన పాండవుల పరిస్థితిని గూర్చి హాస్యవంత చెప్తూ "కన్నేల బోయెరా కనక లింగమా అంటే చేసుకున్న పున్నెంరా శరభలింగమా" అని చెప్పటం వెనకటికి కనకలింగం అనేవాడు కన్ను పోగొట్టుకుని వస్తే పక్కనున్నవాడు కన్నెందుకు పోయిందిరా అని అడిగాడట. దానికి ఈ కనకలింగం తాను చేసిన అసలు పని గూర్చి చెప్పకుండా నేను చేసిన పుణ్యం మూలానా అని దాట వేశాడు. ఇక్కడా అదే పరిస్థితి మాయా ద్యూతంలో ఓడిన పాండవులు మాకు భగవంతుడు ఈ స్థితిని కలిగించాడని, మా విధి అలా ఉందని నింద దేవునిపై వేసి తమ వ్యసనాన్ని కప్పి పుచ్చారు. వ్యసనాలు మనిషిని అధోగతి పాలు చేసి నిలువ నీడ కూడా లేకుండా చేస్తాయని కవి చెప్పారు.

పుట్టినింట ఉంటున్న సుభద్ర పడుతున్న బాధను గూర్చి తెలియజేసే సందర్భంలో, హాస్యవంత "వండని కూడు, వడకని బట్ట" అని చెప్పడంలో గింజల్ని ఉడికించకుండా తినడం, నూలు వడకకుండానే బట్ట నేయడం అనేది సాధ్యం కాని పని. అలాగే వివాహం అయిన స్త్రీ పుట్టింట్లో ఉంటే నలుగురూ నాలుగు రకాలుగా భావించి, ఎగతాళి చేస్తారనే లోక సహజ స్వభావాన్ని గూర్చి కవి ఒక్క మాటలో చక్కగా వివరించారు.

అరణ్యవాసానంతరం అజ్ఞాత వాసానికి వెళ్తున్న పాండవులను గూర్చి చెప్పే సందర్భంలో హాస్యవంత "మేం తిరుపతి వెళ్ళినట్లు వీళ్ళు విరాట నగరం వెళు తున్నారు" అని అనటంతో తిరుపతి వెళ్ళటం అనేది ముక్తి కోసమైతే, విరాట నగరం వెళ్ళడమనేది అజ్ఞాత వాస విముక్తి కోసమని కవి ఉద్దేశంగా చెప్తే అది హాస్యవంత తన సహజ ధోరణిలో తీర్థయాత్రలు చేయటానికి వెళ్ళినట్లు చెప్తూ చేసిన పనికి ప్రతిగా అనే వ్యంగ్యోక్తి వినిపిస్తుంది.

ఉత్తరాభిమన్యుల వివాహ సందర్భంగా విరాటరాజు కానుకలు ఘనంగా ఇచ్చాడని రాజకీయ వంత చెప్పగా హాస్యవంత "కట్నాల కర్ణ పిశాచి అప్పుడూ ఉందా?!" అని అనటంలో ఈ కట్నం అనేది సమాజాన్ని అనాదిగా పట్టి పీడిస్తున్న దురాచారమని, ఆనాటి ఆచార వ్యవహారాల నుంచే ఈ ఆచారం వచ్చిందని, సమాజంలో విద్యావంతులు పెరుగుతున్నా ఇది సమసిపోవటం లేదని తెలిపారు కవి.

ద్రోణుడు దుర్యోధనునికి ధర్మరాజు నప్పగించెదననే ప్రతిజ్ఞ విన్న అభిమన్యుడు నేనుండగనేనా? అని అంటుంటే హాస్యవంత "ఆకు చింపేస్తాన్, ఈకలు పీకేస్తాన్, కోడిని మేసేస్తాన్" అన్నీ మాటలేగా ఎన్నైనా చెపుతారు. ఆచరణలో మాత్రం శూన్యం అని చెప్తూ, హాస్యవంత మా ఊళ్ళో ఎలక్షన్లు వస్తే పోలేరమ్మ గుడి ముందు నేనూ చేశా ప్రతిజ్ఞ. "రౌడీలు రాజులై, గూండాలు దేశ గురువులై, సందుకో సారాకొట్టు, పేటకో పేకాట క్లబ్బు, వీధికో వ్యభిచార గృహం, లెక్కలేనంత ఆస్తి సంపాయిస్తున్న వీళ్ళను ఓడిస్తే నల్లకోడి పెట్టను నీకు కోసి, ఈకలు నీ ముందే దూసి, దాన్ని నేను మేసేస్తానని చెప్పటంలో ఇప్పటి రాజకీయ పరిస్థితి ఎంత అధ్వాన్నంగా ఉందో తెలియజేయడమే కవి ధ్యేయం.

అభిమన్యుడు మహా వీరుడని రాజకీయ వంత చెప్తే హాస్యవంత "అప్పుడు మన వీరుల పేరు చెప్తే దిశలు తెల్లారాయి, ఇప్పుడు కాఫీ చల్లారిపోతుంది" అని నెప్పడంలో నేటి యువత సోమరులై నిర్వీర్యమైపోతుందనే ఉద్దేశాన్ని తెలియజేశారు ۦ.

అభిమన్యుడు పద్మవ్యూహాన్ని ఛేదించగా సైంధవుడు పాండవుల నాపు చేయగా, ద్రోణుడు ధర్మజుని బంధించాడనే వార్త తెలిసిన అభిమన్యుడు కోపంతో యుద్ధంలో గజిబిజి చేస్తున్న సందర్భాన్ని హాస్యవంత చెప్తూ "నక్కబోయినాక బొక్క వెతికినట్లు, తిన్న కుక్క తిని పోతే కన్న కుక్కను కట్టేసి కొట్టినట్లు"గా ద్రోణునిపై కోపం సేనపై చూపుతున్నాడని, ఏదైనా ముందు జాగ్రత్త కావాలని కవి చక్కగా ఉద్బోధించారు.

అభిమన్యుని దుశ్శాసనుడు వేలెడు లేవు వేటుకు కూలుస్తాననే సందర్భంలో హాస్యవంత "ఒట్టి గొడ్డుకు అరుపుల్ జాస్తి" అని అనటంలో గొడ్డుమోతు పశువుకు అరుపులు ఎక్కువనే అర్థంలో చెప్పటం, అరిచే కుక్క కరవదనీ, మాటలు చెప్పేవాడు ఎప్పుడూ ఆ పని చేయలేడనే అభిప్రాయం కవిది.

పారిపోతున్న సేనలను రోషం లేదా, మీకు మీసం లేదా?! నా దేశంలో ఇంత సన్నాసులున్నారా అని అభిమన్యుడు చెండుతున్న సందర్భంలో హాస్యవంత "రొయ్యకు మీసం బారెడు" అని అనుటలో మీసమున్న ప్రతివాడూ వీరుడు కాలేడని తెలియజేస్తూ, ప్రతివారూ పౌరుషంగా ఉండాలని కవి ప్రబోధించారు.

అధర్మంగానైనా యుద్ధంలో అభిమన్యుని అంతం చేయాలని ద్రోణుడు నిర్ణయించాడని తెలిపే సందర్భంలో హాస్యవంత "జనం వినేట్టు నీతులు చెప్పాలి, వెనక పెద్ద పెద్ద గోతులు త్రవ్వాలి" అని చెప్పటంలో పైకి పెద్ద మనుషుల్లా చలామణి అవుతూ, లోన ఎదుటివారి పతనమే ధ్యేయంగా దుర్మార్గాలు చేయటాన్ని, 'మేకవన్నె పులులనే' విషయాన్ని చెప్పేయగా రాజకీయ వంత "నాటి నుంచి నేటి వరకు వస్తున్న రాజనీతి, పాలకవర్గ పాపభీతి, నిజాయితీ ఇదే" నని, అప్పుడూ ఇప్పుడూ అణచివేత ఉందనే విషయాన్ని కవి ఎంతో జాగరూకతతో చెప్పారు.

# అల్లూరి శ్రీరామరాజు యుద్ధం

రాజకీయ వంత వెంకటరామరాజు, నారాయణమ్మల అన్యోన్య దాంపత్యం అని చెప్తే, హాస్యవంత "63 రకమా, 36 రకమా" అని అడుగుతాడు. 63 రకమంటే ఆరు దక్షిణం మూడు ఉత్తరం అని, 36 రకమంటే మూడు ఉత్తరం, ఆరు దక్షిణం అయితే ఎడమొగం పెడమొగమని విశ్లేషించి చెప్తాడు.

అట్టి దంపతులకు ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె అని రాజకీయ వంత చెప్పగా, హాస్యవంత వెంటనే కటింగు అని కుటుంబ నియంత్రణను గురించి చెప్తూ "అధిక సంతానం అనర్థానికి హేతువు" అని సూచించారు కవి.

రామరాజు చదువును గూర్చి చెప్తూ హాస్యవంత "విద్య లేనివాడు వింత పక్షి, ఉద్యోగం రానివాడు ఉష్ట్రపక్షి" అని విద్య గొప్పను, ఉద్యోగం కొరతను ప్రభుత్వం పట్టించుకోదని చాలా చక్కగా చెప్పగా, రాజకీయ వంత రామరాజు విద్యను ఎందుకు తిరస్కరించాడో చెప్తూ "పెట్టుబడిదారులకు లాభాలను చేకూర్చే సగటు అధికార మనస్తత్వాన్ని పోతబోసి, విద్యార్థుల మెదళ్ళను కరుడు గట్టించేదీ విద్యా విధానం" అని అది మనిషి మనుగడకు పనికిరాదని కవి ప్రభుత్వ లోపాన్ని దుయ్యబట్టారు.

రాజు సంతలో ఉపన్యసించగా మన్యం ప్రజలు తిరస్కరించారని చెప్తే, హాస్యవంత "హరోం హర యేడుత్తుండావేంటిరా ఇమ్మానేలా అంటే బ్రాకెట్ తన్నేసిందిరా బెమ్మానందమా" అన్నట్లు, మేలు చేద్దాం అని చూస్తే పరిస్థితి తారుమారై ఎదురొచ్చిందని రాజు పరిస్థితిని చెప్తూ, ఆ నాడు సమాజంలోని బ్రాకెట్ ఆట అనే వ్యసనం గూర్చి కవి ఎంతో గుంభనంగా చెప్పారు.

రామరాజు మల్లు, గంటం దొరలను పంపించి వేశాడని చెప్తే, ఇక రాజు వెళ్ళిపోతాడనే అభిప్రాయం కలిగి హాస్యవంత "ఆంధ్రులు అరంభశూరులు" అని అనటంలో మొదలు పెట్టటమే కాని తర్వాత దాని పర్యవసానాన్ని ఆలోచించి ముందడుగు వేయలేరనే విషయాన్ని కవి సూచించారు.

రాజు అడవిలో ఉండటాన్ని హాస్యవంత "ఆకలి రుచెరగదు నిద్ర సుఖమెరుగదు" అని అనటంలో ఆకలితో ఉన్న వాడికి ఏ పదార్థమైనా ఒకటేనంటూ రుచి గూర్చి ఆలోచించడని, నిద్రవచ్చిన వాడు పట్టు పరుపులు లేకున్నా నిద్రించగలడని తెలుపుతూ, రామరాజు ఆశయ సాధన కోసం ఎన్నో బాధలు పడుతున్నాడని, అలసిన శరీరంతో పంచభక్ష్య పరమాన్నాలు, పట్టు పరుపులు త్యజించి పేద ప్రజల కోసం పాటు పడుతున్నాడని కవి తెలియజేశాడు.

రాజకీయాన్ని హాస్యవంత చెప్తూ "అధికార పార్టీకి భజన చేయాల, అబద్ధాలు చెప్పాల, చందాలు భోం చేయాల"ంటే, రాజకీయ వంత నీవు చెప్పిన వాళ్ళు పార్టీలు చీల్చి పాలక వర్గాలకు బంధువై కష్ట జీవులకు ద్రోహం చేస్తాడని కవి రాజకీయ మర్మాన్ని చెప్పారు.

పెత్తందార్లు బ్రిటిష్‌వారి విధానాన్ననుసరించి మనలో విభేదాలు, మనకు తెలియకుండా ఎలా కలిగిస్తారో చూడండని హాస్యవంత "మాల ఏసుక్రీస్తు మాదిగలకు కాడు, మాదిగేసు క్రీస్తు మాలలకు కాడు" "ఈ చర్చిపై కాకి ఆ చర్చిపై వాలరాదు" అంటూ కులాల కుమ్ములాటలను ఎద్దేవా చేస్తూ, కలసి ఉండమని ప్రబోధం చేశారు కవి.

మల్లు దొర బలహీనత మత్తుమందు సేవించటం గూర్చి చెప్పు సందర్భంలో హాస్యవంత "కల్లు గ్రోలి కాళిదాసు కత్తి తిప్పాడు, సారా త్రాగి శ్రీశ్రీ సినీ హీరో అయ్యాడు" అంటూ త్రాగిన వారిని గూర్చి చెప్తే, రాజకీయ వంత వారు కవి సార్వభౌములురా అనగానే హాస్యవంత కాపుసారా రమ్ములనుకున్నారా అంటాడు. ఎదుటివారి బలహీనతల నాసరా చేసుకుని విభజించి పాలించే విధానాన్ని విడనాడండని సందేశాత్మకంగా చెప్పారు కవి.

మన్యం ప్రజల పంటంతా వడ్డీ నాగులు గుంజుతున్న సందర్భాన్ని వివరించేప్పుడు హాస్యవంత "తిరపతి కొండకెళ్ళే పని లేకుండా క్షవరం చేస్తున్నారు" అని అనడంలో తిరుపతి వెళ్తే పుణ్యమైనా దక్కుతుంది, కానీ వీళ్ళు పుణ్యం,

పురుషార్థం రెండూ దక్కకుండా నిలువు దోపిడీ చేస్తున్నారని తెలియజేశారు కవి.

రాజును గిరిజనుల నుంచి వేరు చేయాలనే పరిస్థితిని హాస్యవంత "పట్టపగలు తలుపు తట్టింది ఎవడ్రా అంటే పెళ్ళాం లేనోడు అన్నట్టుంది" అని అనటంలో పెళ్ళి కానివాడు సంసారం అనే బాదర బందీ గూర్చి తెలుసుకోలేడు. అతను నియమ నిబంధనలు పాటించక ఇతరులను ఇబ్బందికి గురి చేస్తుంటాడు. అలాగే ఉద్యమం గూర్చి తెలియకుండా, ఉద్యమకారుడైన రామరాజు తమకు ఆటంకం కలిగిస్తున్నాడని, తమ పనులను సజావుగా చేసుకోనీయడం లేదని, అందుకే గిరిజనుల నుండి రాజుని విడదీయాలనే విషయాన్ని తెలియజేయడం కోసం కవి వాడారు.

అంగ్లేయులు బ్రాందీ నిచ్చి మన వాళ్ళను లొంగదీసుకున్నారని హాస్యవంత చెప్తూ "బాటిలైతే నేమిరా పెద్ద బానెడెందుకురా సోదరా, మందు మరిగిన పాడు పొట్టకు బ్రాందీనే పోద్దాము, రారా!" అని అనటంలో తెల్లవారు రాకముందు మనవాళ్ళు కల్లు సేవించి మత్తులో తేలేవారు. వారు వచ్చిన తర్వాత అలాంటి మత్తు వీరులను తమ వద్ద నున్న సీమ సరుకు (బ్రాందీ) అలవాటు చేసి వారిని లొంగదీసుకున్నారు. బ్రాందీ రుచి మరిగిన వాళ్లు అది ఒక బాటిలైనా చాలు, పెద్ద బానెడుండాల్సిన పనిలేదు. మందు తాగటానికి అలవాటు పడ్డ ప్రాణికి బ్రాందీయే పోద్దాం అంటూ మన వాళ్ళు అంగ్లేయులకు బానిసలయిన విషయాన్ని చక్కగా వివరించారు కవి.

రామరాజును జైల్లో పెట్టి, ప్రలోభ పెట్టుటకు ముప్పై ఎకరాల భూమిని ఇవ్వబోయారని తెలిపే సందర్భంలో హాస్యవంత "కరిసే కుక్కకి కండ, ఉరికే పశువుకు బండ" ఉండాలన్న విధంగా ఉందనగా రాజకీయ వంత ఉద్యమం చేస్తున్న పేద నాయకులకు వేసే ప్రభువుల బండల్లో ఇదొకటని చెప్పగా, హాస్యవంత "తంతే గారెల బుట్టలో పడ్డాడని" అనటంతో రాజకీయ వంత "తొంబై తొమ్మిది రూపాయలు వెనకేస్తే, ఆ ఒక్క రూపాయి కోసం ఏ గడ్డి అయినా కరుస్తుంది

మానవ మనస్తత్వం" అని కార్ల్ మార్క్స్ అన్నారని చెప్పటంలో ఉద్యమకారుడైన రాజు ఉద్యమం నుండి తప్పుకోవాలని ముప్పై ఎకరాల భూమిని ఆశ చూపి, నీరు గారిన ఉద్యమాన్ని అణచి వేయాలని, అందుకు ఎంతటి పనినైనా చేయటానికి సాహసిస్తారని ఆంగ్లేయులను గూర్చి వివరిస్తూ, డబ్బు కూడిన తర్వాత దాన్ని పెంచి పోషించుకోవటం కోసం ఏ పనైనా చేసే మనిషి మనస్తత్వాన్ని చక్కగా తెలియజేశారు.

చదివి గౌరవంగా బ్రతుకు అని రామరాజుతో తల్లి చెప్తే, హాస్యవంత "చేతిలో డిగ్రీ పట్టా, నిత్యం ఆకలి పొట్ట" అని అనటంలో డిగ్రీలు పూర్తి చేసి ఉద్యోగం దొరక్క నిత్యం పస్తులతో గడుపుతున్నారని, నేటి నిరుద్యోగ సమస్యను గూర్చి చక్కగా తెలియజేశారు కవి.

ఎంత ప్రలోభపెట్టినా రామరాజు లొంగక మిరపకాయ టపా రాగా తప్పించుకున్న సందర్భాన్ని హాస్యవంత "మొనగాడెంకన్న అని బల్లెం భుజానెడితే పారేసి పరిగెత్తాడని" అనటంలో రామరాజు నిజమైన దేశభక్తుడని ఎటువంటి ప్రలోభాలకు లొంగకుండా ఉద్యమ స్ఫూర్తితో సాగుతున్నాడని తెలియజేశారు కవి.

రాజకీయ వంత 'దున్నే వానిదే భూమి' అని అనటంలో కష్టపడి పనిచేసే వాడే ఫలితాన్ని అనుభవించాలని, భరతమాత ముద్దు బిడ్డలమైన మేము వేరొకరి దాస్యం చేయమని, దాస్య విముక్తి కోసం చేసే పోరాటం ఆగదని రాజు ఎదురు దాడులు చేస్తుంటే శత్రువులు పిక్క బలం చూపిస్తున్నారని కవి సమస్యకు పరిష్కారం పోరాటం అని చెప్పారు.

గాంధీ, రామరాజు త్యాగం గొప్పదే కాని "సాయుధ పోరాటాన్ని బలపర్చం అని చెప్పిన సందర్భాన్ని హాస్యవంత "పెళ్ళి కొడుకు జుట్టూ, బట్టలూ అతనివే కానీ ఆ ఉంగరాలు, వాచీ గురించి నన్నడగొద్దు" అన్నట్లు ఉందని అనటంలో "ఒక్క మాటతో ఉద్యమకారులను నీరు కార్చారని, తానే గొప్పవాడవ్వాలనే కీర్తి కాంక్ష" అని కవి ఉద్దేశం.

# పాత్రల స్వభావం

## బొబ్బిలి యుద్ధం

**<u>రంగారావు:-</u>** బొబ్బిలి సంస్థానానికి రాజు రంగారావుకు కొడుకు పుట్టిన ఆనంద సమయంలో వేటకు బయలుదేరిన వెంగళరావును ముందు చూపుతో వారించాడు. అతడు బొబ్బిలి రైతుల పంటను నాశనం చేసిన ఆనందరాజును అడ్డగించి నష్టపరిహారం వసూలు చేయడమే కాక రైతులకు శిస్తులు రద్దు చేసి, ధాన్యాగారం నుంచి ధాన్యం ఇప్పించడంలో అతని ఔదార్యం విదితమవుతుంది.

విజయరామరాజు కోడి పందాలకు ఆహ్వానించగా నవాబుకు, బొబ్బిలి సంస్థానాధీశులకు మధ్య మనస్పర్థలు సృష్టించి దొంగ దెబ్బ తీయాలనే కుట్రను గమనించాడు రంగారావు. ఒత్తిడుల వల్ల పందానికి సిద్ధమయ్యాడు. పందెంలో ఓడిపోయిన విజయరామరాజును మందలించాడు.

వెంగళరావు వివాహంతో పాటు మరో యాభై సామూహిక వివాహాలు నిర్వహిస్తున్న సమయంలో విన్పించిన రణభేరిని గూర్చి అడిగిన వెంగళరావును మభ్యపరచి, మామ అయిన దామెర్ల ధర్మయ్యను పిల్చి సంధి సామర్థ్యం కుదుర్చుకు రమ్మని పంపించాడు. తిరిగి వచ్చిన ధర్మయ్యను తూలనాడిన వెంగళరావుచే క్షమాపణ చెప్పించాడు. అనంతరం ఈ పరిస్థితిని మెరుగుపర్చుటకై పాపారావును రమ్మని కబురు పంపాడు. వెంగళరావుతో క్షమాపణ చెప్పించటంలో పెద్దల ఎడ రంగారావుకు గల గౌరవ భావం విదితమవుతుంది.

అంత:పుర స్త్రీలకు పసుపుకుంకాలు పంపాల్సిన రోజున వీర తిలకం

దిద్దుకుని వీరవనితలుగా మారమని కత్తులు పంపాడు రంగారావు. నరసరాయునితో శత్రువులకు పూచిక పుల్ల కూడా చిక్కకుండా అగ్నికి ఆహుతి చేసి రణస్థలికి రమ్మని చెప్పాడు. హసనల్లీ ఖాన్ వచ్చి రంగారావుతో బుస్సీని క్షమాపణ కోరితే మీ కోట మీకు ఇస్తానని చెప్పమన్నాడని అనగా మేము చేయని నేరానికి యింత దారుణం చేయడం న్యాయమా" అని ప్రశ్నించాడు రంగారావు. అలా కత్తులు పంపుటలో స్త్రీలలో కూడా వీరత్వాన్ని పెంచి పోషించాడు.

రణరంగంలో దండధరునివలె చెలరేగుతూ శత్రువుల తలలు నరుకుతూ, పరాసు వీరులారా, విజయనగర సేనలారా రండి నేనే రంగారావును అని చీల్చి చెండాడుతూ హైదరుతో తలపడ్డాడు. వెనుక నుంచి లౌడూఖాన్ దొంగ దెబ్బ తీయగా వెనుదిరిగి ఒక్క వ్రేటుకే తలను నరికి వేశాడు. పారిపోతున్న హైదరును నిలవరా పిరికిపందా అంటూ వెంబడించి, నల్లమందు మాటులో పడి వీర మరణం పొందాడు రంగారావు.

నైతికంగా గెల్వలేని విజయరామరాజు కుటిలత్వాన్ని బలైపోయిన రంగారావు 'రాజు' అనే పదానికి మారు రూపుగా, ప్రజల కష్టాలను తన కష్టంగా భావించి అన్ని వేళలా ఆవేశం పనికి రాదని, ఆలోచించి పరిస్థితులను సానుకూల పరచుకోవాలని తెలియజేస్తూ ప్రజల ఇక్కట్లను పరిష్కరించేవాడే నిజమైన రాజు అని రంగారావు పాత్ర ద్వారా నిరూపించారు కవి.

**తాండ్రపాపారాయుడు:-** రంగారావుకు బావమరిది రాజాము నగరానికి ఠాణాదారు. అరివీర భయంకరుడు. కోడిపందాల సమయంలో విజయ రామరాజు ఓడిన మైకంలో పరుషంగా పలికిన మాటలకు, నీ అబ్బతరం కాదు, ముందు నిన్ను బాకుతో కుమ్ముతాను అన్నాడు. బొబ్బిలిని జయించాలంటే రాజాము నగరం నుండి సులభ మార్గం - రాజాములో పాపారాయుడు ఉన్నంత కాలం ఆ దారిన వెళ్ళడానికి ప్రయత్నించిన వారికి మరణమే స్వాగతం పలుకుతుందనటంలో పాపారాయుని

వీర పరాక్రమాలు విశదమవుతాయి.

యుద్ధం జరుగుతున్న విషయం తెలియని పాపయ్యకు మల్లమ్మ దేవి శోకంతో కలలో నీవుండగనే అనాథలమైతిమి అంటూ కన్పించగా, కలవర పడిన మనసుతో అందరినీ సమీకరించి చర్చలు జరుపుతున్నాడు. ఆ సమయంలో వచ్చిన దాసి లక్ష్మి బొబ్బిలిలో జరిగిన విషయాలు చెప్పగా, ప్రాణప్రదంగా చూసుకున్న రాజ్యం, రాజవంశం నాశనం సహించలేక ఆత్మహత్యకు పాల్పడగా, లక్ష్మి చెప్పిన మాటలు విని కర్తవ్యం గుర్తించాడు. దాసి లక్ష్మిని నీవు ధర్మ దేవతవు, నా కర్తవ్యాన్ని గుర్తు చేశావు అని మిత్రులతో చిన వెంకట్రావు మనరాజు, ఈమె రాజమాత. వీరిని సామర్లకోటలోని మా అక్క జగ్గమాంబ రక్షణలో ఉంచండి అని చెప్పి పెద్దన్న వెంకన్నలతో మోసాన్ని మోసంతోనే అంతం చేద్దాం అని బయలుదేరాడు.

యుద్ధానంతరం చిత్తుగా తాగి మత్తులో తేలుతున్న బుస్సీ, రామరాజుల డేరాలకు వచ్చి, నిద్రిస్తున్న విజయరామరాజుపై దూకి "బొబ్బిలి పులి, తాండ్రపాపారాయుణ్ణి మోసం చేస్తావురా, నా నుంచి తప్పించుకోలేవు. కొండను గుద్ది పిండి చేస్తా. బొబ్బిలిని దుక్కి దున్నెదవా? నిన్ను చీలుస్తాను" అని కసి తీరా పొడిచి, చంపి రచ్చబండ రేవుల్లో ఆత్మాహుతి అయ్యాడు పాపారాయుడు.

పాపారాయుడు తనపై తనకు అపారమైన నమ్మకం కలవాడు. దాసి లక్ష్మిని రాజమాతగా చెప్పటం అతని ఉన్నతమైన మనస్తత్వాన్ని తెలియజేస్తుంది. కన్న వారందరూ పోయి ఒంటరిగా మారిన వాడు, పరిస్థితులను తట్టుకుని జీవించడం కష్టమని, అలాంటి వారు వివేకం కోల్పోయి కర్తవ్య హీనులౌతారని వారిని కర్తవ్యం గూర్చి బోధించి కార్యోన్ముఖులను చేస్తే ఎంతటి పరిస్థితులనైనా ఎదిరిస్తారని పాపారాయుని పాత్ర ద్వారా తెలియజేశారు కవి.

**దాసి లక్ష్మి:-** రాణి మల్లమ్మదేవి పరిచారిక. రాణి తన కుమారుడైన వెంకట్రావును లక్ష్మికి అప్పగించగా శత్రువుల నుండి తప్పించుకుని రాజాము చేరుకుని బొబ్బిలి సర్వనాశనమయింది రావు వంశ భవితవ్యం తనపై మోపి నీ అల్లుని రక్షించమన్నారు. నీవు కవచమై కాపాడమని పాపారాయునితో విలపిస్తూ చెప్పింది. నా ఆప్తుల వియోగం భరించలేనని భీరుడైన పాపయ్యకు బాధ్యతను గుర్తు చేసింది. మార్గంమధ్యలో రాజు అడ్డగించి బాలుని చంపబోగా బుస్సీ వద్దని, విడిచి పెట్టమన్నాడయ్యా ఇంత జరిగినా ఏకాకిలా బ్రతక దల్చుకుంటే నీ ఇష్టం, నేను తప్పు మాట్లాడి ఉంటే నన్ను శిక్షించండి అని వివేకంతో చెప్పింది లక్ష్మి.

తాను చేసేది దాసి వృత్తి అయినా, లక్ష్మి ఉన్నతమైన వ్యక్తిత్వం కలది. అపారమైన నమ్మకంతో రాణి మల్లమ్మ తనపై మోపిన బాధ్యతను చక్కగా నిర్వర్తించడమే గాక, కర్తవ్యాన్ని మరచిన పాపారాయునికి హితబోధ చేసి కార్యోన్ముఖునిగా తీర్చి దిద్దింది. తన ప్రాణాలను సైతం లెక్క చేయక బొబ్బిలి వంశాన్ని కాపాడి రాజమాతగా లోకమాత అయ్యింది. చివరలో పాపారాయునితో తప్పు మాట్లాడి ఉంటే శిక్షించమనడంలో రాజుల యొక్క తప్పులను ఎత్తి చూపిన సామాన్యులు శిక్షలకు గురవుతారు. అలాగే పాపయ్య తన మాటలను అహంభావంతో వేరుగా భావిస్తాడేమోనని లక్ష్మి ఉద్దేశంగా కవి చక్కగా ఈ పాత్ర ద్వారా వివరించారు.

**మల్లమ్మదేవి:-** రంగారావు భార్య. పతి సేవలో నిరంతరం సాగుతూ, అష్టైశ్వర్యాలు ఉన్ననూ సంతానం లేకపోవుటచే పూజలు, పుణ్యకార్యాలు చేస్తూ, చాలా కాలానికి ఒక కుమారుని కన్నది. ఇక్కడ స్త్రీ సహజమైన మాతృ స్వభావాన్ని తెలియజేశారు.

ధర్మయ్య రాయబారం విఫలమై యుద్ధం కొనసాగుతుండగా వెంగళరావు గాయపడ్డాడని తెలిసి, కాళ్ళ పారాణి ఆరకుండానే ఇంత ఘోరం జరిగిందని చింతించింది. పాపారావు రాకపోవటంతో చివరి యత్నంగా విజయరామరాజు వద్దకు

వెళ్ళి పతిభిక్ష కోరింది. రాజు చెప్పిన సమాధానం విన్న మల్లమ్మ నిండు కొలువులో ద్రౌపది వలువలొలిచిన కౌరవులు, సైరంధ్రిని అవమాన పర్చిన కీచకుడు, సీతమ్మను అపహరించిన రావణుడు, అనసూయను అగచాట్ల పాలుజేసిన దివ్య తేజస్సులే దగ్ధమై పోయాయి. ఎంతో మంది ఆడపడుచులు నీ మూలంగా భర్తలను కోల్పోయారు. చివరకు పారాణి ఆరకుండానే వెంగళరావు ప్రాణాలు బలిగొన్నావు. నీకు తప్పక వీళ్ళ ఉసురు తగులుతుంది అని చెప్పడంలో స్త్రీ అబలే కాదు సబల అని స్త్రీ సంబంధమైన సంఘటనల్ని, వాటి పర్యవసానాలను గుర్తు చేయడంలో ఆమె లోకజ్ఞత విదితం.

అడిగిన వారికి లేదనక దానాలు చేసిన మల్లమ్మ అభిమానాన్ని చంపుకుని విజయరామరాజు వద్దకు వెళితే తిరస్కరించాడు. అవమాన భారంతో దాసి లక్ష్మిని పిల్చి, రాబోయే ముప్పులను తలంచి "వీడు బొబ్బిలి వంశాంకురం. నీ శక్తి మేరకు వీడిని కాపాడినచో నిన్ను లోకం లోకమాత అంటుంది" అని వెంకట్రావును అప్పగించి, "అగ్నికి ఆహుతైపోతున్న అంత:పుర స్త్రీల ఆక్రందనలు వింటూ, విజయరామరాజా! ఏ గడ్డపై నీవీ ఘోరం చేశావో అదే గడ్డపై నీ బూడిద బుంగలకెత్తే వాడు జీవించే ఉన్నాడంటూ" నూనె మంటల్లో దూకి దహనమై పోయింది. ఈ సన్నివేశం ద్వారా ఆవిడ యొక్క ఆత్మాభిమానం వ్యక్తమవుతుంది.

ఈ పాత్ర ద్వారా స్త్రీత్వాన్ని కరుణ రసాత్మకంగా చిత్రించారు కవి.

**వెంగళరావు:-** రంగారావు సోదరుడు. దుందుడుకు స్వభావి. నా మాటే నెగ్గాలని పంతం పట్టే మనస్తత్వం. రంగారావుకు కొడుకు పుట్టిన ఆనంద సమయంలో వేటకు వెళ్ళాలని పట్టుబట్టి బయలుదేరాడు. అడవి పందిని వెంబడిస్తూ కోడేరు చేరగా, విజయనగర రాజ్య సరిహద్దు భటులు అడ్డగించారు. వేటాడిన జంతువు చేజారి పోయిందనే కసి, శత్రువుల అడ్డగింపు కోపాన్ని తెప్పించినా అదను కాదని వెనుతిరిగి రావడంలో అతని నిస్సహాయత వ్యక్తమవుతుంది.

కోడి పందాలకు ఆహ్వానించిన విజయరామరాజు కుయుక్తులు గమనించక ఇది బొబ్బిలి పౌరుషానికి సంబంధించిన విషయం అని మూర్ఖంగా బయలుదేరాడు.

వివాహం చేసుకుంటున్న సమయంలో రణభేరి విని ఏమిటని రంగారావును ప్రశ్నించాడు. సోదరుని మాటలు ఆసాంతం వినక కోట పైకెక్కి చూసి, వెనకే వచ్చిన అన్నతో ఆనతినివ్వన్నా, ఆ రాజు సేనలను తెగనరుకుతాను అన్నాడు. రాయబారిగా వెళ్ళి వచ్చిన ధర్మయ్య పరాభవాన్ని విని ఉగ్రుడైపోయి వెన్నిచ్చి పారిపోయి వచ్చావా!? అని ప్రశ్నించడంలో వెంగళరావు ఆవేశపరుడని విదితమవుతుంది.

విజయరామరాజు విజయ పతాకం ఎగుర వేయమన్నాడన్న వార్త విని వెంగళరావు "అన్నా! బావకు వార్త చేరలేదు, లేకున్న ఇంత ఆలస్యం జరుగదు. నేను చేతులు కట్టుకుని ఉండలేను". నీ ఆనతి తిరస్కరించానని దిగులు చెందకు. నాకు దేశ రక్షణే కర్తవ్యం అంటూ యుద్ధానికి వెళ్ళి బొబ్బిలి పౌరుషాన్ని చాటే బావుటాలా ఎగసి పడుతూ ఖాన్‌ను అడ్డంగా నరికి తీవ్ర గాయాలతో బుస్సీ, రాజుల డేరాల వైపు వెళ్ళాడంటే అతని యొక్క వీరత్వం, దేశభక్తి విశదమవుతున్నాయి.

<u>దామెర్ల ధర్మయ్య :-</u> రంగారావుకు మామ. సర్వసేనాని. పరిస్థితులకు అనుగుణంగా మసలుకునే వ్యక్తిత్వం కలవాడు. రాయబారం నెరవేర్చుటకు వెళ్ళి హఠాత్తుగా వచ్చిన ఈ ముప్పు మాకు అర్థం కాలేదు. అయినా మాది తప్పుగా భావించి క్షమించి నష్ట పరిహారం తీసుకోండి అని నేర్పుతో చెప్పాడు. అది విన్న బుస్సీ బొబ్బిలిని రాజుకు ఫర్మానాగా ఇచ్చానని చెప్పగా వచ్చిన కోపాన్ని దిగమ్రింగుకుని మీకు, మాకు శత్రుత్వం లేదు. మాకు, రాజుకు వైరం. రాజు చెప్పిన విషపు మాటలు విని ఇంత చేశావు. ఇంతసేపు నేను అభిమానాన్ని దిగమ్రింగి మాట్లాడుతున్నాను. నా ఓర్పును పరీక్షించావు. ఇక నా పరాక్రమం

చూడు. లక్ష దండు మీకున్నది. ఇరవై నాలుగు వేల దండు రాజు కున్నది. కేవలం యాభై మందితో నేను వచ్చాను. రాజ్యం వీర భోజ్యం" అందుకు సిద్ధపడితే నేను సిద్ధం అని ధీమాగా పలికాడు. స్త్రీలతో వలస పొండి అని చెప్పిన బుస్సీ మాటలకు అగ్గి పిడుగై మిమ్ము మీ బలగాన్ని చీల్చి చెండాడకపోతే నేను బొబ్బిలి గడ్డ మీదే పుట్టలేదని, ఎదురొచ్చిన రాజు సేనలను తన బృందంతో ఊచకోత కోసి బొబ్బిలి చేరుకుని రంగారావుకు విషయం తెలియజేశాడు.

లక్షా ఇరవై నాలుగువేల దండు ఎదుటి వారికి ఉందని, కేవలం యాభై మందితో మాత్రమే తానున్నానని తెలిసి కూడా వారితో యుద్ధం చేయడంలో ధర్మారాయుని పరాక్రమం, ఆత్మస్థైర్యం విశదమవుతుంది. కోపాన్ని అణచివేయడంలో రాయబారిగా వెళ్ళిన వాడు శాంతంగా ఉండాలని, అందుకే ఓర్పు వహించాడు. సహనం కోల్పోయినపుడు తన యొక్క వీరత్వం చూపకపోతే బొబ్బిలి వారి పరాక్రమాలు తెలియవనే ఉద్దేశంతో ఆ సేనల్ని ఊచకోత కోశాడు. ధర్మారాయుడిని ఆత్మాభిమానం గల మనిషిగా, రాజభక్తి, దేశభక్తిగల వ్యక్తిగా తీర్చి దిద్దారు.

<u>**విజయరామరాజు :-**</u> నిజాం నవాబుకు కప్పం చెల్లిస్తూ విజయనగరాన్ని పాలిస్తున్నాడు. మేము మీ సామంతులుగా ఉండటం బొబ్బిలి వారికి నచ్చటం లేదని నవాబుకు చాడీలు చెప్పి, రక్షణకై సేనలు కావాలని కోరి విషబీజం నాటాడు. అన్న కొడుకైన ఆనందరాజును పిల్చి నారాయణపట్నంలో పన్నులు వసూలు చేసుకుని, దారిలో ఉన్న బొబ్బిలి పంటల్ని నాశనం చేసి రమ్మని చెప్పడంలో పచ్చగా ఉన్న బొబ్బిలిని చూసి అసూయ పెంచుకున్న విషయం విదితమవుతుంది.

మంత్రి మనం చాలా సేనల్ని నష్టపోయామని చెప్పగా తృప్తిలేని బ్రాహ్మడు, తృప్తి చెందిన క్షత్రియుడు, లజ్జా శీల అయిన వేశ్య, లజ్జ లేని కుల స్త్రీలు చెడుదురని లోకోక్తి. వాలి సుగ్రీవుల యుద్ధం, కురుక్షేత్ర యుద్ధాలు అన్నీ రాజ్యం కోసం కాదా!

వీరుడెప్పుడూ జయాపజయాలను అంచనా వేసి యుద్ధ ధర్మాన్ని వీడరాదని చెప్పడంలో రామరాజుకు గల రాజ్యకాంక్ష తేట తెల్లమవుతుంది.

పన్నులు వసూలు చేసుకుని వస్తున్న మా బలగాన్ని బొబ్బిలి వాళ్ళు భయపెట్టి కాజేశారు అని నవాబుకు కబురు పంపి, రంగారావును ఎలాగైనా దెబ్బ తీయాలని కోడి పందాలు ఏర్పాటు చేసి అతనిని ఆహ్వానించాడు. పందెంలో ఓడిన కసితో ఇంకెన్నాళ్ళు మీ అదిరిపాటు, బొబ్బిలిని దుక్కి దున్నేస్తానని పలికాడు. ఇక్కడ విజయరామరాజు యొక్క కుటిల మనస్తత్వం వ్యక్తమవుతుంది.

లష్కరుతో వచ్చిన బుస్సీ రాజులందరికీ ఆహ్వానం పంపగా, బొబ్బిలి వారి ఆహ్వానం తీసుకు వెడుతున్న బౌగీరావును ఆపి, అది నేను పంపిస్తానని చెప్పి, అతణ్ని పంపి వేసి, ఆ జాబును చించి, కానుకలతో హైదరును కలసి లంచమిచ్చి వశపర్చుకున్నాడు. బుస్సీతో “కబురందగానే రావాలా? వీలు చూసుకుని వచ్చి కలుస్తామన్నారని లేని పోనివి కల్పించి చెప్పాడు. నయవంచపు మాటలతో బుస్సీ మనసులో విషబీజం నాటాడు. బొబ్బిలి పైకి రాజాము నుండి వెళితే చావు తప్పదని, దారి మార్చి మల్లమ్మ చెరువులో సేనలనుంచాడు. చివరకు యుద్ధం భయంకరంగా సాగుతుంటే అపజయం తప్పదని నల్లమందు మాటులు ఏర్పాటు చేశాడు. అలా విజయరామరాజు అసూయా ద్వేషాలు వ్యక్తమవుతాయి.

మల్లమ్మ వచ్చి పతిభిక్ష కోరగా భరణమిస్తానని చెప్పడంలో రాజ్యకాంక్షతో ఏర్పడిన తల పొగరు విదితమవుతుంది. చివరకు యుద్ధానంతరం మత్తులో నిద్రిస్తూ పాపారావు చేతుల్లో హతమయ్యాడు విజయరామరాజు.

**బుస్సీ**:- ఆంగ్లేయుడు. ఆహ్వానం పంపగా వచ్చిన రాజులందరినీ చూసి సంతసించి, కానుకలు స్వీకరించి వెలమ దొర రాలేదమని ప్రశ్నించగా, రామరాజు చెప్పిన మాటలు విని పాపారాయుడు మమ్మెదిరించగలడా!? అని అనడంలో అతని అధికార మదం విదితం.

మత్తులో మునిగి, రాయబారిగా వచ్చిన ధర్మయ్యను ఏమిటని ప్రశ్నించాడు. ధర్మయ్య మాటలు విని బొబ్బిలిని రాజుకు ఫర్మానాగా యిచ్చామన్నాడు. ఉగ్రుడైన ధర్మయ్య ఎదిరించబోగా, ఇదేనా నీ రాయబారం. మమ్ము రెచ్చగొట్టకు, మేము ఆడిన మాట తప్పం. రాజుకు ఫర్మానాగా యిచ్చిన బొబ్బిలిని విడిచి, రాజుకు అప్పగించి స్త్రీలతో వలస పొండి అని చెప్పాడు. ధర్మయ్య కోపం చూసి వణికి పోతూ రామరాజా! ధర్మారాయుని బంధించుము అని ఆజ్ఞాపించడంలో విభజించు, పాలించు అనే విధానమతనిదని వ్యక్తమౌతున్నది.

## <u>నేటి రాయలసీమ</u>

**<u>భూపతయ్య:</u>**- రాయపేట గ్రామంలో ఒక సాధారణ రైతు. ఇతనికి భార్య, వృద్ధుడైన తండ్రి, కొడుకు ఉన్నారు. రెండు ఎకరాల భూమి ఉంది. కల్లా కపటం తెలియని కష్టజీవి.

రాయపేటలో కరవు సంభవించి ప్రజలు తిండి గింజలు లేక అలమటిస్తున్నారు. భూపతయ్య ఆ ఊరి షావుకారు బ్రహ్మయ్య చేసిన మోసానికి బలయ్యాడు. కుటుంబాన్ని పోషించలేక, పుట్టి పెరిగిన ఊరిలో తలెత్తుకు తిరగలేక ఊరు విడిచి వెళ్ళాడు. ఇక్కడ అతని నిస్సహాయత విశదమవుతుంది.

ఈ పాత్ర నీతివంతంగా ఉంటూ కష్టాలను చూసి చలించే భీరువుగా ఉంటుంది. భార్యాబిడ్డలను పోషించుకోవాలనే తపనతో అధిక వడ్డీకి అప్పులు చేసి ఉన్న ఆస్తిని పోగొట్టుకుని, ఉన్న ఊరిలో తలెత్తుకు తిరగలేక, పొరుగూరిలో పని చేసుకుని కుటుంబాన్ని పోషించాలనే తాపత్రయంతో, పని దొరక్క, చిక్కి శల్యమై చివరకు బిచ్చమెత్తుకునే స్థితికి వస్తుంది. వీధుల వెంట నడవలేక నడుస్తూ అవసాన దశలో తన భార్య సీతమ్మను కలిసి అసువులు బాసిన సన్నివేశాన్ని కరుణ రసాత్మకంగా వివరించారు.

సన్నకారు రైతుల జీవితాలను, వారి సాధక, బాధకాలను వివరిస్తూ వారు అధిక వడ్డీలకు అప్పులు తెచ్చుకుని ఆస్తుల్ని పోగొట్టుకునే వైనాన్ని, కరువు సంభవిస్తే దేశ ఆర్థిక పరిస్థితి ఎలా ఉంటుందనే విషయాన్ని కవి ఎంతో సామాజిక స్పృహతో చిత్రించారు.

<u>**సీతమ్మ :-**</u> భూపతయ్య భార్య. కష్టజీవి అయిన భర్తకు అన్నిటా చేదోడు వాదోడుగా నిలుస్తుంది.

సీతమ్మ తమకు మగబిడ్డ జన్మించి, ఆవుకు కోడె దూడ పుడితే తలనీలాలిస్తామని వెంకటేశ్వరునికి మొక్కింది. రాయపేటకు వచ్చిన కరవును అనుకూలంగా చేసుకుని ఆస్తులు కాజేస్తున్న బ్రహ్మయ్య అకృత్యాన్ని ఖండించింది. భూపతయ్య ఆవును, కోడెను అమ్ముతానంటే వద్దని ఏడ్చి వాటిని కాపాడుకుంది. బ్రహ్మయ్య అప్పు క్రింద వాటిని తోలుకెళ్ళడానికి వస్తే వద్దని బ్రతిమాలింది. ఇక్కడ జానపదుల నమ్మకాన్ని, వారి ఆత్మ విశ్వాసాన్ని, హక్కుల కోసం చేసే పోరాటాన్ని కవి విశదపర్చారు.

భర్త ఊరు విడిచి వెళ్ళినా గుండె నిబ్బరంతో, ఉన్నవారిని పోషించుకుంటూ కాలం గడుపుతూ ఉంది. బ్రహ్మయ్య పెట్టిన బాధలను చూసి, ఊరు విడిచి వెళదామని మామ అనగా, పుట్టి పెరిగిన గడ్డ మీది మమకారాన్ని చంపుకుని కర్నూలు బయలుదేరారు. వేళకు తిండి లేక విశ్రాంతి లేక ముసలయ్య మరణించాడు. బిడ్డ ఆకలని ఏడుస్తుంటే కనీసం కూడు పెట్టలేని నిస్సహాయురాలై చిక్కి శల్యమై కనిపించిన భర్తను గుర్తించి అసువులు బాసింది.

ఈ పాత్రను ముందు సామాన్య గృహిణిగా చూపిస్తూ జంతువుల పట్ల ఆమె చూపిన ప్రేమానురాగాలను, జీవకారుణ్యం గూర్చి తెలియజేస్తూ, పుట్టి పెరిగిన గడ్డ మీద మమకారమనేది ప్రతి వ్యక్తిలో ఉండాలని కవి అంతర్గతంగా తెలియజేశారు.

అంతేకాకుండా స్వార్థం కోసం గద్దె నెక్కే రాజకీయ నాయకులారా ఇటు చూడండి. ఆకలి చావులతో, నీతి నియమాలు వదల్లేని జనం ఎటూ తేల్చుకోలేని సమస్యలతో సతమతమౌతున్న ప్రజలను ఆదుకోండి అంటూ ఈ పాత్ర ద్వారా సూచించారు కవి.

<u>**బ్రహ్మయ్య:-**</u> రాయపేట గ్రామంలో షావుకారు, వడ్డీ వ్యాపారం ఇతని వృత్తి. రాయపేటకు కరవు సంభవించి కూడు లేక అలమటిస్తున్న పేద ప్రజలకు అధిక వడ్డీలపై అప్పులిచ్చి వారి ఆస్తుల్ని స్వాధీన పర్చుకున్న కసాయి వాడు.

అప్పులిచ్చి పేద వాళ్ళని కోలుకోనీయక, వడ్డీకి వడ్డీ కట్టి చివరకు పుస్తెలతో సహా ఆస్తుల్ని కాజేసి పేదల రక్తాన్ని వడ్డీ రూపంలో పీల్చే జలగ. కూలీలతో పని చేయించుకుని కూలి ఇవ్వడు. అలాంటి బ్రహ్మయ్య వీధిలోకి వస్తుంటే ఆడవాళ్ళు బ్రహ్మరాక్షసునిగా తలచి అతని కంటపడరు.

కరవు పనులు చేయ తలపెట్టిన ప్రభుత్వాన్ని కల్లబొల్లి మాటలతో నమ్మించి, లంచమిచ్చి లొంగదీసి రోడ్డు పనులు చేపట్టాడు. కూలీల వద్ద ఖర్చులని చెప్పి కొంత కూలీ మినహాయించుకునే వాడు.

బ్రహ్మయ్య లాంటి వ్యక్తులు నిజ జీవితంలో మనకు ఎందరో ఎదురౌతారు. కరవు పరిస్థితులను తమకనుకూలంగా మార్చుకుని జనాన్ని పీడించే స్వార్థపరులు మరెందరో. వీరంతా సామాన్యుని రక్తం పీల్చే జలగలు. అణిగి, మణిగి ఉంటే నెత్తికెక్కి తాండవమాడే ప్రబుద్ధులు. వీరందరి స్వార్థానికి ఎన్నాళ్ళిలా బలౌతారు. ఇలాంటి వాళ్ళను ఎదిరించి పోరాడండి. అప్పుడే సామాన్యుని జీవితానికి మనుగడ లభిస్తుందని అంతర్లీనంగా చెప్తూ ఈ పాత్ర ద్వారా లోకంలో ఉన్న దుష్టత్వాన్ని పట్టి చూపుతూ ఇలాంటి వాళ్ళను తరిమి కొట్టమంటూ కవి సందేశమిచ్చారు.

# అల్లూరి శ్రీరామరాజు యుద్ధం

**రామరాజు**:- విద్యనభ్యసించ వలసిన వయసులో బుద్ధి వికాసం కలిగిన రామరాజు ఆంగ్లేయులు ప్రవేశ పెట్టిన విద్యా విధానాన్ని నిరసించి సాముగరిడీలు, విలువిద్య, చిత్రకళలపై ఆసక్తి పెంచుకుని వాటిని అభ్యసించాడు.

గాంధీగారి ఉద్యమంచే ప్రభావితమైన రామరాజు స్వాతంత్రోద్యమంలో చేరి, శాంతియుతంగా స్వాతంత్ర్యం సాధించలేమని, పోరాటం ద్వారానే సాధించగలమని జనాన్ని సాయుధ పోరాటం వైపు ఉద్యమింప జేశాడు. ఈ ఉద్యమంలో 'గాం' సోదరులను తన అనుయాయులుగా చేర్చుకున్నాడు. మన్య ప్రజలు రామరాజు మాటల్ని పట్టించుకోక పోయినా నిరాశ చెందక, వారిలో ఒకడిగా కలిసి పోయి చేదోడు వాదోడుగా ఉంటూ తన జీవితం త్యాగం చేసిన త్యాగరాజు రామరాజు.

బాస్టియన్ దురాగతాలను ఎదిరించి నిలదీశాడు. అందుకు బాస్టియన్ మన్యాన్ని రాజుకు ఫర్మానాగా రాసిస్తానన్నా వినకుండా ప్రజలకిస్తే మంచి జరుగుతుందని చెప్పాడు. కష్టజీవులను దోపిడీ చేస్తున్న మీ ప్రభుత్వమెందుకని, వెంటనే ప్రజా రక్షణ చట్టాలను చేయాలని ఎదురు తిరిగిన వీరుడు. అందుకు బాస్టియన్ రామరాజును ఖైదు చేయించాడు. కళ్ళ ముందు జరిగే అన్యాయాన్ని ఎదిరించటంలో రామరాజు యొక్క సాహసం విదితమవుతుంది.

జలియన్ వాలాబాగ్ వంటి సంఘటనలు రామరాజును తిరగబడేలా చేశాయి. పోలీసు స్టేషన్లపై దాడులు జరిపి ఆయుధాలను సేకరించాడు. లార్డ్ వెల్లింగ్‌టన్ రాజు ధాటికి తట్టుకోలేక 'విభజించు-పాలించు' అనే ఆంగ్లేయుల సూక్తిననుసరించి రాజును ఒంటరివాణ్ణి చేసి గుడాల్‌చే చంపించాడు. తాను నమ్మిన సిద్ధాంతం కోసం ప్రాణాలర్పించిన అమరజీవి రామరాజు.

ఆంగ్లేయుల విద్యా విధానం మనిషి మనుగడకు సరిపడదని, అలాంటి విద్య వలన ప్రయోజనం లేదని సాయుధ పోరాటం వైపు పయనించి దేశ సౌభాగ్యాన్ని రక్షించుకోవాలనే తాపత్రయం అనువణువునా కలిగిన నిస్వార్థపరుడైన దేశభక్తి గల రామరాజును ఆదర్శంగా తీసుకుని, అన్యాయాన్ని, దుర్మార్గాన్ని ఎదిరించి పోరాడమని కవి యువతకు సందేశాన్ని తెలియజేశారు.

**గాం గంటం**:- గంటం దొర మన్య ప్రాంతంలోని గూడెం అనే పల్లెకు మునసబు. రాజుకు ప్రథమ అనుయాయి. తెగింపు, చొరవ కలిగిన ఆదర్శవంతుడు. రామరాజు మాటల్ని వేదంగా భావించే వ్యక్తి. ఉద్యమంలో కొనసాగుతున్నాడు. మంచి యుద్ధ వ్యూహ నిపుణుడు.

ఈ పాత్ర ద్వారా పదవిపోయినా తాను నమ్మిన సిద్ధాంతాల కోసం ప్రాణ త్యాగానికైనా వెనకాడకూడదని తెలియజేశారు కవి.

**గాం మల్లు**:- మల్లు దొర గంటం దొరకు సోదరుడు. రాజుకు మరో ముఖ్యమైన అనుచరుడు. మద్యం సేవించడం ఇతనికున్న దురలవాటు. ఉద్యమంలో పాలు పంచుకుంటున్నాడని ఇతని కున్న రిజర్వు భూములను బాస్టియన్ స్వాధీన పర్చుకున్నాడు. అయినా అధైర్యపడక ఉద్యమ స్ఫూర్తితో రాజునను సరిస్తున్నాడు. ఇతని చేతిలో 'కవర్డు' అనే సైన్యాధిపతి మరణించాడు. చివరకు తనకున్న దురలవాటు వలన తన ప్రాణాలకు ముప్పు వాటిల్లినా ఉద్యమ రహస్యాలను ఆంగ్లేయులకు తెలియజేయని ధీశాలి.

ఉద్యమకారులకు దురలవాట్ల వలన ఎలాంటి పరిస్థితులు ఏర్పడతాయో వివరిస్తూ వాటి వలన జరిగే నష్టాలను తెలియజేసి, దురలవాట్లను వదిలేస్తే ఉద్యమం బాగా కొనసాగుతుందని కవి ఈ పాత్ర ద్వారా తెలియజేశారు. వ్యక్తిగత

బలహీనతల వలన ఉద్యమానికి ముప్పు వాటిల్లుతుందని కవి హెచ్చరించారు.

**నారాయణమ్మ**:- రామరాజు తల్లి. ఖైదులో ఉన్న రాజు వద్దకు వచ్చి, కడుపు తీపితో ఈ ఉద్యమం నీకు కూడు పెట్టదని, 'డబ్బుకు లోకం దాసోహం' అంటుంది. అందుకే నీవు ఉద్యమాలు మాని పెద్దల వలె ఒక ఉద్యోగం చూసుకుని కుటుంబాన్ని పోషించమని హితబోధ చేసింది.

తల్లిదండ్రులు పెద్ద కుమారునిపై సహజంగా ఎలాంటి ప్రేమానురాగాలను కలిగి ఉంటారో వారి భవిష్యత్తును గూర్చి ఎలా ఆలోచిస్తారనే విషయాన్ని, తల్లి తనయునితో కుటుంబ బాధ్యతను స్వీకరించు అని చెప్పడంలో కుటుంబ వ్యవస్థ, బంధంలను గూర్చి ఈ పాత్ర ద్వారా కవి మనకు విశదపర్చారు.

**బాస్టియన్** :- మన్య ప్రాంతానికి తహసీల్దార్ ప్రజలతో పనులు చేయించుకుని కూలీ సరిగా ఇవ్వడు. ఇదేమిటని ప్రశ్నించిన వారిని హింసించటం ఇతని ప్రవృత్తి. ఆంగ్లేయులతో చేతులు కలిపిన భారతీయులు చెప్పిన మాటలు విని, వారి వద్ద లంచాలు పుచ్చుకుని మన్య ప్రాంతంలో మునసబు అయిన గంటం దొరను పదవి నుంచి తొలగించి, మల్లు దొర రిజర్వు భూములను స్వాధీనం చేసుకుని తనకు తొత్తులైన వారికిచ్చాడు. ఆవేశం కలిగి, ఆలోచన లేని మనిషి.

అధికారం ఉందని ఇష్టం వచ్చినట్లు ప్రవర్తించేవాడు. రామరాజు చెప్పే నీతి వాక్యాలు వినక ఆవేశంతో రాజునే ఖైదు చేయించాడు. వెనుకా ముందు ఆలోచించక తీర్పులివ్వటం ఇతని విధానం.

కవి ఈ పాత్ర ద్వారా ఎంతటి పెద్ద పదవిలో ఉన్నా, ఆలోచన లేని కార్యం అర్థరహితమని, దాని వలన మంచి కన్నా చెడు ఎక్కువగా జరుగుతుందని, ఆలోచించి ఏ పనైనా చేయాలనే సందేశం తెలియజేశారు.

**వీరయ్య**:- విప్లవకారుడు, తుపాకి ప్రయోగించడంలో మంచి నేర్పరి.

ఉద్యమంలో తుపాకి దండుకు నాయకుడు. మన్యం ప్రాంతానికి కొత్తగా వస్తున్న ట్రేమన్‌హేర్ నాయకత్వంలోని సైన్యాన్ని వీరోచితంగా ఎదుర్కొని ముప్పు తిప్పలు పెట్టిన వీరుడు.

**రామకృష్ణంరాజు** :- రామరాజుకు పినతండ్రి. కలెక్టర్. రామరాజును చదువు నిమిత్తం తుని మహారాజా వారి స్కూల్లో చేర్పించాడు. బాస్టియన్‌కు స్నేహితుడు.

**అగ్గిరాజు** :- రాజుకు ఆప్తమిత్రుడు. మంచి విలు విద్యా నిపుణుడు. మిరపకాయ టపా ద్వారా రాజునకు వార్తలు చేరవేసి ఉద్యమానికి ఊపిరి పోశాడు. ఇతని అసలు పేరు వేగిరాజు సత్యనారాయణ.

## అభిమన్యు యుద్ధం

**అర్జునుడు**:- పాండవ మధ్యముడు. మాయా జూదంలో ఓటమి పాలయిన పాండవులు పందెం ప్రకారం పన్నెండేండ్ల అరణ్యవాసము, ఒక ఏడాది అరణ్యవాసం అనంతరం అజ్ఞాత వాసమునకు బయలు దేరుతూ సుభద్రను పుట్టింట వదలిన అర్జునుడు మన బిడ్డను కంటికి రెప్పలా కాపాడుము నీకిక్కడ ఏ లోటు ఉండదనటంలో బిడ్డల యెడ తండ్రి యొక్క బాధ్యతను, భార్యపై గల మమతానురాగాలను పాండవ మధ్యముని వ్యథా పూరిత మనస్తత్వం ద్వారా తెలియజేశారు కవి.

అర్జునుడు ద్రోణుడి ప్రియశిష్యుడు. అస్త్ర, శస్త్ర విద్యలలో ఆరితేరినవాడు. గాండీవం చేబూని యుద్ధం చేస్తే ఎదురు నిలువగల ధీశాలి లేడని ప్రతీతి. అయినా పెద్దల యెడ గౌరవభావం కలవాడు. కనుకనే ధర్మజుని మాటకు ఎదురు చెప్పక అరణ్య, అజ్ఞాత వాసములకు సిద్ధమయ్యాడు. లక్ష్యాన్ని సాధించుటలో అతనికతనే సాటి.

కవి అర్జునుని గురుభక్తి, సోదర భక్తితో పాటు విద్య, వినయం కలిగినటువంటి విజ్ఞానవేత్తగా, వీరునిగా తీర్చిదిద్దారు. అరణ్య, అజ్ఞాత వాసముల అనంతరం సుభద్రార్జునుల పునస్సమాగ సమయంలో వియోగ వ్యథను మర్చిపోయి ఉత్తర నీకు కోడలు కాగలదు అని చెప్పడంలో అర్జునుని సరసునిగా చిత్రించారు. అభిమన్యుని చావుకు కారణమైన సైంధవుడిని సూర్యాస్తమయంలోగా సంహరిస్తానని ప్రతిన చేసి, కృష్ణుని సాయంతో సంహరించాడు.

<u>**సుభద్ర**</u>:- పాండవ మధ్యముని భార్య. శ్రీకృష్ణుని ముద్దుల చెల్లెలు. అర్జునునికి అన్ని విధాల అనుకూలమైన ఇల్లాలు. ఎన్ని కష్టాల్లో ఉన్నా సత్యాన్ని మరువకూడదని అభిమన్యునికి బోధించుటలో ఆవిడ మనసు తేట తెల్లమవుతుంది.

పుట్టింట ఉంటున్న సుభద్ర 'పుట్టింట్లో ఉండటం కన్న నరకం మరొకటి లేదని' భావిస్తూ, ఈ స్థితిని కల్పించిన బ్రహ్మను నిందించుచూ మతి లేనివాడుగా భావించడంలో సుభద్రను ఆత్మాభిమానం గల స్త్రీగా చిత్రించారు కవి.

విరాటుని కొలువులో పాండవులు సురక్షితంగా ఉన్నారని తెలిసి సుభద్ర, అభిమన్యుడు విరాట నగరం చేరుకున్నారు. పునస్సమాగంలో వియోగ వ్యథను మరచి సరసంగా ఉత్తర నీకు కోడలు కాగలదు అని అర్జునుడు పలికితే, నా కోడలు మీ కోడలు కాదా అని సుభద్ర చమత్కరించుటలో సరసురాలని కవి తెలిపారు.

కురుక్షేత్ర సంగ్రామంలో పన్నిన పద్మవ్యూహాన్ని ఛేదిస్తానని అభిమన్యుడు దీవించమని అడిగినపుడు సుభద్ర, నీవా చిన్నవాడివి, మీ తండ్రి లేని సమయాన యుద్ధ రంగానికి పంపలేను అని భయపడుటలో తనయుని కోసం తల్లడిల్లే మాతృ హృదయం గూర్చి తెలియజేస్తూ దీవించి పంపుటలో సుభద్రను వీరపత్నిగానే కాకుండా వీరమాతగా కూడా చిత్రించారు కవి.

**అభిమన్యుడు**:- సుభద్రార్జునుల తనయుడు. అస్త్ర, శస్త్ర విద్యలలో ఆరితేరినవాడు. కృష్ణార్జునులు సంశప్తకులపై యుద్ధానికి వెళ్ళిన సమయంలో ద్రోణుడు పద్మవ్యూహం పన్నాడని తెలుసుకున్న అభిమన్యుడు ధర్మజాదులతో నేను ఛేదిస్తాను కాని లోనికి వెళ్ళడమే తెలుసు అని యుద్ధానికి సిద్ధమై వెళ్ళుటలో అభిమన్యు బల పరాక్రమాలు, దేశభక్తి విదితమవుతుంది.

తల్లి దీవెనలందుకొనుటకు వెళ్ళిన అభిమన్యుని యుద్ధానికి వెళ్ళొద్దని సుభద్ర అంటే, అమ్మా! చావు మనిషిని వెన్నంటే ఉంటుంది కదా! అంటూ క్షత్రియ ధర్మం గూర్చి చెప్పి తల్లిని ఒప్పించడంలో అభిమన్యుని ఆత్మస్థైర్యం కలిగిన ఉత్తముడిగా చిత్రించారు కవి.

ఉత్తర వద్దకు వెళ్ళి ఆనందంగా ముద్దాడబోగా మందలిస్తుంది. అందుకు అభిమన్యుడు నీవు తల్లివి కాబోతున్నావని అమ్మ చెప్పింది. ఇలా సంతోషాన్ని పంచుకుందామని వచ్చాను. కామినై భూమికి బరువు అవుతాననుకున్నావా అని అనటంలో అభిమన్యుని సంతోషం గూర్చి తెలియజేస్తూ, నేను కర్తవ్య హీనుణ్ణి కాలేదని చెప్పటం గొప్పగా వర్ణించారు కవి. మన పుత్రుని వంశ గౌరవం పెంపొందించేలా పోషించమని చెప్పుటలో ప్రతి తండ్రి తమ సంతానం గూర్చి కనే కలలు, అవి నెరవేరాలనే ఆరాటం గూర్చి తెలిపారు కవి.

పద్మవ్యూహ ఛేదనలో ద్రోణుడు తలపడగా మాటకు మాట జవాబిచ్చి ద్రోణుడ్ని పరాజితుడ్ని చేసి లోనికి జొరబడ్డాడు. దుశ్శాసనుడు ఎదురై 'గోలీలాట కాదిది' అని హెచ్చరించడంతో 'అబలల జుట్టు పట్టి ఈడ్చుట కాద'ని జవాబిచ్చి మూర్ఛిల్లజేసి చంపుటకు సిద్ధం కాగా భీమ ప్రతిన గుర్తుకు వచ్చి వదిలేశాడు. అనంతరం సుయోధనుడు ఎదురుకాగా, "కురురాజా ఇన్ని ఇడుములకు కారణం నీవు" అంటూ శరపరంపరలచే ఎదిర్చి చంప సిద్ధం కాగా వాయు నందనుని ప్రతిజ్ఞ గుర్తు వచ్చి "ఏకాకిలా బ్రతకమ"ని వదిలివేయటంలో అభిమన్యుడు క్రోధంలో

కూడా పెద్దలు చేసిన ప్రతినలు గుర్తెరిగి వదిలేశాడు. పెద్దలను గౌరవించవలెనన్న నియమంతో వచ్చిన అవకాశాన్ని జారవిడిచి పెద్దలపై గల గౌరవభావాన్ని చాటుకున్నాడు. అదే సమయంలో తప్పు చేసిన వారిని నిలదీయమని అభిమన్యుని పాత్ర చిత్రణ ద్వారా తెలియజేశారు కవి.

కురుసైన్యంలోని పెద్దలందరూ కలిసి అధర్మయుద్ధం చేయనెంచి ఒంటరి వాడైన అభిమన్యునిపై విరుచుకు పడినా ఆత్మస్థైర్యం చెక్కు చెదరక ముప్పు తిప్పలు పెట్టాడు. చివరకు యుద్ధ నీతిని తప్పిన పెద్దల చేతుల్లో హతమయ్యాడు. దీని ద్వారా కవి నేటి యువతకు దేశభక్తి కలిగి ఉండాలని, పోరాట పటిమను పెంచుకోవాలని చక్కని సందేశమిచ్చారు.

**<u>ఉత్తర</u>**:- విరాటరాజు పుత్రిక. అభిమన్యుని భార్య. పద్మవ్యూహం గూర్చి విన్న అభిమన్యుడు యుద్ధానికి వెళుతూ ఉత్తరతో సరసమాడబోగా "రణరంగంలో రక్తం ఏరులై పారుతుండ మీకిది తగునా అంటూ మందలించి, యుద్ధం చేసి విజయుడవై రమ్ము, యుద్ధంలో వెన్ను చూపిన వారిని సంహరించకండి. చేయెత్తి వేడుకున్న వారిని చంపకుండా వీరుని వలె మీ శౌర్యాన్ని ప్రదర్శించండి" అంటూ రాజనీతిని తెల్పి సమరోత్సాహాన్ని కల్గించింది. అభిమన్యుని యుద్ధ సన్నద్ధున్ని చేసి పంపించుటలో వీరపత్నిగా తీర్చి దిద్దారు కవి. ఇక్కడ కవి ఉత్తరను రాజనీతి తెలిసిన వనితగా, తన వంతు కర్తవ్యాన్ని నెరవేర్చే ఇల్లాలిగా, తన బాధ్యతను విస్మరించని మాతృమూర్తిగా ఈ పాత్రకు రూపకల్పన చేశారు.

**<u>ధర్మరాజు</u>**:- పాండవాగ్రజుడు. రాజనీతి కోవిదుడు. శాంత స్వభావి. ఇతనికున్న దురలవాటు పాచికలాట. ఈ వ్యసనం వలన తన సోదరులను, తన్ను తాను, పాంచాలిని ఫణంగా పెట్టి మాయాద్యూతంలో ఓడిపోయాడు. పందెం ప్రకారం అరణ్య, అజ్ఞాత వాసాలకు వెళ్ళారు.

కురుక్షేత్ర సంగ్రామంలో అర్జునుడు లేని సమయాన ద్రోణుడు పద్మవ్యూహం పన్నాడని చింతించుచున్న ధర్మజాదులతో అభిమన్యుడు నేను ఛేదిస్తానన్నాడు. ధర్మరాజు సందేహించాడు. వెనుకా ముందు ఆలోచించి నిర్ణయం తీసుకునే స్వభావి కనుకనే పద్మవ్యూహం గూర్చి పూర్తిగా తెలియని అభిమన్యుని యుద్ధానికి తీసుకెళ్ళటం సమంజసం కాదని భావించాడు. ఇక్కడ ధర్మజుని ఆలోచనా సరళిని గూర్చి కవి ఉన్నతంగా తెలిపారు.

అభిమన్యుడు మరణించాడన్న వార్త విన్న ధర్మజుడు ఈ వార్తను అతని తల్లిదండ్రులకు ఎలా తెలియజేయాలని, ఉత్తరకు ఏమని సమాధానం ఇవ్వాలో తెలియక మదనపడడంలో జరిగిన అనర్థానికి బాధ్యత ఉందని, అందుకే సమాధానం ఎలా చెప్పాలో అని చింతించడంలో ఎవరైనా సరే తప్పు చేస్తే అందుకు సరయిన సమాధానం చెప్పి క్షమాపణ కోరాలని ఈ పాత్ర ద్వారా తెలియజేశారు కవి.

<u>**భీముడు**</u>:- పాండవులలో రెండవ వాడు. బాహు బల సంపన్నుడు. వాయుపుత్రుడని పేరు కలవాడు. ఇతనికున్న అలవాటు అతి తిండి. మంచి పాకశాస్త్ర ప్రవీణుడు.

కురుక్షేత్ర సమర సమయంలో అభిమన్యుడు పద్మవ్యూహం లోనికి వెళ్ళుట మాత్రమే తెలుసు అని అంటే, నీ వెంట నేనుంటాను అని అభయమిచ్చి యుద్ధానికి సన్నద్ధం చేశాడు.

<u>**నకుల సహదేవులు**</u>:- పాండవులలో చివరివారు. అశ్వ శాస్త్ర ప్రవీణులు. ఖడ్గయుద్ధంలో ఆరితేరినవారు. పెద్దల మాటలకు విలువ ఇచ్చేవారు.

<u>**ఘటోత్కచుడు**</u>:- భీముని కుమారుడు. పద్మవ్యూహ ఛేదనలో అభిమన్యునికి అండగా, అగ్నికి వాయువు తోడైనట్లు నిలిచాడు.

<u>**భీష్ముడు**</u>:- కురు, పాండవులకు తాత. కురుక్షేత్ర యుద్ధంలో కౌరవుల పక్షాన యుద్ధం

చేసి అంపశయ్యపై ఉన్నాడు.

**పాంచాలి**:- ద్రుపదుని పుత్రిక. ద్రౌపది అను పేరు కలదు. పాండవులయిదుగురికి భార్య. మాయాద్యూతంలో ధర్మజుడు ఈమెను పణంగా పెట్టాడు. దుశ్శాసనుడు ఈవిడను జుట్టు పట్టి సభ కీడ్చి అవమానపర్చగా ప్రతీకార జ్వాలతో రగిలిపోతుంది.

**ద్రోణుడు**:- కురు పాండవులకు అస్త్ర శస్త్ర విద్యాబుద్ధులు నేర్పిన గురువు. కురుక్షేత్రంలో ధర్మజాదులను బంధించటానికి పద్మవ్యూహం పన్నాడు. మొదటి వరుసలో ధర్మజుని బంధించుటకు నిలువగా అభిమన్యుడు ఎదుర్కొన్నాడు. అమిత క్రోధంతో వస్తున్న అభిమన్యుని 'భామల కౌగిలి కాదు యుద్ధం' అని ఎగతాళి చేశాడు. అభిమన్యుని ధాటికి తట్టుకోలేక యుద్ధరంగం నుంచి పక్కకు తప్పుకున్నాడు. అభిమన్యుని ఓడించాలంటే అధర్మం అనకుండా అందరూ ఒకటై హతమార్చాలని నిర్దేశించాడు.

**సుయోధనుడు**:- దృతరాష్ట్రుని ప్రథమ కుమారుడు. పాచికలాట ఇతనికున్న అలవాటు. పాండవులపై కక్ష గట్టి ఎలాగైనా రాజ్యహీనుల్ని చేయాలని ఎంచి కుటిలోపాయంతో మాయాద్యూతంలో ఓడించి అడవులకు పంపించాడు.

కురుక్షేత్ర సంగ్రామానికి నాంది పలికిన అధికార లాలస, పద్మవ్యూహ ఛేదనలో ఎదురుపడిన అభిమన్యుడు బాలుడని కూడా ఆలోచించక అధర్మంగా సంహరించడానికి సహకరించాడు.

**దుశ్శాసనుడు**:- దృతరాష్ట్రుని మరో పుత్రుడు. అమితమైన అహంకారంతో పేరుకు తగినట్లుగానే ప్రవర్తించేవాడు. అగ్రజుని భార్య తల్లితో సమానమని భావిస్తున్న ఈ భరతఖండంలో పురాణాలు ఘోషిస్తున్నా, సభా మర్యాద, నీతి విడనాడి పాంచాలిని నిండు కొలువుకీడ్చి అవమానించాడు. పద్మవ్యూహంలో అభిమన్యుని 'గోలీలాట కాదిది' అని ఎగతాళి చేసి, అతని ధాటికి తట్టుకోలేక మూర్ఛబోయాడు.

**కర్ణుడు**:- అంగరాజ్యాధిపతి. సుయోధనునికి మంచి మిత్రుడు. దాన కర్ణుడు అని ప్రతీతి. పద్మవ్యూహంలో అభిమన్యుని అన్యాయంగా చంపటం ఇష్టం లేకపోయినా, మనసు చంపుకుని మిత్రునికిచ్చిన మాటను నిలుపుకోవటానికి అభిమన్యుని ధనస్సు త్రుంచి సహకరించాడు. స్నేహం కోసం ప్రాణాలర్పించే స్వభావం కలవాడు.

**శకుని**:- కురు, పాండవులకు మామ. పాచికలాటలో అందె వేసిన చేయి. కురుపక్షపాతి. కురుక్షేత్రం జరగడానికి పరోక్ష కారకుడు.

**శల్యుడు**:- కర్ణుని రథసారథి. సూటిపోటి మాటలతో కర్ణుని హింసించిన వాడు. పద్మవ్యూహంలో అభిమన్యుని గుర్రాలను కూల్చాడు.

**సైంధవుడు**:- పాండవులను తన చేతుల్లో బందీలు కావాలని తపస్సు చేసి వరం సాధించాడు. ఆ ప్రభావంతో పద్మవ్యూహంతో ధర్మజాదులను బంధించినవాడు. సూర్యాస్తమయంలోగా పట్టి సంహరిస్తానన్న అర్జునునికి భయపడి పారిపోయాడు. కృష్ణుని మాయోపాయం తెలియక అర్జునుని చేతిలో అంతమయ్యాడు.

## పల్నాటి యుద్ధం

**అనుగురాజు**:- పల్నాడు రాజ్యాధినేత. ప్రజలకు ఏ ఇక్కట్లు కలుగకుండా పరిపాలించాడు. ఇతని కుమారులు నలగామరాజు, నరసింగరాజు, మలిదేవుడు.

**నలగామరాజు**:- అనుగురాజు ప్రథమ పుత్రుడు. తండ్రి మరణానంతరం పిన్న వయసులోనే రాజ్య పట్టాభిషిక్తుడైనాడు. నాగమ్మ కుయుక్తులు గమనించి బ్రహ్మనాయునికి మనశ్శాంతి లేకుండా చేయడం నచ్చక మలిదేవాదులను పిల్చి 'రెండు కత్తులు ఒక ఒరలో ఇమడవ'ని, మన వంశ రక్షకుడు, తండ్రి వంటివాడు అయిన బ్రహ్మయ్య నేతృత్వంలో మాచర్లను ఏలుకొమ్మని చెప్పాడు. నాగమ్మ

ఒత్తిడులకు తట్టుకోలేక, క్రుంగిపోయి కొంతమేర స్వతంత్రమిచ్చాడు. ఇక్కడ రాజు అసహాయత వ్యక్తమవుతుంది.

అలరాజు సన్యసిస్తానని చెప్పి వెళ్ళగా కన్న తండ్రి కంటే మిన్న అయిన బ్రహ్మయ్య దూరమయ్యాడు. కూతురి భర్త అయిన అలరాజు పెళ్ళి ముచ్చట కూడా తీరకుండానే అలిగి తొలగిపోయాడు. కొండంత అశతో ఎదురుచూస్తున్న కూతురితో ఏమని సమాధానం చెప్పాలని కుమిలిపోయాడు. దీని ద్వారా నలగాముని ఆలోచనా విధానం, ముందు చూపు విశదపర్చారు కవి.

**<u>బ్రహ్మనాయుడు</u>**:- అనుగురాజు సంస్థానంలో ప్రధానమంత్రి. రాజు మరణానంతరం పిన్న వయస్కుడైన నలగాముని పట్టాభిషిక్తుని చేసి, సర్వమానవ సమానత్వాన్ని చాటుతూ ముందడుగు వేస్తున్న సంఘ సంస్కర్త. అసమ్మతి వర్గాన్ని రెచ్చగొడుతున్న నాగమ్మకు రెండవ మంత్రి పదవినిచ్చి, ప్రాణాంతక పరిణామాలను ఎదుర్కొనక తప్పదని భావించుటలో బ్రహ్మయ్య ముందు చూపు విశదమవుతుంది.
కోడిపందాల సందర్భంలో నాగమ్మ పంపించిన జాబును చూసి ఇది "నలగాముని ఆలోచన కాదు. నాగమ్మ దురాలోచన, కనుక మనం వెళ్ళరాదు" అని చెప్పాడు. కడసారి పందెమని రెచ్చగొట్టిన వారి మాటలు వినవద్దని మలిదేవాదులను వారించాడు. పందెంలో ఓడిపోయిన మలిదేవులను చూసి నాగమ్మ బ్రహ్మయ్యతో అన్న మాటలకు తీవ్రంగా కుమిలిపోయాడు. తాను ఊహించినంతా జరిగిందని బాధపడ్డాడు.

పందెం ప్రకారం ఏడేండ్లు గడిపి అలరాజును రాయబారం పంపించాడు బ్రహ్మయ్య.

అలరాజును సంహరించిన విషయం తెలిసి రాయబారిని చంపటం రాజనీతి కాదని సమరశంఖం పూరించి యుద్ధ సన్నద్ధుడై కార్యంపూడికి

బయలుదేరారు. ఇక్కడ సహనం నశించిన బ్రహ్మయ్య ఆవేశం వ్యక్తమవుతుంది.

యుద్ధంలో సంభవించిన జననష్టాన్ని చూసి నాగమ్మతో "నీ అధికార దాహంతో అన్న దమ్ముల మధ్య పోరుపెట్టి శవాలను చేశావు. నీ కోరిక తీరిందా! కట్టుకో ఈ శవాల గుట్టపై నీ పట్టం. ఏలుకో ఈ మరుభూమిని ఏకచ్ఛత్రంగా" అని ఆవేశంగా పలికి గుత్తికొండ బిలం వైపు వెళ్ళాడు.

నేడు మన వ్యవస్థను పట్టి పీడిస్తున్న వర్ణ వివక్ష అనే పిశాచిని నిర్మూలించాలని, సర్వమానవ సమానత్వాన్ని చాటుతూ కలసికట్టుగా జీవిస్తే సమాజం పురోగమిస్తుందని తెలియజేస్తూ, న్యాయాన్యాయాలను సరయిన ధృక్పథంతో నిర్ణయించాలని అప్పుడే ధర్మం రక్షించబడుతుందని బ్రహ్మనాయుని పాత్ర ద్వారా తెలియజేశారు కవి.

**నాగమ్మ**:- నలగామరాజు ఆస్థానంలో కుటిలోపాయంతో మంత్రి పదవి చేపట్టింది. అన్నదమ్ముల మధ్య విభేదాలు సృష్టించి వేరు చేసింది. నరసింగరాజుతో "మీ అన్నకు పుత్రులు లేరు. అతని అల్లుడైన అలరాజు రాజవుతాడు. కాబట్టి నీ పరిస్థితి ఆలోచించుకోమ"ని చెప్పి స్వార్థాన్ని పెంచింది. బ్రహ్మయ్య చేపట్టిన సిద్ధాంతాలు నచ్చక విచక్షణా రహితంగా విభేదిస్తూ, నలగాముడు వ్రాయించినట్లు జాబు వ్రాయించి కోడి పందాలు ఏర్పాటు చేసింది. అలా నాగమ్మ కుటిల మనస్తత్వం విశదమవుతుంది.

కోడి పందాలు జరుగుతున్న సందర్భంలో నలగాముడు చివరిసారి పందెమని చెప్పగా గురజాల పుంజు పారిపొయి, మాచర్ల పుంజు పోరాడి ప్రాణం విడువగా అదను చూసి ఢక్క మ్రోగించి విజయం మాదేనంది. బ్రహ్మయ్యతో పరువు ప్రతిష్ఠ అని ఆలోచించక మాచర్లను ఏలుకోండి, యింకెప్పుడూ మాతో పెట్టుకోకండి అని పొగరుగా చెప్పింది. పందెం ప్రకారం మలిదేవులు, బ్రహ్మయ్య

అడవిలో జీవిస్తుంటే గిరిజనులతో దాడులు జరిపించి వారికి ప్రశాంతత లేకుండా చేసింది. ఇక్కడ బ్రహ్మాయ్యపై గల అసూయాద్వేషాలు వెలిగ్రక్కింది.

గడువు తీరిన పిదప అలరాజు రాయబారిగా వచ్చి బ్రహ్మాయ్య సందేశం వినిపించగా 'రాజ్య విచ్ఛిన్నం శత్రువులకు మంచి అవకాశం. కాబట్టి రాజ్యాన్ని ముక్కలు చేయమ'ని అంటూ 'రాజ్యం వీర భోజ్యం' కాబట్టి, మీ మామ ఎంతో కాలం జీవించడు. ఆ తరువాత నీవే రాజువు. మనమంతా ఐకమత్యంగా ఉండాలని ఆశ చూపింది. అలరాజు వెళ్ళిన తరువాత నరసింగరాజుతో మీ అన్నకు ముద్దుల అల్లుడు కాబట్టి తన తరువాత అతనే రాజు. వేరే ఆలోచించక అతన్ని హతమారిస్తే నీవే రాజువు అవుతావు అని దుర్బోధ చేసి, సంహరింప చేసింది. నలగామరాజుతో అలరాజును బ్రహ్మాయ్య మన సరిహద్దుల్లోనే సంహరించాడని చెప్పింది.

సహనానికి మారుపేరైన స్త్రీ మూర్తులు గల ఈ అవనిపై నాగమ్మలాంటి వారు స్త్రీ అనే పదానికి మచ్చగా నిలుస్తారు. నాగమ్మ తన అధికార దాహంతో ఎన్నో అకృత్యాలు చేసి, అన్నదమ్ముల మధ్య విభేదాలు సృష్టించి వేరు చేసింది. నాగమ్మ అధికార లాలసత్వమే పల్నాడు సీమను మరుభూమిగా మార్చింది.

**<u>నరసింగరాజు</u>**:- నలగామరాజు సోదరుడు. నాగమ్మ మాటలు విని దురాశకు లోనయ్యాడు. నాగమ్మ చేసే ప్రతి పనిలోను ఇతని సహాయం ఉంది. యుద్ధంలో బాలచంద్రుని చేతిలో మరణించాడు.

**<u>అలరాజు</u>**:- నలగామరాజుకు అల్లుడు. ఆలోచనాపరుడు. శాంత స్వభావి. కోడి పందాల సందర్భంగా నాగమ్మ కుయుక్తులు గమనించి ముందు జాగ్రత్తగా వారించాడు. పందెం ప్రకారం ఏడేండ్లు గడచిన తరువాత రాయబారం నెరవేర్చుటకు బ్రహ్మాయ్య సందేశాన్ని నాగమ్మతో చెప్పాడు. అందుకు మంచి చేసుకోవాలని

నాగమ్మ దుర్బోధల్ని తిరస్కరించి, అమ్మా! నాగమ్మ, ప్రశాంతమైన పల్నాడులో అశాంతిని రేపి అన్నదమ్ముల మధ్య పోరు పెట్టావు. ఈ దురాగతాలు నేను చూడలేను. నేను సన్యసిస్తాను అంటూ కొలువు వీడిపోయాడు. జరగబోయే ముప్పును, జననష్టాన్ని ఊహించి వైరాగ్యం పెంచుకున్నాడు అలరాజు. నాగమ్మ కుయుక్తులకు, మోసానికి రాయబారిగా వెళ్ళిన అలరాజు బలైపోయాడు.

**బాలచంద్రుడు**:- బ్రహ్మయ్య కుమారుడు. వీధిలో బొంగరాలాట ఆడుతున్న సమయంలో బొంగరం వెళ్ళి ఒక యువతికి తగలగా "చిన్నా పెద్ద అందరూ యుద్ధం చేస్తుంటే నీవు ఆడుకుంటున్నావా?" అని అడిగింది. అది విన్న బాలచంద్రుడు ఇంటికి వచ్చి తల్లిని నాన్నగారు ఎక్కడ అని ప్రశ్నించాడు. ఆమె చెప్పిన సమాధానం విని "అమ్మా! నన్నాశీర్వదించు నేను కూడా యుద్ధానికి వెళతాను' అని తల్లికి ధైర్యం చెపుతూ అమ్మా! నీవు వీరపత్నివి, అయినా "ఏనుగును చూసి సింహం భయపడుతుందా! సాగరం ఉప్పొంగితే లోకాలు ఆగునా!" నన్ను దీవించి వీరమాతవు కమ్ము అని ఆవేశంగా పలకడంలో 'పిట్ట కొంచెం కూత ఘనం' అని నా ముందు శత్రు సేనలు నిలబడలేవు అని వీరత్వం కూడిన గర్వంతో చెప్తూ, ధర్మం ముందు అధర్మం నిలబడజాలదని ఈ పాత్ర ద్వారా వివరించారు కవి.

అనంతరం మాంచాల మందిరానికి వెళ్ళి ఆమె సౌందర్యానికి మోహావేశుడై ఆమెను కౌగిలించుకోగా, మాంచాల మాటలు విని యుద్ధ సన్నద్ధుడై సమరభేరి పూరించాడు. అరివీర భయంకరునిలా చెలరేగుతూ నరసింగరాజుతో తలపడగా గాయపడి అతని తలను ఒక వ్రేటుకే నరికివేశాడు.

**మాంచాల**:- బాలచంద్రుని భార్య. యుద్ధ సమయంలో మోహావేశుడైన బాలచంద్రునితో "దేశానికి వెన్నెముకలైన యువత కర్తవ్య హీనులైతే, దేశం పరాయి

సొత్తవుతుంది. నాగమ్మ దుర్మార్గపు ఆలోచనలు నాశనం చేసి రమ్మని వీర తిలకం దిద్ది ధర్మయుద్ధం చేసి విజయుడవై రమ్మని యుద్ధానికి పంపిన వీరపత్ని.

నేటి యువత నిర్వీర్యమై సోమరులుగా మారితే దేశం మళ్ళీ పరాయి పాలనలోకి వెళుతుందని అందరూ ఏకమై అన్యాయాన్ని ఎదిరించమని కవి మాంచాల, బాలచంద్రుల పాత్ర ద్వారా తెలియజేశారు.

**పేరిందేవి**:- నలగామరాజు కుమార్తె. అలరాజు భార్య. అలరాజు మరణించిన విషయం తెలిసి విలపిస్తూ నాగమ్మతో నీ కోరిక నెరవేరింది కదా! అయినా నిన్ను అనవలసిన పనిలేదు. మాకు సఖ్యత లేదు. మానవత కోసం అసువులు బాసిన ధర్మవీరుని కడకేగుతానని వెళ్తుండగా ఎదురయిన నరసింగరాజుతో చిన్నాన్నా! అతి గారాబంగా పెంచి, ముద్దుగ వివాహం చేసి, ముద్దు ముచ్చట తీరకముందే మూడునాళ్ళ ముచ్చట చేశావు మా జీవితం అంటూ భర్తతో పాటు సహగమనం చేసింది.

## శ్రీ నాజర్ గానం

గానం అంటే రసభావములను నాదం ద్వారా వివరించేది. రసభావనా ప్రకటనకు గుర్తుగా సప్తస్వరాలు ఏర్పడ్డాయి. అవి సరిగమ పదని. బుర్రకథా గానం నాద ప్రధానమైనది.

బుర్రకథా గానానికి శృతి మాత, లయ పిత. బుర్రకథా గానానికి శృతి మధ్యమ, షడ్జమం. కర్ణాటక సంగీతానికి శృతి మందరం, షడ్జమం. బుర్రకథా గానానికి మూడు స్థాయిలు అవి 1) మందరం 2) మధ్యమం 3) తార

**మందరం**:- 'సరిగమపదని' ఈ ఏడు అక్షరాలను కుతిక నుండి ప్రారంభించాలి. ఇది మంద్రస్థాయి.

**మధ్యమం**:- 'సరిగమపదని' ఈ ఏడు అక్షరాలను కంఠము నుండి ప్రారంభించాలి. ఇది మధ్యమస్థాయి.

**తార**:- 'సరిగమపదని' ఈ ఏడు అక్షరాలను కపాల రంధ్రము నుండి పైపైకి నడిచే విధంగా ప్రారంభించాలి. ఇది తారాస్థాయి. ఇవి మొత్తం ఇరవై రెండు స్వర స్థానాలు. అయితే మనం పలికినవి ఇరవై ఒకటి మాత్రమే. 'స' ఇరవై రెండవ అక్షరం. సుషుమ్నానాడి అను మరొక నాదం కపాల రంధ్రం నుండి వినిపించాలి అనగా కొండ నాలుకపైన మూడు వెంట్రుకల పొడైన ప్రాంతాన్ని కపాలం అన్నారు. హృదయం నుండి సాగిన గజ్జనరాలు అనగా మనిషి ఎదురు రొమ్ము గుంట నుండి సూటిగా వెనుకవైపు వెన్నుపూస కలదు. దీన్ని 'స్పిష్టి అస్థి' అన్నారు వైద్య శాస్త్రజ్ఞులు. 'వీణాదండం' అన్నారు యక్షులు. దీనికి అడ్డంగా హృదయం నుండి కపాల రంధ్రం వరకు ఇరవై రెండు నరాలు ప్రకృతి సిద్ధంగా అమర్చబడి ఉంటాయి. ఇవి శ్వాస, నిశ్వాసములందు మ్రోగుతూ ఉంటాయి.

హృదయం నుండి జీవనాదాన్ని, ప్రాణవాయువు నిచ్చెన మెట్లు ఎక్కినట్లు పైపైకి త్రోయునపుడు కుతిక నుండి బయటకు తోయబడిన ఏడు స్వరాలు మంద్ర స్థాయి. కంఠము నుండి బైటకు తోయబడిన ఏడు స్వరాలు మధ్యమ స్థాయి. హృదయం నుండి కపాల రంధ్రం వరకు మరొక నాడి ఉంది. అదే సుషుమ్నానాడి ఈ నాడి నాదమందు గాయకునికి శ్రోతలకు మత్తును కల్గించు స్వభావముంది. ఇలా మంద్ర, మధ్యమ, తార స్థాయిలు ఇరవై ఒకటి.

మత్తులో, మైకంలో అరమోడ్పు కన్నులు కల్గించు తారాస్థాయిపై షడ్జమ స్వరంతో కలసి అనగా కపాల రంధ్రమును ఛేదించి అందుండి నాదమును బైటకు తోయునదే తారాస్థాయి.

నాద ప్రధానమైనట్టి ఈ గానం దాని స్థాయిలు, దాని స్వర స్థానాలు కళ్ళ నుండి, చెవుల నుండి, నాభి స్థానం నుండి, హృదయం నుండి ఊపిరితిత్తుల పట్టుతో బహిర్గతమగుట చేత గాయకునికి, శ్రోతలకు కళ్ళకు, శ్రోతేంద్రియాలకు, హృదయానికి బలాన్ని ఇచ్చుటయే కాక ఆకలి పుట్టించును.

స్వర వర్ణములచే అలంకరించబడినదై జనుల చిత్తమునకు రంజకమైన ధ్వని విశేషము రాగమనబడును. రాగం మానవుని అనురాగ విరాగ సరాగం. దానికి అనుగుణమే రాగం. 'మానవావస్థలకు సంబంధించిన నాద ప్రకటన, ప్రక్కవాడికి అర్థమయ్యేదే రాగం'.

మూలం నాలుగు రసాలు. వాటికి పుట్టినవి నాలుగు. ప్రతీ రసానికి నాదం జోడించాల్సి వస్తే మూడు స్థాయిలు జోడించాలి. దు:ఖ రౌద్రాలు వగైరా ఆలపించేటపుడు ప్రదర్శించే రసం ప్రజల్లో స్పందన కల్గించక పోతే ఆ రసభావ ప్రకటనల్లో లోపాలను సవరించుకునే వాడే ఉత్తమ కళాకారుడు.

ఈ స్థాయిలలో శృతి పక్వంగా, స్వర పక్వంగా, లయ, తాళ గతులతో ఆలపించిన గాయనీ, గాయకులు స్వజాతికి నాయకులగుదురు.



ఎస్. మురళీబాబు దళం

# శ్రీ నాజర్ సంగీతం పల్నాటి యుద్ధం

చిన్న వయస్కుడైన నలగామరాజుకు పట్టం కట్టి, బ్రహ్మనాయుడు పరిపాలిస్తున్న వైనాన్ని గూర్చి వివరిస్తున్న సందర్భంలో

"యెక్కువ తక్కువ మత విభేదము - అక్కర లేదనుచు" అనే రగడ 'పహిడి' రాగములో హృద్యంగా ఆలపించారు.

బ్రహ్మనాయుడు చేపట్టిన సంఘ సంస్కరణను ఎదిరించిన సందర్భంలో

"పెద్ద పెద్దలకు పెత్తందార్లకు - పీక పట్టెనయ్యా" అనే ఈ రగడను 'మోహన రాగము'లో మనోహరంగా గానం చేశారు.

బ్రహ్మయ్య సంఘ సంస్కరణలను ఎదుర్కొనుటకు సన్నద్ధం అయినపుడు నాగమ్మను గూర్చి వివరించే సందర్భంలో

"సాగినాదిరా నాగులేటి దొరసాని - నాగసాని" అను ఈ రగడ 'ముఖారి' రాగములో మనోహరంగా ఆలపించారు.

నరసింగరాజును కల్లబొల్లి మాటలతో రెచ్చగొట్టి నాగమ్మ సాగిస్తున్న అకృత్యములు వివరించు సందర్భంలో

"నాయునిపై కవ్వించి కయ్యమునకు కాలు దువ్వసాగె" అనే రగడను "ధన్యాసి" రాగము ఆధారంగా మృదుమధురంగా ఆలపించారు.

నాగమ్మ అకృత్యాలను సహించలేని నలగామరాజు తన తమ్ములను పిలిచి మాచర్లను అప్పగిస్తున్న సందర్భంలో

"బాలలారా మాచర్ల సీమ మీ భాగమన్నారు" అనే ఈ రగడను 'ఝుంఝూటి' రాగములో అతి రమ్యంగా గానం చేశారు.

బ్రహ్మనాయుని అండదండలతో మల్లిదేవుల పాలనలో మాచర్ల వర్ణభేదం

లేక ఒక్కటిగా ఉన్న ప్రజలను చూసి

"పెద్దలంత పరుగులెత్తిరి నాయకి - వద్దకు వేవేగ" అను రగడను 'గౌడ' రాగములో హృద్యంగా గానం చేశారు.

పెద్దలంతా వాపోవుచున్న సందర్భంలో వారిని వోదారుస్తున్న నాగమ్మను గూర్చి వివరించే సందర్భంలో

"నాగమాంబ మాచెర్లను జూచి - అసూయపడినాది" అను ఈ రగడను 'శ్రీ'రాగంలో మనోహరంగా గానం చేశారు.

కోడి పందెములను గూర్చి తెలుపుతూ వచ్చిన జాబును చూసి బ్రహ్మనాయుడు

"కామరాజు కీ ప్రేమ యెప్పుడు - కలిగిందన్నాడూ" అను రగడను 'తిలకామోద్' రాగంలో జనరంజకంగా గానం చేశారు.

కోడిపందాల సందర్భంలో ఓడిపోయిన గురజాల వారిని మాచెర్ల సుద్దుల వాడు ఎద్దేవా చేసిన సందర్భంలో

"గురజాల వీరులు రోషమెక్కిబల్ - కొరకొర లాడంగ" అనే రగడను 'మాండుదురిత' రాగంలో హృదయానికి హత్తుకునేలా గానం చేశారు.

పందెంలో ఓడిపోయారని బ్రహ్మనాయునితో నాగమ్మ

"పందెమందునా వోడిపోయితివా - బావా బ్రహ్మయ్య" అను రగడను 'ఆనందభైరవి' రాగంలో అతి మనోహరంగా ఆలపించారు.

రాయబారిగా వచ్చిన అలరాజు నాగమ్మతో

"పందెము బెట్టి అన్నదమ్ములా - వగలుబెట్టినావూ" అను రగడను 'కన్నడ' (కానడ) రాగములో మనోరంజకంగా ఆలపించారు.

సందర్భానుసారంగా ఆయా రసాలకు అనుగుణంగా సంగీతాన్ని చేర్చి, ఎంతో హృద్యంగా తనదైన సరళిలో జనరంజకంగా గానం చేసి ప్రజల్ని ఉర్రూతలూగిస్తూ ఒక చరిత్ర సృష్టించారు శ్రీ నాజర్.

# కథా ప్రవర్తకుడుగా నాజర్

ప్రజా నాట్యమండలి ప్రారంభ దశ నుంచి నాజర్ ప్రముఖ పాత్ర వహించారు. ప్రజా నాట్యమండలి ప్రచారం కోసం ఉపకరించిన జానపద ప్రదర్శన కళారూపాల్లో బుర్రకథ అతి ముఖ్యమైన ప్రదర్శన కళారూపం. దానికి రంగు, రుచి, వాసన సంపాదించి పెట్టిన ఘనత నాజర్‌కు దక్కుతుంది. 'నాజరనగానే బుర్రకథ, బుర్రకథ అనగానే నాజరు, గుర్తుకు రాక మానరు. అదీ నాజరు విశిష్టత. అంతకు ముందే ప్రచారంలో ఉన్న జంగం కథలు, తందాన పాటలు, పిచ్చుగుంటల కథలు మొదలైన వాటితోపాటు వీర గాథాకథనం (కాటమరాజు, పల్నాటి వీర చరిత్ర) ప్రచారంలో ఉండేవి. ప్రజల మనస్సులను ఆకర్షిస్తూ ఉండేవి. పల్లె పట్టుల్లోని ప్రజలకు వినోదంతో పాటు విజ్ఞానాన్నిస్తుండేవి.

ప్రజా నాట్యమండలి స్థాపనతో వామపక్ష భావాల ప్రగతిశీల దృక్పథాన్ని ప్రచారం చేయడానికి ఈ ప్రదర్శన కళారూపం ఉపకరించింది. నాజర్ మొదట వంతగా, ఆ తర్వాత కథకుడిగా టాన్యా, కష్టజీవి మొదలైన బుర్రకథల్ని ప్రవర్తింపజేసి అచిరకాలంలోనే ప్రసిద్ధి పొందాడు. తనలో చిన్నప్పట్నుంచి అణగిమణగి ఉన్న సంగీతం, నృత్యం, గానరీతి ఒక్కసారి పెల్లుబికి సొంత గొంతుకని విప్పేట్టు చేశాయి. తానే స్వయంగా బుర్రకథలు వ్రాసి అందులో కొన్ని వరుసలు, దరువు, రగడ, రేకులు మొదలైనవే కాక పాటలు రచన చేసి ఆడి, పాడి ప్రజల మనసు రంజింపజేసి ఆటను రక్తి కట్టించిన ఉత్తమ ప్రజారంజకుడు నాజర్. తనదైన ఆట, పాట, మాటలతో ఈ కథాకథనం మిక్కిలి ప్రశంసనీయంగా బుర్ర కథకుడు నాజర్ బుర్రకథే తానై నిరూపించుకున్నవాడు.

# బిరుదు సార్థకత

నాజర్‌కు కల బుర్రకథా పితామహ బిరుదు సార్థకమైంది. సందేహం లేదు. అయితే ఆయన తోటే బుర్రకథ ప్రారంభమైందని అనడం కాదు గానీ బుర్రకథకు ఒక రూపకల్పన చేసి కథకుడు, వంతలు ఇలా ఉండాలి, బుర్రకథ ఇలా చెప్పాలి అనే విషయాలకు రూపాన్ని సాధించి తెలుగుసీమలో ప్రతిష్ఠించిన ఘనత నాజర్‌ది. అందుకే ఈ బిరుదు అన్ని విధాలా సార్థకమైంది. మనకు తెలుగు సాహిత్యంలో అనేకులు పితామహులున్నారు. "ఆంధ్ర పద కవితా పితామహ - అన్నమాచార్య, ఆంధ్ర కవితా పితామహ - అల్లసాని పెద్దన, ఆంధ్ర నాటక పితామహ - ధర్మవరం రామకృష్ణమాచార్య, ఆంధ్ర చారిత్రక నాటక పితామహ - కోలాచలం శ్రీనివాసరావు, ఆంధ్ర హరికథ పితామహ - ఆదిభట్ల నారాయణదాసు", మొదలైన మహనీయులెందరో ఉన్నారు. ఆయా సాహిత్య ప్రక్రియలు వారితోనే ప్రారంభమయ్యాయని కాదు. కానీ, ఆయా సాహిత్య ప్రక్రియలకు వారు చేసిన సేవల వల్ల తెచ్చిన ప్రతిష్ఠవల్ల వారికి ఆ బిరుదులు సార్థకమైనట్లు భావించవచ్చు. అలాగే నాజర్ విషయంలో కూడా భావించడం ఎంతైనా సమంజసం. ఉత్తమ కథకుని లక్షణం ప్రజల మనస్సులను ఆకట్టుకోవడం. ఇది బాగా గుర్తించిన విషయం మనకు తెలుసు. ఆయనకిష్టమైన రసాలు రెండు. అవి (1) కరుణ (2) వీరరసం. బెంగాల్ కరవు, రాయలసీమ కరవు కథల్లో కరుణరసం బతికించిన తీరు ప్రజలెన్నటికీ మర్చిపోలేరు. అలాగే అల్లూరి సీతారామరాజు దేశం కోసం ప్రాణత్యాగం చేసిన తీరులో, బాలచంద్రుని యుద్ధంలోని వీరోచిత కృత్యంలో, అభిమన్యుని యుద్ధ రీతిలో, రంగారావు, తాండ్ర పాపయ్యల వీరోచిత కృత్యాలలో నాజర్ వీర రసాన్ని ప్రజ్వలింప జేసి తదుచితంగా ప్రజల హృదయాలను ఉర్రూతలూగించిన పద్ధతి మరువరానిది.

బుర్రకథా ప్రవర్తకుడుగా నాజర్ ఎన్నటికీ ప్రముఖుడుగానే నిల్చిపోయారు. అందుకే ఆయన 'బుర్రకథ పితామహుడు'గా ప్రసిద్ధుడు.

## పలువురి ప్రశంసలు

**శ్రీ కత్తి పద్మారావు**:- నాజర్ బుర్రకథల్లో నడచిన కొన్ని చారిత్రక అంశాలు ఈ తరానికి గుణపాఠాలు. నాజర్ కథల్లో, అడుగులో, గొంతులో, లయలో, తాళంలో దీనుల గాథలు స్రవించడానికి కారణం ఆయన పేద కడుపున పుట్టి అడుగడుగునా అణచివేతలను ఎదుర్కొనడమే. ఈ రోజు 'గద్దర్' డప్పుచప్పుళ్ళకు జన ప్రవాహాలు కదలి వస్తున్నట్లుగానే ఆనాడు నాజర్ కథలకు ప్రజలు తండోప తండాలుగా వచ్చేవారు. కథ చెపుతున్నంత సేపు వేలాది మంది ప్రజలు నాజర్‌తో పాటు ఆవేశపడి, ఆయనతో పాటు దు:ఖితులై, ఆయన కనుగుడ్ల ఎరుపుతో దోపిడి వర్గంపై గుడ్లెర్ర చేసేవారు.

ఆయన చెప్పిన 'బొబ్బిలి కథ' ఆంధ్రుల వీరత్వాన్ని దేశానికి చాటి చెప్పింది. ఆయన గుండె గొంతుకలో నుండి స్రవించిన 'పల్నాటి యుద్ధం' సంఘ సంస్కరణను ప్రబోధించింది. ఆయన చెప్పిన 'కష్టజీవి' జనం గుండెల్ని మండించింది. ఆయన పేద కులాలను ఒకటై పోరాడమన్న పాలికేక ఒక చారిత్రక సత్యంగా సమాజంలో నిల్చిపోయింది. ఆయన గొంతుకలో సామాజిక సత్యాలు రాగయుక్తంగా భాసించాయి. 'పాటల యుగం' నాజర్ డక్కీతోనే ప్రారంభమైంది.

**శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య :-**

'నాజరు' గారికి సన్మానం అంటే అది నాకు గానే భావిస్తున్నాను. ఆయన ఉన్నత కుటుంబంలో నుండి రాలేదు. సామాన్య కుటుంబంలో పుట్టి, ప్రజా ఉద్యమాలకు స్పందించి, పేద ప్రజానీకానికి అంకిత మయ్యారు. క్రమ క్రమంగా జానపద సాహిత్యంలో, శాస్త్రీయమైన సంగీతాన్ని కష్టపడి నేర్చుకున్నాడు.

మొదట నాటకాలు వేసేవాడు. జమిందారీ విధానానికి వ్యతిరేకంగా

"మా భూమి" నాటకం ప్రదర్శించి ఒక ఊపు ఊపారు. కాని, దాన్ని బెజవాడ గోపాలరెడ్డిగారు నిషేధించారు. నాజరు 'పల్నాటి యుద్ధం' బుర్రకథను స్వయంగా వ్రాసుకుని చెప్పటం విశేషం. తానొక బాధితుడుగా ఎన్నో కథలు చెప్పాడు, పెరిగాడు. కాని "కొందరు సహించలేక పోయారు. దాంతో అందరి వాడయ్యాడు". స్వాతంత్ర్యానంతరం నాగరికత పేరుతో జానపద కళలు దెబ్బతింటున్నాయి. కళా రంగంలో ఉన్నత స్థాయికి ఎదిగిన నాజరు మహా పండితులకు సైతం అర్థం కాని గ్రంథం రచించారు. అది త్వరలో వెలువడగలదు. ఈ ప్రక్రియను పోషించిన 'నాజరు' 'చిరంజీవి'యని అభినందించారు.

**<u>శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య:-</u>**

నాజర్ జీవితం వంతగా మొదలు పెట్టినప్పటి నుండి నాకు తెలుసు. అటు తర్వాత ఒక కథకుడిగా, ప్రజా రంజక కళాకారుడుగానే కాక తన రచనల ద్వారా దేశ దాస్య విముక్తికై జనతను జాగృతం చేస్తూ తన కలం, గళం, దళిత విముక్తికై అంకితం చేసిన నిస్వార్థజీవి అయిన నా బిడ్డ ఎంతో ఎదిగాడని అభ్యుదయ రచయితల సభలో శ్రీ నాజర్‌ను అప్యాయంగా కౌగిలించుకుని ప్రశంసించారు.

**<u>శ్రీ బళ్ళారి రాఘవ:-</u>**

1945వ సంవత్సరంలో బాపట్లలో శ్రీ నాజర్ 'బెంగాల్ కరవు' బుర్రకథను ప్రదర్శిస్తుంటే ప్రేక్షకులు స్థల కాలాదులను అధిగమించి బెంగాల్ కరవు భీభత్సాన్ని చూస్తున్నారు. ఆనాటి ప్రేక్షకుల్లో అద్వితీయ నటనా వైదుష్యంతో జగద్విఖ్యాతి గాంచిన శ్రీ బళ్ళారి రాఘవ బెంగాల్ కరవు ఘట్టాన్ని ఆలపిస్తున్న శ్రీ నాజర్‌ను ఆ విషాదాన్ని అలా కొనసాగిస్తే తాను తట్టుకోలేనని సైగ చేస్తూ అధ్యక్షపీఠం నుంచి లేచి వచ్చి నాజర్‌ను వాటేసుకుని 'భళా నాజర్' అంటూ అభినందించారు.

**ఆచార్య ఎస్.గంగప్ప:-**

శ్రీ నాజర్‌గారు జీవిత సర్వస్వం కళకోసం ముడుపు కట్టిన వ్యక్తి. కనకాభిషేక, గండపెండెరాది సన్మానాలు అంది, బుర్రకథా సామ్రాట్టుగా ప్రఖ్యాతి గాంచిన నాజరు గారు ఏ రగడను ఏ రీతిలో పాడాలో అట్లు పాడి శ్రోతలను ముగ్ధులను గావించిన ప్రతిభాశాలి. పల్నాటి యుద్ధంగాని, బొబ్బిలి యుద్ధంగాని మరేదైనా కాని తనదిగా స్వీకరించి, బుర్రకథలు వ్రాసి చెప్పటం ముదావహం అని ప్రశంసించారు.

**శాసనసభ సభ్యులు - శ్రీ బుచ్చయ్య చౌదరి:-**

తన బుర్రకథల ద్వారా సాంఘిక దురన్యాయాలను దుయ్యబడుతూ, వీరోచిత కథలతో యువకులను చైతన్యవంతులను చేసిన ప్రజా కళాకారుడు శ్రీ నాజర్.

**శ్రీ శ్రీనివాస చక్రవర్తి:-**

శ్రీ నాజర్ ప్రాచీన కళారూపమైన బుర్రకథకు జీవం పోశారని, కథకుని వేషం, దుస్తులు, రంగులు, నిర్ణయాలు నాజరు స్వంతమని, ప్రస్తుతం బుర్రకథ చెప్పడంలో 'నాజరు యుగం' నడుస్తుందని 1954లో 'ఆంధ్ర దర్శిని' అనే చారిత్రాత్మక కళా గ్రంథంలో శ్రీనివాస చక్రవర్తిగారు వ్రాశారు.

**అమూల్యశ్రీ శ్రీ జూపూడి అమ్మలయ్య:-**

శ్రీ నాజరు ఉత్తమ కళారాధకుడు. ఆనాడు కరుణ, వీర రస ప్రధానంగా బెంగాల్ కరవు, బొబ్బిలి యుద్ధం వంటి కథలు స్వయంగా వ్రాసి, చెప్పి శ్రోతలను ఉర్రూతలూగించారు. ఏమా జన సందోహం, 'బుర్రకథ అంటే నాజరు, నాజరంటే బుర్రకథ'. అంతటి వాడింక పుట్టడు అని నా భావన.

**పద్మశ్రీ ఘంటశాల:-**

శ్రీ నాజర్ కమ్మగా పాడి, ఆడి, వ్రాసి నటిస్తున్నారు. ఆయనదంతా స్వంతం. నేర్చుకున్నదే కాక పూర్వజన్మ సుకృతమనీ, బుర్రకథోద్ధరణకు జన్మించిన వ్యక్తిగా

నేను భావిస్తున్నాను.

**శ్రీమతి భానుమతి:-**

నాజరుగారి వద్ద ఇంత గొప్ప కళ ఉందని, బుర్రకథ కళారూపం ఇంత గొప్పగా ఉంటుందని నాకు తెలియదు. ఇంతవరకు ఇలాంటిది చూడలేదని, చాలా బావుందని ప్రశంసించారు.

**శ్రీ నిడదవోలు వెంకట రామారావు:-**

ఇదివరలో బుర్రకథ అనుకోవడమే గాని దాని సంగతి నాకు తెలియదు. బుర్రకథ అని మామూలుగా వ్యవహరించేదానికి ఎంత లోతైన అర్థముందో చెన్నపురిలో జరిగిన 'వీరేశలింగం గారి చరిత్ర', 'వంగ దేశంలో కరవు' బుర్రకథలు చూశాను. మొదలు పెట్టిన దగ్గర్నుంచి తదేక ధ్యానంతో విన్నాను. 'తెలుగు మాట, పాట, వేషం ఈ మూడు కూడా మూర్తీభవించిన ప్రక్రియ.

అచ్చు గుద్దినట్లు మాటలు, పాటలు గుండెల్లో సూటిగా నాటుకున్నాయి. కన్నులార చూడడము, చెవులార వినడము చేత మనసారా తెలుగు తనము హత్తుకు పోయింది. హృదయం నాలుగు మూలలా కదిలించింది. తెలుగు రక్తనాడుల్లో పూర్తిగా ప్రవహించడం మొదలు పెట్టింది. హృదయ కుహరముల నుండి జల జల వచ్చే ప్రవాహ రూపకమైన కరుణ రసము ఆపుటకు వీలులేని స్థితి వచ్చింది.

అట్టి ఈ అనంత కళా స్రవంతిని వట్టి పోకుండా కాపాడుకోవాల్సిన బాధ్యత మనదే.

బుర్రకథలు నాటి నుండి నేటి వరకు ప్రచార నిమిత్తమే నియమితమైనట్లు తెలుస్తుంది. ఆనాటి శైవ మత ప్రచారంతో ప్రారంభించబడ్డ ఈ ప్రక్రియ నేటికీ ప్రచార సాధనంగానే మనం చూస్తున్నాం. ఆకాశవాణి, దూరదర్శన్‌వారు బుర్రకథకు కొంత స్థానం కల్పిస్తున్నారు.

రాజకీయ ప్రచారంలోను, చలన చిత్రాలలోను, ప్రభుత్వ ప్రణాళికా సంక్షేమ పథకాల ప్రదం లోను ఈ ప్రక్రియను విరివిగా వాడుకుంటున్నారు. ఈ అర్ధశతాబ్దిలో ఈ కళకు 'ఈ స్థానాన్ని సంతరింపజేసిన ఘనత బుర్రకథా పితామహులదే.

మీలియోరిస్టుల సన్మాన పత్రం

పసిడి రాళ్ళ (పొన్నెకల్లు) ఊళ్ళో పుట్టావు
పట్టెడన్నం దొరక్క ఆకలి కేక వేశావు
కేవలం అక్షరాస్యుడవే
అయినా నేడు 'మహా మనీషి'వే
'జన' పదాలు నిన్ను సృష్టించాయి
జాన పదాలను నీవు సృష్టించావు
నిత్య జీవితంలో పలు బాధలు పడ్డావు
కళా జీవితంలో కడు కాకలు తీరావు
కష్ట జీవుల కడగండ్లను గానం చేశావు
కళా రంగంలో నీ యుగాన్ని సృష్టించుకున్నావు
ఒక తరాన్ని ఊపేశావు
ఒక తుఫాను రేపేశావు
బుర్రకథకి ఆక్సిజను పోశావు
బతుకునే బుర్రకథగా శృతి చేశావు
బడుగు వర్గాల భవిత కోసం
నీ కళా ప్రతిభ అంకితం
జనం గుండె చప్పుళ్ళు 'బుఱ్ఱ'లపై వినిపించావు
బుర్రకథా కథా వతం సుడవయ్యావు
నీ కళ జానపద కళ

ఆ కళలోని పాత్రలు జానపదులు
ఆ జానపదుల ఆవేదన
నీ కళకు జీవనాడి
వాళ్ళ సౌభాగ్యమే
నీ కళా ప్రయోజనం
గోచీ లేనోళ్ళే, గొడ్డు చాకిరీ గాళ్ళే
అంత మాత్రాన బలహీనులా .... అంటావు
వాడి ప్రశ్నలు వేస్తావు
వేడి ఆవేదన రాస్తావు
దీక్ష త్యాగం అలవర్చుకున్నావు
అహంభావం అసలెరుగవు
సువర్ణ కంకణాలు తొడిగించుకున్నావు
అయినా సామాన్య జీవితం గడుపుతున్నావు
జానపద కళారూపాల శిఖరాన
బుర్రకథను నిల్పిన శక్తివి
జనం గుండెల్లో ఎవరూ ఎక్కని
అందలాన్నెక్కిన వ్యక్తివి
ఎందరో ఏకలవ్య శిష్యులున్న
బుర్రకథా 'ద్రోణాచార్య' గుర్వువు
'జాతి యక్షగానం' కలం, గళంతో
షడ్జమంలో విప్పుతున్న పుంస్కోకిలవు
కేంద్ర ప్రభుత్వం తగిలించిన 'పద్మశ్రీ'
నీ తలపాగా కుచ్చులో మరో కలికి తురాయి

అందరూ జీవిస్తారు

ఎందరికో జీవితం ఉండదు

కానీ నీవు ....

బుర్రకథా లోకంలో 'లేజర్' వి

బుర్రకథా కథాన 'వజీర్' వి

ఓ ప్రజా గాయకా ! ఓ ప్రజా కవీ!

తెలుగు మెదళ్ళకు

జ్ఞాపక శక్తి ఉన్నంత కాలం

తెలుగు పుటలకు

చదలు పట్టనంత కాలం

బుర్రల నాదం మ్రోగుతూనే ఉంటుంది

ప్రజా బుర్రల్లో 'తందాన' మార్మ్రోగుతూనే ఉంటుంది

అందుకే ఈ ఘన సన్మానం !

అందుకో మరి సహృదయంతో !!



శ్రీ శేషగిరిరావు దళం

# ముగింపు

బుర్రకథ పితామహుడుగా ప్రసిద్ధిగాంచిన నాజర్ జానపద ప్రదర్శన కళావేత్తగా కీర్తించబడటం సమంజసం. నిరుపేద కుటుంబంలో పుట్టి, పద్మశ్రీ దాకా ఎదిగిన నాజర్ కష్టాలు, నష్టాలు ఎన్నో ఎదుర్కొని బుర్రకథకే జీవితం అంకితం చేసి ప్రఖ్యాతి గడించారు.

మొదటి ప్రకరణంలో ఆయన జీవిత విశేషాలను విపులంగా వివరించి వారి కష్టనష్టాలను, అందులోనుంచి ఉత్తమ కళాకారుడుగా ఎదిగిన తీరు తెన్నులు వివరించడం జరిగింది.

రెండవ ప్రకరణంలో బుర్రకథ పుట్టు పూర్వోత్తరాలు వివరించి, దాని వికాసాన్ని చెప్పడం జరిగింది.

మూడవ ప్రకరణంలో శ్రీ నాజర్ కథకునిగానే కాక రచయితగా నిరూపించుకొన్న విషయాన్ని, ఆయా కథల్లోని ఇతివృత్తాలను వివరిస్తుంది.

నాల్గవ ప్రకరణంలో నాజర్ తన బుర్రకథల్లో మనోహరంగా వర్ణించిన వర్ణనలను, ప్రయోగించిన అలంకారాలను, పోషించిన రసాన్ని, వాడుకొన్న సామెతల్ని విపులంగా వివరించడం జరిగింది.

అయిదవ ప్రకరణం ఈ సిద్ధాంత వ్యాసంలో చివరిది బుర్రకథల్లో నాజర్ రాసిన పాటల విశిష్టతని తెలిపి, వంతల ప్రాముఖ్యాన్ని పేర్కొని, బుర్రకథా ప్రవర్తకుడుగా ఆయనకున్న ప్రసిద్ధిని, బుర్రకథ పితామహ బిరుదు సార్థక్యాన్ని తెలిపి, పలువురు ప్రముఖులు ప్రశంసించిన తీరుతెన్నులను ఉదహరించి నాజర్ గొప్పదనాన్ని ప్రకటిస్తూ ముగించడం జరిగింది.

బుర్రకథా పితామహుడైన నాజర్‌కి నేను చేసిన సేవలివి.

**ముద్రణ**

శ్రీ వెంకటేశ్వర ప్రింటింగ్ వర్క్స్, విజయవాడ-1 వారు ముద్రించారు.

**ప్రచురణలు**

శ్రీ స్వరాజ్య పబ్లికేషన్స్, మల్లికార్జునపేట, విజయవాడ-1 వారు ప్రచురించారు.

| | |
|---|---|
| బొబ్బిలి యుద్ధం, ద్వితీయ ముద్రణ | డిసెంబర్ - 1984 |
| పల్నాటి యుద్ధం, తృతీయ ముద్రణ | డిసెంబర్ - 1984 |
| అభిమన్యు యుద్ధం, ప్రథమ ముద్రణ | డిసెంబర్ - 1984 |
| అల్లూరి శ్రీరామరాజు యుద్ధం, ప్రథమ ముద్రణ | డిసెంబర్ - 1984 |
| నేటి రాయలసీమ, ప్రథమ ముద్రణ | డిసెంబర్ - 1984 |

అన్ని కథలకు కూడా 'దత్తి అప్పారావు'గారు సంపాదకులు.



# అంకితం

1. బొబ్బిలియుద్ధం : అజ్ఞాత జానపద కవులకు, యక్షగాన గాయకులకు

2. పల్నాటి యుద్ధం : నాజరుగారి అభివృద్ధికి తోడ్పడిన ముఖ్యులలో ముఖ్యుడైన పురుషోత్తానికి

3. అభిమన్యు యుద్ధం : జానపద కవులకు, జానపద కళాకారులకు, యక్షగాన గాయకులకు

4. అల్లూరి శ్రీరామరాజుయుద్ధం : నాజర్‌గారి అభివృద్ధికి తోడ్పడిన ముఖ్యులలో ముఖ్యుడైన పురుషోత్తానికి

5. నేటి రాయలసీమ : కథకుడైన తాను వంతయై, వంత అయిన నాజరును కథకుని చేసి, సదా నాజరు అభివృద్ధికి ఎంతో సహకరించిన సహృదయుడు రామకోటికి

## ఉపయుక్త గ్రంథ సూచి


1. అన్నమాచార్య, తాళ్ళపాక - I శృంగార సంకీర్తనలు పుట 12-107
- II ఆధ్యాత్మ సంకీర్తనము పుట 163
2. అప్పారావు, పి.యస్.ఆర్ : తెలుగు నాటక వికాసము,
పుట: 147,178,179
3. కృష్ణకుమారి, నాయని : తెలుగు జానపద గేయ గాథలు,
పుట : 2-47, 65
4. కృష్ణమూర్తి, రాంభట్ల : జానపద కళలు - దృశ్యవిధానం, నాట్యకళ,
పుట : 92,93 జూన్ 1977
5. గంగప్ప యస్. : హరికథ, తెలుగు వాణి - 1975, పుట : 200-201
బుర్రకథ వ్యాసాలు : తెలుగు విశ్వవిద్యాలయం ప్రదర్శన కళల శాఖ పాఠ్యభాగం, సాహిత్యానుశీలన జాతీయ ప్రసంగ సాహితి

6. దొణప్ప తూమాటి : తెలుగు హరికథా సర్వస్వం, పుట : 18
7. నదీరా : బుర్రకథలు, ఏప్రియల్ - 1975
8. నాజర్ సన్మాన సంచిక, భీమవరం - 1962
నాజర్ బుర్రకథ పరిణామం - నాట్యకళ : పుట : 133-142
9. నన్నెచోడుడు : కుమార సంభవం : పుట : 412
10. రాధాకృష్ణమూర్తి, మిక్కిలినేని : ఆంధ్రనాటక రంగ చరిత్ర : పుట : 205,519,521,522,531 బుర్రకథలు, నాట్యకళ : పుట : 47-49 అక్టోబరు-1971
11. రామరాజు.బి : తెలుగు జానపద గేయ సాహిత్యము : పుట : 805-807
12. రామచంద్ర, తిరుమల : తెలుగుజాతి ప్రాచీన సంగీత రూపకం, బుర్రకథ, సాహితీ సుగతుని స్వగతం పుట : 17- 19
13. రామకృష్ణారావు, అబ్బూరి : దొణప్ప తూమాటి : బొమ్మలాట, తెలుగు విజ్ఞాన సర్వస్వం - మూడవసంపుటం తెలుగు సంస్కృతి : పుట : 948,949
14. వల్లభరాయుడు : క్రీడాభిరామం : పుట : 85
15. విజయకుమార్ పువ్వాడ : బుర్రకథలు - పి.హెచ్.డి. సిద్ధాంత గ్రంథం, నాగార్జున విశ్వవిద్యాలయం
16. వెంకట సుబ్బారావు తంగిరాల : బుర్రకథలు, పుట : 24-30
17. శ్రీనివాస చక్రవర్తి : బుర్రకథ - తెలుగువాణి - 1975
18. సుందరం ఆర్వీయస్ : ఆంధ్రుల జానపద విజ్ఞానం, పుట:5,440,441
19. సోమన పాల్కురికి : I పండితారాధ్య చరిత్ర, పర్వత ప్రకరణం, పుట 345-349,434,435 పురాతన ప్రకరణం, పుట 416-443, మహిమ ప్రకరణం, పుట 34,180
II బసవ పురాణం, ప్రథమాశ్వాసం, పుట : 20,50,60,65
చతుర్థాశ్వాసం, పుట : 108




రచయిత : డా॥ అంగడాల వెంకట రమణ మూర్తి

విద్యార్హతలు : ఎం.ఏ (లిట్) పిహెచ్.డి. ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం

వృత్తి : అధ్యాపకత్వం

కృష్ణా విశ్వవిద్యాలయం

తెలుగు విభాగం - మచిలీపట్నం

ప్రవృత్తి : పౌరాణిక - సాంఘిక నాటక నటన, దర్శకత్వం

సాహిత్య వ్యాసాలు - కవితలు - కథలు - నాటకాలు

రేడియో ప్రసంగాలు సామాజిక స్పృహతో రాయడం

జీవితాశయం : కళా సేవ, సాహిత్య సేవ

తల్లిదండ్రులు : కామ్రేడ్ భాస్కరమ్మ - నాగేశ్వరరావు

అర్ధాంగి : రాజశ్రీ

పిల్లలు : మహిత - మాన్యకృష్ణ


272

